# ఆంధ్రకవితరంగిణిని గూర్చిన కొన్ని అభిప్రాయములు

కింకవీంద్రఘటాపంచానన, విద్వత్కవి, బాలసరస్వతి,
బాలకళానిధి, కళాప్రపూర్ణ, మదరాసు ప్రభుత్వ ఆస్థానకవి,

## శతావధాని శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి
## అభిప్రాయము

ఆశీ రుభయకుశలోపరి—

మీరు రచించిన "ఆంధ్రకవితరంగిణి" చాలభాగము చదివితిని స్థూలదృష్టులకు మీ పరిశ్రమము గోచరింపదేమో కాని తక్కిన యావదాంధ్రకవులేకాదు, పండితులేకాదు పామరులేకాదు ఏరెల్లరు కన్నులనద్దుకొందురనియే నా యాశయము. ప్రప్రథమమున

"మార్గదర్శీ మహార్షిః"

అను చొప్పున శ్రీగురజాడ వారీ యుద్యమమునకు పూనిరి. కొంత వఱకే కృతకృత్యులయిరి. వారిని నేను ప్రత్యక్షముగా నెఱుఁగుదును. మాకంటె సర్వదాకొంతపెద్దలయినను సమకాలీనులమే. పిమ్మట వీరేశ లింగము పంతులవారారంభించి చాలవఱకు కృతకృత్యులయిరి. తరువాత మీరు దీనికి నుపక్రమించిరి. ఇప్పటికి వారిద్దరిని సూత్రకారులుగను, వృత్తికారులుగను, భావించుచో మీకు భాష్యకారస్థానము లభించు ననుకొంటిని. ...... భవతు. ఇప్పటికి భాష్యకారస్థానము మీదే. మీయుద్దేశము సర్వదా జయప్రదమగుగాక! విద్యాశాఖాధికారులు మీ పరిశ్రమను గమనింతురుగాక!

ఇంతే. స్వస్తి.

శ్రీ రసాగర బిల్డింగ్సు
గవర్నరుపేట, విజయవాడ.

వెం॥ శా॥
శతావధాని.

## శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు

(ఆంధ్రవిశ్వవిద్యాలయ ప్రధానపండితులు)

"మీ గ్రంథము, మీరు చేసిన కూలంకష పరిశోధనకు ఫలము, కవి జీవిత కవిచరిత్రకారులు అడుగుపెట్టలేని గహనములలో మీరు రాచబాటలు వైచితిరి."

## శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు

(ఉస్మానియా విశ్వవిద్యాలయ ప్రధానపండితులు)

" ...మీకవితరంగిణి కల్హణుని రాజతరంగిణివలె సారస్వతములో ముఖతిలకంగా ప్రకాశింపకలదు... ...ఆధారవస్తువివేచనలో మీ సమగ్రవిజ్ఞానమును ప్రామాణీకరణదృష్టియు ద్యోతకమగుచున్నది."

**ఆంధ్రపత్రిక:** " ...శేషయ్యగారు నిష్పక్షపాత బుద్ధితో యదార్థ మెంతవో గ్రహించడానికి అత్యధికంగా శ్రమపడ్డారు. అనుమాన ప్రమాణంతో కూడుకొన్న చరిత్రకు ఋజువుద్ధమన్న నిర్ణయాలు మొండిగా చేసి చరిత్రకు అపకారం చేయకుండా చారిత్రిక వస్తువులనందించి సూచనమాత్రం తన ఊహను చెప్పి పాఠకులకు నిర్ణయాలకు సదవకాశమిచ్చారు. వీరి ప్రయత్నం ప్రశంసనీయమే"

**ఆంధ్రప్రభ:** "ఆంధ్రులకు సమగ్రమైన కవులచరిత్ర గ్రంథము లేని లోటు దీనితో తీరినట్లయినది. తక్కిన సంపుటములను కూడ త్వరలో వెలువరించడానికి తగిన ప్రోత్సాహం యివ్వవలసిన భారం ఆంధ్రులపైనున్నది"

## శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారు

(మదరాసు విశ్వవిద్యాలయము రిటైర్డు పండితులు)

"... ...తమ గ్రంథమువలన పూర్వవిమర్శకుల రచనలకు వెదకి చూడవలసిన యావశ్యకత లేకపోయినది ఆంధ్రకవితరంగిణి యందు తామవలంబించిన పద్ధతి యధునాతన చరిత్ర రచనాపద్ధతి వంటిది. మీ యత్నము కడు ప్రశంసనీయము."

# విషయసూచిక

శ్రీరామచంద్ర

# ఆంధ్రకవితరంగిణి



## 40 రంగనాథుఁడు

రంగనాథరామాయణ మనుపేర బరగు ద్విపదకావ్యమాంధ్ర దేశమున, విశేషించి పశ్చిమాంధ్రమున నధికప్రచారములో నున్నది. భాస్కరరామాయణ చారిత్రమువలెనే, రంగనాథరామాయణచారిత్రమును వివాదాస్పదమ్ము. ఉత్తరకాండముతోఁ గూడ మొత్త మీ రామాయణమును రంగనాథుఁడను కవి రచియించెనని చిరకాలానుగతమైన జనశ్రుతికలదు. కాని గ్రంథమునం దెచ్చటను నీతని పేరు కాన్పింపదు. పూర్వరామాయణ మనుపేర మొదటి యాఱుకాండములను గోనబుద్ధభూపతి రచియించి, తనతండ్రియైన విట్ఠలభూపతికిఁ గృతియిచ్చినట్లును ఉత్తరరామాయణమును బుద్ధభూపతికుమారులైన కాచరాజు, విఠలరాజులు రచియించి, బుద్ధభూపతికిఁ గృతియిచ్చినట్లును నాగ్రంథములయందు స్పష్టముగాఁ గన్పట్టుచున్నది. గ్రంథమునం దెచ్చటను, రంగనాథరామాయణ మనుపేరు లేదు. ఉత్తరరామాయణ కర్తలుకూడ మొదటియాఱుకాండములను బూర్వరామాయణ మనియే యనిరి. కాని రంగనాథరామాయణ మనలేదు. శీర్షికయందును ముఖపత్రము మీఁదనుమాత్రమే యీపేరు కానవచ్చుచున్నది.

ఈగ్రంథకర్తృత్వవిషయమునఁ బండితులలో భిన్నాభిప్రాయములుండుటచే వాదోపవాదములు పెక్కుజరిగినవి. వారివాదసారాంశము లివి.

౧ రంగనాథుఁడు, కల్పితపురుషుఁడు, రంగనాథరామాయణ నామములోని రంగనాథశబ్దమునుబట్టి జనించిన భ్రాంతిమూలమున

సీపురుషుఁడుత్పత్తియై యతఁ డంధపరంపరగాఁ దరువాతికవులచేతను బండితులచేతను నారాధింపఁ బడియెననుట.

౨ "నయనగతిరగడ" యనుచిన్న గ్రంథమునురచియించిన చక్రపాణి రంగనాథుఁడే యీతఁడనుట;

3. గ్రంథమున స్పష్టమైనలిఖితసాక్ష్యముండఁగా దానినివిడిచిపుక్కిటి పురాణము నాధారముగాఁగొని, రంగనాథుఁ డీగ్రంథకర్తయని నిర్ణయింపరా దనుట;

౪. గ్రంథ మేమి తెలుపుచున్నను, నితరాధారములనుబట్టి రంగనాథుఁడే గ్రంథకర్తయని ధృవపడుచున్నది. కావున నాతఁడే కావ్యకర్తయనుట.

భాస్కరరామాయణ రంగనాథరామాయణము లేకకాలమున రచియింపఁ బడియెనని తెలుపుకథ యొకటి వాడుకలో నున్నది. కోన బుద్ధభూపతి రామాయణమును దనతండ్రి పేరఁ గృతియిచ్చుచు రచియింపుమని రంగనాథునిఁ గోరినట్లు, ఆకృతి ప్రదాన సమయముననే భాస్కరకవి రామాయణమును బద్యకావ్యముగా రచించి బుద్ధభూపతి కడకుఁ దెచ్చి గ్రహింపుమనికోరఁగా నాతఁడు రంగనాథరామాయణమును గుడిచేతితోడను, భాస్కరరామాయణము నెడమచేతను గ్రహించినట్లును, భాస్కరకవి యాయవమానమును సహింపఁ జాలక "నీకుఁగృతియిచ్చుటకంటె నే గుఱ్ఱములను గాచెడివానికైనఁ గృతి యిచ్చుటమే" లని యటనుండి లేచిపోవుచుండ బుద్ధనృపతి గుఱ్ఱములను గాయువాఁ డెదురుపడి "సత్యవాక్కులరగు మీరాడినమాట చెరవేర్పుఁ"డని ప్రార్థించెననియు, నాతఁడే సాహిణిమారఁడనియు, భాస్కరరామాయణభాగమున కాతఁడు కృతిపతియయ్యెననియు నొకకథ కలదు. కాని యీకథకుఁ గాళ్ళులేవు. ఇదిలేశమాత్రమునువిశ్వాసార్హమైనదికాదు సాహిణిమారయ గుఱ్ఱములనుగాయువాఁడుకాదు. ఈరామాయణములు రెండును నేకకాలమున జనించినవికావు. ఈవిష

యమునుగూర్చి హుళక్కి-భాస్కర కుమారరుద్రదేవుల చారిత్రముల యందు విపులముగాఁ జర్చించియున్నాఁడను. భాస్కరరామాయణ మునకంటె రంగనాథరామాయణము మిన్నగా నుండెనని తెలుపుట కీకథ యొక్కింత యుపకరించిన నుపకరించునుగాని రంగనాథ రామా యణ కర్తృత్వవివాదమును బరిష్కరించుట కిది యించుకేనియు నుపయోగింపదు. కావున దీనిని ద్యజించివేయుదము.

ఇఁక నితరాధారములను బట్టి వివాద విషయములను గూర్చి యాలోచింప వలసియున్నది.

### రంగనాథుఁడు కల్పిత పురుషుఁడా?

ఈద్విపదరామాయణమునకు "రంగనాథరామాయణ" మను పేరు కవియుంచిన దనిచెప్పుట కాధారములులేవు. ఈపేరును గవి యుంచినచో, గ్రంథమునం దెచ్చటనో నొకచోటఁ జెప్పియే యుం డును. ఉత్తరరామాయణమునఁ గూడఁ గవి పూర్వరామాయణ మనియే చెప్పెనుగాని రంగనాథరామాయణ మనలేదు. ఇతరరామా యణములతో భిన్నత్వమును దెలుపుటకై తరువాతికవులు, పండి తులు, పాఠకులు నిట్టిపేరులను బెట్టి వాడుచుండుట లోకాచారము. కుమ్మరమొల్ల రచించినరామాయణమును "మొల్లరామాయణ"మని వాడుచున్నాము. ఆపేరును కవయిత్రి యుంచలేదు. గ్రంథమున మొల్లరామాయణ మనిలేదు. కానిముద్రిత ప్రతులలో శీర్షికలయందు మొల్లరామాయణ మనిముద్రిత మగుచున్నది. "ఎఱ్ఱాప్రగడరామా యణ" మని, "వావిలికొలనురామాయణ"మని, "జనమంచిరామా యణ"మని ప్రజలలో వాడుకలు బయలుదేరినవి. అట్లే యీరామా యణమును రంగనాథరామాయణ మనుపేరఁ గొంతకాలమునకుఁ దరువాత కవులో, పండితులో, వాడుటకుఁ బ్రారంభించిరనియు, నది క్రమక్రమముగా స్థిరమై పోయెననియుఁ దలంచుట సమంజసము. ఇట్టి సందర్భములలో గ్రంథమునకుఁ గవిపేరును జేర్చి వాడుచుందు రని

తలంచుటకూడ న్యాయమును సహజమును నగును. బుద్ధభూపతియీ గ్రంథమునకు రంగనాథరామాయణ మనుపేరుంచెనని ధృవపడినచే తప్ప రంగనాథశబ్దమునుండి రంగనాథుఁడుత్పన్నుఁ డయ్యెనని నిశ్చయింపరాదు. ఈనామకరణము బుద్ధనృపతిచేసెనను సాక్ష్యము లేదు. కావున లోకాచారముననుసరించి, రంగనాథునిబట్టియే రంగనాథ రామాయణ మనుపేరు వచ్చినదనియు, రంగనాథుఁడు కల్పితపురుషుఁడు గాఁడనియు, నిర్ణయింపఁదగియున్నది. బుద్ధభూపతి. యీ రామాయణమును రంగనాథరామాయణ మనిపిలువఁదలచినచోఁ దుదకుఁ దనతండ్రినామమునకు రంగనాథశబ్దమునైనఁ జేర్చి సూచించియుండును. అతఁడట్లును జేయలేదు కావున నీగ్రంథమునకు రంగనాథరామాయణ మనుపేరాతఁ డుంచినదికాదనియే నిశ్చయింపవలసియున్నది ఏయాధారమునులేని రంగనాథశబ్దమునుండి రంగనాథుఁ డుత్పత్తియయ్యెననుటకంటె రంగనాథునిబట్టి గ్రంథనామమునకు రంగనాథశబ్దము చేర్చఁబడినదని తలంచుటయే సమంజసము.

నే నెఱిఁగియున్నంతవఱకు రంగనాథునిఁ బూర్వకవులలోఁ జేర్చి నుతించినవారిలో మొదటివాఁ డనంతామాత్యుఁడు. ఇతఁడు క్రీ. శ. ౧౪౦౦ సంవత్సరప్రాంతము నందుండెను. రంగనాథరామాయణము ౧౩౩౦ ప్రాంతమున రచితమయ్యెను. అనంతామాత్యుఁడు తనభోజరాజీయమున:—

ఉ॥ నన్నయభట్టుఁ దిక్కకవినాయకు భాస్కరు రంగనాథుఁ జే
రెన్నికకెక్కినట్టి యమరేశ్వరు నెఱ్ఱయమంత్రి నాదిగాఁ
జన్నకవీంద్రులం నవరసస్ఫుటవాణు లనంగ ధాత్రిలో
నున్నకవీంద్రులం దల్ఁతు నుల్లమెలర్పఁగ వాగ్విభూతికిన్."

అని చెప్పియున్నాఁడు. ఇందు "భాస్కరురంగనాథు" అని వరుసక్రమమునఁ జెప్పియుండుటచే, భాస్కర, రంగనాథరామాయణములను వరుసను నందుంచుకొని, తత్కర్తలను నుతించినాఁడని

యెంచఁదగియున్నది. ఆరామాయణముల నాతఁడు చదివియుండును. రంగనాథరామాయణజననమునకుఁ బిమ్మట. నరువదిదెబ్బది సంవత్సరములలోనున్న యనంతామాత్యుఁ డొకకల్పితపురుషుని వాస్తవిక కవిగానెంచి నుతించెనని తలంచుట కవకాశములేదు. రంగనాథుఁడు రచించినమఱియే యితరగ్రంథములైన నప్పుడుండి, యటు తరువాత నవి కాలగర్భమునఁ బడిపోయి యుండుననియు, నందు సీరామాయణకర్త రంగనాథుఁడని యనంతామాత్యుఁడు చెప్పినట్లు భావింపరాదనియుఁ, గొంద ఱనవచ్చును. అయిన నాపక్షమునఁ గూడ రంగనాథుఁడు కల్పితపురుషుఁడుకాక వాస్తవికకవియేయగును. కావున నెటుచూచినను రంగనాథుఁడు భ్రాంతిమూలమున జనించిన కల్పితవ్యక్తి కాఁడనుట నిశ్చయము.

౨. చక్రపాణిరంగనాథుఁడును, ద్విపదరామాయణకర్తయు నొక్కఁడు కాఁడని చక్రపాణిరంగనాథుని చారిత్రమున వ్రాసియున్నాఁడను. ఇఁక నావిషయమున మఱల జర్చింపఁబనిలేదు.

3. ఇతరులురచించిన కావ్యములను దమపేర ప్రకటించుకొనిరను ప్రవాదము గలవా రాంధ్రకవి ప్రపంచముననే పదిమందిరో యుందురు. అట్టి ప్రవాదము గల్గుట కేవియోకొన్నికారణములుండియుండును. అట్టిగాథ లన్నియు సత్యములై యుండవు. అన్నియు నసత్యములునై యుండవు. కొన్నియిదమిత్థమని నిర్ణయింపసాధ్యముగానివై యుండును. తెలిసినవిషయములను లోకము నెదుటనుంచి, తమయభిప్రాయమును దెలుపుచు నిర్ణయమును బాఠకులకు వదలివేయుట చరిత్రకారులధర్మము. ఆవిధినే నేనిట నిర్వర్తించుచున్నాఁడను. రంగనాథరామాయణమున కున్నట్లే కంకంటివారి యుత్తరరామాయణమునకుఁగూడ నిట్టిప్రవాదమే కల్గుట యొకవిచిత్రసంఘటనము. గ్రంథస్థమైన సాక్ష్యముండఁగా దానిని విడచి యితరసాక్ష్యము నాధారముగాఁ గైకొనుట తగదను నియమము కవులపట్ల నత్య

రశః అనువర్తింపఁజేయునెడల, నీవిచారణయే యక్కఱలేదు. ఈ వివాదమునకు మూలచ్ఛేదమే యగును. ఆ స్తిపత్రములోఁ గేరున్న వానిదికాక మరియొకరిదనివచ్చెడి వివాదములలో లిఖితసాక్ష్యమునే కాకుండ నితరసాక్ష్యమును గైకొనవచ్చునని నియమమును గవుల పట్లకూడ వర్తింపఁజేయవచ్చునని నిర్ణయించినప్పుడే యీచర్చ కవ కాశము కలుగుచున్నది. దివ్యలోభముచేఁ దనపుత్రిక నితరుని పుత్రికయని ప్రకటించుట కంగీకరించెడికవులును, ఇతరుని పుత్రికను స్వీకృతపుత్రికగా గ్రహించెడి కీర్తికాములును మన కచ్చటచ్చటఁ గన్పట్టుచున్నారు. ఇట్టివారుండుట, సంభవమే యనుసూత్రమును మన మంగీకరించితిమేని, గ్రంథాధారముచే కాకుండ నితరసందర్భము లనుగూడఁ బరిశీలించి తీర్మానింపవలయుననికూడ మన మంగీకరింపక తప్పదు.

బుద్ధభూపతి పక్షమునఁగల సాక్ష్యము.

౪. రంగనాథరామాయణ విషయమునఁ గృత్యాదియు గద్యయు బుద్ధభూపతిపక్షమున స్పష్టమైన సాక్ష్యమొసంగుచున్నవి. ఇంతకుదప్ప నితరకవులితనిని నుతించుట మొదలుగా వేఱుసాక్ష్యమేమి యు నీతనిపక్షమున లేదు. ఇఁక రంగనాథునిపక్షమున నింతకంటె బలవత్తరమైనసాక్ష్యమున్నదా ? యనువిషయమునుగూర్చియాలోచిం పవలసియున్నది.

రంగనాథుని పక్షమునఁగల సాక్ష్యము.

(క) రంగనాథరామాయణ ముత్పన్నమైన కాలములో, అనం తామాత్య, పోతన, గోపనాదిమహాకవులచే నుతిఁగన్న రంగనాథుఁ డనుకవియున్నప్పుడా రామాయణ మాతనిపేరుతోనే వ్యవహృత మయ్యెననియు, దాని కాతఁడే కర్తయనియుఁ దలఁచుట సహజము. కృత్యాదియు గద్యయు బుద్ధిభూపతిపక్షమున నెట్లు సాక్ష్యమిచ్చు చున్నవో, రంగనాథునిపట్ల నీపేరును నటే ప్రబలమైన సాక్ష్యమొసం

గుచున్నది. కవినిబట్టి బుద్ధరామాయణమనిగాని, కృతిభర్తనుబట్టి విఠలరామాయణమనిగాని, కృతిపతిపూర్తినామము పాండురంగవిఠల నాథుఁడని తలంచినచో (అట్లుతలంచుట కాధారములు లేవు. బుద్ధ భూపతి తనతండ్రినామము పాండురంగవిఠలనాథుఁ డనియెచ్చటను జెప్పలేదు. ఆతనికుమారులును ననలేదు. కుప్పమాంబ శాసనముల యందును నట్లులేదు. ఎచ్చటఁజూచినను విఠలుఁడని, విఠలభూపతి యని, విఠలత్మానాథుఁడని, యిత్యాదిగాఁ గన్పట్టుచున్నది). పాండు రంగమహాత్మ్యమువలెనే పాండురంగరామాయణమనిదీని, పిలువక లోకము, కవిపరంపర, పండితబృందము మొదటినుండియు, రంగనాథ రామాయణ మనివాడుచుండుటచే నీకావ్యకర్తరంగనాథుఁడని స్పష్ట మగుచున్నది. పాండురంగవిఠలదేవుని స్ఫురింపఁజేయక శ్రీరంగ మండలిరంగనాథుని సులభముగా స్ఫురింపఁజేసెడి యీరంగనాథశబ మును, బుద్ధభూపతి తనతండ్రినామచిహ్నముకొఱ కుపయోగించినాఁ డని తలంపరాదు.

(చ) అనంతామాత్యాదికవిపుంగవులు గ్రంథము బుద్ధభూపతి పేర నుండఁగా నాతనినివిడిచి, రంగనాథుని స్మరించుటచే నీగ్రం థము రంగనాథరచితమనువాడుక, యదిబయలువెడలిన యఱువది డెబ్బదిసంవత్సరములలోపుననే పుట్టినదనుట స్పష్టము. దీనినిబట్టిచిర కాలానుగతమైన జనశ్రుతికూడ నీగ్రంథము రంగనాథునిదని ఋజువుసేయుచున్నది. అప్పకవి యీగ్రంథమునుండి యుదాహరణ ములనుజూపుచుఁ దనగ్రంథములో "రంగనాథరామాయణ మనక రంగనాథుని రామాయణము" అని స్పష్టముగాఁ జెప్పియున్నాఁడు.

(ట) పూర్వరామాయణముయొక్కయు నుత్తరరామాయణ ముయొక్కయు శైలి యొకేరీతిగ నున్నది. "బహుపురాణజ్ఞులు" మొదలుగా ననేకశబ్దము లొకేరీతి వర్ణనములలో రెండుగ్రంథ ములయందును నొకేవిధముగా నుపయోగింపఁ బడినవి. తండ్రి

గ్రంథములోని వర్ణనలను కుమారు లనుకరించి రని యనుకొనినను, తండ్రికొడుకుల శైలి యొకేవిధమున నుండుననుట యసామాన్యవిషయము. ఈ రెండుగ్రంథములను జదివి చూచినవారి కిందలి శైలి యొక్క-రీతిగా నున్నదని తోఁపకమానదు. శైలినిబట్టి వివాదమును బరిష్కరించుటలోఁ బ్రమాదము కలుగవచ్చు ననుమాట సత్యమే యైనను యీసూత్ర మన్నితావుల వర్తింపదు. కొన్ని పదములనో కొన్ని పద్యములనో ఆధారముగాఁగొని శైలిని నిర్ణయింపరాదు. కాని యిచ్చట నొకగ్రంథ ముత్తరకాండమున్నది. కావున శైలిపైనాధారపడుట యాక్షేపణీయము కాఁజాలదు. చదివిచూచినప్పు డీరెండు సంపూర్ణగ్రంథముల శైలియు నొక్కటియే యని నిర్ణయించుట కించుకేనియు సంశయము కలుగదు. కావున శ్రీరామాయణకర్త రంగనాథుఁడనినిశ్చయించుట కభేద్యమైన యీశైలి బలవత్తరమైనసాక్ష్యమిచ్చుచున్నది.

(ఞ) పూర్వరామాయణము సరిగా పూర్తియగు నప్పటికే బుద్ధారెడ్డి కవసానము తటస్థించుటయు, విఠలభూకాంతుఁడు కుమారునితోఁ జెప్పినట్లే బుద్ధభూపతి, రామాయణము బూర్తిచేయుఁ డని కుమారులతోఁ జెప్పుటయు, ననుమానాస్పదము లగుచున్నవి. రంగనాథుఁడే బుద్ధనృపతిపేరునఁ బూర్వరామాయణమును, కుమారుల పేరున నుత్తరరామాయణమును రచియించెననితోఁపకమానదు.

(ప) రంగనాథుఁడే యీగ్రంథమును రచించియున్నయెడల, "మాతండ్రి విట్ఠలక్ష్మాపాలుపేర" అని వ్రాసికొనఁగలఁడా ? యని యొకప్రశ్న ! కారణాంతరములచేఁ దనయాస్తి నింకొకరిదని చూపుటకై యొకపత్రమును వ్రాసినప్పుఁ డందులకు నలయు మాటలే యందుండుటయు, దానినిబట్టి తరువాత వ్రాయు వ్రాఁతలన్నియు నందుల కనుగుణముగనే యుండుటయు లోకాచారము. ఆగ్రంథమును బుద్ధభూపతి వ్రాయుచున్నట్లురచించెడికవి విఠలభూపతిని "మా

తండ్రి'' యనక యేమనును ? ఈగ్రంథమును వ్రాయునప్పుడు రంగనాథుఁడు, తాను కేవలలేఖరి నని మాత్రమే యనుకొనుచున్నాఁడు. కాని కవి ననుకొనుట లేదని మనము తలంపవలసియున్నది. కావున గ్రంథకర్త రంగనాథుఁ డనుట కీవిషయ మడ్డంకి కానేరదు.

(గ) తంజావూరునం దున్న యొక తాళపత్రప్రతిలో నీ రంగనాథ రామాయణమును బుద్ధభూపతిచెప్పుచుండఁగా రంగనాథుఁడు లేఖరిగానుండి లిఖించినట్లు వ్రాసియున్నదని చెప్పుచున్నారు. నే నా ప్రతినిఁజూచుట తటస్థింపలేదు. తంజావూరు గ్రంథముల పట్టికలోఁగూడ నీయంశమున్న ప్రతి యుదాహృతము కాలేదు. ఒకవేళ నటులున్నను, నదిగద్యకవిత్వాదులకంటె నెక్కువ సాక్ష్యమీయదు. వానికనుగుణముగా నీవ్రాఁత వ్రాయఁబడియెనని చెప్ప నొప్పును. ఇంతేకాదు. గ్రంథములను లిఖించు వ్రాయసకాఁడుగా నైనను, బుద్ధభూపతి యాస్థానమున రంగనాథుఁ డను నొకపురుషుఁ డున్నట్లెందు వలన స్పష్టపడును. కేవలము వ్రాయసకాని పేరు గ్రంథమునకుఁ బెట్టుదురని యెవరునుదలంపఁగు. మఱియు నట్టివానిని కవులునుతింపరు. కావున నీ విషయముకూడ రంగనాథుఁడు గ్రంథకర్త కాఁడని ఋజువు సేయదు.

ఈచర్చనుబట్టి, రంగనాథుని పక్షమున గ్రంథనామమును, శైలియు, ఆకాలపుకవుల వ్రాఁతలును, అప్పకవ్యాదిలాక్షణికుల యుదాహరణములును, చిరకాలానుగత బహుజన శ్రుతియు, బలవత్తరమైన సాక్ష్య మొసంగుచున్న వని యొప్పుకొనక తప్పదు. ద్విపద రామాయణగ్రంథకర్త రంగనాథుఁడనియే నాయభిప్రాయము.

రంగనాథుని కృతికన్యను స్వీకృతకన్యనుగా గ్రహించినందు వలన బుద్ధభూపతి యశమున కించుకంతయు లోపము వాటిల్లదు. రంగనాథరామాయణమువంటి మహాకావ్యమును రచింపఁజేసి యాకవిని పోషించి, యాంధ్రభాషాభివృద్ధికిఁ దోడ్పడిన బుద్ధనృపతి నాంధ్రలోకము మఱువఁజాలదు.

...రంగనాథునికులగోత్రాదు లేవియుఁ దెలియరాలేదు. కొఱవి గోపరాజు నుడివిన :—

చ. అనఘు హుళక్కి భాస్కరు మహామతిఁ బిల్లలమఱ్ఱి వీరరా
జును ఘను నాగరాజుఁ గవిసోమునిఁ దిక్కనసోమయాజిఁ గే
తనకవి, రంగనాథు నుచితజ్ఞుని నెఱ్ఱన నాచిరాజు సో
ముని నమరేశ్వరుం దలఁతు మత్కులచంద్రుల సత్కవీంద్రులన్.

అనుపద్యమునుబట్టి రంగనాథుఁడు నియోగిబ్రాహ్మణుఁ డని చెప్పవచ్చును. ఈతని యింటిపేరు వెలిచేటివారని యొకప్రతీతిగలదు. వెలిచేటి వారు నియోగిబ్రాహ్మణులలో నున్నారు. ఇదిసత్యమైనచో చక్రపాణిరంగనాథుఁడును, సీతఁడును భిన్నవ్యక్తు లనుట స్పష్టము. ఈతని నివాసము బళ్ళారిమండలమో, కడపమండలమో యై యుండును. ఇతని కాలము పదుమూఁడవ శతాబ్ది తుదిభాగమును పదునాల్గవ శతాబ్ది మొదటిపాదము నని నిశ్చయింపవచ్చును.

రంగనాథరామాయణ కృత్యాదియు. గద్యయును గాఁకులసౌకర్యముకొఱకు బుద్ధభూపతి చరిత్రమున వ్రాయుదును.

—:0:—

## 41. గోన బుద్ధభూపతి

రంగనాథరామాయణ ద్విపదకావ్యమున కితఁడు కర్తయని యీక్రింది ద్విపదలవలన స్పష్టపడుచున్నది.

"అని యాంధ్రభాష భాషాధీశవిభుఁడు
వినుతకావ్యాగమవిమలమానసుఁడు
పాలితాచారుఁ డపారధీశరధి
భూలోకనిధి గోనబుద్ధభూవిభుఁడు
తమతండ్రి విట్టలధరణీశు పేరఁ
గమనీయగుణ ధైర్యకనకాద్రి పే

పనిబూని యారిగండభైరవు పేర
ఘనుపేర మీసరగండని పేర
నాచంద్రతారార్కమై యొప్పు మిగుల
భూచక్రమున నతిపూజ్యమై వెలయ
నసమానలలితశబ్దార్థసంగతుల
రసికమై చెలువొందు రామాయణంబు
పరఁగ నలంకారభావన లొప్పఁడ
గరమర్థి నీయుద్ధకాండంబు చెప్పె"

కృత్యాది

ఈకవితండ్రియైనవిట్ఠలనాథుఁ డొకనాఁడు సభలోఁగూర్చుండి తెలుఁగున రామాయణమును రచియింప గలవారెవ రైన నున్నారా యని ప్రశ్నింపఁగా సభాసదులు "ఏలికకుమారుఁ డైన బుద్ధభూపతి యీపనికిఁ దగినవాఁ"డని విన్నవించిరఁట! అందుపైనా మహారాజు కుమారునిఁ బిలిపించి రామాయణమును రచింపు మని యానతీయఁ దానీగ్రంథమును రచించితి నని కవి యీక్రింది ద్విపద లలోఁ జెప్పుకొనియుండెను!

"వినయనయోపాయవిజయసుస్థిరుఁడు
ఘనకీర్తి విట్ఠలక్ష్మాపాలవరుఁడు
రాజసర్వజ్ఞుండు రాజసింహుండు
రాజశిరోమణి రాజపూజితుఁడు
సకలజగద్ధితచాతుర్యధుర్యుఁ
డొకనాఁడు గొలువున నున్నతోన్నతిని
బహుపురాణజ్ఞులుబహుశాస్త్రవిదులు
బహుకావ్యనాటకప్రౌఢమానసులు
హితులు మంత్రులు పురోహితులు నాశ్రితులు
సుతులు రాజులు బహుశ్రుతులును గొల్వ

దీపించుభూలోక దేవేంద్రు పగిది
నేపారియున్నచో నింపు పుట్టించి
రసికులు భారత రామాయణాది
రసగోష్ఠి ప్రకటింప రసికశేఖరుఁడు
రామకథాసుధారసరక్తుఁ డగుచు
నామహాసభలోన నందఱఁజూచి
"రమణమైఁ దెనుఁగున రామాయణంబు
క్రమమొప్పఁ జెప్పెడు ఘనకావ్యశక్తి
గలకవు లెవ్వరుగల రుర్వి" ననినఁ
దలపోసి విట్ఠలధరణిపాలునకు
నున్నతమూర్తికి నురుయశోనిధికి
విన్నవించిరి ప్రీతివిబుధపుంగవులు
"సీతనూజన్ముండు నిపుణమానసుఁడు
ధూతకల్మషుఁడు బంధురనీతిధనుఁడు
సర్వజ్ఞుఁ డనఘుండు చతురవర్తనుఁడు
సర్వపురాణవిచారతత్పరుఁడు
కమనీయబహుకళాగమవిచక్షణుఁడు
సుమనీషిపోషణోత్సుకసుఖోన్నతుఁడు
కవిసార్వభౌముండు కవికల్పతరువు
కవిలోకభోజుండు కవిపురందరుఁడు
ప్రత్యర్థిరాజన్యబలవజ్రపాణి
ప్రత్యర్థినృపపాపదావకోజ్జ్వలుఁడు
భీకరనిజఖడ్గబింబితస్వర
లోకానురక్తారి లోకదుర్దముఁడు
సగసార్థిజలజాతజలజాతహితుఁడు
పురుషచింతామణి బుద్ధయాహ్వయుఁడు
నీకతిభక్తుండు నిఖిలశబ్దార్థ

పాకజ్ఞుఁ డత్యంతపాండిత్యఘనుఁడు
మఱియు రామాయణమర్మ మాతండ
యెఱుఁగునాతనిఁ బంపు మీకథఁ జెప్ప
ననిన మజ్జనకుఁ డుదాత్తవర్తనుఁడు
ననునర్థిఁ బిలిపించి ననుగారవించి
"భూమిఁ గవీంద్రులు బుధులును మెచ్చ
రామాయణంబు పురాణమార్గమునఁ
దప్పక నాపేరఁదగ నాంధ్రభాషఁ
జెప్పి ప్రఖ్యాతంబు సేయింపు మర్థి"
నని యానతిచ్చిన నామృదూక్తులకు
ననయంబు హర్షించి యట్ల కావింపఁ
బనిపూని యరిగండభైరవు పేర
ఘనుపేర మీసరగండని పేర
లలితనిర్మలగుణాలంకారు పేర
నలఘునిశ్చలదయాయతబుద్ధి పేర
నాతతకృతి పేర నతిపుణ్యు పేర
మాతండ్రి విట్ఠలక్ష్మాపాలు పేర
రాజులు బుధులును రసికులు సుకవి
రాజులు సుఖగోష్ఠి రాజిల్లి పొగడఁ
బదము లర్థంబులు భావముల్ గతులు
పదశయ్య లర్థసౌభాగ్యముల్ యతులు
రసములు గుంభనల్ ప్రాససంగతులు
నసమానరీతుల నన్నియుఁ గలుగ
నాదికవీశ్వరుఁ డైనవాల్మీకి
యాదరంబునఁ బుణ్యులందఱు మెచ్చఁ
జెప్పిన తెఱఁగున శ్రీరామచరిత
మొప్పఁ జెప్పెదఁ గథాభ్యుదయ మెట్లనిన"

ఈద్విపదరామాయణమును రంగనాథకవి రచియించె నని యొక వాడుక కలదు. దీనినిగూర్చి రంగనాథకవి చారిత్రమున విపులముగా వ్రాసియున్నాఁడను. కావున నిట మఱల వ్రాయలేదు. కావ్యకర్తను గూర్చి వివాదముండుటచే నావిషయమున దమయభిప్రాయమును స్థిరముచేసికొనుటకై గ్రంథవిస్తరభీతియున్నను గృత్యాదిని గవిచెప్పినయంశములను బూర్తిగఁ బైనినుదాహరించితిని. కుమారుని కవితాసామర్థ్యము సభ్యులు చెప్పెడువఱకును దండ్రికిఁ దెలియకుండుట వింతగనే కన్పించును. కాని కవులు తమశక్తిని దాము చెప్పి యాత్మస్తుతిపరాయణు లనిపించుకొనుట కిష్టములేక యితరులు చెప్పినట్లు చూపుటకై యిట్టికథలను గల్పించుచుందురుటలోకప్రసిద్ధము. కావున నిది యొకయాక్షేపణీయాంశముగాఁ బరిగణింపరాదు. కవి తనవంశావళిని క్రిందిద్విపదలలో వర్ణించియున్నాఁడు.

—:బుద్ధభూపతి వంశము.:—

శ్రీరమణీయమహా స్పృష్టి నుత్తములు
గోరివర్ణన సేయుగోనవంశమున
ఫలితసదాచారభానుఁడై పొడమి
కలికాలదోషాంధకారంబుఁద్రోలి

* * *

శరణార్థి రాజన్యషట్పదాధార
కరపద్మునకు గోనకాటభూపతికి
నయనయోదయదయాయత నిత్యమతికిఁ
బ్రియతనూజన్ముఁడై పృథివిఁ బెంపొందు
రుద్రప్రతాపుండు రుద్రనిర్మలుఁడు
రుద్రాత్ముఁ డగుగోనరుద్రనరేంద్రు
పౌత్రుఁడ భంగుఁడ ప్రతిమవర్తనుఁడు
గోత్రధీరుఁడు కులగోత్రవర్ధనుఁడు

దివిజేంద్రవిభవుండు ధీరసన్నుతుఁడు
భువనవిఖ్యాతుఁడౌ బుద్ధభూవిభుని
తనుజన్ముఁ డక్షీణదాక్షిణ్యధనుఁడు

* * *

వినయనయోదయవిభవసుస్థిరుఁడు
మనుమూర్తి విట్ఠలక్ష్మాపాలవిభుఁడు

ఈద్విపదలనుబట్టి చదువరులసౌకర్యార్థ మీకవివంశము నీక్రిందని చ్చుచున్నాను. బుద్ధభూపతితండ్రినిగూర్చి కొంతతగవు కలదు. అందుకొఱకీ వంశవృక్ష మవసరమైనది.




(వీరిరువురును ఉత్తరకాండ కృతికర్తలు)

ఇందలి మొదటిపురుషుఁ డగు కాటభూపతి కాకతి పోలరాజునకు సేనానాయకుఁ డని శేషాద్రిరమణ కవులు వ్రాసియున్నారు.

—: బుద్ధభూపతి తండ్రి విట్ఠయయా? గన్నయయా? :—

బుద్ధభూపతి తండ్రి విట్ఠలభూపతియని యీవంశవృక్షములోఁ గన్పట్టుచున్నది. రంగనాథరామాయణ కృత్యవతరణికలో బుద్ధ

ఈద్విపదరామాయణమును రంగనాథకవి రచియించె నని యొక వాడుక కలదు. దీనినిగూర్చి రంగనాథకవి చారిత్రమున విపులముగా వ్రాసియున్నాఁడను కావున నిట మఱల వ్రాయలేదు. కావ్యకర్తను గూర్చి వివాదముండుటచే నావిషయమున దమయభిప్రాయమును స్థిరముచేసికొనుటకై గ్రంథవిస్తరభీతియున్నను కృత్యాదిని గవిచెప్పినయంశములను బూర్తిగఁ బైనినుదాహరించితిని. కుమారుని కవితాసామర్థ్యము సభ్యులు చెప్పుచువఱకును దండ్రికిఁ దెలియకుండుట వింతగనే కన్పించును. కాని కవులు తమశక్తిని దామెచెప్పి యాత్మస్తుతిపరాయణు లనిపించుకొనుట కిష్టములేక యితరులు చెప్పినట్లు చూపుటకై యిట్టికథలను గల్పించుచుందురుటలోకప్రసిద్ధము. కావున నిది యొకయాక్షేపణీయాంశముగాఁ బరిగణింపరాదు. కవి తనవంశావళి నీ క్రిందిద్విపదలలో వర్ణించియున్నాఁడు.

—: బుద్ధభూపతి వంశము. :—

శ్రీరమణీయమా సృష్టి నుత్తములు
గోరివర్ణనసేయుగోనవంశమున
ఫలితసదాచారభానుఁడై పొడమి
కలికాలదోషాంధకారంబుఁద్రోలి

* * *

శరణార్థి రాజన్యషట్పదాధారి
కరపద్ముఁనకు గోనకాటభూపతికి
నయనయోదయదయాయత నిత్యమతికిఁ
బ్రియతనూజన్ముఁడై పృథివిఁ బెంపొందు
రుద్రప్రతాపుండు రుద్రనిర్మలుఁడు
రుద్రాత్ముఁ డగుగోనరుద్రనరేంద్రు
పౌత్రుఁడ భంగుఁ డప్రతిమవర్తనుఁడు
గోత్రధీరుఁడు కులగోత్రవర్ధనుఁడు

దివిజేంద్రవిభవుండు ధీరసన్నుతుఁడు
భువనవిఖ్యాతుఁడౌ బుద్ధభూవిభుని
తనుజన్ముఁ డక్షీణదాక్షిణ్యధనుఁడు

* * *

వినయనయోదయవిభవసుస్థిరుఁడు
మనుమూర్తి విట్ఠలక్ష్మాపాలవిభుఁడు

ఈద్విపదలనుబట్టి చదువరులసౌకర్యార్థ మీకవివంశము నీక్రిందనిచ్చుచున్నాము. బుద్ధభూపతితండ్రినిగూర్చి కొంతతగవు కలదు. అందుకొఱకే వంశవృక్ష మవసరమైనది.




(వీరిద్దరును ఉత్తరకాండ కృతికర్తలు)

ఇందలి మొదటిపురుషుఁ డగు కాటభూపతి కాకతి ప్రోలరాజునకు సేనానాయకుఁ డని శేషాద్రిరమణ కవులు వ్రాసియున్నారు.

—: బుద్ధభూపతి తండ్రి విట్ఠయయా ? గన్నయయా ? :—

బుద్ధభూపతి తండ్రి విట్ఠలభూపతియని యీవంశవృక్షములోఁ గన్పట్టుచున్నది. రంగనాథరామాయణ కృత్యవతరణికలో బుద్ధ

భూపతితండ్రి విట్ఠలక్ష్మానాథుఁ డని స్పష్టముగాఁ జెప్పఁబడినట్లు పై నుదాహరించిన ద్విపదలవలనఁ గనవచ్చుచున్నది. ఇట్లుండఁగాఁ బూర్వరామాయణకృతికర్త యైన బుద్ధభూపతి తనయులు కాచవిభుఁడు విట్ఠలరాజులు తాము రచించిన యుత్తరకాండమునఁ దమతాత గన్న క్షితీందుఁ డని యీక్రింది ద్విపదలలో నుడివియున్నారు.

> "గోన వంశార్ణవ కువలయప్రియుఁడు
> నానొప్పు గోన గన్న క్షితీంద్రునకు
> ననుకూలయై యున్న యన్నమాంబికకుఁ
> దనయుండు సాహిత్యతత్త్వకోవిదుఁడు
> దానప్రసిద్ధుండు ధర్మశీలుండు
> భూనుతాచారుండు బుద్ధ భూవిభుఁడు
> అఖిల పురాణేతిహాస సమ్మతము
> నిఖిల లక్షణగుణాన్వితము నగుచుఁ
> దెలుఁగున నొప్పఁగా ద్విపదరూపమున
> నలిఁ బూర్వరామాయణము మున్నుఁ జెప్పి."

పూర్వరామాయణకర్త యగు బుద్ధభూపతికి ఉత్తరకాండకర్తలు కుమారు లనుటకు సందియము లేదు. ఇఁక నీ బుద్ధభూపతి తండ్రి పేరు విషయమే వివాదాంశము. తన తండ్రి పేరు విట్ఠలక్ష్మానాథుఁ డని బుద్ధభూపతి స్పష్టముగాఁ గృత్యాదిని గొండ్రశములను జెప్పి యుండఁగా ఆ గ్రంథమును జదివిన యీ కాచవిట్ఠలరాజులు గన్న భూపతి యని యేలచెప్పవలయుననునదియే విషమసమస్య. ఈప్రశ్నకు విట్ఠల భూపతికిఁ గన్నభూపతి యని నామాంతర ముండియుండు నని సులభముగా సమాధాన మీయవచ్చును. కాని గ్రంథమునం దంతటను తండ్రిచెప్పిన పేరుండఁగా దానిని విడిచి యీకవు లీనామాంతరము నేల గ్రహింపవలయు నను సంశయమున కిది తృప్తికరమైన సమాధానము కాఁజాలదు.

మఱియు నీకవినివాసము, కాలములనుగూర్చి కూడఁ దెలిసి కొనవలసినయావశ్యకమున్నది. రంగనాథరామాయణ పూర్వోత్తర భాగములలో నెచ్చటను వీరినివాసమునుగాని, వీరుపరిపాలించిన ప్రదేశమునుగాని, వీరికాలమునుగాని తెలిసికొనుట కాధారములు లేవు వీరునుతించినకవులుగాని వీరిని నుతించినకవులుగాని లేకపోవుటచేఁ గాలనిర్ణయ మసాధ్యమగుచున్నది. ఈవిషయములను దెలిసికొనుట కిదివఱకు పండితు లైదుశాసనముల నాధారముగాఁ గొనియున్నారు. ఆశాసనము లీసందర్భమున నెంతవఱకు దోడుపడునో చూడవలసియున్నది.

:మల్యాల గుండయ శాసనములు:—

కాకతీయగణపతియొద్దను రుద్రాంబ, కాలములోను మల్యాల గుండయయను దండనాయకుఁడుండెను. అతనిభార్యకుప్పాంబిక. గుండయ దండనాయకుఁడు శా, శ. ౧౧౯౪, ౧౧౮౧, ౧౧౯౪ సంవత్సరములలో మూఁడుశాసనములను వ్రాయించెను. వీనికి బూదపురశాసనములని పేరు.

ఈమూఁడుశాసనములలోను గుప్పాంబికపేరుకూడ నున్నది. ఆమెగోనబుద్ధభూపతికుమార్తెయని యందుఁ జెప్పఁబడినది. గుండయ దండాధినాథుఁడు చనిపోయినపిదప నీకుప్పాంబ శా. శ. ౧౧౯౭ లో నేకశాసనము వ్రాయించినది. అందులోఁగూడ నీమె గోనబుద్ధభూపతికుమార్తెనని, చెప్పుకొనినది. పైఁజూపిన వంశవృక్షములో బుద్ధభూపతు లిరువురున్నారు. అందెవరికైన నీమె కుమార్తెయైయుండునని తలంచి, పండితులీశాసనముల నాధారముగాఁ గొని రంగనాథ రామాయణకాలమును నిర్ణయింపఁబూనుకొనిరి. ఈసందర్భమున గుండయదండనాయకుని శాసనములతో నంతగాఁ బనిలేదు. అందుచే తను గ్రంథగౌరవభీతిచేతను వాని నిట నీయలేదు. కుప్పాంబశాసనము నీక్రిందనిచ్చుచున్నాఁడను. ఈశాసనములో నుదాహృతుఁడైనబుద్ధ

భూపతియు వంశవృక్షములోని బుద్ధభూపతియు నొక్కఁడేయనుటకు
నిస్సంశయమైనయాధారము లేదు. అయినను బుద్ధభూపతి దాదాపుగా
నా కాలములోనివాఁడే యైనందునను గోనబుద్ధభూపతి తనయ నని
యామె చెప్పుటవలనను, నాతఁడే యీతఁడని నిర్ణయింపనగును.

—: కుప్పాంబ బూదపుర శాసనము :—

స్వస్తిసమధిగతపంచమహామండలేశ్వ రానుమకొండపురవరా
ధీశ్వర కాకతీయ రుద్రదేవమహారాజులు. ఓరుంగంటను పృథివి
రాజ్యంబు సేయుచుండంగాం దత్పాదాపాదితరాజ్యలక్ష్మీనివాసుం
డయిన శ్రీమల్యాలగుండదండాధీశ్వరునిధర్మపత్ని కుప్పమాంబిక తన
పతి పరలోకానికిం జనితేని బూదుపురాన గుడికట్టించి శకవర్షంబులు
౧౧౯౮ వర్తింపంగాను ధాతృసంవత్సర మాఘశుద్ధ౧౦ గు॥ గుండయ
పేరను లింగప్రతిష్ఠ చేసి ఆకాలమునందు ఆకుప్పసానంమంగాను తమ
కొడుకులు బాచయబొప్పండు గణపతిదేవండు పర్వతను మల్లయ
తమ్ముండ్లు మల్లయ బుద్ధయ వితయ కాటయకొడుకు గుండయ వీరు
సహితమయి ఆగుండేశ్వర దేవరకు ధారాపూర్వకముయినవృత్తి సేరు
నేల బాస్పముదాన మ ౨ కుప్పసముద్రాన మ ౧ గణపసముద్రాన
మ ౪ బుధునికుంటను మ ౪ వెరసి మ ౩॥ వెలిపొలము బూదుపురాన
మ ౧౨ పోతులమునుగున ౯ వెరసి మ ౨౧ ఇంతవట్టు ఆచంద్రార్క
స్థాయిగా నిచ్చి చిలజియ్యలకొడుకు సిద్ధజియ్యలాను బాచజియ్యల
కొడుకు వైజజియ్యలాను ఈస్థానానకు ఒడయులై బిడ్డతరము ప్రసాదో
పజీవులై ఉండుండని పంచి ధర్మసంరక్షణార్థంబుగు వదశ్రీమయుత
యజుర్వేదపారగ శబ్దవిద్యావిశారద కవీశ్వరుడయిన ఈశ్వరభట్టో
పాధ్యాయులను శాసనంబు సెప్పంబంచినం దత్ప్రారంభం బెట్టిదనిన॥
శ్రీవరాహరహస్యత్వం శ్రీవరాహజగత్ప్రభో రక్షితాదుదధే రంత
గతక్షితాక్షిప్తమంబువత్॥ శ్రీమన్మల్యాలవంశే శశికరనికరాందోళనో
న్మీలనశ్రీ మిశ్రీభూత ప్రభూత ప్రకటపటునటత్కీర్తివల్లీవితానః।

ఆసీ దాసీరలూనావళిమిళిత లసత్సంప దున్మేషభూషావేషా శేషాభి రామః క్షితితలతిలకో గుండదండాధినాథః। శ్రీగోనవంశనిజశేఖర బుద్ధయాఖ్యపుత్రీ పవిత్రచరితా భరితాగుణౌఘైః శృంగారకారకర ణిః కరణేయదక్షా కుప్పాంబికా జనిచతస్యసతీకలత్రం॥ లక్ష్మీనారా ణాఖ్యం జలశయనమధాశూన్యశయ్యాభిధానం సాసంసారుంధతీయం వ్రతశి. ద్వాదశీషు వ్రతంచకల్పోక్తం తచ్ఛతచ్ఛవ్యధిత 'కులసతీ స్తోమసీమంతభూషాకూపాస్థానాటి వాపీ సశివవనతటాగ శ్రీముకుంద ప్రతిష్టాం॥ భూదానంభూరిదానం రథతురగసదాదాన మన్నప్రదానం గోదానం హేమదానం వివిధవరపటీదాన మంబుప్రదానంత త్తచ్ఛత్ర ప్రదానం విధివిహితమహాదాన మన్యచ్చ సర్వం కుప్పాంబాకల్పవల్లీ ముహురకృతపతాం సర్వశయ్యాప్రదానం॥ శాకాబ్దే వసునందశంక గమితే శ్రీధాతృసంవత్సరే మాఘేమాసి సితేచ ధర్మదివసే వారేచ వాచాంపతేః కుప్పాంబా పతిసంజ్ఞయాకృత ముదా లింగప్రతిష్టా మదాత్. క్షేత్రం తిల్య మతుల్య మప్యధిఫలంజాతే యమస్మైతదా శ్రీమతు బాచయబొప్పనికి విత్తయను వైనె నారాయణుని అవ్వపేరు మాడిని వారణసికిం బుచ్చి బాసముద్రం వెనక బెట్టినవృత్తి మ ౨ వేసవి ౨ మ.

ఈశాసనకాలమునాటికిం గుప్పాంబికకు వయసువచ్చినతనయు లున్నారు. కావున నప్పటి కామె కేఁబదియేం డ్లుండునని తలంపవ చ్చును అట్లయినచో నామెజననముశా. శ. ౧౧౪౮ క్రీ. శ, ౧౨౨౬ ప్రాంత మగును. తండ్రియైనబుద్ధభూపతికి, ముప్పదవయేట నామె జన్మించియుండు ననితలంచితిమేని, యాతనిజననము క్రీ. శ. ౧౧౯౬ గును. రంగనాథరామాయణ మాతని యేఁబదవయేట పూర్తి య య్యె నన్నచో నది క్రీ. శ ౧౨౪౬ వ సంవత్సరమై యాకాలము పాల్కురికిసోమనాథాదులకంటెంబూర్వ మగును. రంగనాథరామాయ ణమంత ప్రాచీనము కాదు. కావునం గుప్పాంబిక పై వంశవృక్షము లోని రెండవబుద్ధభూపతికిం గుమార్తె కాదనియు, మొదటిబుద్ధభూపతి

యొక్క-తనయుఁడై యుండునని యు నిశ్చయింపఁదగియున్నది. పై శాస
నములో నాకుప్పాంబికకు, మల్లయ, బుద్ధయ, విటయ కాటయ య
నువారలు సోదరు లయినట్లు కన్పట్టుచున్నది. ఇందులోని విట్టయయే,
మన బుద్ధభూపతితండ్రియై యుండవలయును. రంగనాథ రామాయణము
లోని వంశవృక్షములో విట్ఠలునిసోదరులను జెప్పలేదు. అట్లు చెప్పక
పోయినంతమాత్రమునఁ గుప్పాంబికతో నీవంశమునకు సంబంధము
లేదని నిర్ణయింపలేము. భావిపరిశోధనమున నిందులకు వ్యతిరేకముగా
నేమేని గన్పడిననే తప్ప, రంగనాథ రామాయణకృతికర్త యైనబుద్ధ
భూపతి కీకుప్పాంబిక మేనత్తయని నిర్ణయింతము. దీనినిబట్టి బుద్ధభూ
పతిజననము క్రీ. శ. ౧౨౭౦ ప్రాంతమై రంగనాథ రామాయణరచనా
కాలము క్రీ. శ. ౧౩౦౦-౧౩౨౦ నడుమనై యుండునని తేలుచున్నది.

చిలుకూరివీరభద్రరావు పంతులుగారు ఆంధ్రుల చరిత్రమున
నీకుప్పాంబిక రంగనాథ రామాయణ కృతికర్తయని చెప్పఁబడియెడిబుద్ధ
భూపతికిఁ గుమార్తెయనియు, నామెసోదరు లనిచెప్పబడిన విట్ఠలుఁడే
యుత్తరరామాయణకర్త యగువిట్ఠలుఁ డనియు కాచరాజనే కాట
యయును శాసనమున నుదాహరించిరనియు, నభిప్రాయపడియున్నారు.
ఇదియు నూహలపై నాధారపడియున్నదే కాని వేఱుకాదు. కాటయ
కాచయ యొక్క-రేయనుట సమంజసముకాదు. ఇంతేకాదు. శాసన
మున విట్ఠలునకుఁ గాటయ తమ్ముఁడైనట్లు కన్పట్టుచున్నది. ఉత్తరరా
మాయణమునుబట్టి విట్ఠలునకు, కాచయ యగ్రజుఁడైనట్లున్నది. కా
వునఁ గుప్పాంబిక రెండవబుద్ధభూపతికిఁ గుమార్తెయనుటకంటె
మొదటి బుద్ధభూపతి తనయయనుటయే సమంజసమని నాదృఢాభిప్రా
యము.

కుప్పాంబికశాసనమునుబట్టి కాల మేదియో యొకవిధముగా
నిర్దిష్టమైనది కాని తక్కినవిషయములను తెల్పుటకీ శాసనమేమియు
సాహాయ్య మొసఁగ లేదు. ఇదివఱకుఁ జర్చలలో నుదాహృతమైన
రాయచూరుశాసనమువలన నేమైన నుపయోగ ముండునేమో చూడ
వలసియున్నది. ఆశాసన మిది.

—: రాయచూరు శాసనము :—

(కాకతీయసంచికనుండి గైకొనఁబడినది)

స్వస్తి సమస్త గుణగణాకార నవ్యరత్నాకర సౌజన్యగార (వ) అరిగండభైరవ సాహసోత్తుంగ కాకతీయకటకసంనాహ వీరవిత రణోత్సాహ కుడుపులూరిపురవరాధీశ్వర వీరలక్ష్మినిజేశ్వర మను మకులకమలమార్తాండ కదనప్రచండ మీసరగండ ఉభయబలగండ గండరగండ అభంగ గండభేరుండ హన్నిబ్బరగండ హదిమువర గండ లాడకువరుపిండార చోడజగజాళవీర కాంతికాఅగళమాళి సంతతార్చితశశివాళి కామినీజయంత దుష్టతురగ రేఖా రేవంత సమరసమయదుర్వారవీరావతార కోసగిమైలితలగొండుగండ ఉప్పు లమన్నితలగొండుగండ పందిభూపాలుని తలగొండుగండ అక్కినాయకు నితలగొండుగండ మేడిపలికాచయనాయకునిశిరఖండ కందూరికేసినా యనితలగొండుగండ ఆపాకభీమనిర్ధూమధామ నిరుపమసంగ్రామ రామ తెలిలకాటదిశాపట్ట ఏరువగొండ గోధూమఘట్టనఘరట్ట చేడ చెలుకినాయినినిసాహసాపహరణ సహజకార్యభరణ కోటపెర్మాడి రాయకంఠాభరణచూఅకాఅ బొడ్డబిడయపట్టసూత్రితతురంగాపహార రుద్రదేవదక్షిణభుజాదండ నిజకీర్తిపూరితబ్రహ్మాండకరండ పరబలో ద్దండ శ్రీసోమనాథదేవదివ్య శ్రీపాదపద్మారాధక పరబలసాధక నామాదిసమస్తప్రశస్తిసహితం శ్రీమతుమీసియరగండ గోనగంన యవడ్డివారు వర్ధమానపురమునందు సుఖసంకథావినోదంబు (న) పృ థువి రాజ్యము సేయుచుండగాను తద్రాజ్యరత్నామణిఅయిన శ్రీ నా రాయణదేవదివ్య శ్రీపాదపద్మారాధక సకలజనప్రతిపాలక పరబల సాధక సకలధర్మసాధక పుణ్యగుణసహిత విశాలనాథభూనాథుండు ఆదవనితుంబుళము మానువహాలువ దుర్గాలుసాధించి తదనంతరంబు రాచూరిపట్టణ ప్రవేశాభిముఖుండై సుఖసంకథావినోదంబున పృథువి రాజ్యము సేయుచునుండి శకవర్షంబులు ౧౨౧౬ అగు జయసంవ త్సరమార్గశిర శు ౭ రు నందుసర్వరాష్ట్రసమస్త ప్రజారక్షణార్థంబై దుర్గము రచియించెను. మంగళం మహా శ్రీశ్రీశ్రీ.

ఈశాసనమున గోనగన్నారెడ్డి, విట్ఠలభూపతి యనునిరువురు గన్పట్టుచున్నారు. ఈయిరువురును సోదరులనియు, నిందలివిట్ఠలభూపతియే రంగనాథరామాయణకృతిభర్తయనియు నతఁడు బుద్ధభూపతికి బినతండ్రియైనను, మనలోఁ బినతండ్రిని తండ్రియని పిలచెడియాచారమున్నది. కావున రంగనాథరామాయణమున నతనిని దండ్రియని వ్యవహరించినాఁడనియు శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు వ్రాసియున్నారు. ఇది శ్రీకవిగారియూహయే కాని యాధారసహిత మైనది కాదు. కుప్పాంబిశాసనములో నీగన్నారెడ్డి యుదాహృతుఁడు కాలేదు. రాయచూరుశాసనము, కుప్పాంబికశాసనమునకుఁ దరువాత పదునెనిమిదేండ్లకు పుట్టినది అందుచేత గన్నారెడ్డి. కుప్పాంబికశాసనమునాఁటికి జీవించియున్నాఁ డనుట స్పష్టము. గన్నారెడ్డియామెకు సోదరుఁడైనచో నాశాసనమున నాతఁడుకూడ నుండియుండును. అట్లు లేఁడు కావున గన్నారెడ్డి కుప్పాంబికకు సోదరుఁడు కాఁడని నిర్ణయింపఁదగియున్నది. కుప్పాంబికశాసనములోఁ జెప్పఁబడినలింగప్రతిష్ఠ సమయమున గన్నారెడ్డి యచ్చట లేకపోవుటచే నాతని పేరుదాహృతముకాలేదేమో యనియనుకొనుటకు వీలులేదు. ఆట్టిపరిభావంతుఁడైనగన్నారెడ్డి యచ్చటనుండకపోవుట తటస్థింపదు. ఉండకపోయినను నాతనిపేరు నుదాహరింపకుండ నుండరు. కావునగన్నారెడ్డికిఁ గుప్పాంబ సోదరికాదని నిర్ణయించుటయే సముచితము. అట్టి మహోదారపురుషుఁడు బుద్ధభూపతికిఁ బెదతండ్రియో, తండ్రియో యైయున్నయెడల, రామాయణమునఁ గవి యాతనిని స్మరింపకుండఁ నుండఁడు. కావున దానినిబట్టిచూచినను, నీగన్నారెడ్డితో మన బుద్ధభూపతికి సంబంధము లేదనియే చెప్పఁదగియున్నది.

గన్నారెడ్డితో సంబంధములేకపోయినమానె, రాయచూరుశాసనమందలివిఠలునితో నేమయిన సంబంధమున్నదా ? యని యాలోచింపవలసియున్నది. ఆవిఠలుఁడు గన్నారెడ్డి రాజ్యరక్షామణి యని

శాసనమునం దున్నది. సోదరుఁడు రాజ్యరత్నామణి కావచ్చును. కావున వారిరువురును సోదరులే యనికొందఱియభిప్రాయము. రాజ్య రత్నామణియనఁగా సేనాధిపతివంటివాఁడు. కావున గన్నారెడ్డికి విఠ లుఁడు సేనాధిపతియేగాని సోదరుఁడు కాఁ డని కొందఱి యభిప్రా యము. ఈసందర్భమున నింకనొకవిషయమునుగూర్చి యోచింపవలసి యున్నది. శ్రీయుత మారేమండ రామారావు ఎం. ఎ. బి యిడిగారు కాకతీయసంచికలో "క్రీ. శ. ౧౨౬౦ ప్రాంతమున గాకతిరుద్రాంబయుఁ బ్రతాపరుద్రుఁడును గలసి రాజ్యము చేయుచుండిన కాలమున రాయ చూరుదోఆబ్ ను, గర్నూలుమండలము నరణ్యావృతములై యుం డఁగా నీప్రాంతమునందలి కాకతీయసామంతులును సేనానులు నీభూ భాగమును గృషియోగ్యమొనర్చిరి. ఇట్టివారిలో గోనవంశీయులు ముఖ్యులు వీరిలో మువ్వురు సోదరు లీకాలమున గాకతీయసామ్రా జ్యపుదక్షిణదిశ నధికారముచేయుచుండిరి. గన్నయరెడ్డి వర్ధమాన పురమునను, విఠలనాథుడు రాయచూరు బళ్ళారిమండలములను, కాట రెడ్డియు నాతనిపుత్త్రుడగుఇమ్మడి కాటారెడ్డియు రాయచూరుదోఆబ్ పైనను, అధికారులై యుండిరి. వీరందఱును కాకతీయసామంతులే. అడవులను నిర్మూలించి భూమినివాసయోగ్యముగ జేయుటలోఇమ్మడి కాటారెడ్డికి ఎజగాప్రిమునివాసి యగు బుద్ధారెడ్డి లేక పాలవిరెడ్డి యను సహోదరుడు మిక్కిలి సహాయ మొనర్చెను. అందుచే నీకాకతీయ సేనాని ప్రతాపరుద్రునిచే క్రీ. శ. ౧౨౯౦ లో పైబుద్ధారెడ్డికి మానవబెళు దోణి, రాయచూరు, మోసలకల్లు, అలంపురము, ఆదోని, ఐజ, అను ఏడుసీమలపై నాడగౌడరికము నిప్పించెను" అనివ్రాసియున్నారు.

రాయచూరుశాసనములో వర్ధమానపురాధిపతిగా గన్నారె డ్డియు, రాయచూరుదుర్గాధిపతిగా విఠలభూపతియుఁ జెప్పఁ బడియుం డుటచే రామారావుగారి వ్రాఁతలనుబట్టి వారిరువురును సోదరు లగు చున్నారు. రామారావుగా రట్లువ్రాయుట కాధారము లేమియో

తెలియలేదు. అవి యాధారసహితములైనచోఁ గన్నారెడ్డితోపాటుగ నాయికలనాథునితోఁగూడ బుద్ధభూపతికి సంబంధము లేకపోఁగా, నీరాయచూరుశాసనము నీసందర్భమున నాలోచనలోనికిఁ దీసికొనకుండ విడచివేయవలసియున్నది. కుప్పాంబికశాసనములో విట్టయకు సోదరుఁడుగా నొకకాటయ యున్నాఁడు. కాని రామారావుగారి కాటయకొడుకుఇమ్మడికాటారెడ్డియును కుప్పాంబిక కాటయకొడుకు గుండయయునై యున్నందున, నీయిరువురుకాటయలు నొక్కరు కారనియెంచి కుప్పాంబికశాసనములోనివారికిని, రాయచూరుశాసనములోనివారికిని సంబంధము లేదని చెప్పుటయే యన్నివిధముల నుచితముగా గాన్పించుచున్నది ఈరెండుకుటుంబములవారును సోదరవారసులగుటచే, దాయాదులై యుందురని తోఁచుచున్నది. శ్రీ రామారావుగారి వాక్యము లూహామాత్రజనితములే యైనచో, రాయచూరుశాసనమందలి విఠలుఁడు బుద్ధభూపతిజనకుఁ డేమోయనుసంశయమున కవకాశమున్నది. అదిసత్యమైనచో, బుద్ధభూపతి రాయచూరునివాసి యగును. ఇదికూడ నూహయేగాని సత్యమని నిశ్చయముగాఁ జెప్పజాలము.

రాయచూరుశాసనమునుబట్టి గన్నారెడ్డియు, విఠలపతియు, కాకతీయులకు సామంతులై, వర్ధమానపుర, రాయచూరుదుర్గములనుబరిపాలింపుచుఁ గీర్తిగాంచిరనియు, బుద్ధభూపతి వంశీయులు వారికి దాయాదులై వారితోపాటుగ సైన్యాధిపతులుగనుండి యేస్వల్పప్రదేశమునకో పరిపాలకులై యుందురనియు నెంచఁదగియున్నది. వీరినివాసము బళ్ళారిజిల్లాయో లేకదానికెదురుగ కృష్ణానదికుత్తరమున నున్ననిజాంరాష్ట్రములోని వర్ధమానపుర ప్రాంతమో అయియుండును. రాయచూరుశాసనమున గన్నారెడ్డి కుడుపులూరి పురవరాధీశ్వరుఁడని చెప్పఁబడినాఁడు. ఈగ్రామ మెచ్చట నుండెనో తెలియలేదు. బహుశః నిజామురాష్ట్రమున నుండియుండును.

బ్రి. శ్రీ. వీరేశలింగముపంతులుగారు రాంధ్రకవుల చారిత్రమున నీబుద్ధభూపతి కృష్ణామండలములోని మునుమూరి సంస్థానాధిపతి

యని వ్రాసియున్నారు. నా రేయాధారమునను సరించి యట్లువ్రాసిరో తెలియదు. కృష్ణామండలములో మనుమూరుసంస్థాన మున్నటు లేదు. బుద్ధభూపతి పశ్చిమాంధ్రమునం దుండెనుగాని యుత్తరాంధ్ర “నివాసికాఁడు”. కృత్యాదిద్విపదలలోని మనుమూర్తి విఠలభూమిపాల విభుఁడు” అనుద్విపదయందలి “తి”ను విలేఖకుఁడు పొరపాటున విడచి పెట్టఁగా శ్రీపంతులుగారు దానిని మనుమూరుగా భావించిరేమో తెలియదు.

బుద్ధభూపతి తండ్రి విషయమునఁ బూర్వోత్తర రామాయణములలోఁ గలపరస్పరభేదమును సమన్వయించుటకుఁ బైజేసిన చర్చగాని, చూపినశాసనములుగాని యేమియుఁ దోడ్పడలేదు. ఏవియో మనయూహలు కొన్ని చేర్చినఁగాని, యీభేదమును సమన్వయింపలేము. ఉత్తరరామాయణమున బుద్ధభూపతితల్లి “యన్నమాంబ” యనియున్నది. పూర్వరామాయణమున నీపే రుదాహృతము కాలేదు. అందుచే నదియు సహాయకారి కాలేదు. విఠలభూపతికి గన్నారెడ్డి యనునామాంతర మున్నదనియో, పినతండ్రిని దండ్రిగా వర్ణించినాఁడనియో, సమాధానము చెప్పవచ్చును. కాని యది సంశయరాహిత్యమును జేయు సమాధానముకాదు. పూర్వరామాయణమునఁ జెప్పినపేరును విడిచి యుత్తరరామాయణమున నామాంతరము నేలఁ గైకొనును? పినతండ్రితో సభ్యులు “నీతనరాజన్యుండు” అని చెప్పుదురా? తండ్రిపేరునైనఁ దలంపఁడా? వంశవర్ణనమునందైన గన్నయను జెప్పఁడా? పూర్వోత్తరభాగములు రెండును రంగనాథుఁడే రచియించెనని తలంపఁబడుచున్నదికదా! అతఁడు రెండుభాగములలోను రెండువిధములుగా వ్రాయునా? ఈప్రశ్నలకుఁ దృప్తికరము లైనసమాధానములు రాలేదు.

ఉత్తరరామాయణములో “నానొప్పు గోనగన్నక్షితీంద్రునకును” అనుద్విపదను “నానొప్పు విటలనరనాథమణికి” అని సవ

రింపనైన సవరింపవలయును. లేదా యీద్విపదకును తరువాతి ద్విపదకును నడుమ గన్నారెడ్డికిని,విఠలనాథునకును గలసంబంధమును దెలుపుచు, విఠలుని పే రుదాహరించి మఱిరెండుద్విపదల నైనను జేర్చవలయును ఇంతకంటె నీసమన్వయమునకు మార్గాంతరము లేదు. భావిపరిశోధనమున నీకఠినసమస్య పూరింపఁ బడునేమో చూడవలసి యున్నది.

—:శైలి:—

రంగనాథరామాయణశైలి మృదువై మధురమై పండితపామర జనరంజకమై ద్రాక్షాపాకమున నొప్పారుచున్న దనుటకు సంశయము లేదు. ఇది యత్యుత్తమము లైనమహాకావ్యములలో నొకటి. ఆఱు కాండములనుండియుఁ గొన్నిద్విపదల నుదాహరించెదను.

"శ్రీరామ నాపుత్త్రి సీతసద్ధర్మ
చారిణిఁ గొను మగ్నిసాక్షిగా" ననుచు
ధారవోసెను దేవతాపుష్పవృష్టి
ధారతో దివ్యవాద్యధ్వనుల్ మీఱ
నంతట సుముహూర్త మని తెరఁదీయఁ
గాంతనెమ్మోము మున్గనుఁగొని యలరె
రామునికనుఁగవ రాకాసుధాంశు
గోమున నలరెడుకుముదంబు లనఁగ
భామచూపులు నిల్చెఁ బతిపాదయుగళిఁ
దామరపైఁ దేఁటితండంబు లనఁగ
నింతిలావణ్యాబ్ధి కెదు రెక్కు మీన
సంతానమై రామచంద్రు చూపడరె
వరుదేహకాంతిప్రవాహమధ్యమునఁ
దగుణిచూపులు పద్మదళములై క్రాలె.
సతిచూపుఁ బతిచూపు సరసతఁజూపు

రతిరూపు రతిమనోరమణు నిరూపు
నెలసి నొండొరు మేను లెఱుఁగ రాకుండఁ
గళలంటఁ దాఁకినగతిఁ గొంత సేపు
వెలసెనంతట రఘువీరకుంజరము
చెలికేలు కందమ్మి చెలువునఁ బట్టి
నొండొరుల్ పులకించి యొక్కపీఠమున
నుండి హోమము సేయుచుండి రాపిదప...

బాలకాండము.

జననాథ సహధర్మచారిణి గాఁగ
జనకుచే నన్నగ్ని సాక్షిగఁ గొంటి
జనలోకనుతుఁడవు సత్యసంధుఁడవు
నను డించి నీవుఁ గానలకేఁగఁ దగునె
యెన్ని దుఃఖములు నీ వెన్ని వడసితివి
నన్నియు సౌఖ్యంబు లనఘ నీదయను
ఈవాడ లీమేడ లీబంధుబృంద
మీవస్తుసంపద లీజీవనంబు
నీవు లేకున్నచో నిస్సార మరయఁ
గావున నిచట నేకరణి వేగింతు
సావిత్రి యనుపుణ్యసతి దనపతిని
సేవించి పోయినచెలువున నేను
నీవెంటఁ జనుదెంతు నీనీడవోలె
నీవెంట సాధ్వికి నిదియ ధర్మంబు
నినుఁ బాసి యుచ్చట నిముస మేనోర్వ
వనముల నినుఁగూడి వర్తింప నేర్తు
బదునాలుగేం డ్లేల ప్రాణేశ నిన్నుఁ
గదిసి వేయేం డ్లైనఁ గాపుందునందు

సతులకుజగముల జనులెంచఁదగిన
మతముఁ బ్రతిష్ఠింపు మతివేయునేల
యీవరణ్యములకు నిట నన్నడించి
పోవుట నిజమైనఁ బోవుఁ బ్రాణములు
అలుకమైఁ గాదేని నగ్నిచేనైన
జలములనైన విషంబుచేనైన
నేచినవగ లోర్వనేనిటె చత్తు
నాచావు సూచిపో; నమడించిపోకు......

అయోధ్యకాండము

"బరమపావనుఁడైన బ్రహ్మమన్మఁడవు
వరపుణ్యనిధి విశ్రవసుతనూజుఁడవు
ధనదానుజుండవు దానవాగ్రణివి
విను మిట్టికృత్యంబు విహితమే నీకు
జగదేకపతి రామచంద్రుని దేవిఁ
దగఁ దోడికొనిపోవఁ దగిలి యిబ్భంగి
ముదలించి తేక రాముని డాఁగురించి
సుదతి నీభంగిఁ దెచ్చుట బంటుతనమె
నీలంకయును నిన్ను నీబంధుజనులఁ
గాలుచు నోరి రాఘవుకోపవహ్ని
యెఱిఁగియు విషమిటు లేల క్రోలెదవు ?
ఎఱిగొన్న పెనుబాము నేల త్రొక్కెదవు ?
అఱువది వేలేండ్ల యతివృద్ధు నన్ను
నెఱుఁగుదో యెఱుఁగవో యేజటాయువను
ఈపుణ్యసాధ్వి నీవిప్పు డొప్పించి
పాపాత్మ; పోకున్నఁ బోరిలో నిన్నుఁ
దుండాగ్రధారలఁ దునియలు సేసి

మండితచర్మమర్మములు భేదించి
యడరి నీదైన ప్రాణాభిమానములు
విడిపించి జానకి విడిపింతు...

అరణ్యకాండము.

జననాథ యీ వాలిఁ జంపనేమిటికి
మెఱసి నన్నిటు సేయ మీతండ్రితోడఁ
గఱపెనే రఘురామ గణుతింపవాలి ?
వెరవున నీరాజ్యవిభవంబు గొన్న
భరతుఁడే రఘురామ పరికింపవాలి ?
చెనఁటియై నీదేవిఁ జెఱగొనిచనిన
దనుజుఁడే రఘురామ దలపోయవాలి ?
వాలి నకారణవైరంబు పూని
యేలయ్య తెగటార్చి తిబ్భంగిఁ బేర్చి ?
నీయట్టిసుకృతికి నీయట్టిపతికి
నీయట్టికారుణ్యనిధి కిట్లుదగునె ?
జనకజతోఁగూడ జనియెనే యెఱుక ?
ఘనమైన విరహాగ్నిఁ గ్రాఁగెనే యెఱుక ?
భూమీశ ! నేఁడు నాపుణ్య మిట్లయ్యె
నేమి సేయుదు నింక నేమందు విధికి ?
నీవాలి నెడఁబాసి యేనుండఁజాల
దేవ నన్నును బట్టి దెగటార్పవయ్య !" ...

కిష్కింధాకాండము.

"భానుజ ! నాప్రాణపద మైనయట్టి
మానినీమణి శిరోమణి చూచినప్పుడె
నామది కరఁగుచున్నది లక్ష్మణ వోలె
నీమణి మామామ కిచ్చె నింద్రుండు
యాగసంతృప్తుఁడై యాత్మలో మెచ్చి

దయాగుణనిధి జనకావనీవిభుఁడు
నట్టియామణి సీతయాఁదల వేడ్కఁ
గట్టి పెండిలి సేసెఁ గరమర్థి నాకు
నన్ను లతలమిన్న యైన యాసీత
నెన్నఁడు నెడఁబాయ దీమణి నేఁడు
నాతిని నన్ను మన్ననఁ గూర్పవచ్చు
దూతికయన సిరుల్ పులకింప వచ్చె
నని యని యందంద యక్కునఁ జేర్చి
హనుమంతు మఱియును నటచూచి పలికెఁ
బరమపుణ్యాత్మక ! పవనజ ! నీవు
సువలి యేతెంచుచో సుగున యోమనియె ?

...సుందరకాండము.

సీతఁ దెచ్చితి వీవు శ్రీరామచంద్రుఁ
డే తెఱంగున నీకు నెగ్గేమి సేసె
రామలక్ష్మణులతో రణమొనరింప
నీమూఁడుజగముల నెవ్వరు గలరు ?
నలి సామభేదదానంబులు సూపఁ
గలిగిన దండంబుగాదు పాటింప
దండంబుఁ బాటింపఁ దలఁచెద వేని
దండింపఁబడుదురె దశరథాత్మజులు
దేవ ! రాముఁడు పరదేవత గాన
నీకు మ్రొక్కుటయెల్ల నేరంబుగాదు
శరణన్నఁ జేకొను శరణన్న నీకు
నురుశుభం బగుఁగాని యొకకీడుఁ గాదు
గుణరూప దాక్షిణ్యగుణగణకేళి
గణుతింప నలవియే కాకుత్స్థ రాముఁ

కలిగిన నిలువ రింద్రాదిదేవతలుఁ
దలపవచ్చోదు నీదు తరముగాదెందు
వలదు వృథాగర్వవహ్నిఁ గూలకుము
చలమొప్ప దొప్పదు సంతాపముడిగి
యింక నైనను సీత నిచ్చుట మేలు
లంకేశ కులమును లంకయు నిలుపు"

...యుద్ధకాండము.

రంగనాథరామాయణమును, వావిళ్లవారును, ఆంధ్రవిశ్వవిద్యాలయమువారును ప్రకటించియున్నారు. విశ్వవిద్యాలయమువారి ప్రతిలో పూర్వముద్రణమునఁ జేరకుండఁ దాళపత్రి ప్రతులలోఁ జేరియున్న భాగముల ననుబంధముగాఁ జేర్చియున్నారు. ఆ భాగము ముద్రణమునఁ జిన్న యక్షరములలో దాదాపు ౧౩౦ పుట లున్నది. వ్రాఁతప్రతులలో లేని కొంతభాగము పూర్వముద్రణమునదనధికముగాఁ జేరియున్నది. దీనినిబట్టి కవిరచించినదానిలోఁ గ్రమక్రమమున ననేకములగు మార్పులు జరిగియున్నట్లు తోఁచుచున్నది. ఆ మార్పులను గూర్చి చర్చించుట కిట తావుచాలదు.

ఒక్క యుదాహరణమిచ్చెదను. భాగవత సప్తమస్కంధమందలి ప్రహ్లాదచరిత్రములోని:—

సీ. కంజాక్షునకుఁ గాని కాయంబు కాయమే
పవనకుంభిత చర్మభస్త్రి గాక
వైకుంఠుఁ బొగడని వక్త్రంబు వక్త్రమే
ఢమఢమధ్వనితోడి ఢక్క గాక
హరిపూజనము లేని హస్తంబు హస్తమే
తనుశాఖనిర్మితదర్వి గాక
కమలేశుఁ జూడని కన్నులు కన్నులే
తనుకుడ్యజాలరంధ్రములు గాక

అనుపద్యమునందలి పదములను భావములను

పతి కౌఁగలింపనిపణతి కాయంబు
పవనకుంభితచర్మభస్త్రి గాకేమి
సవినయంబుగ సరససల్లాపములను
అమరంగఁ బతితోడ నాడనినోరు
ఘుమఘుమధ్వనితోడిఘరక్క గాకేమి
పురుషు నీక్షింపనిపొలఁతి నేత్రములు
ధరఁ దనుకుడ్యరంధ్రములు గాకేమి
పరుసేవ సేయని వరకరాబ్జంబు
తరసాస్థినిర్మితదర్వి గాకేమి.

అనుద్విపదలలో ననుకరించియున్నాఁడు. బమ్మెర పోతరాజునకుఁ దరువాత నెవరో యీభాగమును రచియించి రంగనాథరామాయణమునఁ జేర్చియుందురు. పోతనయే రంగనాథు ననుకరించె నని యన లేము సంస్కృత భాగవతమున లేకున్నను భక్తిరసపొంగంగతుఁ డగు పోతన యిట్టి పద్యములను మూఁడిటి నీ సందర్భమున రచియించి యున్నాఁడు.

బుద్ధభూపతి యింటిపేరు "గోన" వారని వాడుచున్నారు కాని శిలాశాసనములలో "గోన" వారని యుండుటచే నేనిందు గోనవారనియే వ్రాసితిని. ఇతఁడు రెడ్డికులోత్పన్నుఁడు.



## 42. గోనకాచభూపతి; విఠలరాజు

వీరిరువురును సోదరులు. రంగనాథ రామాయణద్విపదకావ్య కర్త యగు బుద్ధభూపతితనయులు. తండ్రివలెనే వీరును బ్రణీత కవులనియు, వీరు రచించినదని చెప్పఁబడియెడు ఉత్తరకాండమును గూడ రంగనాథుఁడే రచియించెననియుఁ జెప్పఁబడుచుండును. ఈవిషయమును గూర్చి రంగనాథునిచరిత్రమున వ్రాసియున్నాఁడను. కావున నాకథ నిట ప్రస్తావించుట పునరుక్తి యగును.

ఈకవులు తమతండ్రి యవసానకాలమున దమను బిలిపించి, పూర్వరామాయణమును దాను రచించితిననియు, ఉత్తరకాండమును రచించి తనకోర్కెఁ బూర్తిచేయుఁ డని కోరెననియు, నందుపైఁ దా మీగ్రంథమును రచించితిమనియు, నీ క్రిందిద్విపదలలోఁ జెప్పకొనియున్నారు.

శ్రీనాథచరణరాజీవసేవకుఁడు
భానుకోటిప్రభాభాసమానుండు
మనుచరిత్రుఁడు శత్రుమత్తమాతంగ
ఘనఘటాపాటనకంఠీరవుండు
గోనవంశార్ణవకువలయప్రియుఁడు
నానొప్పు గోనగన్నక్షితీంద్రునకు
ననుకూల యైయున్న యన్నమాంబికకుఁ
దనయుండు సాహిత్యతత్త్వకోవిదుఁడు
దానప్రసిద్ధుండు ధర్మశీలుండు
భూనుతాచారుండు బుద్ధభూవిభుఁడు
అఖిలపురాణేతిహాససమ్మతము
నిఖిలలక్షణగుణాన్వితము నగుచుఁ
దెలుఁగున నొప్పుగా ద్విపదరూపమున

వలెఁ బూర్వరామాయణము మున్నుఁ జెప్పి
సకలేశుఁ డగురామచంద్రువర్తనము
సకలంబు రచియించి సకలపుణ్యముల
సకలలోకులు దన్ను సన్నుతిసేయ
సకలంకమహిమల నందెదఁ గాక
యని నిశ్చయము చేసి యంతరంగమునఁ
దనయిష్టదేవతాధ్యానంబు సేయ
గరుడాధిరూఢుఁడై కరపంకజముల
నగుమగా శంఖశార్ఙ్గాదులు మెఱయ

* * *

భానుకోటిప్రభా భాసితుం డగుచు
మానసంబునఁ దోఁచి మహితవాక్యముల
నీవు నాకెంతయు నెఱయ భక్తుఁడవు
నీవు పుణ్యుండవు నీవు మాన్యుఁడవు
గావున నీభక్తిఁ గైకొంటి మేము
నీవింక మముఁగూర్చి నెమ్మి నేతెమ్ము
నీవాంఛితార్థంబు నిర్వహింపంగ
నీవరనందనుల్ నిపుణమానసులు
వారి నియోగింపు వారు నీకోర్కె-
గారవంబునఁ జేయఁగలవారు మీఁద
నని పల్కి విచ్చేసె నాదేవునాజ్ఞ
మనమున ధరియించి మముఁ బిల్వఁ బంచి
యాతతప్రీతితో నాతెఱం గెల్ల
మాతోడ వినిపించి మముఁ గటాక్షించి

* * *

బహుపురాణజ్ఞులు బహుకళాన్వితులు
బహుకార్యకోవిదుల్ బహుదానపరులు

నాకులదీపకుల్ నాగుణాన్వితులు
నాకీర్తివర్ధనుల్ నాకూర్మిసుతులు
గాన నాపూనినకథ యెల్లజనులు
వానుగాఁ గొనియాడ మధురవాక్యముల
నెమ్మి చెప్పుఁడు మీరు నిపుణులై యనుచు
మమ్ముఁ బంచిన మేము మాతండ్రిప్రీతిన
చిరకీర్తు లెసఁగంగఁ జెల్లింపఁ గనుట
పరమధర్మంబని భక్తితోఁ గోరి''

* * *

గామాసతారంబు రమణీయ మగుట
రాముపావనచరితము దివ్యభాష
లోకానురంజనశ్లోకబంధములఁ
జేకొని వాల్మీకి చెప్పినజాడ
మాతండ్రి బుద్ధక్షమానాథు పేర
నాతతైఘనుచు పేర సనఘుని పేర
ఘనుఁడు మీసరగండ కాచభూవరుఁడు
వినుతశీలుఁడు పినవిఠలభూపతియు
నని జనుల్ గొనియాడ నర్థితో మేము
వినుతనూతనపదద్విపదకావ్యమున
ఘనమైనపాకంబు గాటమా శయ్యఁ
బ్రాకటంబుగ నాంధ్రభాషఁ జెప్పంగఁ
గైకొన్న యుత్తరకథ యెట్టిదనిన.

ఈకవులనుగూర్చి వీరితండ్రియైన బుద్ధభూపతిచరిత్రమున వ్రాసి యున్నాఁడను. అంతకంటె నిట వ్రాయవలసిన దేమియుఁ గన్పట్టలేదు. వీ రొకచిన్నసంస్థానాధిపతు లని తలంపవలసియున్నది. రంగనాథ రామాయణమందలి యుత్తరకాండశైలి తెలియుటకై కొన్నిద్విపదల

నిక్రింద నిచ్చుచున్నాఁడను. ఈగ్రంథమున సీతాపహరణమునకుఁ బూర్వము రావణుఁ డొనర్చినయద్భుతకార్యవర్ణనమును, రాముఁడు సీత నరణ్యమునకుఁ బంపుటయుఁ గుశలవజన్మమును, రాముఁడు యజ్ఞ మొనర్చుటయు, సీత భూవివరంబు జొచ్చుటయు, రామనిర్యాణము మొదలగుకథలు గలవు. కవిత్వము మనోహరమై యున్నది.

"ఎవతెవు సీతాంశుమి యొద్ది నీనామ
మెవ్వనిసతివి నీవిట నుండు టేమి
పోడిఁగా నెవ్వనిఁ బొందుదు నీవు
వాఁడు కృతార్థుఁడు వనజాయతాక్షి
యాపద లడఁగింప సంగజాస్త్రములఁ
జూపు నీకడకంటిచూపింతెచాలు
నీమేను గుందించు నీతపంబునకు
నేమి ప్రయోజనం బెఱింగింపుమనిన
నాతిథ్య మొనరించి యా వేదవతియు
నాతురుండైన దశాస్యుతో ననియె
మా తాత సురమంత్రి మహనీయబుద్ధి
నాతండ్రి కెనవచ్చు నాతఁ డున్నతుఁడు
మాతండ్రి ధర్మైకమతి కుశధ్వజుఁడు
బ్రాతిగా నియతి నా బ్రహ్మర్షివరుఁడు
వేదంబు చదువ నా వేళ నేఁబుట్టి
వేదవతీనామవిఖ్యాత నైతి
నను నంతఁ గోరి గంధర్వులు సురలు
దనుజులు యక్షులు దైత్యులు నడుగ
నెలమితో విష్ణున కిత్తు నన్నుబద్ధిఁ
బలుమాఱు దమ్మొల్లఁ బరిహరించుటయు
రాతిరిమై దైత్యరాజు శంబరుఁడు
మాతండ్రిఁ జంపె నేమఱుపాట వచ్చి

మాతల్లియును నంత మాతండ్రితోడ
వీతకల్మషబుద్ధి విహితమార్గమును
జేకొని తగ నేకచిత్తిఁ బొంది పుణ్య
లోకంబునకు ధర్మలోలయై చనియె
నేను మాతండ్రిహృదయంబు కోర్కి
మానుగాఁ దలపోసి మానసంబునను
భక్తవత్సలుఁ డైనపంకజోదరుని
భక్తిభావంబున భక్తఁగాఁ గోరి
తపము గైకొంటి నాతపమున కిదియె
నెప మీతపశ్శక్తి నిఖిలంబు గాంచు
నిను నెఱుంగుదు నేను నీవు పౌలస్త్య
మనుమఁడ వీపిన్నమాట లేమిటికి ?

* * *

''కుశలవుల్ వీరు నాకొడుకు''లు సీత
విశదాత్మ యిదియెల్ల విశదంబ యౌను
జానకి సభలోన సడిఁ బాపుకొన్న
మానుగాఁ గైకొందు మఱియొండు లేదు
నావుఁడు నమ్మహీనాథుని తెంపు
భావించి యప్పుడు బహ్మాదిసురలు
జనక రాజాత్మజ శపథంబుచూడ
చనుదెంచి యుండిరి చదలెల్ల నిండ
పరిమళమిళితమై పలుచనిగాలి
పొరిఁబొరి సభలోనఁ బొలుపార నప్పుడు
సీత యాసభలోనఁ జేతులు మొగిచి
మాత భూదేవిపై మఱిచూడ్కి నిలిపి
పతియును గురుఁడు నాపాలదైవంబు
హితుఁడు రాముఁడు నాకు నేనన్య మెఱుఁగ

నెలమి రాముని(దప్ప నే నన్యపురుషుఁ
దలఁప నేర్కొన నాదుధర్మంబు దప్ప
నిది సత్యవచనంబ యేని యోయంబ
విదితంబుగా నాకు వివర మిమ్మనిన
నహికుమారులచేత నంచితమణుల
బహుతరద్యుతినొప్పు భద్రపీఠంబుఁ
బట్టించుకొని నేల బయలిచ్చిపాయ
నెట్టన భూదేవి నెమ్మి నేతెంచి
యామణిపీఠంబు నందుంచి తల్లి
సేమమే యనిపల్కి సీతఁ దోడ్కొనుచు
వదలక చనెఁబుష్పవర్షము ల్గురియ
ముదముతోఁ బాతాళమున కేగెనపుడు.

పూర్వభాగరచనమునకును నుత్తరకాండరచనమునకును నడుమ వ్యవధి యెంతయో యుండదు. క్రి. శ. ౧౩౨౦-౧౩౭౫ నడుమ నిది రచితమయ్యెనని చెప్పవచ్చును. రంగనాథకవినిబోషించిన వీరు చిరస్మరణీయులు.



## 43. రావిపాటి తిప్పన్న (త్రిపురాంతకుఁడు)

ఈకవి కులగోత్రాదు లేవియుఁ దెలియవు ఇతఁ డాంధ్రమున మదనవిజయమను రతిశాస్త్రమును, అంబికాశతకమును, త్రిపురాంతకోదాహరణమును, తారావళియు, సంస్కృతమున ప్రేమాభిరామ మను వీథినాటకమును రచియించినట్లు తెలియుచున్నది. ఇందు త్రిపురాంతకోదాహరణము మాత్రము ముద్రితమై లభించుచున్నది.

ఈకవి రచించిన ప్రేమాభిరామనాటకమును వినుకొండ వల్లభ రాయలపేరున శ్రీనాథమహాకవి క్రీడాభిరామ మనుసంజ్ఞతో నాంధ్రీక

రించి యున్నాఁడు. ఇందునుగూర్చి వల్లభరాయకవి చారిత్రమున వ్రాసెదను. ఆక్రీడాభిరామమునందు నటీసూత్రధార సంభాషణమున న్నీ త్రిపురాంతకుని నీక్రిందిపద్యములో స్తుతించియున్నాఁడు.

ఉ. నన్నయభట్టు తిక్కకవినాయకుఁ డన్న హుళక్కిభాస్కరుం
డన్నను, జిమ్మపూడి యమరాధిపుఁ డన్నను సత్కవీశ్వరుల్
నెన్నుదుటం గరాంజలులు నింతురు జే యని రావిపాటి తి
ప్పన్నయు నంతవాఁడ ! తగునా యిటు దోసపుమాట లాడఁగన్

ఈతిప్పన్నయే త్రిపురాంతకుఁడు. శ్రీనాథునిచే నిట్లు స్తుతింపఁబడిన యీతఁడు గొప్పకవియై యుండుననుటలో నతిశయోక్తిలేదు. ఈ తఁడు రచించినమదనవిజయమును దా మొదసారి చూచితిమనియు, రెండవసారి చూతమనుకొనునప్పటి కాగ్రంథస్వాములు మరలఁ జూపలే దనియు నది యెనిమిదాశ్వాసముల సంజ్ఞాభియోగిక భార్యాధికార పారదారిక వైశికాదిప్రకరణములు గలిగి యభినవకామసూత్రమో యన విలసిల్లుచున్నదనియు, శ్రీయుత మానవల్లి రామకృష్ణకవిగారు త్రిపురాంతకోదాహరణపీఠికలో వ్రాయుచు నందులోని వని యీక్రింది రెండుపద్యముల నుదాహరించియున్నారు.

క. సతి గుణవతి యగు నేనియుఁ
బతి కదిరత్నంబు; ప్రాణబంధువు; యమృతం;
బతివయ దుర్గుణి యగు నేఁ
బతి కెడపనిచిచ్చు కాలుపక యది కాల్చున్.

మ. గుణమున్ సుందరరూపమున్ విభవమున్ గూటంబు సౌభాగ్యల
క్షణముం, జారుచరిత్రమున్ వినయమున్ జాతుర్యమున్ ధర్మభూ
షణముం గల్గి పతివ్రతామహిమ మించన్ గల్గెనేఁ దత్సతీ
మణి చింతామణిదానిఁ దాల్పఁగలుగన్ మర్త్యుండె ధన్యుండిలన్.

ఈపద్యములు చక్కనిశైలిలో మనోహరములుగ నున్నవి. ఇట్టి త్రిపురాంతకుని గ్రంథములు లభింపకపోవుట యాంధ్రుల దురదృష్ట మనకతీరదు.

ఉదాహరణ లక్షణమును పాల్కురికి సోమన చారిత్రమున వ్రాసియున్నాఁడను. సంబుద్ధితోఁగూడ నెనిమిదివిభక్తులకును, నెనిమిదివృత్తములును, నెనిమిది కళికలును, నెనిమిది యుత్కళికలను రచియించి తుదను నెనిమిది విభక్తులు నుంచి యొక పద్యమును వ్రాసిన నది యుదాహరణగ్రంథ మనిపించుకొనును. త్రిపురాంతకుని తుదిపద్యమిది.

శా. నీ వాక్యండవు; నిన్నుఁ దెల్పఁ జదువుల్; నీచేత మేలొందఁ; నీ
కై వాక్యాజ లొనర్తు; నీవలన బ్రహ్మాండావళుల్ వుట్టు; నీ
కే వేల్పుల్ సరి; యన్యదైవభజనం బే నొల్ల; నీయందు సు
ధ్యానం బందఁదగున్; కుమారగిరినాథా; చంద్రచూడామణీ!

కుమారగిరియనఁగా తరుణాచలము. ఇదిశ్రీశైలాంతర్భాగము. త్రిపురాంతకము శ్రీశైలముయొక్క తూర్పుద్వారము. ఈత్రిపురాంతకమే కవి నివాసము. ఈకవి రెండవ ప్రతాపరుద్రుని యాస్థానకవి యని శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు ఉదాహరణ పీఠికలో వ్రాసియున్నారు. ప్రతాప చరిత్రమున రెండవ ప్రతాపరుద్రుని యాస్థానమునఁ ద్రిపురాంతకుఁడనుకవి యున్నట్లు చెప్పఁబడినది.

క్రీడాభిరామమున నోరుఘట్టమున ఓరుగంటియందొక గృహమునుజూచి, గోవిందశర్మ "ఇది యెవ్వరియిల్లొకో! శోభనంబు ముడివడుచున్నయది" యనుచు నాకాశంబు వీక్షించి యచ్చటివారల నేమి యనుచు యడిగిన.

శా. ద్వీపాంతంబుననుండి వచ్చితివె ? భూదేవా ! 'ప్రశాంతం మహాపాపం' సర్వజగత్ప్రసిద్ధ సుమనోబాణాసనామ్నాయ వి
ద్యోపాధ్యాయి ప్రతాపరుద్రధరణీశోపాత్తగోష్ఠీపవిత్ర
స్థాపారీణ నెఱుంగ వయ్యెద వె? మాచల్దేవి వారాంగనన్."

అని యాతఁడు ప్రత్యుత్తరమిచ్చినట్లున్నది. క్రీడాభిరామము, త్రిపురాంతకుఁడు రచియించిన ప్రేమాభిరామమున కాంధ్రీకరణము

గాని స్వతంత్రగ్రంథము కాదు. మాచల్దేవి ప్రతాపరుద్రునియుంపుడు కత్తె యని చెప్పఁదగినవాఁడు త్రిపురాంతకుఁడుగాని శ్రీనాథుఁడు కాఁడు. ప్రతాపరుద్రుని కాలమునకు శ్రీనాథుఁడు జన్మింపలేదు. ప్రేమాభిరామము నందున్నగాథనే శ్రీనాథుఁడు క్రీడాభిరామమునఁ జెప్పిన ట్లూహింపవలసియున్నది. క్రీడాభిరామమున నప్పు డెదురఁ గన్పట్టుచున్న విషయముల నే వర్ణించుచుండినట్లు కన్పట్టుచున్నను, నవి ప్రేమాభిరామమునందుండి గ్రహించినవై యున్నవి. కావున నీమాచల్దేవివర్ణనమును త్రిపురాంతకుఁడే చేసియున్నాఁ డని భావింపవలయును. దీనినిబట్టి త్రిపురాంతకుఁడు ప్రతాపరుద్రునికాలమువాఁడని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. ద్వితీయప్రతాపరుద్రుఁడు క్రీ. శ. ౧౨౯౫ మొదలు ౧౩౨౩ వఱకు రాజ్యము చేసినవాఁడు. కావున నీకవియు నాకాలమువాఁ డనుటకు సంశయములేదు.

శ్రీనాథునికాలమునఁగూడ నొకమాచల్దేవి యున్నట్లు శాసనాధారమున్నది. కాని యామె వారాంగన యగునా కాదా యని సంశయముగా నున్నది. ఆమె ప్రతాపరుద్రుని కాలమునాఁటిది కాదు ఆమె వారాంగనయేయైనను, శ్రీనాథుఁడామెను ప్రతాపరుద్రునకు జోడు చేసెననుటలో స్వారస్యము లేదు. కావున నీ శాసనకర్త్రి యామాచల్దేవి కాదు.

ఈత్రిపురాంతకుఁడు ప్రతాపరుద్రునికాలమువాఁడు కాఁడని యు, క్రీ. శ. ౧౩౮౦ ప్రాంతము వాఁడనియు నొకపూర్వపక్షమున్నది. దానినిగూర్చి యాలోచింతము.

అప్పకవి తనలక్షణగ్రంథమున రావిపాటి తిప్పరాజు చాటుధారయని యీక్రిందిపద్యమును అనుస్వారసంబంధయతికి లక్ష్యముగా నిచ్చియున్నాఁడు.

“మ. సరి బే సైరిపు డేల భాస్కరులు భాషానాథ ! పుత్త్రీ!వసుం
ధర నందొక్కఁడు మంత్రియయ్యె ! వినుకొండ నాత్రిమయా

మాత్యభాస్కరుఁడో! యూ! నయి తే సహస్రకరశాఖల్లేవ వే
యున్న వే;
తిరమైదానము సేయుచో రిపులహేతి ర్వేయుచో వ్రాయుచోన్.

ఈపద్యములో వర్ణితుఁడైనభాస్కరుఁడు వినుకొండయందు దానముచేతను శౌర్యముచేతను బ్రసిద్ధుఁడైనవాఁడు. భాస్కరులు పెక్కురున్నారు. కాని మనకుఁ గావలసిన భాస్కరుఁడు పైలక్షణములు గలవాఁడుగా నుండవలయును. కొండవీటి గోపీనాథస్వామి యాలయ ముఖద్వారశాఖయందు దీక్రిందిపద్యములో వర్ణితుఁడైన భాస్కరుఁ డొకఁడు పైలక్షణములుగల యాతఁ డున్నాఁడు.

సీ. నిర్మించె నేమంత్రి నిరుపమప్రాకార
నవకంబుగా గోపినాథపురము.
గెలిచినాఁ డేమంత్రి లలితవిక్రమమునఁ
బ్రబలుఁడై యవనులబలము నెల్ల
నిలిపినాఁ డేమంత్రి నియత వైభవమున
గోపికావల్లభుఁ గూర్మి వెలయ.
పాలించె నేమంత్రి ప్రకటధర్మజ్యోతి
మహిమ మీఱఁగ నాంధ్రమండలంబు
నతఁడు భూపాలమంత్రీంద్ర సతతవినుత
ధీవిశారదుఁ డచ్యుతదేవరాయ
మాన్యహితవర్తనుఁడు శౌర్యమహితయశుఁడు
భానుతేజుండు రామయభాస్కరుండు.

ఈతనిశాసనములను నీతనిసహోదరి శాసనములను గూడఁ గలవు. ఇతఁడు శ్రీకృష్ణదేవరాయల యనంతరమున క్రీ. శ. ౧౫౨౯ వ సంవత్సరములోఁ గర్ణాటసింహాసన మధిష్ఠించిన యచ్యుతరాయల యొద్ద మంత్రిగానుండినవాఁడు. త్రిపురాంతకుఁడు శ్రీనాథునకుఁ బూర్వుఁడు. అనఁగా క్రీ. శ. ౧౩౮౦ వ సంవత్సరమునకుఁ బూర్వుఁ

డై యుండవలయును. కాలవ్యత్యాసమునుబట్టి యీకవి రామయామాత్యభాస్కరుని నుతించుట యసంభవము. కావున నప్పకవియుదాహరించిన చాటుధార యీత్రిపురాంతకునిది కాదని నిర్ణయింప వలసియున్నది. అతని దనుట నప్పకవినాఁటితప్ప వేఱాధారము లేదు. అయినను చరిత్రకారు లట్లు నిర్ణయింపక యీచాటువులోని "రామయామాత్య" యనుమాటకు ద్వాత్రింశన్మంత్రి చరిత్రములోనున్న "రాయనామాత్య" యను పాఠాంతరము నాధారముగాఁ గొనిరాయన భాస్కరులకొఱకు వెదుకనారంభించిరి. వారికి నాదెండ్ల యప్పయామాత్యునిచే భర్తపూడి యనుగ్రామము నగ్రహారముగాఁ గైకొనిన రాయనిభాస్కరుఁ డొకఁడు లభించినాఁడు. కాని శాసనకాలము క్రీ. శ. ౧౪౩౯ సంవత్సరమగుటచే గాలము సరిపోలేదని యాతనిని ద్రోసిపుచ్చిరి.

కాటయవేమారెడ్డికాలమునందొకరాయని భాస్కరుఁ డుండి యీక్రిందిచాటువులోఁ గీర్తింపఁబడియున్నాఁడు.

చ. కలయఁ బసిండిగంటమునఁ గాటయవేము సమక్షమందు స
త్ఫలముగ రాయనప్రభుని బాచఁడు వ్రాసినవ్రాలమ్రోఁతలున్
గలుగలు గల్లుగల్లురనఁ గంటకమంత్రులగుండె లన్నియున్
జలుజలు జల్లుజల్లురనె సత్కవివర్యులు మేలు మేలనన్.

ఈచాటువు నాధారముగాఁ గొని శ్రీ వీరేశలింగముపంతులుగారు తిప్పనచాటుధారలో వర్ణితుఁడైన రాయనభాస్కరుఁ డీతఁడే యని నిర్ణయించి, త్రిపురాంతకునికాలము క్రీ. శ. ౧౩౮౦ ప్రాంతమని నిర్ణయించినారు. ఈపద్యములోఁ గల ప్రస్తావనయే కాని కర్తృవర్ణనము లేదు. అందుచేఁ ద్రిపురాంతకుని భాస్కరుఁడీతఁడు కాఁడు. మఱియు క్రీ. శ. ౧౩౮౦ వఱకును, అనవేమారెడ్డియే రాజ్యమునం దున్నవాఁడు. ఆకాలములోఁ గాటయవేమున కధికారప్రసక్తి లేదు. ఇతఁడు అనపోతారెడ్డికల్లుఁడు. అతనికుమారుఁ డైన కుమారగిరిరెడ్డి రాజ్యమునకు వచ్చిన ౧౩౮౨ వ సంవత్సరము నుండియును,

కుమారగిరిరెడ్డివలన రాజమహేంద్రవరరాజ్యమును బడసిన క్రీ. శ. ౧౩౮౬ వ సంవత్సరమునకుఁ బిమ్మటను గాటయవేమున కధికార ప్రాప్తి కలిగినది. ఆపిమ్మట తిప్పయ, యాభాస్కరునినుతించినాఁ డంచు సేని త్రిపురాంతకుఁడు దాదాపుగా శ్రీనాథునికాలమువాఁ డగును. సమకాలికుని గ్రంథము నాతఁడాంధ్రీకరించుటయు, నాతనిని బొగడుటయు సంభవింపదు. కావునఁ బైనవ్రాసినచాటుధార త్రిపు రాంతకునిది కాదనుటయే లెస్స. ఎట్లయినను, నాపద్యము త్రిపురాం తకునిదని నిర్ణయింపక తప్పదను నెడల నందుల కనువగు భాస్కరుని సంపాదింపవలసియున్నది. అనవేమారెడ్డి క్రీ. శ. ౧౩౬౨ సంవత్సర మున రెడ్డిరాజ్యమునం దభిషిక్తుఁడయ్యెనని చరిత్రకారులు చెప్పు చున్నారు. ఆతనియొద్ద మంత్రిగా నొకరాయనభాస్కరుఁడున్నాఁడు. చింతగుంట కోదండరామకవి తనసునందాపరిణయమునం దారాయన భాస్కరు నిట్లుకీర్తించియున్నాఁడు.

సీ. ఘనత నౌదార్యదీక్షాకల్పితానల్ప
కరనిబద్ధసువర్ణకంకణుండు
ఆసేతుసీతనగాంతరరాట్సభా
మధ్యవిశ్రుతకీర్తిమండలుండు
కొండపల్లివిన్నకొండదుర్గద్వయీ
దేశప్రజావనధీయుతుండు
సకలావనీపకసంతానయాచిత
వస్తుప్రదాపరివర్తనుండు
అన్నవేమమహీశదత్తాగ్రహార
మదకలాందోళికా సర్వమణివిశేష
భూషణాద్యష్టభూతివిభూషితుండు
భానుతేజుండు! రాయనభాస్కరుండు!

జగద్విఖ్యాతయశుఁ డై, ఆంధ్రదేశమందలి భట్రాజులచే సన్నుతింపఁబడుచున్న రాయన భాస్కరుఁడే యీ పద్యము నందుఁ జెప్పఁ బడినవాఁ డని యీ పద్యమందలి వాక్యముల వలన నూహింపఁ దగియున్నది. "సరిబేసైరిపు" డను పద్యము "రామయామాత్యభాస్కరుని" పైగాక "రాయనామాత్యభాస్కరు" నుద్దేశించినయెడల నా రాయనామాత్యభాస్కరుఁడీతఁడే యనిచెప్పుటకు సంశయింపనక్కఱలేదు. క్రీ. శ. ౧౩౦౦ సంవత్సరప్రాంతమున జన్మించిన రావిపాటి త్రిపురాంతకుఁడు తన చరమవయసున నీ రాయనిభాస్కరుని "సరిబేసై" యను పద్యమున వర్ణించినాఁ డనినను విరోధముకన్పట్టదు. ఇది యుభయసమ్మత మగువిధానముగాఁ గన్పట్టుచున్నది. కాటయవేముని యొద్దనున్న భాస్కరుఁ డీతని మన్మఁ డైన భాస్కరుఁడు గావచ్చును. అనవేమునియొద్ద నగ్రహారములను గైకొనిన రాయనభాస్కరుఁడన వేమునియన్న యైన యనపోతభూపాలుని కాలములోఁ గూడ నుండి కీర్తిఁగాంచుచు నలుబది యేఁబదేండ్ల వయసున ననవేమునిచేత నగ్రహారములను గైకొనియుండెనని తలంపవచ్చును. ఎట్లయినను, త్రిపురాంతకుఁడు ద్వితీయ ప్రతాపరుద్రుని కాలమునందున్న వాఁడని తలంచుటయే యుచితమని నాయుద్దేశము. ఈ భాస్కరులనుగూర్చి మఱి యొకతావునఁ జర్చింతము.

త్రిపురాంతకుఁడు రచించిన గ్రంథములనుబట్టి యీతఁడు శివభక్తుఁ డనియు, శృంగారరసమునం దెక్కువ యభిరుచికలవాఁడనియు నెఱుంగనగుచున్నది ఈతఁడు రచించిన యంబికా శతకమునందలి పద్యములలో భక్తిరసముకంటె శృంగారరసమే యెక్కువగాఁబోషింపఁబడినది. పార్వతీపరమేశ్వరుల శృంగార లీలావిలాసాదులు భక్తిరసమిళితములై యిందుఁ గానవచ్చుచున్నవి. ఈతనికవిత్వము మృదువై ధారాశుద్ధికలిగి వ్యర్థపద విరహితమై హృదయంగమముగా నున్నది. ప్రబంధరత్నావళినుండి గైకొనిన యీతని పద్యములు కొన్నిటి నిట నుదాహరించుచున్నాఁడను.

## అంబికాశతకము.

చ. బెడఁగగు రత్నదర్పణముఁ జేరినవెన్నెల పోసి నిచ్చలుం
దుడుపక పాలసంద్రమునఁ దోఁచి సుధాకరుమేనికందుఁ బోఁ
గడుగక నేరెటేట సితకంజము ముంపక నైజకాంతితోఁ
బొడరదనఁ దల్లి నీమొగముతో సరిపోల్పఁగ జాలు నంబికా!

ఉ. తెప్పలఁ బోరుఁ దల్పులిసిఱింతలు వాతెఱచూపుఁ గుంచియుం
దిప్పి తళుక్కనం దెఱచి తిన్ననినోమునఁ గాయువెన్నెలల్
ముప్పిరి గొన్న వేడుకలు మూఁగినసిగ్గసిమాడఁ బ్రీతి నీ
వప్పరమేశుఁ జూచి తనునర్ధముగొంటి పొసంగ నంబికా!

ఉ. ఆదిమశక్తి యీతరుణి, యాద్యకుటుంబిని యీకుమారి, ము
త్తైదువ యీతలోదరి, చిదాత్మక యీసతి విశ్వమాత యీ
పైదలి సర్వలోకశుభభామిని యీచపలాక్షి యంచు బ్ర
హ్మాదులు వచ్చి నిచ్చలు హిమాద్రికి నిన్నెఱిగింతు రంబికా!

ఉ. కూడెను వెండ్రుకల్ నిడుదమూఁకటఁ బ్రోవుగ బొడ్డుపై నళుల్
జాడగఁ దోఁపఁ గ్రొమ్మొలకచన్నులు మించు దలిర్ప సిగ్గునన్
జూడఁగ నేరముల్ మెఱుఁగుఁజూపుల నీవ హిమాద్రియింట నీ
వాడుట శూలికిన్ మనము వాడుటగాదె తలంప నంబికా!

ఉ. భారతివై సరోజభవుపాల వసించి రమావధూటివై
నీరజనాభుఁ జెంది ధరణీధరనందనవై మహేశ్వరుం
గోరి వరించి తమ్మ; నినుఁ గొల్వక యూరక యేల కల్గుసం
సారసుఖంబు లీమనుజసంతతికిం దలపోయ నంబికా!

## తారావళి

మ. అమితధ్వాంతతమాలవల్లిలవనవ్యాపారపారీణదా
త్రమొ, సౌగంధికమండకుట్మలకుటీరాజీసముద్ఘాటన
క్రమనిర్వాణధురీణకుంచికయొ, నాఁగం బెంపున న్నీకళా
రమణీయత్వము చూడ నొప్పెసఁగుఁ జంద్రా! రోహిణీవల్లభా!

మ. చరమక్ష్మాధరచారుసింహముఖదంష్ట్రాకోటియో నాఁగ నం
బరశార్దూలనఖంబు నాఁగఁ దిమిరేభప్రస్ఫురద్గర్వసం
హరణక్రూరతరాంకుశం బనఁగ నుద్యల్లీల మీరేఖ ని
త్యరుచిన్ బొల్పుగఁ బెంపగున్ విదియచంద్రా! రోహిణీవల్లభా!

మ. పొలకయ్యంబులఁ గల్గుముద్దుటలుకన్ బుష్పాయుధారాతి మ్రొ
క్కులఁ దీర్పన్ దలమీఁద దఁ గాన నగునీక్రొమ్మేను పుణ్యాంగనా
తిలకం బైనభవానిపాదనఖపంక్తిం జెంద డెందంబులోఁ
దలఁ తాచుక్కలతోడిమక్కువలు చంద్రా! రోహిణీవల్లభా!

మ. రతినాథుం డనుమాయజోగి చదలం ద్రైలోక్యవశ్యాంజనం
బతి యత్నంబునఁగూర్చి మౌక్తికమయం బై యున్నపాత్రంబునన్
మతకం బేర్పడఁ బెట్టి దాఁచె నన నీమధ్యంబునన్ మచ్చ సం
తతమున్ గన్నులపండువై వెలయుఁ జంద్రా! రోహిణీవల్లభా!

ఉదాహరణము:— ద్వితీయావిభక్తి.

ఉ. పాములు హారముల్ వెలయఁ బాఁపటసేసయు నేఱు మల్లికా
దామము తోలు దువ్వలువ దట్టపుబూదియుఁ జందనంబు పై
పామునఁ జాల నందముగ సన్నిధిసేసిన జాడఁ గంటి నే
నామదిలోఁ గుమారగిరినాథుని శైలసుతాధినాథునిన్.

కళిక—విజయభద్రగడ

మఱియు వేలుపుకేటిమాళి నాఁగినవాని
వెఱయ గన్నపనోటి సీటఁ బోఁగినవానిఁ.
బోలఁతితో నొక్కెడలఁ బొత్తుఁ గూడినవానిఁ
దలఁకి సేనమరాజు దాడి కోడినవాని
సాఖ్యతొండనిరాల జడికి నోర్చినవాని
సౌఖ్యతరసాయుజ్యసరణిఁ దీర్చినవాని
వెన్నెలలఁ బురుణించు వెలఁది నవ్వులవాని
వెన్నునకు నలువకును వెదుక దవ్వగువాని

ఉత్సాహ

చిగురుఁ గైదువు వెఱికి
మగలసిగ్గులు నఱికి
సతులఁ బాటులు పఱచి
యతులవ్రతములు చెఱచి
అలులు చిలుకలు బండు
వెలయఁ గొలువఁగ నుండు
మరు జయించినవాని
గరుణ మించినవాని.

ఈకవిరచించిన ప్రేమాభిరామము లభ్యముకాలేదు. ఇది సంస్కృతనాటకము కాదనియు, తెలుగుభాషలోనే దీనిని త్రిపురాంతకుఁడు రచియించెననియుఁ దీని "ననుసరించి" వల్లభామాత్యుఁడు క్రీడాభిరామమును వ్రాసెననియు కీ. శే. తల్లాప్రగడ సూర్యనారాయణరావు గారాంధ్రసాహిత్యపరిషత్పత్రికలో (సం౨పు౩౬౯) వ్రాసియున్నారు. కాని యదినిజముకా దని నావిశ్వాసము. ఈవిషయమునుగూర్చి వల్లభామాత్యుని చారిత్రమున వ్రాసెదను.

---

## 44. గణపనారాధ్యుఁడు

ఈకవినిగూర్చి శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారు భారతి 12 వ సంపుటము 1న భాగమునందు 29–31 పేజీలలో నిటుల వ్రాసియున్నారు.

"ఈకవి ఆంధ్రులకపరిచితుఁడు. ఇతఁడు స్వరశాస్త్ర మను చిన్నద్విపదకావ్యమును రచించెను.

ఇటీవల నేనుహంపీయాత్రకుఁబోయినప్పుడు అచటఆంధ్ర గ్రంథములేవేనియు దొరకునాయని పలువుర నడిగితిని. కానియెచ్చటను లభింపవయ్యెను. అక్కడి యానెగొందియందును విచారింపఁగా రెండు మూఁడుసంవత్సరముల పూర్వము అచ్చటనున్న తాళపత్రగ్రంథముల నన్నిటిని తుంగభద్రలో వైచితిమని యచ్చటివారు చెప్పఁగావిని చింతించితిని. అయినను నాతోఁడవచ్చినమిత్రులు టి. వి. రంగాచార్యులుగారు నావలె హతాశులుగాక కంటికగపడినవారి నందఱిని తాళపత్రగ్రంథము లేవేని తమకడఁ గలవాయని విచారించుచుండిరి. ఒక నాఁటియుదయము మేము ఆనెగొందిలో నొకభాగమగు చింతామణిని వీక్షింపబోయినపుడు, అచటనున్న యొకశైవమఠమును జొచ్చితిమి. ఆమఠాధిపతి యగు శ్రీ సుందరానందస్వాములవారు మాకామఠమును జూపునపుడు, మిత్రులు రంగాచార్యులు యథావిధి తమకడ తాళపత్రగ్రంథము లేవియేనియుఁ గలవా' యనియడిగిరి. వారు తమదగ్గర రెండు గ్రంథములు గలవని వానిని దెచ్చి మాముందువైచిరి. అందొకటి గ్రంథాక్షరములభగవద్గీత, రెండవది స్వరశాస్త్రము. స్వరశాస్త్రము మిక్కిలి పురాతనగ్రంథమగుటచేతను దానిని మాకిండని స్వాములవారిని వేఁడితిమి వారు వెంటనే మాకాగ్రంథము నొసఁగిరి. వారియెడ కృతజ్ఞుఁడను.

ఈగ్రంథకర్త కౌండిన్యగోత్రజుఁడు ఇతని తండ్రి గణ్ణయామాత్యుఁడు; తల్లి దేవమాంబ; అన్న రామరాజు; చెల్లెలుఅన్నమాంబ ఉనికిపట్టుఓరుగల్లో తత్ప్రాంతదేశమో తనవంశాదికములను కవి యట్లు వర్ణించుకొనియున్నాఁడు.

ఆదిమబ్రహ్మకు నాత్మసంభవుఁడు
ఆతనికి గౌండిన్యుఁ డతనిగోత్రమున
గణ్ణయామాత్యుఁ డగణ్యవిక్రముఁడు
సత్యసదాచారసన్మార్గవర్తి

చంద్రశేఖరపాదసద్భక్తివరుఁడు
భూమండలమున జంబూద్వీపమందు
భారతవర్షాన భరతఖండమున
హిమసేతుపర్యంత మెల్లను వెలసె
ఆదేశములకెల్ల నధిపతియైన
వీరప్రతాపుఁడై వెలయురుద్రుండు
ఆరుద్రభూపతి కాలయంబైన
సాంపారు నర్థీశ్వర రోహుగంటి ?
మంత్రిశేఖరవృత్తి మహిమీఁద వెలసి
దేవమాంబికతోడ తెరగొప్పఁగూడి
కులమందు చంద్రుల కొడుకుల గాంచి
కొడుకులలో పెద్దగుణవంతుఁడైన
రామరాజన భూమి రమణతో వెలసి
రాజవిక్రమవృత్తి; రాజపూజితుఁడు
పరసతీసోదరి భావంబు బిరుదు
బ్రహ్మణ్యపరమూర్తి పరమార్థవేది
ఆగమవేదసదాచారయుతుఁడు
బంధుచింతామణి పరమోపకారి
సురరాజభోగభాసుర రక్షకుండు
దానధర్మైకతాత్పర్యచిత్తుండు
మహనీయవృత్తిని మహిమీఁద నడిపి
ఏకపత్నీవ్రతం బింపారనడిపి
కొడుకులఁ గూతులఁ గొమరొప్ప గాంచి
సుఖలీల విభవంబు సొంపారనుండి
కాకతిరాజ్యంబు కడచన్నమీఁద
నొగి సురత్రాణుని నుదండరాజ్య
మహిమతోఁ జెన్నారు మన్ననమీఁద

నిజభుజవిక్రమ నీతినిపుణుండు
శ్రీలొసగి పురాణశ్రీకాంతుఁ డగుచు
అశ్వసామంతుల నాందోళములును
వీణాదివాద్యముల వేదఘోషముల
మంగళపాఠక మహితకీర్తనల
మండలేశ్వరులీల మాన్యగా నేలె

* * *

మంత్రిశేఖరుఁ డైనమంత్రి కనుజుండు
మానితగుణి యన్నమాంబ కగ్రిజుఁడు
సంసారమధ్యస్థ సాధకోత్తముఁడు
గణప నారాధ్యుండు కమనీయమూర్తి"

ఈగణపనారాధ్యుఁడు యోగశాస్త్రవేత్త కావున యోగశాస్త్రముల నన్నిటిని బరిశోధించి యీస్వరశాస్త్రమును విరచించెను.

"సంసారజితులకు సహజయోగమున
స్వరశాస్త్రయోగంబు నరిగాగ దలచి
హరిమతశాస్త్రంబు హరశాస్త్రమతము
వాసిష్ఠమతమును వల్క్యయోగంబు
నానామతైకంబు నపహాధమతము
మహితమై యొప్పెడు మార్తాండమతము
కొమరొప్పుచున్నట్టి గోరక్షమతము
కడనొప్పుచున్నట్టి కామాక్షిమతము
మొదలుగా మహిమీద ముఖ్యమైయున్న
యోగశాస్త్రములెల్ల యోచించిచూచి
జీవహితంబుగా జీవునిబట్టి
తెరగొప్ప జనులెల్ల దెలియునట్లుగను
స్వరశాస్త్రమంజరి వర్ణింతు బ్రీతి"

కవికాలము:—గణపనారాధ్యుని కాలమును నిర్ణయించుట సులభము. ఏలన, అతనితండ్రి 'గణ్నయామాత్యుఁడు' ఓరుగంటి ప్రతాపరుద్రమహారాజునకు మంత్రి. అన్నయగు రామరాజు కాకతి రాజ్యము గతించినపిమ్మట సురత్రాణునిచే మన్ననలనుబొంది మండలేశ్వరులీలమాన్యుఁడై యేలినవాఁడు. వీరప్రతాపరుద్రనరపతి కాకతీయ రాజులలో కడపటివాఁడు. ఇతఁడు క్రీ. శ. ౧౨౯౫ మొదలు ౧౩౨౩ వఱకును రాజ్యపాలనము చేసెను. గణ్నయామాత్యుఁడు గూడ నప్పటివాఁడే యగును. ఇక రామరాజును మన్నించిన సురత్రాణుఁడు ఢిల్లీప్రభువగు మహమ్మదు తుఘలామ్‌షా. ఇతఁడు క్రీ శ. ౧౩౨౩ నం దోరుగంటిపై దండయాత్ర జేసి ప్రతాపరుద్రుని బంధితుని జేసి, కాకతిరాజ్యమును విధ్వంసమొనర్చి, మహమ్మదీయసామ్రాజ్యము నాంధ్రదేశమునందు నెలకొల్పెను. ఈతనియధికార మాంధ్రదేశమున క్రీ. శ. ౧౩౪౫ వఱకు సాగెను. ఆసంవత్సరమున ముసునూరి కాపయనాయకుఁడు ఆంధ్రస్వాతంత్ర్యస్థాపనార్థము నడుము కట్టుకొని, యనేకాంధ్రనాయకుల సాయముచేత మహమ్మదీయులను తెలంగాణమునుండి వెడలనడచెను. కావున సురత్రాణునిచే మన్నన వడసిన రామరాజు క్రీ. శ ౧౩౨౩, ౧౩౪౫ ల మధ్యకాలమున వెలసినాఁడనుట స్పష్టము గణపనారాధ్యుఁడు తన గ్రంథము నప్పుడే రచియించి యుండవలయును.

కాకతిరుద్రాంబకల్లుఁడును, ద్వితీయప్రతాపరుద్రుని మంత్రియు నగు నింబులూరి యన్నయమంత్రి కౌండిన్యగోత్రుఁడు. అతనితండ్రి పెదగణ్నయామాత్యుఁడు. ఈగణపనారాధ్యకవి తండ్రియైన గణ్నయామాత్యుఁ డాపెదగణ్నయకు సోదరుఁడో, పినతండ్రియైన పినమల్లదేవునికొడుకో యై యుండు నని తోఁచుచున్నది శ్రీవెంకటరమణయ్యగారు నిర్ణయించినకాలము సరియైనది. స్వరమంజరిని నేను జూడలేదు. ఇతనికవిత సరస మైనదని, పైనవ్రాసిన ద్విపదలనుబట్టి తెలియుచున్నది.

# 45. ఎఱ్ఱాప్రెగ్గడ

భారతకవిత్రయములో నొక్కఁడై, ప్రబంధపరమేశ్వర బిరుదాంచితుఁడై, సకలసుకవినుతిపాత్రుఁడై, కీర్తికాయుఁడైన యిమ్మహాకవి నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; శ్రీవత్సస గోత్రుఁడు. ఇతనికిఁ దండ్రిసూరనార్యుఁడు; తల్లిపోతాంబ; ఎఱపోత సూరి పితామహుఁడు; పేరమాంబ పితామహి; బొల్లన ప్రపితామహుఁడు; పోలమాంబ ప్రపితామహి; వెలనాటిచోడునివలన గౌరవము నొందిన భీమనమంత్రి యీకవితాతకుఁ దాత; బొల్లన పోలన జన్నన యనువార లీకవికిఁ బెదతండ్రులు; శంకరస్వామి యీతనికి గురువు.

—: ఇతని పేరు :—

ఈకవి పేరు ఎఱ్ఱయ. నియోగిబ్రాహ్మణసూచకముగాఁ బేరునకుఁ దరువాత మంత్రి, అమాత్య, ప్రెగ్గడశబ్దములను జేర్చుచుండుట చిరకాలానుగతమైన యాచారమగుటచే నీతనిని, ఎఱ్ఱాప్రెగ్గడ యని పిలుచుచున్నారు. ఈశ్వరభక్తుఁడగుటచే శంభుదాసనియీతనికి నామాంతరము కలదు. ఇది లక్షణాభిధేయ మని యీక్రింది గద్యలోఁ గవి చెప్పియున్నాఁడు.

"గద్యము ఇది శ్రీశంకరస్వామి సంయమీశ్వరచరణసరోరుహ
ధ్యానానందసౌందర్యధుర్య శ్రీసూర్యసుకవిసంభవ శంభు
దాసలక్షణాభిధేయ యెఱ్ఱయ నామధేయ ప్రణీతంబైన"

—: ఈతని పూర్వులు : గురువు :—

ఈమహాకవి నన్నయభట్టు రచింపగామిగిలినభారతారణ్యపర్వశేషమును బూరించెను. నృసింహపురాణము, రామాయణము, హరివంశము నను గ్రంథము లీతని యితర రచనములు ఈతఁడు రచించిన నృసింహపురాణమునుండి యీతనివంశవృత్తాంతమును దెలుపుపద్యమును గురుస్తుతికల పద్యమును గ్రహించి యీక్రింద నిచ్చుచున్నాఁడను.

సీ. ప్రజ్ఞాపవిత్రుఁ డాపస్తంబసూత్రుండు
శ్రీవత్సగోత్రుఁ డూర్జితచరిత్రుఁ
డగుబొల్లనకుఁ బోలమాంబకు బుత్రుండు
వెలనాటిచోడునివలన మిగుల
మన్నన గన్నభీమనమంత్రి పౌత్రుండు
పేరమాంబామనఃప్రియుఁడు
పోతమాంబికావిభు మజ్జనకుని
బొల్లధీనిధికిని బోలనకును

గీ. జన్నకునకనుజన్ముని గన్నతండ్రి
వేఁగినాటఁ గరాపర్తి వృత్తిమంతుఁ
డనఘుఁ డెఱపోతసూరి కంసారిచరణ
కమలమధుకరపతిసారవిమలయశుఁడు.

ఈపద్యమునందలి యెఱపోతసూరి, యీకవికిఁబితామహుఁడు. ఇతఁడే కవికి స్వప్నములోఁ గనఁబడి నృసింహపురాణమును రచించి, అహోబలనృసింహున కంకితము సేయుమని యాజ్ఞాపించినవాఁడు

ఉ. యామము లెన్మిదింట నియతాకృతిఁ బ్రత్యయమున్ శివార్చనా
రామత యొప్ప నిత్యశివరాత్రివ్రతంబుగఁ బూని భవ్యయో
గామృతతృప్తిమైఁ ద్రిజగదర్చితలీలఁ దనర్చుశంకర
స్వామి మునీంద్రభక్తజనవత్సలు మద్గురు నాశ్రయించెదన్.

ఎఱ్ఱాప్రెగ్గడ తనతండ్రియైన సూరనామాత్యుఁ డుభయకవిత్వప్రౌఢుఁ డని పైపద్యములోఁ జెప్పియున్నాఁడు. కాని యాతఁడు రచించినగ్రంథము లేవియో చెప్పలేదు. సంస్కృతభాషలో సూర్యకవిరచిత మగుసంక్షేపరామాయణ మొకటి కలదనియు నతఁ డెఱ్ఱాప్రెగ్గడతండ్రియేమో ! అనియు శ్రీ ప్రభాకరశాస్త్రిగారు వ్రాసియున్నారు.

—: ఈతని గృహనామము : నివాసము :—

ఎఱ్ఱాప్రెగ్గడగృహనామ మేదియో యితనిగ్రంథములనుబట్టి తెలియుట లేదు. విప్రనారాయణచరిత్రమును రచించిన చెదలువాడ మల్లయకవి తాను ఎఱ్ఱాప్రెగ్గడకవివంశజుఁడ నని యీక్రిందిపద్య ములోఁ జెప్పియున్నాఁడు.

సీ. ప్రతిభతో నారణ్యపర్వశేషముఁ జెప్పెఁ
గవులకుఁ జెవులపండువులు గాఁగ
వల్మీకభవువచోవైఖరి రామాయ
ణంబు నాంధ్రప్రబంధంబుఁ జేసె
నారసింహునిపురాణ మొనర్చె హరిమెచ్చి
నన్ను నెన్నఁడు చూచినాఁడ వనఁగఁ
బ్రౌఢిమై హరివంశభాగముల్ రెండును
రచియించె సభలందుఁ బ్రాజ్ఞు లెన్న
దురితహరుఁ బ్రబంధపరమేశ్వరునిఁ జెద
ల్వాడనిలయు నాదువంశకర్త
ధన్యమూర్తి శంభుదాసు నెఱ్ఱాప్రెగ్గ
డను నుతింప బ్రహ్మకును దరంబె.

ఈపద్యమునుబట్టి యెఱ్ఱాప్రెగ్గడ, చెదలువాడ యనుగ్రామ మునం దుండుటచే నీతనివంశమువారికి 'చెదలువాడ' యను గృహ నామ మేర్పడినట్లు కన్పట్టుచున్నది. ఎఱ్ఱాప్రెగ్గడతరువాత నాకుటుం బమువారికి "చెదలవాడ" యనునింటిపేరు వచ్చినవచ్చియుండవచ్చు ను. అంతమాత్రముచేత, ఎఱ్ఱాప్రెగ్గడగృహనామము "చెదలువాడ" యని యెంచరాదు.

ఎఱ్ఱాప్రెగ్గడతాత యైన యెఱపోతసూరి, వేఁగినాటి గరాపర్తి వృత్తిమంతుఁడైనట్లు నృసింహపురాణములోఁ జెప్పియుండుటచే, వేఁగినాటి యందుండెడి 'గరాపర్తి' యనుగ్రామ నివాసకవిపూర్వుల

నివాసమైనట్లూహింపవచ్చును. భారతారణ్యపర్వాంతమందలి యీ క్రిందిపద్యములవలన నెఱ్ఱాప్రెగ్గడ పాకనాటియం దున్నగుడ్లూరు నివాసుఁడైనట్లు కనుపట్టుచున్నది.

సీ. భవ్యచారిత్రుఁ డాపస్తంబసూత్రుండు
శ్రీవత్సగోత్రుండు శివపదాబ్జ
సంతతధ్యానసంసక్తచిత్తుఁడు సూర
నార్యునకును బోతమాంబికకును
నందనుం డిలఁ బాకనాఁటిలో నీలకం
ఠేశ్వరస్థానమై యెసక మెసఁగు
గుడ్లూరి నెలవున గుణగరిష్ఠత నొప్పు
ధన్యుఁ డద్వైతైకతత్పరాత్ముఁ
డెఱ్ఱనార్యుండు సకలకవీంద్రవినుతుఁ
డైన నన్నయభట్టమహాకవీంద్రు
సరససారస్వతాంశప్రశస్తి తనుఁ
జెందుటయు సాధుహర్షణసిద్ధిఁ గోరి.

క. ధీరవిచారుఁడు తత్కవి
తారీతియుఁ గొంతదోఁపఁ దద్రచనయ కా
నారణ్యపర్వశేషము
పూరించెఁ గవీంద్రకర్ణపుటపేయముగాన్.

ఎఱ్ఱాప్రెగ్గడయో, లేక యాతనివంశీయుఁడైన సూరయామాత్యకవియో, వేఁగినాఁటినుండి వచ్చి, పాకనాఁటియందలిగుడ్లూరునివాస మేర్పరచుకొని యుండును. అచ్చటనే ఆరణ్యపర్వశేషమును, నృసింహపురాణమును రచియించినపిమ్మట మల్లారెడ్డిపరిచయములభింపగాఁ జెదలువాడగ్రామమున కాతనితో నేగి యాతనియన్న యైన వేమారెడ్డిని దర్శించి కొంతకాలమైనను అద్దంకిలో నివాసముండి రామాయణమును హరివంశమును రచించి యాతనికి గృతిచేసి వార్ధక్యమునఁ జెదలువాడ

డయందు నివసించియుండును. ఆరణ్యపర్వశేషము గుద్దూరునందుం డగా రచియించెనని పైపద్యమువలన స్పష్టమగుచున్నది. అంతకు పూర్వ మెఱ్ఱాప్రెగ్గడకు గాని, యాతనిపూర్వులకుఁ గాని చెదలువాడతో సంబంధమున్నట్లు గాన్పింపదు. కావున, ఎఱ్ఱాప్రెగ్గడనాఁటి కాతనిగృహనామము చెదలువాడ కాదు. ఆతనికిఁ బిమ్మట నాతనివంశీయులకు చెదలువాడ యనుగృహనామ మేర్పడియున్నట్లువిప్రనారాయణచరిత్రకారునివలన మనకుఁ దెలియుచునే యున్నది.

అయినను పైనవ్రాసినపద్యములు రెండును బ్రక్షిప్తములనియు, నవి కొన్ని తాళపత్రప్రతులలో లేవనియుఁ గొంద అనుచున్నారు. అవి యెఱ్ఱాప్రెగ్గడరచించినవియా? ఇతరులురచించి యందుఁజేర్చిరా? యనువిషయమును నిర్ధారణము చేయుటకు మానయూహలేకాని యితరాధారములు లేవు. ఈపద్యములలోఁ బ్రథమపురుష ముపయోగింపబడుటచే నీపద్యరచయిత యితరుఁడై యుండునని కొంద అనుచున్నారు. కాని యంతమాత్రముచే నట్లు నిర్ణయింపఁజనదు. భారతమున నన్నయభట్టు "తనకులబ్రాహ్మణు" అనుపద్యములో బ్రథమపురుషమునే యుపయోగించి యుండుటచే నది యొకయాక్షేపణము కాఁజాలదు. ఆరణ్యపర్వశేషమును నన్నయపేరుతోడనే రచియించి రాజరాజనరేంద్రునే కృతిపతినిగాఁ జేసినయెఱ్ఱాప్రెగ్గడ యందులకు విరుద్ధముగా నీపద్యములను వ్రాసియుండఁడని యొక యాక్షేపణమును దెల్పుచున్నారు. ఎఱ్ఱాప్రెగ్గడ తానుచేసినపనికి విరుద్ధముగా నీపద్యములను వ్రాయలేదు. తా నేకార్యమును జేసెనో దాని నేయాపద్యములయందుఁ దెల్పినాఁడు. నన్నయయందలి గౌరవముచేఁ దాను రచించినయాభాగమునకు నన్నయ పేరు పెట్టితినని చెప్పుటవిరుద్ధమా? అట్లు చెప్పకుండుటయే విరుద్ధము. తానురచించి నన్నయ పేరుపెట్టుట యసత్యమాడుటకాదా? అనియనవచ్చును. అదియసత్యమాడుటకాదు. నన్నయను గౌరవించుట. అందసత్యదోషములేదు.

అసత్యదోషము రాకుండుటకై యీపద్యములనాతఁడు రచించె నని చెప్పుటయే న్యాయము.

ఎఱ్ఱాప్రెగ్గడ 'గరాపర్తి' నివాసుఁడనియు, గుడ్లూరు వాస్తవ్యుఁ డెప్పుడును గాఁడనియుఁ బై పద్యమునందు గుడ్లూరి నెలవున నని వ్రాసియుండుటచే నది ప్రక్షిప్తమనియుఁ బ్రక్షిప్త వాదులయభిప్రాయము. ఎఱ్ఱాప్రెగ్గడ తాతనివాసము గరాపర్తి కావచ్చును. ఎఱ్ఱయ్యయు నాతని తండ్రియు, గరాపర్తి యందున్నారని యెవరు చెప్పఁగలరు? ఎఱ్ఱాప్రెగ్గడ గుడ్లూరు నివాసి కాఁడని యెట్లునిశ్చయింపఁగలము? నరసింహపురాణరచనము నాఁటి కాతఁడు గరాపర్తి యందున్నాఁడని సాక్ష్యము లభించువఱకును గుడ్లూరునివాసమును ద్రోసి వేయరాదు. శ్రీప్రభాకరశాస్త్రులుగా రెఱ్ఱాప్రెగ్గడ రామాయణము లోనిదని ప్రకటించిన పద్యములో నీలకంఠేశ్వరస్తవ మున్నది. ఆదేవుఁడు గుడ్లూరునందున్నవాఁడు. రామాయణరచనమును గుడ్లూరునందుండియే చేసెనో వేమారెడ్డిరాజ్యమునకు రాజధానియైన యద్దంకిలోనుండి చేసెనో చెప్పజాలము. అద్దంకియందుఁ గాపుర మేర్పరచుకొనినపిమ్మటనే రామాయణమును రచించెనని తలంచినను దన పూర్వనివాసమైన గుడ్లూరునందలి నీలకంఠేశ్వరుని నుతించియుండవచ్చును. దీనినిబట్టి గుడ్లూరి నెలవున నని వ్రాసియుండుట కారణముగా నాపద్యము ప్రక్షిప్తమని చెప్పరాదు విష్ణుపురాణములో వేమారెడ్డివంశజుఁడైన రాఘవరెడ్డి నివాసము గుడ్లూరని చెప్పియుండుటచే వేమారెడ్డి నివాసమద్దంకియని తెలియని వారెవరో యొకరు వేమారెడ్డి సంస్థానము నందున్న యెఱ్ఱాప్రెగ్గడకూడ గుడ్లూరు నివాసుఁడై యుండునని భావించి యీపద్యములను రచించి తన ప్రతిలోఁ జేర్చుకొనియుండుననియు దానినిబట్టి యనేకప్రతులు బయలుదేరియుండు ననియు నందుచే నవి ప్రక్షిప్తములని యెంచవలయుననియు శ్రీ నడకుదుటి వీరరాజుపంతులుగారు భారతిపత్రికలో వ్రాసియున్నారు. ఈ రాఘవరెడ్డి వేమారెడ్డి వంశములోనివాఁడు కాఁడు.

ఎఱ్ఱాప్రెగ్గడకును రాఘవరెడ్డికిని నడుమ రెండువందల సంవత్సరముల వ్యవధియున్నది. ఇంతకాలమునకుఁ దరువాత నేమిప్రయోజన మపేక్షించి యావిలేఖకుఁ డీపద్యములను స్వయముగా రచియించి తనప్రతియందుఁ జేర్చియుండును? కొన్నిప్రతులలో నీపద్యములు లేవని యనుచున్నారు. సత్యమే కావచ్చును. గద్య నన్నయపేర నుండుటచే నీ పద్యము లనవసరములని యోచించి విలేఖకుఁ డీపద్యములను దీసివేసియుండుననియు దాని ప్రతికలలో నీపద్యములు లేకపోయి యుండుననియుఁ దలంపవచ్చును. ఈ పద్యములను రచించి ప్రతులలోఁ జేర్చుటకంటె దీసివేయుట సులభమైనకార్యము. ప్రక్షిప్తము లనియెంచి యీ పద్యములను మనము త్యజించినను ద్యజింపవచ్చును. అందువలన నెఱ్ఱాప్రెగ్గడ గుడ్లూరు నివాసియనుట కాధారము పోవును. కాని యంతకంటెఁ జెడిపోవునది లేదు. కాని యాపద్యము ప్రక్షిప్తము కాదనియు, గుడ్లూరునందుఁ గొంతకాల మీతఁడు నివసించి యుండెననియు నా దృఢవిశ్వాసము.

భాగవత షష్ఠస్కంధమును రచించిన యేర్చూరి సింగయకవి వంశములోఁ బూర్వుఁడు ఎఱ్ఱనప్రెగ్గడ యొకఁడున్నాఁడు. ఆతనిని గూర్చి సింగయకవి యిట్లు వ్రాసియున్నాఁడు.

సీ. శ్రీవత్సగోత్రుండు శివభక్తియుక్తుఁడా
పస్తంబసూత్రుఁ డపారగుణుఁడు
నేర్చూరిశాసనుం డెఱ్ఱనప్రెగ్గడ
పుత్రుండు వీరన పుణ్యమూర్తి
కాత్మజుఁ డైనగాదామాత్యునకుఁ బ్రోల
మాంబకు నందను లమితగుణులు
కసువనామాత్యుండు ఘనుఁడు వీరనమంత్రి
సింగధీమణియు నంచితచరిత్రు
లుద్భవించిరి త్రేతాగ్నులో యనంగ
సారిది మూర్తిత్రయం బన శుద్ధకీర్తిఁ

బరఁగి రందులఁ గసువనప్రభువనకును
మమ్మడ మ్మనుసాధ్వి యిమ్ములను వెలసె.

ఇరువురును నియోగిబ్రాహ్మణులును ఆపస్తంబసూత్రులును, శ్రీవత్సగోత్రులును శివభక్తియుక్తులు నగుటచే నీయిరువురు నొక్క రేయని భ్రమపడి కొందఱు ఎఱ్ఱాప్రెగ్గడ గృహనామము పర్యాప్రి వారని చెప్ప మొదలిడిరి. కాని యది పొరపాటు ఆయెఱ్ఱాప్రెగ్గడ వేఱు. ఈయెఱ్ఱాప్రెగ్గడ వేఱు. ఆతనికి నీతనికిని సంబంధము లేదు. ఈయిరువురుగాక యింక నొక యెఱ్ఱన యున్నాఁడు. ఆతఁడును కవియే నియోగిబ్రాహ్మణుఁడే; ఆపస్తంబసూత్రుఁడే; శ్రీవత్సగోత్రజుఁడే శివభక్తి పరాయణుఁడే; ఆతఁడు రచించిన కొక్కోకమునందు తననుగూర్చి యిట్లు చెప్పుకొనియున్నాఁడు.

సీ. శ్రీవత్సగోత్రప్రసిద్ధసంభూతి నా
పస్తంబసూత్రప్రశస్తఘనుఁడ
గురుదయానిధి యైన కూచనమంత్రికి
నంగనామణి ముత్తమాంబికకును
దనయుండ సత్కవీంద్రసుమాన్యచరితుండ
శివకృపాసుజ్ఞాన శేఖరుండ
నారూఢవిద్యాచలానందయోగీంద్ర
శిష్యపరిచారవిశిష్టఘనుఁడ
నెఱ్ఱనామాత్యుఁడను సత్కవీంద్రహితుఁడఁ
గవితవాక్ప్రౌఢిఁ గొక్కోకకవివరుండఁ
జతురమతితోడ రతికళాశాస్త్ర మిదియుఁ
దెనుఁగుఁ గావింతు రసికులు వినుతిసేయ

ఏదియెట్లున్నను, ఎఱ్ఱాప్రెగ్గడగృహనామము మనకుఁ దెలియరాలే దనియే చెప్పవలసియున్నది.

ఈ క వి కా ల ము

ఇతఁడు రచించినరామాయణ, హరివంశములను వేమారెడ్డి కంకితము చేసియుండెను. వేమారెడ్డి క్రీ. శ. ౧౩౨౪-౧౩౪౯ మధ్య రాజ్యముచేసినవాఁడు. కావున నికవికాలమదియేయనుట నిశ్చయము. ఇతనికిఁ బ్రపితామహుఁడైన భీమనమంత్రి వెలనాఁటి చోడునివలన మన్నన లందినవాఁడని పైనను దాహరించిన సీసపద్యములోఁ జెప్పి యున్నాఁడు. వెలనాఁటి చోడులిరువురున్నారు. మొదటియాతఁడుక్రీ. శ. ౧౧౩౭ వఱకు నున్నవాఁడు. రెండవయాతఁడు క్రీ. శ. ౧౧౬౦ ౧౧౭౦ నడుమ రాజ్యముచేసినవాఁడు. భీమనమంత్రిని గౌరవించిన చోడుఁడు మొదటియాతఁడని శ్రీ వీరేశలింగముపంతులు గారభిప్రాయ పడిరి. రెండవచోడుఁడని నాయభిప్రాయము. ఇతనిని వీరేంద్రచోడుఁ డందురు. భీమనమంత్రి ౧౧౬౫ సంవత్సర ప్రాంతమున నీవెలనాఁటి చోడునిచే గౌరవము నందెననియు నప్పటికాతఁడు ముప్పది సంవత్స రముల యీడుగలవాఁడనియు భావించితిమేని, భీమనమంత్రి జననము క్రీ. శ. ౧౧౪౦ ప్రాంతమైయుండును. తరమునకు ముప్పదిమూఁడు సం వత్సరములవంతునఁ జూచినచో, ౧౧౬౭ ప్రాంతమున బొల్లనయు, ౧౨౧౦ ప్రాంతమున నెఱపోతసూరియు, ౧౨౪౫ ప్రాంతమున సూర నయు, నించుమించుగ ౧౨౭౦ వ సంవత్సరకాలమున మనయెఱ్ఱాప్రె గ్గడయు జన్మించియుందురని తలంపవలసియున్నది. శ్రీ పంతులుగా రనినట్లు మొదటి వెలనాఁటిచోడుఁడైనచో, నీయంతర మధికమై తరమునకు ౪౫సంవత్సరములవ్యవధి యేర్పడి యస్వాభావికమగును.

ఎఱ్ఱాప్రెగ్గడ, ఆరణ్యపర్వశేష, నరసింహ పురాణములను, ౧౩౧౫-౧౩౨౫ నడుమ రచియించియుండును అటుపిమ్మట ౧౩౩౦-౧౩౪౦ సంవత్సరములనడుమ రామాయణమును, హరివంశమును జేసి వేమారెడ్డికిఁ గృతినొసంగియుండును. వేమారెడ్డి జీవితకాలములోనే ౧౩౪౫ ప్రాంతమున నీకవి ౭౫ సంవత్సరముల వయసునఁ దనభౌతిక దేహమును వీడియుండును.

కవిసామర్థ్యము.

కవికిఁ బితామహుఁడైన యెఱపోతసూరి, స్వప్నమునఁ గన్పడి తన కుపదేశించినట్లు కవి రచించిన యీక్రిందిపద్యములవలన కవిసామర్థ్యాదులు కొంతవఱకుఁ దెలియవచ్చుచుండుటచే గ్రంథవిస్తరభీతి యున్నను నాభాగ మందలిపద్యముల నన్నిఁటి నిటఁ నుదాహరించుచున్నాఁడను.

ఉ. ఉన్నతసంస్కృతాదిచతురోక్తిపదంబులఁ గావ్యకర్తవై
యెన్నికమైఁ బ్రబంధపరమేశుఁడనంగ నరణ్యపర్వశే
షోన్నయమంధ్రభాష సుజనోత్సవ మొప్పఁగ నిర్వహించితా
నన్నయభట్టతిక్కకవినాథుల కెక్కినభక్తి పెంపునన్.

క. గిరిశపదభక్తిరసత
త్పరభావము కలిమి శంభుదాసుం డనఁగా
బరఁగినగోవిందగుణా
దరసంభృతసౌమనస్యధన్యుఁడ వెంమున్.

క. గురుభజనపరాయణుఁడవు
సరసబహుపురాణ ధర్మశాస్త్రకథావి
స్తరవేదివి వినయోదిత
భరితుఁడ వతులానుభావభవ్యుఁడవు మహాన్.

క కావునఁ బ్రబంధరచనా
ప్రావీణ్యత నీకు సహజపరిణత సిద్ధం
బై వెలసినయది యొకకృతి
గావింప జగద్ధితంబుగా నేఁ బనుతున్.

ఉ. శ్రీమదహోబలేశనరసింహుఁడు నాప్రియదైవతంబు మా
తాస్వామి తదీయతీర్థవిభవంబును దన్మహితావతారమున్
నీమధురోక్తిగుంభన మనీషులు మెచ్చఁగఁ బ్రస్తుతింపు నీ
కేమెయి సంభవించు నఖిలేప్సితపుణ్యఫలోదయోన్నతుల్.

తే. అనినఁ బులకలు మై జాదుకొనఁగ నప్పుడు
మనసు వికసిల్లఁ గనువిచ్చి మహితలీల
నద్భుతానందరసమూర్తి నై తలంపు
తద్గతంబుగ ధన్యత తలకొనంగ

క. ఇది యీశ్వరానుశాసన
ముదయోన్ముఖమయ్యె నాకు నూర్జితశుభసం
పదనొనరింతు ప్రబంధము
సదయ నృసింహావతారసంస్తవసరణిన్.

చ. ననుఁ దన పేరివాఁడని మనంబున నెప్పుడు నాదరించుటన్
బని చె గుణప్రసిద్ధియును భవ్యసమృద్ధియుఁ జేయు పుణ్యపుం
బని యఁట మత్పితామహుఁడు ప్రాక్తనసంయమితుల్యవర్తనుం
డనఘయశుండు పూర్ణపురుషాయుపజీవితధన్యుఁ డిమ్మహిన్.

తే. అమ్మహాత్ముఁడు నిత్యదయార్ద్రహృదయుఁ
డతులితానందజలధి నోలాడుఁ గాత
విష్ణుధర్మ ప్రశంసాపవిత్రమైన
యస్మదీయప్రబంధసామగ్రి వలన.

శా. ప్రాజ్ఞప్రస్తుతభవ్యభోగవిభవస్ఫారాత్ముఁ డారాధ్యస
ర్వజ్ఞుం డప్రతిమానదుర్భతోభయకవిత్వప్రౌఢి శబ్దార్థయో
గాజ్ఞాసిద్ధిఘనుండు మజ్జనకుఁ డుద్యత్కీర్తి శ్రీసూర్యుఁ డీ
విజ్ఞానాత్మక వాఙ్మయంబున ముదావేశోజ్జ్వలుం డయ్యెడున్.

### ఈతని కృతిపతులు

ఈతఁడు భారతారణ్యపర్వశేషమును నన్నయభట్టు రచించి నట్లే లిఖించి రాజరాజనరేంద్రునే కృతిపతినిగాఁ జేసెను. నృసింహ పురాణము నహోబలనృసింహస్వామి కంకితముచేసెను. రామాయ ణమును, హరివంశమును వేమారెడ్డికిఁ గృతియిచ్చెను. వేమారెడ్డి

తమ్ముఁ డైనమల్లారెడ్డి, మొదట నీ కవి నాదరించి తీసికొనివచ్చి యన్నయైనవేమారెడ్డి కప్పగించెననియు, నాతఁడీకవిని దనయాస్థానము నందుంచుకొని రామాయణమును, హరివంశమును రచింపఁ జేసి కృతిపొందెననియు హరివంశమునందలి యీక్రిందిగద్యపద్యములవలనఁ దెలియుచున్నది.

"ఇట్లు సకలసమృద్ధులఁ బ్రసిద్ధప్రభావుం డైనవేమజననాథుం డొక్కనాఁడు ప్రమోదంబు మిగులం బేరోలగం బుండి

క. అంబుజభవనిభుఁడును బో
తాంబావిభుఁడు నగు సూరనార్యుని సుతున
న్నం బూజితధూర్జటిచర
ణాంబుజు శ్రీవత్సగోత్రు నంచితచరితున్.

వ. సవినయంబుగాఁ బూజించి యిట్లనియె.

తే. సకలభాషాకవిత్వవిశారదుఁడవు
సాధుసమ్మతుఁడవు నిత్యసౌమ్యమతివి
భవ్యుఁడవు గాన నీమీఁద బగఁగఁ బక్ష
మేను గలిగియుండుదు నెఱ్ఱప్రెగ్గడార్య

శా. నాతమ్ముండు ఘనుండు మల్లగథినీనాథుండు నిన్నాతత
శ్రీతోడన్ సముపేతుఁ జేసి యెలమిం జేపట్టి మాకిచ్చుటం
జేతోమోదమెలర్ప రామకథమున్ జెప్పించి యత్యుత్తమ
ఖ్యాతిం బొందితి నింక నేను దనియన్ గావ్యామృతాస్వాద
నన్

క. భారతపరాశరమునిఁ యిం
పారఁగఁ జెప్పుదురు బుధులు హరివంశము నీ
వారమ్యకథఁ దెనుంగుగ
ధీరోత్తమ నిర్వహించి తెలుపుము మాకున్.

వ. అనినం బ్రహ్మానందభరితపులకితదేహుండనై యమ్మహాభాగుని సమ
 గ్రసంప్రార్థనంబుఁ గృతార్థతాకవితనృత్తం బగుచిత్తంబునం
 గైకొని యిట్లంటి:

ఉ. నన్నయభట్టతిక్కకవినాథులు చూపిన త్రోవఁ బావనం
 బెన్నఁ బరాశరాత్మజమునీంద్రునివాఙ్మయ మాదిదేవుఁడౌ
 వెన్నునివృత్తమీవు కడువేడుకతో విను నాయకుండవి
 ట్లెన్నియొ సంఘటించె మదభీప్సితసిద్ధికి రాజపుంగవా

క. కావునఁ జెప్పెదఁ గల్యా
 ణావహమహనీయరచన హరివంశము స
 ద్భావమున నవధరింపుము
 భూవినుత గుణాభిరామ! ప్రోలయవేమా!

—: నృసింహపురాణ హరివంశములలో దేనిని ముందు రచించెను? :—

హరివంశమునకుముందు రామాయణమును, నృసింహపురాణ మునకు ముందారణ్యపర్వశేషమును రచియించినట్లు పైపద్యముల వలనఁ దెలియుచున్నది. కాని నృసింహపురాణమును ముందురచించె నో, హరివంశమునుముందురచించెనో తెలియఁదగిన కవికృతపద్యము లే గ్రంథమునను లేవు. హరివంశముకంటె నృసింహపురాణము ముం దుగ రచించినాఁ డందు మేని నాతనిరచనములవరుస యిట్లుండును. ౧ అరణ్యపర్వశేషము ౨ నృసింహపురాణము ౩ రామాయణము ౪ హరివంశము. నృసింహపురాణముకంటె హరివంశము ముందు రచించియుండె నందు మేని యాతనిగ్రంథము లీక్రింది వరుసగా నుండును. ౧ రామాయణము ౨ హరివంశము ౩ అరణ్యపర్వ శేషము ౪ నృసింహపురాణ ము.

(క) ఈరెండువరుసలలోఁ గడపటివరుసలోనే, ఎఱ్ఱాప్రెగ్గడ తనగ్రంథములను రచియించెనని కవిచరిత్రకారులగు బ్రి. శ్రీ. వీరేశ

లింగముపంతులుగారును మొదటివరుసలోనే రచియించెనని హరి వంశపీఠికాకారులగు బ్రి. శ్రీ. శేషాద్రిరమణకవులునుఅభిప్రాయముల నిచ్చియున్నారు. ఉభయులును దమయూహలకు హేతువుల నిచ్చి యుండలేదు.

నృసింహపురాణము కట్టకడపటరచియించె నని తలంచుట కీ క్రిందికారణములు కన్పట్టుచున్నవి.

౧. గ్రంథరచనకుఁ బ్రారంభమున నీతఁడు, నన్నయకు విఘ్నమును గలిగించినట్టియు, విఘ్నము కలుగునను భయముచేత తిక్కన విడిచిపెట్టె నని ప్రజ లనుకొను నట్టియు, నారణ్య పర్వశేషము నెన్నుకొనియుండఁడు.

౨. హరివంశము వంటియుత్తమ ప్రబంధము రచించినపిమ్మట ప్రబంధ పరమేశ్వరుఁ డని పేరు వచ్చునుగాని అరణ్యపర్వ శేషము ను బూరించినంత మాత్రమున నట్టిపేరు వచ్చెనని తలంచుట సమంజసముకాదు. అందుచేత నే హరివంశమునఁ బ్రబంధపరమేశ్వరుఁడ ననికవి చెప్పుకొనలేదు. నృసింహపురాణమున నట్లు చెప్పుకొని యున్నాఁడు.

3. కవి తనయౌవనమున రాజుల నాశ్రయించి కృతులిచ్చి తిక్కన శ్రీనాథులవలెనే వృద్ధాప్యమున భగవంతుఁడైననారసింహునకు గృతియిచ్చెను.

ఈకారణములనుబట్టి నరసింహపురాణమును గట్టకడపట రచియించె ననెడియూహ సత్యమనియే తోఁచునుకాని, నరసింహపురాణమందలియవతారికలోని గద్యపద్యములను జదివినచో నాయూహ నిలువఁజాలదు. వాని నీక్రింద నిచ్చుచున్నాఁడను.

వ. అనియాక్రమంబునఁ బ్రధానదేవతాసంకీర్తనంబును మహాకవిజనప్రార్థనంబును సద్గురుచరణానుస్మరణకీర్తనంబును సమర్థించి కృతార్థతం బొంది కతిపయాక్షరపరిగ్రహజనితం బైన నైసర్గికచాపలంబుకతంబున.

ఉ. మించినవేడ్క నీనులకు మిక్కుటమై మధువృష్టి గ్రమ్మ రా
యంచలు కూయఁ గ్రౌంచమును నావలఁ గూయఁగడంగుభం
గి ప్రా
ఘాంచితశబ్దసారులు మహాకవు లాఢ్యులు కావ్యశయ్య గీ
లించినకీర్తిసంగసుఖలీలకు నేనును గాంక్షఁ జేసితిన్.

వ. అట్లు మహాప్రబంధకల్పనాకుతూహలాయత్తంబగు చిత్తంబుతో నొక్కనాఁడు తదనుసంధానానుబంధసమాధి నిమీలితేక్షణుండనై క్షణంబున్న సమయంబున.

పైగద్యపద్యములను, పరిశీలనాబుద్ధితోఁ జదివినయెడల, ఎఱ్ఱాప్రెగ్గడకుఁ గావ్యరచన కిది ప్రథమప్రయత్నమనియు, నదివఱ కారణ్యపర్వశేషమును బూరించియున్నను, నది యొకస్వతంత్రగ్రంథము గాక యన్యకవివిరచితమైన మహాగ్రంథములోఁ గొంతభాగము మాత్రమే యగుటచేతను, నందు వేఱుగా నవతారికను గాని గద్యను గాని రచింపక నన్నయమహాకవి రచించినట్లే చెప్పియుండుటచేతను, దాని నొకగ్రంథముగా నెఱ్ఱాప్రెగ్గడ యెంచుకొనక నృసింహపురాణమునే తనప్రథమ కావ్యముగా నెంచి నూతనరచన కారంభించిన కవులు సామాన్యముగాఁ జూపెడి వినమ్రతను సూచించు "కతిపయాక్షర ... ... నైసర్గికచాపలంబు ... ... గాయంచలుకూయఁ గ్రౌంచమును నావలఁ గూయఁ గడంగుభంగి" అనువాక్యముల నిందువ్రాసెననియు, రామాయణమును, హరివంశమును, ఆరణ్యపర్వశేషమును, అదివఱకేరచియించియున్నయెడల, నృసింహపురాణమునందిట్టి ప్రథమ ప్రయత్నసూచక వాక్యములను వ్రాసియుండఁ డనియుఁ దోఁపక మానదు.

నృసింహపురాణమును కట్టకడపటరచించినాఁ డనుటకుఁ బైనఁ జూపినమూఁడుకారణములకంటె ముందుగా రచించెననుటకుఁ జూపిన యీకారణములే బలవత్తరము లని నాయభిప్రాయము. మొదటఁ

జూపిన మూఁడుకారణముల కీక్రిందివిధమున సమాధానము చెప్ప వచ్చును

(౧) ఆరణ్యపర్వశేషమును ప్రథమమున రచించుట కాతనికి సంశయము కలుగకపోయియుండవచ్చును. నన్నయతిక్కనల భారత భాగములను జదివియున్నవాఁడు కావున వారు రచింపఁగా మిగిలియున్న భాగమును బూర్తిచేసినచోఁ దనకు గొప్పయశము గలుగునని తలంచి "కీర్తికాంతాపరుఁ" డైన యీమహాకవి, ఇతరు లెవ్వరును నాకార్యమును జేపట్టకమునుపు తానే యాపనిని నిర్వహించి తెలుఁగు వారికి గలిగియున్నలోపమును బూర్తిచేయవలయునన్న యాత్రము తోడను, నత్యుత్సాహముతోడను, మొట్టమొదట నా భాగమునే పూర్తిచేసియుండవచ్చును. భారతమునందును, దత్కర్తలయందును గవికిఁ గలగౌరవభావము లీక్రిందిపద్యములో వ్యక్తీకరింపఁ బడినవి.

ఉ. భాసురభారతార్థముల భంగులు నిక్క మెఱుంగ నేరమిన్
గాసట బీసటే చదివి గాథలు ద్రవ్వ తెనుంగువారికిన్
వ్యాసమునిప్రణీతపరమార్థము తెల్లముఁ జేసినట్టి య
బ్జాసనకల్పులం దలఁతు నాద్యుల నన్నయ తిక్కనార్యులన్.

(౨) భారతము నందిట్టి మహాభిప్రాయము గల కవి మొట్ట మొదట నీభాగమును బూరించెననుటలో వింత లేదు. మహాభారత మునకుగల కొఱతను బూర్తిజేసిన మహనీయుఁ డగుటచే నతనిని విద్వజ్జనము ప్రబంధపరమేశ్వరుడని పిలువఁజొచ్చిరని తలంపవచ్చును. లేదా కవి తానే ప్రబంధపరమేశ్వర బిరుదమును వేసికొనియుండ వచ్చును. కవియారణ్యపర్వశేషమును, నృసింహపురాణమును ప్రబం ధములుగా భావించియుండెనే కాని హరివంశమును బ్రబంధమని యననేలేదు.

(౩) నృసింహపురాణమును రచించునాటికి రాజాశ్రయ మీాత నికి లభింపకపోయి యుండవచ్చును. అందుచేతచే యాతఁడు నృసింహ

హాపురాణమును నృసింహస్వామి కంకితము చేసినాఁడు. నృసింహ పురాణ రచనమునాఁటికి పాఁకనాటియందు రెడ్డిప్రభువుల పరిపాలనము ప్రారంభము కాకపోయియుండవచ్చును. రాజాశ్రయము లభించినపిమ్మట రామాయణమును రచించియుండును. ఎట్లుచూచినను హరివంశముకంటె నృసింహపురాణమే ముందుగా రచియింపఁబడినట్లు కానవచ్చుచున్నది. విక్రమార్క-చరిత్రమును రచించిన జక్కయకవి ఎఱ్ఱాప్రగ్గడను నుతించుచు వ్రాసిన పద్యములో నరణ్యపర్వశేషము నృసింహపురాణము రామాయణమునని వరుసగాఁ బేర్కొని యుండుట ప్రబలసాక్ష్యము కాకపోయినను గొంతవఱకీ యూహను బలపరచుచున్నది.

—: ఇతని రామాయణప్రశంస :—

ఎఱ్ఱాప్రెగ్గడ రచించిన రామాయణ మిప్పుడెచ్చటను గాన్పించుటలేదు. కూచిమంచి తిమ్మకవి ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణములోనివని యీక్రిందిపద్యములు తన సర్వలక్షణసార సంగ్రహమున నుదాహరించియున్నాఁడు.

మ. చెఱకుందోఁటలఁ బెంచి శాలిమయ సుక్షేత్రస్థలుల్ నించి య
క్కఱ లేకుండఁగఁ బూగనాగలతికాకాంతారముల్ ప్రోచి యే
స్తెఱ నంతం గుముదోత్పలాళి వనవాటీకోటిఁ బాటించి పె
న్నెఱులుప్పుల్ వొలెచ్చెఁ బురంబునన్దెసలఁ బ్రస్ఫీతాంబుపూర్ణస్థితిన్. ౧

క. నూఱుదెఱంగుల నెఱసులు
మీఱఁగ సీవిభ్రమములు మెఱయుంచి మునిం
గాఱఁగఁ జేయుము మేనక
చూఱకొనదె యతని తెలివి సొమ్ములు మున్నున్. ౨

శా. తాఱంగ్రాఁగిననేల తంపలఱఁ బాతాళంబుదాఁకన్ జనం
దూఱం జల్మిరి మిన్ను దాఁకి తరఁగల్ తోరంబులై నల్గడల్
పాఱం బెల్లుగ నేఱు లుబ్బఱముగాఁ బైపైన నీరెక్కెడై
వాఱన్ జెరుఁలు సెన్ను మీఱె నఖలప్రాణుల్ ముదంబందఁగన్. 3

ఉ. కోటలు నాల్గుదిగ్గయినకూర్మకఫణీంద్రుఁ గతిన్ దరంగముల్
మాటికిఁ భూరిహారిఘకర్మంబున రాహుకరాళవక్త్రముఁగా
దూటినతీవ్రభానుకిరణము దుర్బలసైన్యతఁ బుత్రహీనతన్
గీటికరాభవాబిగతిఁ గీడ్పడి భూపతి నెమ్మనంబునన్. ౪

ఉ. నాకున్ నీకు నొక్కచందము మనోగతి సైరణచేసి నన్ను నా
సత్కులంబు నుత్తమయశంబున నుంచితి రమ్మలార! మీ
కుర్విని సాటి యౌ యబల లొండొరు దేవతలున్ బటుత్వమా
నిర్వహణంబొనర్చుటకు నేరరు మర్త్యులఁ జెప్పనేటికిన్. ౫

ఉ. సందడి యధ్వరక్రియ కసంగత మేని బలంబుతోడఁ బెన్
గ్రిందదియేల యేన తగఁ గాశ్మహస్తుఁడనై కడంగ మీ
ముందఱ నిల్చెదన్ గ్రతువుముట్టకయుండఁ బ్రచండదైత్యరా
జిందగ దప్వడాల వెసఁజించెదఁ బెంచెద మీకు మోదమున్. ౬

చ. అనఘ యకంపమై విమలమై పరిపూర్తియు లోఁతుఁ దియ్యనున్
ఘనతయుఁ గల్గి సజ్జనమనస్సదృశస్థితిఁ జాల నొప్పు మీ
జనయది యన్నదీజలము త్రావను మంచిది ... ... ... ౭

ఈపద్యములు బాలకాండములోనివి.

ఉ. అంగముతోడఁ గటు మిట యజ్ఞవిఘాతకచోరు నెందు వా
వంగలవాఁడ వింక నిటు శైశవ తాపసవేషధారివై

చ. అనుటయు మంత్రిమాటకుఁ బ్రియంపడి యాతని నాదరించియు
మ్మనుజకు లేందురెఁడు.

ఈపద్యములు మఱియేలక్షణగ్రంథమునందును నుదాహరింప బడినట్లు కన్పట్టదు. దీనినిబట్టి తిమ్మకవియొద్ద నీరామాయణ ముండి యుండినట్లు స్పష్టమగుచున్నది. రెండువందలసంవత్సరముల క్రిందట వఱకునున్న యీగ్రంథ మంతరించిపోవుట యాంధ్రులదురదృష్టము. తిమ్మకవినివాసగ్రామము లయినకందరాడ చంద్రంపాలెంగ్రామముల లో నున్నకూచిమంచివారియిండ్లయందలి తాటాకుగ్రంథములను వె

దకించి చూచితి మనియు, నం దిట్టిగ్రంథములు కనపడ లేదనియు బ్ర. శ్రీ. వీరేశలింగముపంతులుగారు వ్రాసియున్నారు.

ఒకసంకలిత గ్రంథమున ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణములోని వని ఈ క్రిందిపద్యములు వ్రాయబడియున్నట్లు శ్రీ. వేటూరి ప్రభాకరశాస్త్రిలుగారు భారతిలో (16 సం ౭-౨౯ పుట) ప్రకటించినారు. ఆపద్యముల నీక్రిందనిచ్చుచున్నాఁడను. ఒకటిరెండుదక్కఁ దక్కినపద్యము లన్నియు యుద్ధకాండమునందలివి. తుదిపద్యము నీలకంఠేశ్వర స్తుతి. ఈనీలకంఠేశ్వరుఁడు ఎఱ్ఱాప్రెగ్గడనివాస మగు గుడ్లూరు నందలి నీలకంఠేశ్వరుఁడే యైయుండును. శ్రీ ప్రభాకరశాస్త్రిలుగారు, ఈపద్యము లున్న వేమోయని భాస్కరరామాయణమును, భారతారణ్య పర్వాంతర్గతరామాయణమును, భాగవతాంతర్గతరామాయణమును, మొల్లరామాయణమును, రామాభ్యుదయమును, ఘనగిరిరామకవి సకలవర్ణనాపూర్ణరామాయణమును బరిశీలించి చూచినట్లును, నీపద్యములు వానియం దెచ్చటను గనఁబడలే దనియు వ్రాసియున్నారు. ఇప్పుడు భాస్కరరామాయణ ముద్రిత ప్రతిలోఁ గొన్నిపద్యములెఱ్ఱాప్రెగ్గడవి యున్నవని శ్రీ శాస్త్రిగారి యభిప్రాయము. రామాయణమునుగూర్చి పరిశోధన మెక్కువగా జరుగవలసి యున్నదని మంత్రి భాస్కరుని చారిత్రమున వ్రాసియుంటిని. ఈక్రింది పద్యములనుబట్టి యీకవి రామాయణమును సంగ్రహముగాఁగాక వాల్మీకిరామాయణానుసారముగానే రచించియున్నట్లు స్పష్టమగును.

చ. అనిలజ రావణానుజులు హస్తములన్ గయిదండ గొంచుఁ గ్ర
 క్కునఁ జనుదెంచి, భానుజుఁడు గొల్వ సుఖంబున నున్న రామచం
 ద్రునిఁ గనిపాదముల్ శిరముతో నొఱయన్ బ్రణమిల్లి లేచి ని
 ల్చినయెడ నెమ్మొగమ్ము వికసిల్లి విభీషణుడుం బ్రియంబునన్.

ఉ. తమ్ముఁడ! నేఁడు నాకుఁ బ్రమదంబు ఘటిల్లె దశాస్యనందనుం
 డిమ్మెయిఁ గూలుటన్ మనకు నింక జయం బగు నంచు సిగ్గులోఁ

గ్రమ్మఁగ నున్నలక్ష్మణుని గ్రక్కున నంకమునందు నుంచి వ
క్షమ్మునఁ జేర్చుచున్ శిరము సారెకు మూర్కొనుచుం గ్రమంబు
నన్

చ. కరముల నవ్విభుం డతనిగాయము లంటుచు నూర్పుపుచ్చుచున్
బురఁబురఁ బొక్కుచున్ శిరము మూర్కొని యెంతయు నూఱడింపుచున్
దురమున నెన్నఁ గూర్చితివి దుర్దముఁ డైనవిరోధిఁ బంక్తికం
ధరుఁడును నింకఁ గూలు నని నామది నిశ్చయబుద్ధి నొందెదన్.

చ. మసలక రామరావణులు మూర్కొని యుద్ధము సేయుచుండఁగా
నిశితశరంబు లొండొకటి నేర్పునఁ ద్రుంచుచు నుగ్రశక్తి మై
దశశిరుమస్తకప్రతతి దాఁకినఁ జిత్రము డుల్లునూపుమై
నుసిరిక్రమానిమీఁదఁ బిడుగూనినఁ గాయలు డుల్లు నాకృతిన్.

ఉ. అక్కట ధూళిఁబ్రుంగు డయి యంగము నెత్తుటఁదోఁగి వేదనన్
స్రుక్కుచు ధాత్రిపైఁ బొరలుచున్ బడి లక్ష్మణుఁ డిట్టులుండ నా
కెక్కడియుద్ధకాంక్ష యిఁక నెక్కడివిక్రమగౌరవక్రమం
బెక్కడిప్రాణ మెక్కడిమహీసుత యెక్కడిరాజ్యసంపదల్.

ఉ. కందకగాజువాఱక మొగంబు వికాసముఁ జెందెఁ జేతు లీ
యందము లైనకాళ్ళు నరుణాంబురుహంబుల లీలఁ జూడఁ జె
న్నొందెడు జీవహీను లిటు లుండరు ప్రాణముతోడ నున్నవాఁ
డిందు సహోదరుండు ధరణీశ్వర! నీకు విషాద మేటికిన్.

చ. మనమున నిశ్చయించి పవమానతనూజుఁడు మూఁడు మూఱులే
పునఁ గదలించి యంబుధరముం బలె నీలరుచిం జెలంగుత
ద్వనగిరిశృంగమున్ బిడిచి కైకొని పై కెగురంగ వైచి యూ
చి నిలువఁబట్టుచున్ వెస సుషేణునిఁ జేరఁగవచ్చి యచ్చటన్

ఉ. ఆతనిరౌద్రరేఖఁ గని యబ్ధి గలంగెఁ జలించె, శైలమా
త్పాతికవారిదంబు లతిదారుణరావము లై జనించె, ధా

త్రితల మెల్ల బిట్టదరె, దిక్కులు వ్రీలె. సమస్తభూతముల్
భీతి వహించె, డెంద మగలెన్, రజనీచరలోకభర్తకున్.

చ. అనయము సర్వభూతములయందును గోద్విజులందు శైలకా
ననగగనాఖిలాశల ఘనత్వము మించ సహస్రపాదలో
చనశతశీర్షమూర్తి వయి సారగతిన్ వసియించి సాద్రికా
వనియు సమస్తభూతములవారి వహింతువు నీవె రాఘవా!

మ. తరుణాదిత్యనిభద్యుతిన్ మెఱసి రక్తశ్రీచ్ఛటాశాదికా
ధరయుం దప్తసువర్ణభూషణయు నుద్యన్నీలధూమాభ్రబం
ధురధమ్మిల్లయు నౌ విదేహతనయన్ దోర్దాల్త బెన్మంటలోఁ
జొర నేతెంచినరూపుతోన జగముల్ సోద్యంబునన్ జూచినన్.

చ. అవనిజనంబు లెల్లను దశాననునంతిపురంబునందుఁ బె
క్కువుదివసంబు లున్నజనకాత్మజశోధతఁ జేయకే యనా
ర్యవిహితవృత్తిఁ దెచ్చె రఘురాముఁడు బాలిశుఁ డంచు నెంచరా
భువనములెల్ల నమ్ముటకుఁ బోయిటు సేసితి హవ్యవాహనా!

చ. ప్రకటతరాత్మతేజమున రక్షితయా మిథిలాధిరాజక
న్యకను బయోదివేలఁబలె నాశరుఁ డెంతు నతిక్రమింపఁ డె
న్నికకును నిప్పువంటిమహనీయచరిత్రము గల్గునట్టి జా
నకిని దరంబె వానికి మనంబున నేనియుఁ జుల్కఁ జూడఁగాన్

ఉ. వైరిజయంబు గాంచు బలవంతులమిత్రులఁగూడి తేజమున్
నారయశంబునుం గనిన నాదుసమాగమనంబు నీవు సాం
పారఁగఁ జెప్పుచో నతనియాననవర్ణవిలోకనేంగితా
కారవచోవిశేషములకై వడి నేర్పునఁ జూడు మేర్పడన్.

మ. అతులంబై వశవర్తియై రథతురంగానేకపాకీర్ణమై
పితృపైతామహమైనరాజ్యము మదిన్ భేదింపఁగాఁ జేయుసం
తత మెవ్వానికినైన రాజ్యఫలమాత్మన్ గోరినన్ గైక యీ
సుతుఁడే యేలుచు నుండుఁగాక విపులక్షోణీతలం బంతయున్.

చ. అతఁ డడరించుశస్త్రములయారవముల్ శరపుంఖజాతమా
రుతములు గ్రమ్మినన్ గులగిరుల్ గదలెన్ గలఁగెన్ బయోనిధుల్
క్షితిఁ వడఁకెన్ మనంబునఁ జలించిరి పన్నగలోకవాసులు
న్నతరుచిఁ బాసి మాసె దిననాథుఁడు మందటిలెన్ సమీరుఁడున్

చ. వడి నమరేంద్రముక్త మగు వజ్రములీల యుగాంతకాలుకై
వడిఁ బరతెంచి రావణునివక్షము గాఁడి ధరిత్రిఁ దూఱెఁ బ
ల్విడి దశకంఠుఁ ద్రుంచె రఘువీరుఁడు నేఁ డని మేలువార్త యే
ర్పడ ఫణిలోకవాసు లలరెన్ వివరింపఁగ నేఁగెనో యనన్.

శా. ఆపుణ్యవ్రతఁ బట్టినప్పుడె తదీయంబై యనిర్వార్యమౌ
కోపాగ్నిన్ మసిగాక నీవునికి రక్షోనాథ ! లోకంబునన్
బాపాత్ముం డగువాఁడు పాపఫలముల్ ప్రాప్తవ్యకాలంబునన్
బ్రాపించున్ నిజపాపకర్మఫల మిబ్భంగిన్ నినుం జెందుటన్.

చ. సవితృఁడు చంద్రుఁడున్ దిశలు సంధ్యలు రేలుఁబగళ్ళు గాలియున్
భువియును నాదిగా సకలమున్ గను సాక్షులు వీరెఱుంగ నేఁ
బ్రవిమలసద్గుణేతరధురాపరిభూషిత నైతి నేని హ
వ్యవహుఁడు నన్ను నిప్పుడె దయామాయతచిత్తతఁ బ్రోచుఁగావునన్.

శా. ఆరీతిన్ భువనత్రయిన్ గలుగువా రత్యంతశోకార్తులై
ధీరత్వంబు పరిత్యజించి యలధాత్రీనందనం జెందు దు
ర్వారాపన్నతి యెంచుచున్ బలుకఁ దద్వాక్యంబు లాలించుచున్
ధారాళాశ్రులతో మనం బెరియఁ జింతన్ రాముఁ డున్నత్తఱిన్

చ. ఖలునిఁ గబంధునిన్ నిశితకాండములన్ దునుమాడి వాని ప
ల్కులు విని ఋశ్యమూకమునకున్ జని భానుజుఁ గూడి వాలి ను
జ్జ్వలబలుఁ గూల్చి యర్కసుతు వానరరాజ్యమునందు నుంచి య
య్యలఘుఁడు పంపె భూమితనయన్ వెదుకన్ గపివీరకోటులన్.

చ. నిరుపమమూర్తి రామధరణీపతి శోభనవేళ నాడి ర
చ్చరపువుఁబోండ్లు కిన్నరులు సారెకుఁ బాడిరి దేవదుందుభుల్

మొరసెను ధాత్రి సస్యములు మోహనలీల వహించె వృక్షముల్
వరసురభిప్రసూనఫలవర్గములన్ విలసిల్లె నెంతయున్.

చ. అనికొనియోడుచున్ జలరుహాక్షులు సేసలు మీఁదఁ జల్లఁగా
ననఘచరిత్ర! రామ! సుగుణాకర! వర్ధిల్లుమంచుఁ బౌరు లె
ల్లను దనచుట్టుఁ గొల్వఁగ నలంకృతమైన రథంబుపై ముదం
బున భరతాగ్రజుండు రఘుపుంగవుఁ డీగతి వైభవంబులన్.

చ. జలనిధిగట్టి మించుకపిసైన్యముతో వనరాశి దాఁటి దో
ర్బలమున లంకపై విడిసి రావణముఖ్యనిశాటకోటులన్
గలన జయించి భూతనయఁ గ్రమ్మఱఁ గైకొని నిత్యకీర్తులన్
వెలసినవాఁడు రాముఁ డిటువింటిమె కంటిమె యిట్టిచిత్రముల్.

శా. భేరీకాహళశంఖతూర్యములు గంభీరంబులై మ్రోయఁగాఁ
దారామార్గమునందు దేవఋషిగంధర్వస్తుతుల్ మీఱ సే
వారూఢిం దగ వందిమాగధులు కైవారంబు గావించుచున్
సాకోదారవిచిత్రవైఖరుల నానందంబు గల్పింపఁగన్.

ఉ. రావణుఁ గూల్చి క్రమ్మఱ ధరాసుతఁ జేకొని వచ్చుచున్నవాఁ
డావసుధాకళత్రు డిదె యాప్తులతోడ మహేంద్రుతో శచీ
దేవియుఁబోలె సీత జగతీతలనాథునిఁగూడి సంతత
శ్రీ విలసిల్లు నున్నయది చేరినవాఁడు సుమిత్రపట్టియున్.

చ. అలికుల వేణులన్ జలరుహాక్షులఁ జంద్రనిభాస్యలన్ విని
ర్మలమణిహేమభూషణసమగ్రల భార్యలఁ గా వరింపు గ
న్యల గుణజాతియుక్తలఁ బదార్గుర గ్రామశతంబుఁ జూడఁ జె
న్నలరెడు లక్షగోవులఁ బ్రియం బెటింగించిన నీకు నిచ్చెదన్.

ఉ. కొంచక కోటపై నిలిచి కొందఱు భీమ బలాఢ్యులైన న
క్తంచరు లుగ్రతోమరగదాపటుశక్తుల వానవాలి నొ
ప్పించిరి వానరేంద్రులును బేర్చి రణంబునఁ గోటపైకి లం
ఘించి నిశాటులన్ ధరణికిం బడ నీడిచి నొంచి రుద్ధతిన్.

మ. నిను సేవించినఁ గల్గు మానవులకున్ వీటీవధూటీఘటీ
ఘనకోటీశకటీకటీతటిపటీగంధేభ వాటీపటీ
రనటీహారిపటీసువర్ణమకుటీ పచ్ఛోటికా పేటికల్
కనదామ్నాయమహాసురంగ! శివలింగా! నీలకంఠేశ్వరా!

ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణమునకై యెవ్వరైనఁ బ్రయత్నింతురనియు, నాతని రామాయణ శైలిని దెలిసికొనఁ బాఠకు లుత్సహించుచుందురనియుఁ దలంచి యందలి పద్యములను లభ్యమైనన్నిటిని గ్రంథ విస్తరభీతియున్నను నిం దుదాహరించితిని.

ఇతఁడు కవిసర్పగారుడము రచించెనా?

ఎఱ్ఱాప్రెగ్గడ "కవిసర్పగారుడ" మను నొకఛందోగ్రంథమును రచియించెనని చెప్పుచుఁ గస్తూరి రంగకవి కొన్ని పద్యములను దన యానందరంగరాట్ఛందమున నుదాహరించియున్నాఁడు. ఇదికూడ నన్నభట్టు లక్షణసారమువంటిదే. ఎఱ్ఱాప్రెగ్గడ లక్షణగ్రంథమును రచియించెనని యెవ్వరు నెఱుఁగరు. ఎవరును జెప్పలేదు. ఈరంగకవి కీ పద్యము లెట్లు లభించినవో తెలియదు. అయినను భావిపరిశోధకుల కనుకూలముగా నుండునని యెంచి యాతఁ డుదాహరించిన పద్యములలో నెనిమిదిపద్యముల నీక్రింద నిచ్చుచున్నాఁడను. కవిసర్పగారుడ తాళపత్రప్రతియొకటి తంజావూరునందును మఱియొకప్రతి మదరాసునందును గలవు. వీనియందుఁ గవిపేరు లేదు. ఆప్రతులయందున్న పద్యములును రంగకవి యుదాహరించిన పద్యములును భిన్నములు కావు. బసవనయను నతఁడు కవిసర్పగారుడమును రచించెనని తెలియుచున్నది. ఈ బసవన యెప్పటివాఁడో ఆతనికులగోత్రము లేవియో యింకను నాకుఁ దెలియలేదు. పట్టాభిరామకవి యనునతఁడు కవిసర్పగారుడమును రచించెనని చెప్పుచున్నారు. ఈ విషయమును వారల చారిత్రమునఁ జర్చింపెదను.

మ. ధరదైవంబు గ్రహంబు సౌమ్యుఁడు హరిద్వర్ణంబు దక్షాంతియా
సుర మూహింపఁ గణంబు జాతి దలపించున్ శౌద్రి (శూద్ర) యా
యోనిదా
హరిణం బుజ్జలతార జ్యేష్ఠ రస ముఖ్యదౌద్రి మారాశి తే
లుగ భద్రంబు ఫలంబు నామగుణ మింపొందున్ బుధస్తుత్యమై

మ. అనలుం డీశుఁడు రాశి మేషము గ్రహం బౌభౌముఁ డత్తారసం
ప్రణతిన్ గృత్తిక దైత్యమాగణము వైరాజ్యంబువంశంబు మే
క నిటిన్ యోనిఫలంబు భీరసము శృంగారంబు సత్కాంతి కో
కన దచ్ఛచ్ఛవి మించు నాగగణమే కాలంబు ధాత్రీస్థలిన్.

మ అనిలుం డీశుఁడు స్వాతితార రుచి శ్వేతాభావ మెన్నన్ గ్రహం
బినజుండౌ దులరాశి హైన్యము కులం బేపార క్షీణంబు దా
మునుఁబద్ధంబు భయంబుతద్రసము కారోప్తెమ్మెయిన్ యోనియెం
దును దైత్యుండుగణంబు నాసగణ మొందున్ గీర్తి విస్ఫూర్తిగన్

మ అనుమన్ ఘున్నధిదైవ మక్కులము బ్రాహ్మ్యం బాగణంబెన్నదై
వము జీవుండు గ్రహంబు నల్పురుచి యైశ్వర్యంబు లబ్ధంబు మే
షము దా యోని రసంబు శాంత మలనక్షత్రంబు పుష్యంబు రా
శి మహాన్ గర్కటకంబు,నాఁ దగణముత్సేకం బగున్ జెల్వమై.

గీ సగణమగణములు పొసంగిన విభవంబు
రసగణంబు లెనయఁ బ్రబలుఁ గీడు
రగణయగణయుతము రాజ్యప్రదం బగు
భయము లిరువురకును భయము లిడును.

మ. అరుణుం డేలిక చాయరక్తిను రసం బవీర మాయన్వయం
బురు వైరాజ్యము రాశిసింహముగ్రహం బుష్ణాంశుఁ డత్తారయు
త్తరరోగంబు ఫలంబు యోని యురవొందం ధేను వమ్మానవం
బరుదారంగ గణంబు నా జగణ మింపారుం జగత్సిద్ధమై.

మ. శ్రీ చంద్రుం డహి యోనిరాశి వృష మాంశంబు వైశ్యంబు దై
వత మెన్నం గణమా ఫలంబు సుఖమా వర్ణంబు శ్వేతంబు సం
యుతనక్షత్రము చెప్పఁగా మృగశిరంబున్ దద్గ్రహం బా నిశా
పతి హాస్యంబు రసంబు నాథగణ మేర్పాటయ్యె సర్వంసహన్.

గీ. చంద్రుఁడే గ్రహంబుగాగ నిల్చిన దాని
వర్ణమై శుభాశుభంబు లిచ్చు
భగణ మేగణంబుఁ దగిలించెఁ దత్ఫలం
బిచ్చుఁ దనకుఁ జంద్రుఁ డీశుఁ డగుట.

—: ఎఱ్ఱాప్రెగ్గడ వైష్ణవాభిమానియా ? :—

ఎఱ్ఱాప్రెగ్గడ రచించిన హరివంశముయొక్క తాళపత్రప్రతులు కొన్నిటిలోఁ గృత్యాదియందు.

"సీ. తెమకటాక్షము బల్లిదపుఁగుంచెకోలయో
వైకుంఠనగరీకవాటములకు.
తమపాదతీర్థ ముత్కటనీలమేఘమో
సకలచేతనచిత్తసస్యములకు,
తమసుప్రసాదంబు విమలాంజనమొ పరం
ధామస్వరూపనిధానములకు,
తమప్రభావము ఘోరతరపంచవదనమో
చండపాషండవేదండములకు

తే. అనఁగఁ గందాళవంశదేశికాగ్రగణ్య
శిష్య పెద్దింటితిరుమాల సింగరాత్మ
జాత తిరుమలతిరుమలాచార్యవర్య
సన్నుతి యొనర్తు మద్గురుస్వామి నెపుడు."

అనుపద్య మొకటి కన్పించినదనియు, శైలినిబట్టిచూడఁ బద్యము ప్రక్షిప్త మనుటకు వీలులేదనియు, నీపద్యమునందు దిరుమలాచార్యుఁడు శంభుదాసునకు వంశపరంపరాగతాచార్యుఁడేమో యని

తోఁచుచున్నదనియు శ్రీ శేషాద్రిరమణకవులు వ్రాయుచు శంభుదాసుఁడు వైష్ణవుఁడా యనిశంకించియున్నారు. (భారతి-ప్రమోదూత-శ్రావణము.)

ఈపద్యమునందలి గురుస్వామి, పెద్దింటితిరుమలసింగరాచార్యుని కుమారుఁడైనతిరుమలతిరుమలాచార్యుఁడైనట్లును నప్పుడు కందాళప్పగురునిశిష్యుఁడైనట్లును, తెలియుచున్నది. ఈకందాళప్పగురుఁడు తెనాలిరామకృష్ణకవికి గురువైనయప్పయాచార్యులే కాని యన్యుఁడు కాఁడనినాయభిప్రాయము అడసత్యమైనచో నాతనికాలము పదునాఱవశతాబ్దికావున, నీపద్యము ప్రక్షిప్తమనియు, నిదివిలేఖకునికృత్యమనియు నిర్ణయింపక తప్పదు. ఈపద్యము రెండుమూఁడు ప్రతులయందేయుండి తక్కినప్రతులలో లేకపోవుట పైయూహకు బలమొసంగుచున్నది. పైపద్యములోని తిరుమలసింగరాచార్యులు, వెన్నెలకంటి సూరనార్యకృతవిష్ణుపురాణకృతిపతియైనబసవయరాఘవునకు గురువైనట్లుకన్పట్టుచున్నాఁడు. ఆరాఘవభూపతి క్రీ. శ. ౧౪౩౦ ప్రాంతమువాఁడని సూరకవిచారిత్రమున నిర్ణయించియున్నాఁడను. ఆతని కుమారుఁడైనతిరుమలాచార్యులు క్రీ. శ. ౧౪౪౦ ప్రాంతమున కందాళ అప్పగురునకు శిష్యుఁడై రామకృష్ణునితో సమకాలికుఁడగుటలో విరుద్ధమేమియు నుండదు. ఏవిధమునఁ జూచినను పైనీసపద్యము ప్రక్షిప్తమనియే తోఁచుచున్నది. శంభుదాసు వీరశైవుఁడును గాఁడు; వీరవైష్ణవుఁడును గాఁడు. శివకేశవులయందు సమానభక్తిగలవాఁడని యాతనిబిరుదనామమును, నృసింహపురాణమునుజాటుచున్నవి.

నన్నయ్యభట్టారణ్యపర్వమును బూర్తిగ రచించెనా?

భారతారణ్యపర్వము మొత్తమేడాశ్వాసములలోను మొదటి మూఁడాశ్వాసములును చతుర్థాశ్వాసమున ౧౮౨ పద్యములును నన్నయరచించియుండెను. శేష మెఱ్ఱాప్రెగ్గడచేఁ బూరితమైనది. ఉభయుల కవిత్వమునకునడుమ, తాళపత్ర ప్రతులయందును ముద్రిత

ప్రతులయందును "ఇక్కడనుండి యెఱ్ఱాప్రెగ్గడ కవిత్వము" అని వ్రాయఁబడుచుండెను

నన్నయరచనములోనితుదిపద్యమిది: —

ఉ. శారదరాత్రు లుజ్జ్వలలసత్తరతారకహారపంక్తులం
జారుతరంబు లయ్యె వికసన్నవకైరవగంధబంధురో
దారసమీరసౌరభము దాల్చి సుధాంశువికీర్యమాణ క
ర్పూరపరాగపాండురుచిపూరములం బరపూరితంబులై

ఎఱ్ఱాప్రెగ్గడకవిత్వములోని మొదటిపద్యమిది:—

చ. స్ఫురదరుణాంశురాగరుచిఁ బొంపిరివోయి నిరస్తనీరదా
వరణములై దళత్కమలవైభవజృంభణ ముల్లసిల్ల ను
ద్ధురతరహంససారసమధువ్రతనిస్వనముల్ సెలంగఁగాఁ
గరము వెలింగె వాసరముఖంబులు శారదవేళఁ జూడఁగన్

ఆరణ్యపర్వమునందు మొత్తము ౨౯౦౦ గద్యపద్యములు కలవు. అందు ౧౩౦౦ నన్నయరచితములు ౧౬౦౦ ఎఱ్ఱయరచితములు దీనినిబట్టిచూడ నెఱ్ఱయ యరణ్యపర్వములో సగముకంటెఁగొంచెము ధికముగా రచియించినట్లు కన్పట్టుచున్నది. ఎఱ్ఱాప్రెగ్గడ తనరచన ప్రారంభమున దైవప్రార్థనాదికము లేమియుఁ జేయక, నన్నయరచన ము తరువాత నందుకొనిపద్యములను రచించినాఁడు. ఇంతేకాదు నన్నయవలెనే యాశ్వాసాద్యంతపద్యములను రాజరాజనరేంద్రుని సంబోధించుచునే రచియించి, గద్యమునందుఁగూడ నన్నయరచితము నియేచెప్పియున్నాఁడు. ఆరణ్యపర్వాంతమునందలి రెండుపద్యములు ను, లిఖితముద్రితప్రతులయందు "ఇక్కడనుండి యెఱ్ఱాప్రెగ్గడకవిత్వ ము" అనుమాటలును లేకపోయినచో భారతము కవిద్వయప్రణీత మనియే చెప్పవలసివచ్చును.

ఇంచుమించుగ నాలుగువందలసంవత్సరములనుండి, "స్ఫురదరు ణాంశు..." అనుపద్యము మొద లరణ్యపర్వాంతము వఱకును, ఎఱ్ఱా

ప్రెగ్గడ రచియించెనని లోకము తలంచుచున్నది. వాకొనుచున్నది. లిఖించుచున్నది ఇట్లుండఁగా నీనడుమ నిందులకువిరుద్ధముగ నొకవాదము బయలుదేరినది. నన్నయభట్టు అరణ్యపర్వమును పూర్తిగానే రచియించియుండె ననియు "స్ఫురదరుణాంశు" అనుపద్యము మొదలు తక్కినభాగములో నచ్చటచ్చట గొన్ని భాగములు శిథిలములై పోగా, ఎఱ్ఱాప్రెగ్గడ పూరించెననియు, నంతియకాని యాభాగమునంతను ఆతఁడు రచింపలేదనియును నావాదసారాంశము. నే నెఱిఁగియున్నంత వఱ కీవాదమును జేసినవారిలో ముఖ్యులు కీర్తిశేషు లగు శ్రీ నడకుదుటి వీరరాజుపంతులుగారు. విమర్శాదర్శకబిరుదాంచితులు. కావున వారివాదము నిస్సారమైనదని యొక్కమాటలోఁ జెప్పి త్రోసిపుచ్చ వీలులేదు. వాదమున వారుచూపిన హేతువుల నిట వ్రాసియందెంత వఱకు సత్యమున్నదో యోచించుట ఆవశ్యకము. (రచనాసౌలభ్యముకొఱకు, అరణ్యపర్వమును బూర్తిగా నన్నయరచించెననివాదించు వారిని నన్నయపక్షమువారనియు, నందులకు వ్యతిరేకముగాఁ జెప్పు వారిని, నెఱ్ఱయపక్షమువారనియు వ్రాయుచుందును.) ఈవాదము లిదివఱకు పత్రికలలో విమర్శింపఁబడినవే యైనను, ఎఱ్ఱాప్రెగ్గడ చారిత్రమునందు వానిని బూర్తిగ విడచిపెట్టుట లోపమగుననియు, భావికాలపాఠకుల కిది యుపయోగమనియు నందుచే నిందుఁ జర్వితచర్వణదోషముం డదనియుఁ దలంచుచున్నాఁడను.

వీరరాజుపంతులుగారివాదమునకు ముఖ్యాధారము తిక్కన సోమయాజియు, మారనకవియు నన్నయభట్టుమూఁడుపర్వములును రచించెనని చెప్పియుండుట.

"ఆదరణీయ... ...సం,దాదిఁ దొడంగి మూఁడుకృతు లంధ్రికవిత్వవిశారదుండు విద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయ... ..." తిక్కన విరాటపర్వము.

"భారతసంహితన్ మును ద్రిపర్వము లెవ్వఁ డొనర్చె నట్టి... నన్నయభట్టుఁ గొల్చెదన్" మారన మార్కండేయ పురాణము.

ఈయిరువురు నెట్టాపెగ్గడకుఁ బూర్వులు. వీరిరువురునుగూడ నన్నయభట్టు మూఁడుపర్వములను రచించియుండెనని ఘంటాపథముగాఁ జెప్పినప్పు డావిషయమునుగూర్చి సంశయింపఁబనిలే దని వీరాజుపంతులుగారి యభిప్రాయము. స్థూలదృష్టిచేఁ జూచినప్పుడు వారివాదమునందు నిస్సంశయముగా సత్యమున్నదనియే తోఁచును. కానియిం దాలోచింపవలసిన విషయమొకటియున్నది. నన్నయ యరణ్యపర్వములోఁ గొంతిభాగమే రచియించెనని వాదముకొర కంగీకరింపుఁడు. అప్పుడు తిక్కనయేమి చెప్పవలసియుండును? రెండుపర్వములు పూర్తిగను మూఁడవపర్వములోఁ గొంతయును జెప్పెనని యనవలసియుండును ఇంతవివరముగాఁ జెప్పుట చరిత్రకారుల కవసరముగాని నన్నయను నుతించెడి పద్యములలోఁ దిక్కన కంతయవసరముకాదు అందుచే నతఁడు స్థూలదృష్టితో మూఁడుపర్వము లని చెప్పి, మిగిలిన పదునైదుపర్వములను దాను రచించుచుంటినని చెప్పియున్నాఁడు. మూఁడుపర్వములని చెప్పుటలో మారనకవి యభిప్రాయముకూడ నంతియే కాని వేఱుకాదు. మారన మార్కండేయ పురాణమును క్రీ. శ. ౧౩౨౦ ప్రాంతమున రచియించియుండెను. అప్పటివఱకును, నారణ్యపర్వము పూర్తిగ నుండియున్నదని మారనమూఁడు పర్వములని చెప్పినదానినిబట్టి నిశ్చయింపఁ జూచినచో నది యెప్పుడు శిథిల మైనది? ఆరణ్యపర్వశేషము నెట్టాపెగ్గడ క్రీ. శ. ౧౩౮౦ కి పూర్వమే పూరించియుండెను. ఈస్వల్పకాలములో నీభాగములో నచ్చటచ్చట శిథిలమయ్యె నందురా? ఎవరియొద్దనైననున్న కొన్ని ప్రతులలో నట్లు శిథిలమైనదనిన నమ్మనచ్చును కాని దేశమందున్న ప్రతులన్నిటిలోను నొకేభాగములోనిట్టి యనర్థము సంభవించునా? శ్రీ వీరరాజుపంతులుగారా కాలమున, నాంధ్రప్రపంచములోఁ దాళపత్రప్రతులు విశేషముగా నుండెడివికావనియుఁ బండితులయొద్ద నక్కడక్కడ స్వల్పముగా నుండెడివనియు, నవి శిథిలములై పోఁగా, నెట్టాపెగ్గడ, పోయినభాగములను బూరించెననియుఁ దమవాదమును

సమర్థింపఁజూచిరి. కాని యది యంగీకార్యము కాదు. ఉన్నప్రతులు స్వల్పమైనను, నన్నిప్రతులలోను ఒకేభాగము లేక భాగములు శిథిలము లైనవనుట పదుగు రంగీకరింపఁదగినవిషయము కాఁజాలదు. నన్నయభారతమునకు వ్రాతప్రతులాకాలమం దైనను, నధికముగనే యుండునని నాయభిప్రాయము. తక్కిన గ్రంథములకుఁ బ్రతులు విశేషముగ లేకపోయిన పోవచ్చును. కాని భాగము నకు మాత్రము ప్రతులు విశేషముగనే యుండును. భారతమును నన్నయ ఎఱ్ఱాప్రెగ్గడనాఁటికి దాదాపు ౨౦౦ సంవత్సరములకు బూర్వము రచించెను. ఈ మధ్యకాలములో నెంద ఱెన్నిప్రతులను వ్రాసికొని యుండిరో! ఏఁబదిగ్రామముల కొకప్రతియున్నను నెన్నియో ప్రతులగును. ఇన్నింటిలోను, ఎఱ్ఱాప్రెగ్గడపూరించినభాగములే పోయినవని తలంచుట సమంజసమా? శిథిలమగుట యెట్లు సంభవించును? చెదపురుగులు కొట్టుటవలననో, పిల్లలు చింపుటమూలముననో ఇట్టివే మరి యేయితరకారణములవలననో కదా శిథిలమగుటతటస్థించును. అన్ని ప్రతులలోను చెదపురుగులు ఎఱ్ఱాప్రెగ్గడ పూరించిన భాగములనే తినివేయునా? ఇది యసంభవము. ఒక ప్రతిలోని శిథిలభాగమునే యెఱ్ఱయ పూరించియున్నచోఁ దక్కిన ప్రతులలోని పద్యము లట్లే నిలిచియుండి పాఠభేదములపూర్వకముగ నైన బయటికివచ్చియుండును గదా! అట్టిదేదియుఁ గన్పట్టుట లేదు. పదునాఱవ శతాబ్దివాఁడైన యప్పకవి కూడ, నప్పకవీయమునందు (ఎఱ్ఱాప్రెగ్గడ, ఆరణ్యపర్వశేషమును రచించియుండె నని యెఱిఁగియుండియు) నన్నయభట్టు మూఁడుపర్వములను రచించెనని యీక్రిందిపద్యములలోఁ జెప్పియున్నాఁడు.

ఉ. ఆదిని శబ్దశాసనమహాకవి చెప్పినభారతంబులో
వేది వచింపఁగాఁ బడియె నెవ్వియు దానినెకాని సూత్రసం
పాదన లేమిచేఁ దెనుఁగుపల్కు మఱొక్కటిఁగూర్చి చెప్పఁగా
రాదని దక్షవాటికవిరాక్షసుఁ డీనియమంబు చేసినన్.

క. ఆమూఁడు పర్వములలో
నామాన్యుఁడు నుడువు తెనుఁగు లరసికొని కృతుల్
దాము రచించిరి తిక్కన
ధీమణి మొదలైన తొంటి తెనుఁగుకవీంద్రుల్.

దీనినిబట్టి యప్పకవివద్ద నన్నయ రచించిన మూఁడుపర్వము లునున్నవనితలంపవలయు నందురా? అట్లైన్నటికిని కాదు. ఈకార ణములచే నీయుత్పన్నకథను విశ్వసింపఁజాలము. ఎఱ్ఱాప్రెగ్గడ, భార తారణ్యపర్వశేషమును రచియించుటనుగురించి యీక్రిందిపద్యమును రచించెను.

క. ధీరవిచారుఁడు తత్కవి
తారీతియుఁ గొంత దోఁపఁ దద్రచనయకా
నారణ్యపర్వశేషము
పూరించెఁ గవీంద్రకర్ణపుట పేయముగాన్.

ఈపద్యము ప్రక్షిప్త మనియెంచి శ్రీవీరరాజుపంతులుగారిం దలిరెండవపాదము దైవయోగమునఁ బడియెనని వ్రాసియున్నారు. అందుచే నీపద్యముపై విమర్శన మనగత్యమే. కాని యిదిప్రక్షిప్త ముకాదని నేనభిప్రాయపడుటవలన నిందలిభావమునుగూర్చికూడఁ గొంచెమిట వ్రాయవలసివచ్చినది.

నన్నయకవితారీతియుఁ గొంతదోఁప నాతఁడు రచించినట్లే ఎఱ్ఱాప్రెగ్గడ యరణ్యపర్వశేషమును బూరించెనని యీపద్యార్థము. దీనినిబట్టి, ఎఱ్ఱాప్రెగ్గడదని చెప్పెడుభాగమునందు నన్నయకవిత్వము కొంతయున్నదనియు, నందుచేతనే నన్నయరచితమనియే తాను దానినిబూరించితినని యాతఁడీపద్యమును జెప్పెననియు నన్నయపక్ష మువారియభిప్రాయము. ఈపద్యార్థ మదికాదనియు, నన్నయకవిత్వ మిందుఁగొంత యున్నదనిచెప్పక కవితారీతియని చెప్పుటచే నాతని కవితారీతి తనకవిత్వమునందు (పూర్తిగాఁ గాకపోయినను) కొంత

యున్నదనితోఁచఁగా, నన్నయయే యిదిరచియించిన ట్లరణ్యపర్వ శేషమును దాను రచించితినని యెఱ్ఱాప్రెగ్గడచెప్పెనని యెఱ్ఱయపక్షము వారియభిప్రాయము. ఈరెండవపక్షమువారిభావమే కవిభావమని నాతలంపు. "నన్నయభట్టమహాకవీంద్ర సరససారస్వతాంశప్రశస్తి తన్నుఁజెందుటయు" అనువాక్యములీయంశమును బలపరుచుచున్నవి.

భారతారణ్యపర్వశేషరచనమునుగూర్చి యెఱ్ఱాప్రెగ్గడ తన నృసింహాపురాణమునం దీక్రిందిపద్యమును జెప్పియుండెను.

ఉ. ఉన్నతసంస్కృతాదిచతురోక్తిపదంబులఁ గావ్యకర్తవై
యెన్నికమైఁ బ్రబంధపరమేశుఁ డనంగ నరణ్యపర్వశే
షోన్నయ మంధ్రభాష సుజనోత్సవ మొప్పఁగ నిర్వహించితో
నన్నయభట్ట తిక్కకవినాథుల కెక్కినభక్తి పెంపునన్.

ఈపద్యమందును బైపద్యమందునుగూడ నరణ్యపర్వశేషమని కవి ప్రయోగించియున్నాఁడు. ఇచ్చట శేషశబ్దమునకు మిగిలినదని యర్థము చెప్పి నన్నయరచింపగామిగిలినదని భావింపవలయునని శ్రీవీరేశలింగముపంతులుగారు వ్రాసియున్నారు. అట్లు భావింపరాదనియు, శేషశబ్దమునకు మిగిలినదనునర్థము సరియైనదేయైనను, పోఁగా మిగిలినదనియో, లభింపగా మిగిలినదనియో యర్థము చెప్పవలయుననియు శ్రీ వీరరాజుపంతులుగారియుద్దేశము. ఇప్పట్టున శ్రీవీరేశలింగముపంతులుగారి యభిప్రాయమే న్యాయమైనది. వీరరాజుగారియుద్దేశానుసారముగ నరణ్యపర్వమందలి శిథిలభాగపూరణమే యెఱ్ఱయ గావించియున్నయెడల, "నరణ్యపర్వభాగోన్నయ" మనియే యాతఁడు రచించియుండును. కాని శేషశబ్దము నుపయోగించియుండఁడు. అచ్చటచ్చటశిథిలములయినభాగములు దక్కతక్కిన యరణ్యపర్వమంతయు నెఱ్ఱాప్రెగ్గడకు లభించినదనికదా శ్రీవీరరాజు పంతులుగారివాదము. లభియింపగామిగిలిన యాముక్కలను చీడపురుగులుదినినయక్షరములను దెలుపుటకై శేషశబ్దమును బై రెండుపద్య

ములలోను నెఱ్ఱమహాకవి వాడెనందురా ? ఇది యసంభవము. శేషశబ్దార్థమునుగూర్చి విశేషచర్చయనవసరము. ఇచ్చట శేష మనఁగా నన్నయరచింపఁగామిగిలినదనియే యర్థముకాని, నన్నయరచించినయరణ్యపర్వములో శిథిలములయినభాగము లనియర్థము కానేరదు. ఉన్నయశబ్దమునకు ఉద్ధారణమనియర్థము చెప్పి నూతిలోని జలము నుద్ధరించినట్లు ఎఱ్ఱయ యరణ్యపర్వములోని శిథిలభాగముల నుద్ధరించెనని శ్రీవీరరాజుపంతులుగారు వ్రాసియున్నారు. శేషమును నిర్వహించి యడుగునఁబడియున్న యరణ్యపర్వము నుద్ధరించెననికూడ నీ "ఉన్నయ" శబ్దమున కర్థము చెప్పనచ్చును. ఈయున్నయశబ్దము ప్రాసస్థానమందున్నది. ఎంతటిమహాకవికైనను యతిప్రాసస్థానముల యందు వ్యర్థపదములు పడుచుండుట సహజము. అట్టిపదములకు సందర్భమునను సరించి యర్థముచెప్పి యాశబ్దప్రయోగమును సమర్థించుట పండితులధర్మము. అంతియేకాని, వివాదవిషయములలో నట్టి శబ్దార్థమునుబట్టి తీర్మాన మొసంగయత్నించుట న్యాయము కాదు. ఇచ్చట "ఉన్నయ" శబ్దము లేకపోయినను నర్థము చెడదు. కావున నీశబ్దార్థమునాధారముచేసి నన్నయపక్షమునఁ దీర్మానమీయరాదు ఎఱ్ఱాప్రెగ్గడవంటిమహాకవి యూరక నిట్టిశబ్ద ముపయోగించునాయని తలంపరాదు. హరివంశమునందు నన్నయభట్టును నుతించుపట్టునఁ గూడ నెఱ్ఱాప్రెగ్గడ "ఉన్నయ" శబ్దమునే యుపయోగించి యీ క్రిందిపద్యమును వ్రాసియుండెను.

ఉ. ఉన్నతగోత్రసంభవము నూర్జితసత్వము భద్రజాతిసం
పన్నము నుద్ధతాన్యపరిభావిమదోత్కటము న్న రేంద్రపూ
జోన్నయనోచితంబు నయియొప్పెడు నన్నయభట్టకుంజరం
బెన్న నిరంకుశోక్తిగతి నెందును గ్రాలుటఁ బ్రస్తుతించెదన్.

ఇట్టి వివాదములనుగూర్చి చర్చించునప్పుడు, విశాలదృష్టితో సంగతిసందర్భములనన్నిటిని బరికించి తీర్మానింపవలయునేగాని ఏది

యొుయొకశబ్దమునో, ఒకసందర్భమునో, ఆధారముచేసికొని విషయ మును బరిష్కరింపరాదు.

శ్రీనాథాదికవులు కొందఱు భారతకవులను వర్ణించుటలో నీ యెఱ్ఱాప్రెగ్గడను దలపెట్ట లేదనిచూపుచు శ్రీవీరరాజుపంతులుగారు, దానినిబట్టి నన్నయ, యారణ్యపర్వమును బూర్తిగరచించియుండె నని నిర్ధారణ మొనర్పఁ డని వ్రాసియున్నారు.

శ్రీనాథుఁడు భీమపురాణములో

క. నెట్టుకొని కొలుతు నన్నయ
భట్టోపాధ్యాయసార్వభౌముని గవితా
పట్టాభిషిక్తు భారత
ఘట్టోల్లంఘనపటిష్ఠగాఢప్రతిభున్.

అని నన్నయను,

ఉ. పంచమ వేద మైపరగుభారతసంహిత యాంధ్రభాషఁ గా
వించెఁ బదేనుపర్వములు విశ్వజగద్ధితబుద్ధి నెవ్వఁ డ
క్కాంచనగర్భతుల్యున కఖండితభక్తి నమస్కరింతు ని
ర్వంచితకీర్తివైభవవిరాజికిఁ దిక్కనసోమయాజికిన్.

అని తిక్కనసోమయాజిని మాత్రమే నుతించెననియు నన్నయ రచించిన యరణ్యపర్వములోని శిథిలభాగములను బూరించినవాఁ డగుటచే నెఱ్ఱనను దలపెట్టలేదనియుఁ బైకందపద్యములోని భారత ఘట్టమనఁగా భారతారణ్యపర్వము నుల్లంఘించుటయనఁగా భయం కరమైన భారతారణ్యపర్వమును దాఁటినప్రజ్ఞకలవాఁ డనినన్నయను నుతించుటచే మూఁడుపర్వములును నన్నయ పూర్తిగరచించినాఁ డని శ్రీనాథుని యభిప్రాయ మనియు శ్రీవీరరాజుపంతులుగారు వ్రాసి యి చ్చుటకూడ ఘట్టశబ్దము నాధారముచేసి సౌధమును నిర్మించినారు. శ్రీనాథుఁ డీపదమును నన్నయ మూఁడుపర్వములను సంపూర్ణముగా రచించెనని తెలుపుటకై, యుద్దేశపూర్వకముగఁ బ్రయోగించె నని

నేననుకొనను, పిల్లలమఱ్ఱి పినవీరన్నకూడ నీక్రిందిపద్యములో ఘట్టి మునే యుపయోగించినాఁడు.

క. ఇట్టుల మగుమతి భారత
ఘట్టమునకు నడవ యచ్చుఁగట్టినకవితా
పట్టాభిషిక్తు నన్నయ
భట్టోపాధ్యాయుఁ దలఁచి పరమ ప్రీతిన్.

ఇచ్చట ఘట్టశబ్దమునకు పంతులుగా రిచ్చినయర్థము లేదు. శ్రీనాథుఁడే నైషధమున:—

"ధీరమతి నన్నపార్యుని దిక్కయజ్వ
శంభుదాసునిఁ గరమర్థి సన్నుతించి".

అని భారతకవిత్రయమును స్మరించినాఁడు. ఈపద్యమును వ్రాయునప్పుడు, శ్రీనాథుని హృదయమున భారతమునురచించినకవి త్రయమును నున్నారనియే భావింపవలసియున్నది భీమేశ్వరపురాణ మున నారణ్యపర్వమందలి శిథిలభాగములను పూరించిన కారణముచే శంభుదాసుని శ్రీనాథుఁడు స్మరింపలేదని శ్రీవీరరాజు పంతులుగారి వాదము. శ్రీనాథుని మనసునం దాయుద్దేశమే యున్నదని మనమేల యనుకొనవలయును? ఒకపర్వమునఁ జివర కొంతభాగమును మాత్ర మే రచియించియుండుటచే శ్రీనాథుఁ డాతనిని బేర్కొనలేదని యేల తలంపరాదు? ఇప్పట్టున శిథిలభాగపూరణమునకును, శేషపూరణము నకును శ్రీనాథుని హృదయమున భేద మున్నదని తలంపఁజనదు. తమవాదసమర్థమునకై నన్నయ పక్షీయు లీభేదమును దమహృదయ మునఁ గల్పించుకొనిరి. శ్రీనాథుఁడు భీమపురాణమున నెఱ్ఱాప్రెగ్గ డను నుతింపకపోవుటను, దమవాదమున కనుకూలముగఁ జేసికొను టకై ఘట్టశబ్దమున కారణ్యార్థమును జెప్పి తికమకలు పడిరి. కాని యీవాదమునందు స్వారస్యము లేదు. కాశీఖండమున శ్రీనాథుఁడు భారతకవులను ముగ్గురిని వరుసగా నుతించియున్నాఁడు. వేములవాడ

భీమకవిని కాశీఖండమునఁదేగాని తక్కిన గ్రంథములలోఁ దలపెట్టలేదు. ఇఁక నీవిషయమున విశేషచర్చ యనావశ్యకము. శిథిలభాగపూరణ వాదమునందు బలము లేదనియు, నెఱ్ఱాప్రెగ్గడ "స్ఫురదరుణాంశు" అను పద్యము మొదలుగ నారణ్యపర్వశేషమును రచియించెననియు నాధునికవిశ్వాసము.

ఎఱ్ఱాప్రెగ్గడ రచించిన భాగమునందలి అక్కరాది వృత్తల క్షణవ్యత్యాసమునుబట్టియుఁ గవితారీతి ననుసరించియుఁ బ్రయోగ విశేషాదులను దీసికొనియు నీవివాదమును బరిష్కరింపఁబూనుట వృథా యాసము. ఆవిచారణకుఁ బూనితిమేని, యేది నన్నయ పక్షమున కనుకూలమో యది శిథిలభాగము కాదనియు, నేది యెఱ్ఱయపక్ష మున కుపకరించునో యదిశిథిలభాగమనియు సమాధానము వచ్చును. ఒకేపద్యమునందు రెండురీతులను జూపఁ గల్గినచో, శిథిలభాగపూర ణవాదమున కది కొంత యుపకరించును. కాని యది యసంభవము. నన్నయపక్షవాదు లట్టివి చూపలేదు. కావున నీవిషయము నింత టితో విడిచిపెట్టెదను.

ఎఱ్ఱాప్రెగ్గడ తాను రచించినభాగమునకు నన్నయపే రేలపెట్టె నని ప్రశ్నించి దాని నాధారముచేసికొని యారణ్యపర్వము నంతను నన్నయయే రచించెనని కొందఱనుచున్నారు. ఆగద్యయే ప్రధాన మనియు, నితరసాక్ష్యముతోఁ బనిలేదనియు నిర్ణయించితిమేని, యీ వివాదమునకు మూలచ్ఛేదమే యగును. ఇంతవిమర్శనముతోఁ బని యే యుండదు. ఎఱ్ఱాప్రెగ్గడ, నన్నయయందలి గౌరవముచేతనైన నను నట్లుచేసియుండును, లేదా తన కది ప్రథమ రచనమగుటచే నా రణ్యపర్వమును దనరచనమని ప్రకటించుట కిష్టములేకయైనను దన పేరున గద్యములను వ్రాసికొనిన నేమి కీడుమూడునో యనుభయ మున నైనను నట్లుచేసియుండును. కావున నన్నయపక్షీయుల కీయం శము బలమునీయదు.

—:ఎఱ్ఱాప్రెగ్గడ కవిత్వశైలి:—

(కవిత్రయములోనివాఁడై లాక్షణికులచేతను శ్రీనాథాదికవీంద్రులచేతను బాగ ప్తను గనిన ప్రబంధపరమేశ్వరుని కవితనుగూర్చి నేను వేఱుగ వ్రాయఁబనిలేదు. సమానసంస్కృతాంధ్ర పదసంయుతమై, మృదువై, మధురమై, ద్రాక్షాపాకమున, హృదయరంజకము గావించుచున్నయీతనికవిత యెవనిహృదయమున కానందము నీయకుండును?

ఆరణ్యపర్వభాగమున నీతఁడు నన్నయరచనమువలె సంస్కృతపదబహుళముగా నారంభించి క్రమక్రమముగా నరణ్యపర్వాంతము నకుఁ దిక్కనసోమయాజి కవిత్వముతోఁ గలియునట్లు శైలిని మార్చి రచించియున్నాఁడు. ఇరువురికవిత్వమును దాననుసరించినట్లుపైని వ్రాసినపద్యములో "సుజనోత్సవ మొప్పగ నిర్వహించితో—నన్నయ భట్టతిక్కకవినాథుల కెక్కినభక్తి పెంపునన్." అని కవియే చెప్పియున్నాఁడు.

కవిత్వశైలి తెలియుటకై యరణ్యపర్వమునుండి నాల్గుపద్యములును ఇతరగ్రంథములనుండి యాశ్వాసమున కొకపద్యమును నీ క్రిందనిచ్చుచున్నాఁడను. ఆంధ్రకవులలో నీతనిని నుతింపనివా రరుదుగ నుందురు.)

మ. వినుఁడీ సర్వజనంబులుం గడఁగి యీవిప్రున్ దురాలాపు దా
రనునిం దున్మెద నస్మదీయకమహాచాపోగ్రనిర్ముక్త బా
ణనిపాతచ్ఛిదురాంగరక్తజలశోణక్షోణిసంసుప్తుఁగా
గనుఁడీ యీదురితాత్మునంచు నతిశీఘ్రప్రాప్తకోదండుఁడై ర ఆ.

ఉ. దారుణశౌర్యధుర్యుఁ డతిదర్పితచిత్తుఁడు వహ్నిసూనుఁ డ
వ్వీరుఁడు నిన్నుఁ గైకొనక వీఁకమెయిం జనుదెంచు నిప్డు దు
ర్వారత నీపదంబు గొనువాంఛ నవశ్యముఁ గాన యింతలో
నీరసమెత్తి వాని వధియింపుము చెచ్చెర విక్రమోన్నతిన్. 2 ఆ

ఉ. ఇంతకు మున్న వాఁడు సనియెం గడుదవ్వుగఁ బోవకుండ న
త్యంతరయంబునం బటురథావలి యొప్పఁగ నేఁగు డుగ్రులై
సంతసకట్టుఁ డస్త్రములు శస్త్రములుం దొడుగుండు పర్మముల్
సంతతదివ్యబాణముల శాత్రవుఁ దున్మఁడు దెండు నెచ్చెలిన్. ౬౮

చ. అన విని మేటిధర్మ మగు నట్టిది యెయ్యది యెట్టి దెప్పుడుం
గనియఁగఁ బండి యుండు నెసకంబుగ నెయ్యది నిగ్రహించినన్
దనరుఁ బ్రమోదసిద్ధి నియతంబుగ నెవ్వరితోడిసంధి యెం
దుసు వికలంబు గాదు పరితోష మెలర్ప నుపన్యసింపవే. ౭౮

నృసింహపురాణము:—

చ. తపములఁ బోనిపాపములు దానగుణంబులఁ బోనిదోషముల్
జపముల నారిపోనికలుషంబులు దుష్పరఁ దూలిపోవు న
చ్చఁపుఁదలఁపొప్ప నొక్కపరి సర్వమునైన రమేశుపేరు తీ
యఁపుఁబలు కింపుమీఱ ననయందొడగూర్పఁగ నేర్పుగల్గినన్.

చ. మనసిజ మంత్రఘోషములు మన్మథునానతిమాట లిందిరా
తనయవిలాసహాసములు దర్పకునార్పుటెలుంగు లంగ జ
న్మునిచదువున్ మనోభవుని మోహనగీతు లనంగఁజూరు ఖే
లనములు నెల్లదిక్కులఁ జెలంగె మదోత్కటకోకిలధ్వనుల్. ౮౨

ఉ. చల్లనివాఁడుగావున నిశాకరుప్రాపున దీప్తిలీలమై
నెల్లజగంబులు న్మిగలి యిమ్ముల నుండితి వింత నెంతయున్
దెల్లము తీవ్రమూర్తి యొరు తేజము సైఁపడు భానుఁగూడి వ
ర్తిల్లఁగ వచ్చునే యనుగతిన్ దివి చుక్కలడంగె దోడుతోన్.

ఉ. పాపఁడ! యింతకాలమును బాయక యొజ్జలయొద్ద నుండినీ
వేపగిదిన్ బఠించి తది యేర్పడఁ బ్రిస్ఫురితార్థసారమై
తీపులు వీనులం గురియ దివ్యసుభాషితరత్న మొక్కటు
దీపితధీవిజృంభణవిధేయత యొప్ప నుపన్యసింపుమా. ౮౪

చ. భయములనెల్లఁ బాపుటకుఁ బాల్పడినాఁడు పయోరుహాక్షుఁ డ
క్షయుఁ డచలుం డనంతుఁ డనిశంబును నామదిలోన నుండఁగా
భయ మొక తెందునుం గలదె పంకరుహోదర పాదపంకజా
శ్రయులకుఁ దండ్రి! పుట్టువు జరామరణాదిభయంబులేమియున్. ఆర

చ. అతులతపస్సమాధినియతాత్ములకైనను గానరాని య
ద్భుతపరమాత్మమూర్తి యిదె తోఁచెఁ గృతార్థులమైతి మింక నీ
కతలనుమాని యివ్విభు నగణ్యకృపానిధి నాశ్రయింపు దు
ష్కృతములకెల్ల శుద్ధియగుఁ జేకుఱునీకు ననంతసౌఖ్యముల్. ఆ౫

హరివంశము పూర్వభాగము:—

ఉ. కౌరవపాండవప్రవరగౌరవలీలలు నీవు చెప్పఁ దీ
పారెడుభంగి వింటిమి గుణాకర! యింక జగత్త్రయంబునన్
ధీరులు శూరులున్ విభవదీప్తులు నా నుతికన్నయాయదు
ప్రారమణాన్వయోత్తములచందములున్ విన వేడు కయ్యెడున్.
ఆ౧

ఉ. నిండుమనంబుతోడ ధరణీపతి యాధరణీసురోత్తముల్
బండితపూజితుల్ మధురభాషల నెంతయుఁ దన్పి కోరికల్
నిండ నఖండవస్తుశతనిర్భరసంపద లిచ్చి తృప్తి యొం
డొండ యొనర్చి వీడ్కొలిపె నుత్సుకతం ద్వరమాణచిత్తుఁడై ఆ౨

చ. సురలకు లేనియాతనివిశుద్ధగుణంబుల కాత్మ నెంతయుం
గరఁగి వధూజనైకతిలకం బగుమూర్వశి తాన వచ్చి ని
ర్భరవిభవోత్సవస్ఫురణభక్తి వరించిన నాదరించి యా
నరవరుఁ డిష్టభోగకలనం జరితార్థగఁ జేసె నుగ్మలిన్. ఆ 3.

మ కుటిలాచారులు దైత్యు లెప్పుడును మీకుం గీడు గావింప న
త్కటరంధ్రంబులు వేచి యుండుదురు నిక్కం బెమ్మెయిన్ వారి న
మ్ముట కర్తవ్యము గాదు సాత్వికమతు లుగ్రాత్మకుల్ మీర లో
క్కటియు న్నెరరు మాయ నేమఱకుఁ డేకర్జంబులందున్ దగన్.

మ. తలయుం జీరయు వీడ సంభ్రమముతో దైవోపఘాతంబునం
గలకం గుల్లముఁ జాఱు తెంచి వెస నాకంసుండు తత్సూతికా
నిలయద్వారమునందు నిల్చి శిశువుం దే తెమ్ము తెమ్మంచు నా
కులుఁడై పల్కఁగఁ గృష్ణమాతయును సంక్షోభార్తయై యత్త
ఱేఁ. ఆ ౫.

ఉ. దిక్కరిహస్తదండసముదీర్ణభుజుండు ప్రగాఢముష్టి నొ
క్కొక్కనిమస్తకం బవియ నొక్కొకపోటు గొనంగఁ గన్నులన్
ముక్కున వాత నెత్తురు సముద్ధురమై చెదరంగ నోలి తో
నొక్కొకరుండ కూలి రుసు ఱొక్కట పోవఁగఁ గాలనేమిజుల్.

శా. ఈవానం బడిపీడఁ బొందు పసుల న్వీక్షించి రక్షార్థమై
వేవే యిద్ధరణీధ్రముం బెఱికితిన్ విస్తీర్ణ మీక్రిందు మీ
రే వా రెచ్చట నుండఁ గోరితిరి వారెల్లం బశుశ్రేణితో
భావంబుల్ భయ ముజ్జగించి చొరుఁడీ భవ్యాద్రిచాటందఱున్.

మ. యదుభోజాంధక కోటికెల్ల నొడయుం డాకంసుఁడా రాజ్యసం
పు దగం జేసినవాఁడవై మధురకున్ భూరిప్రమోదంబుతో
యదువీరోత్తమ! రమ్ము కార్ముకమహావ్యాజంబునం బేర్చుత
ద్విదితశ్రీవిభవం బపూర్వగరిమన్ వీక్షింపు మంపేర్పడన్. ఆ౮

ఉ. వాసవుఁ డల్గి నీభువికి వర్షము మాన్చిన నీవు నవ్వి బా
ణాసనముక్తదివ్యవిశిఖావలి నంబుదకోటివ్రచ్చి ధా
రాసవిలప్లవం బఖిలరంజకమై యొలయంగఁ జేయవే
నీసరి యెవ్వఁ డిష్టు విధి నిర్దయుఁడైన వశంబె యెద్దియున్. ఆ౯

ఉత్తరభాగము:—

ఉ. కారణమానుషత్వమునఁ గంసుఁడు లోనుగ దుష్టదైత్యులం
బేరడఁగించుపొంటె నిటు పృథ్వి జనించినవాని నాదిపం
కేరుహనాభుగా నెఱింగి కృష్ణ యజస్రము నిన్నుఁ జూడఁగాఁ
గోరుదు నేఁడు నాకు సమకూరె మనోరథసిద్ధి యంతయున్. ఆ౧

చ. తమతమజన్మదేశముల తద్దయు రమ్యము లెల్లవారికిని జా
తములకు నంట యిప్పుడు గదా నిజమయ్యె జగత్ప్రసిద్ధ వి
క్రముఁడవు నీవు నీపసులఁ గాచినచోటికి వచ్చి యిమ్మెయిన్
మముఁ గొనియాడ నింకఁ గడుమాన్యులమైతిమి దేవతాళికిన్.

ఉ. చారువిహారసౌధముల సాగరతీరవనాంతభూములన్
భూరిమనోజ్ఞరైవతకభూధరకందరమందిరంబులన్
హారిసరస్సమీపలతికావసథంబుల నమ్మృగాక్షినిం
పారఁగఁ దార్చి కేళిరతుఁ డయ్యె ముకుందుఁ డమందలోలతన్.

మ. సకలంబుం గలిగింపఁ బెంపఁ జెఱుపన్ శక్తంబు మూర్తిత్రయా
త్మక మక్షోభ్యము నీమహత్త్వము భవన్మాయానుభావంబు వా
రక యవ్వారిరుహాసనాదుల కనిర్వాచ్యంబు సర్వాత్మ నీ
ప్రకృతిం జూతు రనాదిమధ్యనిధనప్రాధాత్మఁగా బోధనుల్. ౮౪

శా. వేదాధ్యాయులు గానలేరు నియమావేశవ్రతుల్ గానలే
ర్వేదాంతజ్ఞులు గానలేరు బహుసంవిత్తర్కకార్కశ్యసం
వాదుల్ గానఁగలేరు భక్తి వెలిగా భక్తైకసంప్రాప్తు నే
మాదేవుం హరిఁ గానఁ బోయెదము భాగ్యాగంభ మెట్లో తుదిన్

తే. ఆదిదేవునిపేరు చిహ్నములు మోచి
నంతటనె యాతనికిఁ దుయ్యఁ డండ్రె నిన్ను
సింహచర్మంబు తొడిగినఁ జెనఁటికుక్క
గంధగజగంధమునకును గలదె నిలువ. ౯౪

క. నాలావుకోలఁది యెఱుఁగవు
బాలా! తలఁ కెదవు బాణపరివార మొకం
డేలా యేను జయింతును
ఫాలాక్షుఁడు ప్రమథవరులు బన్నిరయేనిన్. ౭౪

మ. మునువేచేతులుగల్గి క్రొవ్వఁడె మహామోహాంధుఁడై హైహయా
ర్జునుఁ డారాజు నుదీర్ణుఁడై భృగుతనూజుం డాజిలో నెవ్విధం

బునకుం దెచ్చె నెఱుంగ వెట్లు నని సీపొంగె నడంగింతు నెం
దును బోనీక బారిపుచ్చెదఁ గెలిచెదం దో డెవ్వ రేతెంచినన్

మ. క్షతులై పాతితులై విధూతులయి ర క్తస్యందిసందిగ్ధజీ
వితసమ్మూర్ఛితచేష్టులై విరథులై వీతాశ్వులై వారుణ
చ్యుతులై పాటితహేతులై విశిఖసంక్షుణ్ణాంగులై నిర్జరుల్
ధృతి దూలంగఁ దొలంగి రెల్లెడల దైతేయాహవాభీలతన్. ౯ ఆ

చ. మునికొని పోన కెంతయును ముట్టక నిల్పక భావమున్ రసం
బును వెలయం దగుల్పడక పొందుగ వాక్యవిభాగ మొప్పఁగా
నెనిమిది తానకంబులను నేర్పడి వర్ణము లుల్లసిల్ల నిం
పెనయుగ వాచకుండు కడు నింపగురీతిఁ బఠింపఁగాఁ దగున్. ౧౦ ఆ

కృతిపతివంశ చరిత్రము

హరివంశకృతిపతి యగు వేమారెడ్డి వంశచారిత్రము నిట కొంచెము చెప్పవలసియున్నది. వేమారెడ్డి కొండవీటిరెడ్డివంశీయుఁడు. కొండవీడును బరిపాలించుటచే వీరిని గొండవీటి రెడ్లని పిలుచు చున్నారు రెడ్లలో, పంటరెడ్లు, మోటవాడరెడ్లు, భూమంచిరెడ్లు మొదలగు తెగలున్నవి. అం దీకొండవీటిరెడ్లు పంటరెడ్ల తెగకుఁ జెందినవారు.

ఓరుగల్లు రాజధానిగా నాంధ్రదేశము నత్యంతప్రతాపముతోఁ బరిపాలించిన ప్రతాపరుద్రమహారాజును మహమ్మదీయులు ఢిల్లీకిఁ దీసికొనిపోయినపిమ్మట నాంధ్రరాజ్యము విచ్ఛిన్నమై పోయినది. ఆ ప్రభువుకడ నుండెడిసేనాధిపతు లాకాలమున స్వతంత్రులై యాదివఱకు తమయధీనమునం దున్నదుర్గముల నాధారముగఁ జేసికొని రాజ్యస్థాపన మొనర్చి బలవంతులై, బలహీనులుగా నున్న పరిసర దుర్గాధిపతులను జయించి, తమరాజ్యమును వి స్తరింపఁజేసికొనిరి. అట్టివారిలో హరివంశకృతిపతి యగు వేమారెడ్డి యొకఁడు ఇతఁడు పంటరెడ్డి కులమునకుఁ జెందినవాఁడు.

ఈ వేమారెడ్డి యొక్క వంశవృక్షమును బ్రహ్మశ్రీ వీరేశలింగము పంతులుగారు తమకవులచారిత్రములో ఎఱ్ఱాప్రెగ్గడ చారిత్రమునం దీరీతిగా నిచ్చియున్నారు.




ఎఱ్ఱాప్రెగ్గడచరిత్రమున కీవంశవృక్షమంతటితోను సంబంధము లేదు. మఱియు దీనియం దొకింత పొరపాటుకలదు. అందుచే నెఱ్ఱాప్రెగ్గడ హరివంశమున నుదాహరించిన పద్యములనుబట్టికృతిపతి యైన వేమారెడ్డియొక్కయు, నాతనిమాతామహునియొక్కయు వంశవృక్షముల నీక్రింద నిచ్చుచున్నాఁడను.

(౧) దేసటి వేమయరెడ్డి

కోమటి ప్రోలయ్య = భార్య అన్నమాంబ




(౨) వేమారెడ్డి మాతామహ వంశము.

దొడ్డయరెడ్డి




వేమారెడ్డికింకను గొంతసంతాన మున్నది. కాని యావిషయము హరివంశమునఁ జెప్పలేదు. అందుచే నాసంతానము నిందుఁ జూపలేదు.

పై రెండువంశవృక్షముల కాధారములైన హరివంశములోని పద్యముల నీక్రింద నిచ్చుచున్నాఁడను.

చ. కులజలరాశిచంద్రుఁ డగుకోమటిప్రోలనయు న్నితంబినీ
తిలకము పుణ్యురాలు పతిదేవత యన్నమయుం గృతార్థతా
కలితులు వీరు వేమవిభుఁ గానక గాంచినపుణ్య మెట్టిదో
కొలఁదుల నెన్నిజన్మములఁ గూర్చిరొ నాఁబొదలున్ జనస్తుతుల్

సీ. పంటకులస్వామి ప్రఖ్యాతుఁ డౌర వే
మయ పితామహుఁ డను మాన్యతయును
ధూతకలంకుండు దొడ్డయ సైన్యనా
యకుఁడు మాతామహుం డను వినుతియు
నాదిరాజన్యతుల్యాచారనిధి మాచ
విభుఁడు పూర్వజుఁ డను విశ్రుతియును
శ్రీయుతుల్ పోతయ చిట్టయ నాగయ
ప్రభులు మాతులు రను భవ్యతయును

తే. దనమహత్త్వంబు భూషింపఁ దాను వారి
పేరు వెలయింపఁ జాలు. గంభీరమహితు
నాత్మగుణముల నొదవించు నన్వయైక
పావనుఁడు వేమజనపతి గేవలుండె.

తే. తనకు సద్దంకి తగురాజధానిగాఁ బ
రాక్రమంబున బహుభూము లాక్రమించి
యనుజ తనుజ బాంధవ మిత్రజనుల కిచ్చె
నెదురె యెవ్వారు వేమమహేశ్వరునకు.

క. దైతేయారికి మాఁట
చేతులక్రియ నొప్పి రెండుఁ జేదోడై వి
ఖ్యాతులు తమ్ములు వేమ
క్ష్మాతలపతి కన్నవిభుఁడు మల్లప్రభుఁడున్.

వ. అయ్యెరువురయందును.

ఉ. అన్నచమూవరుండు సకలార్థసమన్వితుఁ డన్నదానసం
పన్నుఁ డభిన్నబాహుబలభాసి భవాంఘ్రిసరోజపూజనా
సన్నుతితత్పరాత్ముఁ డపసన్నవిరోధి ప్రసన్నభావుఁ డ
భ్యున్నతశాలి కేలిశశుభోదయుఁ డూర్జితుఁడయ్యె నెయ్యెడన్.

వ. తదనంతరప్రభవ్రుండు.

శా. బాహాదర్పమునం బ్రతీపధరణీపాలావలిం దోలి యు
త్సాహోదగ్రుఁడు మోటుపల్లి గొని సప్తద్వీపసద్వస్తుసం
దోహంబున్ దనకిచ్చు నెచ్చెలి సముద్రుం బ్రీతిఁగావించు మన్
మాహాత్మ్యంబు వహించె మల్లరథినీనాథుండు గాఢోద్ధతిన్.

క. రామునకు లక్ష్మణుఁడు సు
త్రామసుతుఁడు ధర్మజునకుఁ దగ సౌభ్రాత్రం
బేమెయి నెఱపుదు రామెయి
వేమప్రభుఁ గొల్చె మల్లవిభుఁడును భక్తిన్.

శా. వేమక్ష్మాధిపుకూర్మిపుత్త్రుఁడు దయావిభ్రాజి యవ్యాజతే
జోమార్తాండుఁడు కీర్తనీయసుగుణస్తోమంబులం దేమియున్
రామస్ఫూర్తికి లోచ్చుగాక సరియై రాజిల్లె రాజార్చితుం
డాముష్యాయణుఁ డెందుఁ బోతయచమూపాగ్రేసరుం డిమ్మహిన్.

వ. తదీయానుజుండు.

క. దానంబునఁ గర్ణుని సరి
మానంబునఁ బేర్మి ననుపమానుఁడు బుధస
న్మానచతురుండు ప్రోలయ
సూనుఁడు గోమటి సమస్తసులభుఁడు కరుణన్.

వ. వేమధాత్రీపతికి పరమమిత్త్రుండును సకలజగజ్జైత్రుండును నగు
మాతులప్రియపుత్త్రుఁడు.

మ. జయమే కయ్యమునందు నెంతటిరిపుక్ష్మానాథులం జెందనీఁ
డయసంపన్నత నన్నఁడున్ వెలితిగాఁ డాద్యక్రియాయత్తమై

నయ మాత్మీయయశముగాఁ జిరస్థితుల నానందించు నాథుఁడు చి
ట్టయ నూకప్రభుఁ డిద్ధసత్యగుణనిష్ఠం బట్టిపుణ్యుం డిలన్.

బ్రా॥ శ్రీ వీరేశలింగముపంతులుగారు పొరపాటు పడినయొకటి రెండువిషయములనుగూర్చి యిటవ్రాయుచున్నాఁడను

(౧) శ్రీవీరేశలింగము పంతులుగారు కోమటిప్రోలయతండ్రి "అల్లాడరెడ్డి"యని కవులచారిత్రమున వ్రాసియున్నారు. కాని యది సత్యము కాదు. ఆతనిపేరు "వేమయరెడ్డి"యని పైన నుదాహరించిన హరివంశపద్యములలోని సీసపద్యప్రథమపాదమువలనను, మల్లవరము శాసనమువలనను దెలియనగుచున్నది. (నె. శా సం. పుట ౧౦౨౨) శ్రీనాథమహాకవిచే భీమేశ్వరపురాణమును గృతినందిన వీరభద్రారెడ్డికి వేమారెడ్డి యనునగ్రజుఁడు కలఁడు. ఆవేమారెడ్డితండ్రి యల్లాడరెడ్డి. నామసామ్యముచే నావేమారెడ్డి యీతనిగా భావించి, శ్రీపంతులుగా రట్లువ్రాసియుందురు లేదా, వేమయరెడ్డిపూర్వులలో నల్లాడరెడ్డి యను నాతఁ డెవ్వరైననుండియుండవలయును.

(౨) హరివంశకృత్యాదియందలి పద్యములను గొన్నిటిని పైన నుదాహరించియుంటిని. అందలి

" దానంబునఁ గర్ణుని సరి
మానంబునఁ బేర్మి ననుపమానుఁడు బుధస
న్మానచతురుండు ప్రోలయ
సూనుఁడు గోమటిసమస్తసులభుఁడు కరుణన్.

అనుకందపద్యము ముద్రితప్రతిలోను గొన్నితాళపత్రప్రతులలోను నట్లేయున్నది. అందు "ప్రోలయ" యనుశబ్దము పొరపాటు. ప్రోలయకుఁ గోమటియను సూనుఁడు లేనేలేఁడు. ప్రోలయయను పదము సరికాదనియు, నచట మాచయ యనుపదముండవలయుననియు శ్రీవీరేశలింగముపంతులుగారు వ్రాసియున్నారు. కాని మాచయ

యనుపదముకూడ సరియైనది కాదనియు, నచ్చట వేమయ యనుపద ముండవలయుననియు నాయభిప్రాయము. కవి యీకథాసందర్భమున వేమారెడ్డివంశమును నాతనిమాతృసంబంధులను మాత్రమే వర్ణించు చున్నాఁడుగాని వేమారెడ్డి కగ్రజుఁడయిన మాచనవంశమును జెప్పుట లేదు. ఇంతియగాక, యీకందపద్యమునకుపైన, "ఆతనియనుజుండు" అని చెప్పియుండుటచే వేమారెడ్డికి ప్రథమపుత్త్రుఁడైనపోతయచమూపతికిఁ దమ్ముఁడును వేమారెడ్డికి రెండవపుత్త్రుఁడు నైనవానిని బై కందపద్యములో వర్ణింపనెంచె ననుట నిశ్చయము. కానిచో "అతనియనుజుండు" అనువాక్యము నిరర్థకమగును. కావున పై పద్యములో "ప్రోలయ" యనుటకు బదులుగా వేమారెడ్డిని సూచించు వేమయ యనుమాట యుండఁదగినది.

శ్రీపంతులుగారు శ్రీనాథకవి చారిత్రమున వేమారెడ్డికి "కోమటిరెడ్డి" యనుపుత్రుఁడున్నాఁడని యంగీకరించుచు, "ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశము రచించునాటికి కనవేమారెడ్డి మిక్కిలి పసివాఁడు. కోమటిరెడ్డి మృతుఁడయ్యెను. హరివంశమునందే యీతని పెదతండ్రికుమారుఁడయిన కోమటిరెడ్డి యిట్లువర్ణింపఁబడెను" అనివ్రాసి "దానంబున గర్ణుని" అనుపద్యము నుదాహరించుచునందలి "ప్రోలయ" అనుపదమును "మాచయ" అనిమార్చివేసిరి. (పుట ౧౨౩.) కాని యవియన్నియు 'ప్రోలయ' ను 'వేమయ' గా గ్రహింపక 'మాచయ'గా గ్రహించుటవలనను, హరివంశములోని "అతనియనుజుండు" అను మాటను స్థూలదృష్టితో వదలివేయుటవలనను గలిగిన ప్రమాదజనితములు. హరివంశరచనమునాఁటికి, వేమారెడ్డి రెండవకుమారుఁడైన కోమటిరెడ్డిజీవించియే యున్నాఁడు. అతఁడే పై కందపద్యమున వర్ణింపఁబడినవాఁడు. ఆవర్ణనమునుబట్టి అప్పటి కాతని కిరువదియేండ్లు వయసుండునని యూహింపవచ్చును. వేమారెడ్డి మూఁడవకుమారుఁడైన యనవేమారెడ్డి కప్పటికి ౧౦-౧౫ సంవత్సరములవయ సుం

డును. పసివాఁడగుటచే నాతనిని, ఎఱ్ఱాప్రెగ్గడ వర్ణింపలేదు. వేమా
రెడ్డి కుమార్తెలను స్త్రీలగుటచేతఁ గాఁబోలు కవి వర్ణింపలేదు.

వేమారెడ్డికుమారుఁడైనయీకోమటిరెడ్డివంశము వృద్ధిచెం
దెనా యనువిషయము సంశయాస్పదముగా నున్నది. రెండుశాసన
ములనుబట్టి (నె. శా. సం. పుటలు ౨౮, ౫౧౫) యీకోమటిరెడ్డికి
శ్రీగిరిరెడ్డి యనుకుమారుఁడును, ఈశ్రీగిరిరెడ్డికి మల్లయరెడ్డి యను
పుత్త్రుఁడు నున్నట్లుగనఁబట్టుచున్నది

"వేమాయరెడ్డింగారినప్త్రులున్ను పినకోమటిరెడ్డింగారిపౌత్త్రులు
న్ను శ్రీగిరిరెడ్డిగారిపుత్త్రులున్ను అయిన మల్లాయరెడ్డింగారు వ్రా
యించియిచ్చినధర్మశాసనం ..." ౨౮౭ పుట

"స్వస్తి శ్రీమన్నిస్సీమభూదాననిరతుండై శ్రీపర్వతాన సోపా
నాలు నిర్మించిన వేమాయరెడ్డింగారిమనుమండైన శ్రీగిరిరెడ్డింగారి
కిన్ని గంగాంబకున్ను సుపుత్త్రుండైన మల్లాయరెడ్డింగారు"
౫౧౫ పుట.

ఈశాసనములు శా.శ ౧౩౨౭-౧౩౩౦ సంవత్సరములనాఁ
టివి. వీనినిబట్టి యీకోమటిరెడ్డివంశము వృద్ధిచెందినదనుటయే స్పష్ట
మగుచున్నది కాని వేమారెడ్డికి మల్లారెడ్డియనుకనిష్ఠసోదరుఁడుకలఁ
డని పై వంశవృక్షమువలనఁ దెలియుచున్నదికదా! ఆమల్లారెడ్డికిఁగూడ
కోమటిరెడ్డియను కుమారుఁడున్నాఁడు. అతనికుమారుఁడు శ్రీగిరిరెడ్డి.
ఈశ్రీగిరిరెడ్డిభార్య గంగాంబ వీరితనయుఁడు మల్లారెడ్డి ఈమల్లారెడ్డి
యే పై శాసనములలోఁ జెప్పఁబడిన మల్లారెడ్డియనితోఁచుచున్నది.
మొదటి మల్లారెడ్డికిమునిమనుమఁడైన రెండవమల్లారెడ్డి శాసనములు
నె.శాసం. ౫౦౮-౫౦౫ పుటలలో నున్నవి. వీనిలోనిశాసనకర్త వేమా
రెడ్డికిఁ దమ్ముఁడైన మల్లారెడ్డికి మునిమనుమఁడని స్పష్టముగానున్నది.
ఆశాసనములును పైనవ్రాసిన ౫౧౫వ పుటలోని శాసనమును నొక్క-
నాఁడుపుట్టినవి. ఈకారణమువలనను, తల్లిదండ్రులపేర్లును తాతపేరును
నొక్క-టియై యుండుటచేతను, ఈశాసనములన్నిటిలోని మల్లారెడ్డియు

నొక్కఁడేయనియుఁ బైనఁజెప్పిన రెండుశాసనములలోను మలారెడ్డి మునిమనుమఁ డనుటకుబదులుగా నాతనికగ్రజుఁడైన వేమారెడ్డిసుప్రసిద్ధుఁ డగుటచే నాతని పేరుదాహరించినారనియుఁ దోఁచుచున్నది. దీనినిబట్టి వేమారెడ్డి కుమారుఁడైన కోమటిరెడ్డివంశ మభివృద్ధిచెందినదియు లేనిదియు మనకుఁదెలియలేదు. కాని యెఱ్ఱాప్రెగ్గడ స్వాయముగ నెఱిఁగియుండి వ్రాసినవాఁడగుటచే వేమారెడ్డికిఁ గోమటిరెడ్డి యనుకుమారుఁడున్నమాట సత్యమని యంగీకరింపకతప్పదు.

హరివంశకృతిపతి వేమారెడ్డికాఁ డనియు, నాతనిమూఁడవ కుమారుఁ డైన యనవేమారెడ్డియనియుఁ గొందఱుభ్రమ పడుచు అది సత్యముగా దనుటకుఁ బైనవ్రాసినవిషయములే చాలియున్నవి. ఈక్రిందవ్రాసిన యాశ్వాసాంతపద్యములనుబట్టి హరివంశ కృతిపతి కోమటిప్రోలయ వేముఁడుకాని వేమారెడ్డికుమారుఁ డైనయనవేమారెడ్డి కాఁ డనుటనిశ్చయము.

క. శ్రీసంభావితవక్షో
భాసుర మణిహారకిరణపరిచయచతురో
ల్లాస మృదుహాసయవిరత
భూసుర గృహరచితహేమ! ప్రోలయవేమా! ౪ అ. పూ. భా.

క. శ్రీమత్కుసుమశరోపమ
సామగ్రీజనితహృదయసంజ్వరవిలుఠ
ద్భామాసఖీసమర్చిత
కోమలచరణాభిరామ! కోమటివేమా! ౬ అ. పూ. భా.

క. శ్రీసాధకసుచరిత్రా
నైసర్గికసుజనతాభినందితగోత్రా
వాసవసమగుణజైత్రా!
దేసటి వేమా! సమస్తధీరలలామా! ౭ ఆ. పూ. భా.

వేమారెడ్డితండ్రియైన ప్రోలయరెడ్డికూడఁ గాకతీయ ప్రభువుల యొద్ద దండనాయకుఁడుగా నున్నట్లు కొందఱు అనుచున్నారు. కాని యందులకుఁ దగిననిదర్శనములు నాకు లభింపలేదు. రెడ్డిప్రభువులలో నీవేమారెడ్డియే మొదటివాఁడు. ఇతఁడు ప్రతాపరుద్రుని కడ దండనాయకుఁడుగనుండెడివాఁడు. క్రీ. శ ౧౩౨౩ సంవత్సరప్రాంతమునఁ గాకతీయరాజ్యము మహమ్మదీయులవలన విధ్వంసముకాఁగా నీవేమారెడ్డి స్వతంత్రుఁడై అద్దంకిరాజధానిగా పాకనాటియందు రెడ్డిరాజ్యమును స్థాపించి, క్రమక్రమముగా పరిసర ప్రాంతములను జయించి యందుఁగొంతభాగమును దనబంధువుల కిచ్చివేసి తాను ప్రభువగుటయేగాక, తనవారిని గూడ రెడ్డిప్రభువులనుగా చేసిన ట్లీక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

క. తనకునద్దంకి తగురాజధానిగాఁ బ
 రాక్రమంబున బహుభూము లాక్రమించి
 యనుజ, తనుజ, బాంధవ, మిత్రజనుల కిచ్చె
 నెదురె యెవ్వారు వేమమహీశ్వరునకు.

ఈ వేమభూపతిని ఎఱ్ఱాప్రెగ్గడ యనేకపద్యములలో వర్ణించియున్నాఁడు. అందొక్కపద్యము నీక్రిందనుదాహరించుచున్నాఁడను.

సీ. అగ్రహారములు విద్యాతపోవృద్ధవి
  ప్రుల కిచ్చి యజ్ఞకర్తలుగ నునిచెఁ
 గోమటారఁ జెఱువులు గుళ్ళు ప్రతిష్ఠించి
  లోకసంభావ్యంబులుగ నొనర్చె
 నిధులు నల్గిండ్లును నిలిపెఁ దోఁటలు సత్ర
  ములు చలిపందిళ్ళు వెలయఁ బెట్టె
 హేమాద్రిపరికీర్తితామిత వ్రతదాన
  నివహంబు లన్నియు నిర్వహించెఁ
తే. జేసెఁ జేయుచునున్నాఁడు సేయనున్న
 వాఁడు పునరుక్తకృతి శుభావళుల నెల్ల

ననఁగ శ్రీవేమవిభున కయ్యలరు పేర్మి
వశమె వర్ణింపఁ దద్భాగ్యవైభవంబు.

ఈ వేమారెడ్డి శ్రీశైలమునఁ బాతాళగంగకు సోపానపంక్తిని నిర్మించెనని, యీతనివంశీయులు వ్రాయించిన యనేకశిలాతామ్రశాసనములలో వర్ణింపఁబడియున్నది. ఆవిషయ మెందువలననో హరివంశమునఁ జెప్పఁబడలేదు. బహుశః హరివంశరచనానంతర మాఘనకార్యము నాతఁడు చేయించి యుండవచ్చును.

ఈ వేమారెడ్డి క్రీ.శ. ౧౩౨౮ సంవత్సరము మొదలు ౧౩౪౯వ సంవత్సరమువఱకును రాజ్యపాలన మొనర్చెనని చరిత్రకారులు వ్రాసియున్నారు ఇతఁడు జీవించియుండగనే యితని పెద్దకుమారుఁ డయిన పోతయ్య చమూపతి (ఇతనినే అనపోతారెడ్డి యందురు) సేనానాయకుఁడుగను, యువరాజుగను నుండెనని హరివంశమునందలి యీక్రింది పద్యములోఁ జెప్పఁబడియున్నది.

క. వితతయువరాజ విభవో
న్నత పోతయ సైన్యనాథనయమార్గసమీ
హితసంతత సేవావిల
సితపుత్ర! శ్రీసమృద్ధ! శివగుణసిద్ధా!

వేమారెడ్డి రాజ్యముచేయుచున్నప్పు డాతని పిన్నతమ్ముఁ డైన మల్లారెడ్డి సర్వవిధముల నాతనికిఁ దోడై రాజకార్యములను నిర్వహించుచున్నట్లు, హరివంశములోని యీక్రిందిపద్యములవలనఁ దెలియుచున్నది.

క. సకలద్వీపాంతరర
త్నకలాపనిరంతరార్చనాకల నారం
భక కుకుమాలూరి పురనా
యక! మల్లచమూవరేణ్య! హరినిషేవ్యా.!

క. సర్వధురీణ గుణోదయ
సర్వజ్ఞోదాత్తవృత్తసంసిద్ధ యశో
గర్వితే మల్లచమూవర
నిర్వంచకసోదరత్వ నిత్యారాధ్యా!

క. శ్రీమల్లచమూవల్లభ
సామాధిక చతురుపాయ సామర్థ్యసను
ప్నామంతోజ్జ్వల వైభవ
సామగ్రీలబ్ధ! సఫలసౌభాగ్యశ్రీసుఖా!

క. బహుజలధిద్వీపాంతర
మహీశ్వర ప్రహితకనకమణి మాక్తికహ
స్తిహయాద్యర్పణసేవా
బహుమత మల్లరథినీశభ క్తిప్రీతా!

క. ధీయు క్త మల్లరథినీ
నాయక! మంత్రప్రయు క్తనయపూర్వకకా
ర్యాయత్త! ఖడ్గవిభవ
స్ఫాయద్విభవాభిపోష! భాసురవేషా!

క. రత్నాకరనాయక! గుణ
రత్నోజ్జ్వల! రెడ్డిమల్లరాజితశశ్వ
ద్యత్నార్థద్వీపాంతర
రత్నాలంకృత సమస్తరాజ్యరమాంగా!

క. శ్రీమల్లచమూపతి సే
వామధురిమ నిత్యసుముఖవామావిహా
వ్యామూఢ విముఖయర్చిత
వామార్ధాంగ పరతత్త్వ వాసవసత్త్వా.

ఈమల్లారెడ్డి ముఖ్యముగా సముద్రతీరస్థపట్టణములమీఁద నధి కారియై ద్వీపాంతర వర్తకము నభివృద్ధి నొందించుచుఁ దన్మూలమున

రత్నహారాదులను సంపాదించి యన్నయైన వేమారెడ్డి కిచ్చుచుండెడివాఁ డని పైపద్యములవలనఁ గనుపట్టుచున్నది.

ఈమల్లారెడ్డియొక్క వంశము చాల నభివృద్ధి చెందినది. వేమారెడ్డి పాకనాఁడు, కొండవీడు మొదలుగాఁగల రెడ్డిరాజ్యమునకు గొప్ప ప్రభువుగా నున్నను, నాతనిజీవితకాలములోనే, అతనియన్నదమ్ములందఱును, చిన్నచిన్నసంస్థానములకుఁ బ్రభువులై యాతని ప్రభుత్వమునకు లోఁబడి తమతమ సంస్థానములను బరిపాలించుకొనుచు, నాతనికి సర్వవిధములఁ దోడుపడుచున్నట్లు పైపద్యములవలనఁ దెలియుచున్నది.

బ్ర. శ్రీ. వీరేశలింగము పంతులుగారిచ్చిన వంశవృక్షములో వేమారెడ్డికి దొడ్డారెడ్డి యనునొకసోదరుఁ డున్నట్లు కన్పట్టుచున్నది. హరివంశమున నాతని పేరు కన్పట్టుటలేదు. కాని పైనఁజెప్పిన శాసనములో (మల్లవరముశాసనము) కోమటి ప్రోలయ కైదుగురుకుమారులనిచెప్పుచు నందు దొడ్డారెడ్డిపే రుదాహరించియున్నారు. కావున దొడ్డారెడ్డి యున్నమాటనిజము హరివంశరచనమునాఁటి కాతఁడు చనిపోయియుండును. అందుచేఁ గవి యాతనిపేరును జెప్పలేదని తలంపవలసియున్నది. ఆశాసనము శా. శ. ౧౨౮౭ లో వేమారెడ్డి వ్రాయించినది. దీనినిబట్టి హరివంశమును గవి క్రీ. శ. ౧౩౬౫ వ సంవత్సరమునకుఁ దరువాత రచించెనని స్పష్టమగుచున్నది. హరివంశరచనాకాలనిర్ణయమున కింకనొకశాసనాధార మున్నది. అది శా. శ. ౧౨౯౭ (క్రీ. శ ౧౩౭౫)వ సంవత్సరములో, వేమారెడ్డితనసోదరుఁడైన మల్లారెడ్డికి పుణ్యముకొఱ కమరావతియందలి యమరేశ్వరాలయమున కైదుస్వర్ణశిఖరము లెత్తించి వ్రాయించినదై యున్నది. అప్పటికి మల్లారెడ్డి చనిపోయెను (A.R. 268 ఆఫ్ 1897) హరివంశమునందలిపద్యములనుబట్టి హరివంశరచనాకాలమునకు మల్లారెడ్డి జీవించియుండుట తథ్యము. కావున హరివంశము క్రీ. శ. ౧౩౭౫ కుపూర్వమును ౧౩౬౫ కుఁ దరువాతను రచియింపఁబడియెననుట స్పష్టము.

పైనుదాహరించినమల్లవరము శాసనము (నె శా సం. పుట ౧౦౨౨) ను బట్టి మనకు మఱియొకవిషయము తెలియుచున్నది. ఈశాసనము గుండ్లకమ్మనదీతీరముననున్న చెదలువాడ గ్రామమందలి శ్రీరామచంద్రునకు: జంద్రగ్రహణసమయమున వేమారెడ్డి నదీమధ్యమందలి యిసుకతిన్నెపైఁ గూర్చుండి యొక గ్రామమును దానమొసంగ వ్రాయించినది. శకకాలము ౧౨౪౭ నెల్లూరుశాసనసంపుటములలో నీశాసనము నింగ్లీషుభాషలోనికి తర్జుమా చేసినవారు శకకాలము ౧౨౭౭ అని వ్రాసియున్నారు. శాసనమునందలి "శాకాబ్దేశైలవార్ధిద్యుమణి" యనువాక్యము లోనివార్ధిశబ్దమునకు చతుస్సముద్రము లనియెంచిఁ నాలుగు" అర్థము చెప్పవలసియుండఁగా సప్తసముద్రములని భావించి "ఏడు" అని అర్థము చెప్పుటచే వచ్చినప్రమాదము. శా. శ. ౧౨౭౭ నాటికి వేమారెడ్డిలేఁడు. ఈశాసనమున రామలక్ష్మణ విగ్రహములను, వేమారెడ్డితమ్ముఁడైనమల్లారెడ్డి ప్రతిష్ఠించెననియున్నది. ఈ మల్లారెడ్డి వేమారెడ్డియొక్క సర్వసేనాధిపతియై, కొంతకాల మద్దంకియందును, కొంతకాలము చెదలువాడయందును, కొంతకాలము కురుమలూరుయందును, ఇట్లే వేఱు వేఱు కాలములయందు వేఱు వేఱు ప్రదేశములలో నివసించుచుండి, ఆయా ప్రాంతపరిపాలనమున సర్వాధికారమును వహించియుండెనని తలంపవలసియున్నది. అద్దంకి, చెదలువాడ గ్రామములు వంగవోలు తాలూకాలో గుండ్లకమ్మ నదీతీరమున నున్నవి. ఎఱ్ఱాప్రెగ్గడ కొంతకాలమువసించినగుడ్లూరు కందుకూరు తాలూకాలోనిది. ఎఱ్ఱాప్రెగ్గడను, మల్లారెడ్డి తీసికొనివచ్చి వేమారెడ్డికిచ్చెనని హరివంశకృత్యాదియం దున్నది. దీనినిబట్టి గుడ్లూరునం దున్నసరసకవితాధురీణుఁ డగునీమహాకవిని దన నివాసమగు చెదలువాడకుఁ దీసికొనివచ్చి యచ్చట నాతనికి మడిమాన్యములనిచ్చి స్థావరము నేర్పరచి పోషించుచుఁ బిమ్మటఁ దనయన్నయైన వేమభూపతి కిచ్చియుండును. బహుశః యీశాసన కావ్యకర్తకూడ నెఱ్ఱాప్రెగ్గడ యైనఁ గావచ్చును.

వేమారెడ్డి చంద్రగ్రహణసమయమున స్నానార్థియై పుణ్యనదియైన గుండ్లకమ్మకు వచ్చి తత్సమయమున దమ్మునిచేఁ బ్రతిష్ఠింపఁబడిన శ్రీ రామచంద్రునకు గ్రామమును దానమొసంగి యుండును. మల్లారెడ్డి తనసోదరుఁడైన వేమారెడ్డి కీమహాకవి నాసమయముననే కానుకగా సమర్పించియుండును. ఈయూహ సత్యమయ్యెనేని ఎఱ్ఱాప్రెగ్గడ, రామాయణహరివంశములను, పైఁజెప్పినట్లు క్రీ. శ. ౧౩౨౪-౧౩౪౦ నడుమఁబూర్తిచేసియుండును. దానమొసంగిన గ్రామము వంగవోలు తాలూకా మల్లవరము. మల్లారెడ్డి పేరుతో నీగ్రామ మీయఁబడియుండును. అప్పటినుండియు నెఱ్ఱాప్రెగ్గడ చెదలువాడనిలయుఁ డయ్యెనని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. ఇతఁడు రామాయణహరివంశరచనాకాలమున కొండవీడునకు రాజధానియగు నద్దంకియందు నివసించి, యవసానకాలమునకు మఱల చెదలువాడకుఁ జేరియుండును.

పైనుదహరించినకురుమలూరెచ్చటిదో తెలియరాలేదు. తిక్కనసోమయాజి నిర్వచనోత్తర రామాయణకృత్యాదియందుఁ జోళతిక్కనృపతిని వర్ణించుసందర్భమున,

"లకుమయ గురుమలూరికి నెత్తివచ్చినఁ
గొనఁడె యాహవమున ఘోటకముల"

అనివ్రాసిన సీసపద్యపాదములోని కురుమలూరును నిదియు నొక్కటియే యై నెల్లూరుమండలములోనిదై యుండును. ఈరెడ్డిరాజుల నామములలో "కోమటి" 'వేమయ' యనుశబ్దము లుపయోగింపఁబడుచున్నందుల కొకకథ కలదు. వీరేశలింగము పంతులుగారాకథను శ్రీనాథకవి చారిత్రమున వ్రాసియున్నారు. ఆకథను వారివాక్యములలో నీక్రింద వ్రాయుచున్నాఁడను.

"అనుమకొండయందు సామాన్యకర్షకుఁడైన దొంతి యల్లాడరెడ్డి యనుపంటకాఁపు ధర్మచింతగలవాఁ డొకఁ డుండెననియు. అతని యింటి కొకనాటిరాత్రి కోమటి యొకఁడు వేమనయనువాఁడు రాఁగా

నాతని నాదరించి కోమటియింట భోజనము పెట్టించి తనయింటఁ బరుండఁ దావిచ్చి, అతఁడు శయనించి నప్పుడతనిమూటలో స్పర్శ వేదియుండుట గ్రహించి దాని నపహరించి, దానిమూలమున మహాధనికుఁ డయ్యెననియు చెప్పెడికథ యొకటి కలదు. ఈకథయే యింకొకవిధముగాఁ గూడఁ జెప్పఁబడుచున్నది. వేమన యనువైశ్యుఁ డొకఁడు శ్రీశైలయాత్రకుఁ బోయెననియు, అతఁ డచ్చటి మల్లికార్జునాలయమున కుత్తరమున నున్నయరణ్యములో నితరలోహములను బంగారముగా మార్చఁగల యోషధివిశేషము లున్నట్టు కనిపెట్టియామందుచెట్లయాకుల పసరును రెండుకుండలనిండ నింపి వానిని గొని స్వగ్రామమునకుఁ బోవుచు మార్గమధ్యమున నొకనాటి సాయంకాలమునుమకొండఁ జేరి యారాత్రి వసించుటకు దొంతియల్లాడరెడ్డి యింటికిఁ బోయెననియు, ధర్మాత్ముఁ డైనయారెడ్డి యాతనివస్తువులను తనసేద్యపుపనిముట్లున్న పాకలోఁ బెట్టనియమించి భోజనార్థ మయి యాకోమటిని కోమటియింటికిఁ బంపెననియు, అతఁడు భోజనముచేసి మరల వచ్చులోపల రెడ్డి తనపనిముట్లను సరిచూచుకొనుటకయి యాపాకలోనికిఁ బోయి యందు తననాగలియొక్క కఱుకోలయొకటి బంగారమువలె తళతళలాడుచుండుట చూచి యాశ్చర్యపడి చేరువకుఁ బోయి కోమటి తెచ్చుకున్నకుండలలోనిపస రొకింత దానిపై బడుటచూచి దానిప్రభావమువలన నాయినుపకోల సువర్ణమయియుండునని యూహించి దాని నిజమును బరీక్షించుటకయి సమీపమున నున్న గడ్డపాఱ నొకదానిని గొనివచ్చి దాని నాపసరుకుండలో ముంపఁగా నదియు బంగారమయ్యెననియు, అదిచూచి సంతోషించి యారెడ్డి పసరుతో నిండియున్న యారెండుకుండలను దనయింటిలోఁ బెట్టుకొని యాపాకకు నిప్పంటించె ననియు, ఇంతలో కోమటిభోజనము చేసి వచ్చి యాకాశము నంటుచున్నమంటలతో బగబగమండుచున్న యాపాకను జూచి దానిలోఁ దనపసరుకుండలు రెండును మండిపోయెనని భావించి దుఃఖించి ప్రాణమునకంటెను ధనమెక్కువగా భావించెడి

యావైశ్యశిఖామణి విత్తము పోయినతరువాతఁ దనబ్రతుకెందులకని తానును మిన్నంటి మండుచుండిన యాజ్వాలలలోఁబడి ప్రాణములు విడిచెననియు, తరువాత నాకోమటివేమయ్య పిశాచమయి యల్లాడ రెడ్డికుటుంబమును బట్టుకొని యాతనికిఁ బుట్టినబిడ్డలనెల్లఁ జంపుచువచ్చెననియు, దానికా రెడ్డి దుఃఖితుఁడయి మ్రొక్కఁగొనఁగా నాకోమటి స్వప్నములో నాతనకిఁ గనఁబడి తన పేరుపెట్టినయెడల ముందు పుట్టఁబోయెడు కుమారుఁడు బ్రతుకు ననియు, వంశమువారికిఁ దనపేరు పెట్టుచువచ్చినయెడల, వారు మహాధనవంతులును ప్రభువులు నయి భువనమునఁ బ్రఖ్యాతిగాంతురనియు, తనమూలమున వచ్చినధనము లోసగము ధర్మార్థముగా నుపయోగింపవలసినదనియు, చెప్పెనఁట ! అల్లాడరెడ్డి దానికొప్పుకొని తరువాతఁబుట్టినతనకొమారునకు తండ్రిపేరితోఁజేర్చి కోమటిప్రోలయ (వేమన) యని పేరుపెట్టెను. అతఁడు చిరకాలము జీవించి మహాధనికుఁడయి తనపంటకులపురెడ్లలో వన్నెవాసిగాంచి తనధనమును త్యాగభోగములయందు సద్వినియోగము చేయుచువచ్చెను. ఈకోమటిప్రోలయయే కొండవీటిపంటరెడ్లవంశమునకు మూలపురుషుఁడయ్యెను. ఆతనిపుత్త్రులు మహాశూరులయి ప్రతాపరుద్రునియొద్ద దండనాథు లయిరి. అల్లాడరెడ్డియింటిపేరు దొంతివారనియు దేసటివారనియుకూడ నుండియుండును. ఈతఁడు కోమటియొక్కకుండలదొంతిని సంగ్రహించుట దొంతివాఁడయ్యెనని యొకకథ గలదు. ఈయల్లాడరెడ్డి మిక్కిలిపాటుపడువాఁడయి విశేష ధనమునార్జించి ప్రసిద్ధి కెక్కియుండును. ఆతని కంతధనమువచ్చి నందునకుఁ గారణముగాఁ దరువాత నీకథ కల్పింపఁబడియుండును. కథ యెట్టిదయినను ప్రోలయరెడ్డికిని నాతనిసంతతివారికిని కోమటియనియు, వేతునయనియు నామములువచ్చుట కేదో కారణముండియుండవలయును. అల్లాడరెడ్డి స్పర్శవేదిని మందుపసరును గాక పోయినను, కోమటిధనము నపహరించి యాతఁడు పిశాచమయి పట్టెనన్న భీతిచేత దనకుమారునకును సంతతివారికిని కోమటివేమన యనుపేరు లుంచి యుండవచ్చును".

గోదావరిమండలములోని దక్షారామ భీమేశ్వరాలయనిర్మాణమునుగూర్చి యిట్టిదే యొకకథ గలదు. భీమన యనునొక బ్రాహ్మణ బ్రహ్మచారి వివాహమాడుటకు ద్రవ్యాభావముచే వెరపుఁ గానక, మహారణ్యములో నుండుసిద్ధులయనుగ్రహమును సంపాదించినచో, నినుమును బంగారముగాఁ జేయుసిద్ధక్రియఁజెప్పెదరని విని యచ్చటికిఁ బోయి దైవానుగ్రహమున నొకమహాపురుషునికటాక్షముచే రెండు ఆనపకాయబుఱ్ఱలపిండ నట్టిరసమును సంపాదించి యతిసంతోషమున నింటికివచ్చుచు, మార్గమధ్యమున నప్పటికి నొకచిన్నపల్లెగా నుండు దక్షారామముకడ కేఁగుదెంచునప్పటికి సూర్యాస్తమానమగుటచే నొకకాఁపు నడిగి యాతనియింటి కెదురుగ నున్నయొకసావిడియందు గోడకుఁ గొట్టబడియున్న మేకుల కాబుఱ్ఱలను దగిల్చి యచ్చటనే పండుకొనియె ననియు, తెల్లవారుజామునఁ గాలకృత్యములను దీర్చుకొనుటకై యా బ్రాహ్మణుఁ డావలకుఁబోఁగా, నాకాఁపు నాతనిపొలములోఁబనిచేయుకూలివారు నచ్చటకువచ్చి పొలములోఁ బనిచేయుటకై నదివఱకచ్చట చేర్చియుంచిన గెడ్డపాఱలను గైకొని, మంచినీరు తెచ్చుకొనుటకై యుపయోగించునట్టినుఱకొన్ని యానపకాయబుఱ్ఱలతోఁబాటు పసరుగలబుఱ్ఱలనుగూడఁ దీసికొనినప్పు డాగదలిపసరుచింది గెడ్డపాఱపైఁ బడ నది పచ్చగామాఱి తళతళలాడుచుండుటను జూచి యాకాపు, అందలిరహస్యమును గ్రహించి, యాపసరును జాగ్రతగా దాఁచి యేమియు నెఱుంగనివానివలె పొలమునకుఁ బోయెననియు, బ్రాహ్మణుఁడు మఱలవచ్చి చూచుకొని తనపసరుబుఱ్ఱలు లేకుండుటఁ గాంచి రోదనము చేయుచు, నాకాఁపుకడకుఁ బోయి తనపసరుబుఱ్ఱల నడుగఁదనమనుష్యుఁ డెఱుఁగక నాపసరును చెఱువులోఁ బోసివేసి వానితో మంచినీరును దెచ్చెనని చెప్పి నీటితో నున్న యాబుఱ్ఱలను జూపి యాబ్రాహ్మణునితోపాటు కపటదుఃఖము నభినయించెననియు, నాబ్రాహ్మణుఁడాతని దుష్కార్యము నెఱింగి యాతని ననేకవిధముల బ్రతిమాలియుఁ గార్యముఁగానక విచారమునొంది యెంతయో ప్రయ

త్నముచేసి తెచ్చినధనము పోవుటచే నీఁక బ్రదికినప్రయోజనము
లేదని జీవితముపై నిరాశఁ జెంది గోదావరిలోఁబడి మరణించి బ్రహ్మ
రాక్షసుఁడై యాకాపును బట్టుకొని పీడించుచు, నాతఁడు కనుమూసి
నప్పుడెల్ల భయంకరరూపమునఁ గన్పట్టుచు నిద్రాహారములు లేకుం
డఁజేసి, యొకనాఁటిరాత్రి స్వప్నమునఁ గనుపడి నాపేరుతోనిచ్చోట
నీశ్వరప్రతిష చేసినచో నాతనికిని తనకునుగూడ ముక్తి కలుగునని
యుపదేశించెననియు, నాకాఁపు ఆపసరును గెడ్డపాఱలకుఁ బట్టింపనవి
బంగార మయ్యెననియు, నాద్రవ్యముతో భీమేశ్వరాలయమును
నిర్మించె ననియు, నాబంగారపుగెడ్డపాఱలను జూర్ణముచేయించి, యా
కాఁపు ఆచూర్ణము నిసుకలోఁగలిపి, ఆలయనిర్మాణమునఁ బనిచేయు
వాలకు సాయంతనమున దోసెడేసియిసుక పంచిపెట్టుచురాఁగా, నెవ
రెంతపని చేసిన నందునకు సరిపడినవిలువగలబంగారు మాయిసుకయం
దుండుచుండెడిదనియు, నేమియుఁ బనిచేయక సాయంకాలమున నిసుక
పంచెడి వేళకు వెళ్ళి చేయిఁజాచువారలకు బంగారము లేకుండ కేవల
మిసుకమాత్రమే వచ్చెడిదనియు, నొకకథ నిచ్చట ప్రజలు చెప్పు
కొనుచుందురు.

వేమయయను పేరు పురుషులలోను, వేమాంబికయను పేరు
స్త్రీలలోను గన్పట్టుచున్నది ఈ పేరు లేదయినగ్రామదేవతనుబట్టి
వచ్చెనేమో చెప్పఁజాలము. మాగ్రామమునకు మూఁడుమైళ్ళదూర
మున నున్నవానపల్లియందు పళ్ళాలమ్మ యనుగ్రామదేవతకలదు.
ఆదేవత పేరున నాగ్రామమందలిపురుషులకు "పళ్ళయ" "పళ్ళంరాజు"
అనియును స్త్రీలకు "పళ్ళమ్మ" "పళ్ళాలమ్మ" అనియుఁ దఱచుగాఁ
బేర్లిడుచుందురు. ఆగ్రామమునందే కాక, చుట్టుప్రక్కలగ్రామము
లందును, ఆగ్రామమందలి యాఁడుపడుచుల నిచ్చినంతవఱ కాకుటుం
బములలోను, వారిబంధువులలోను నీపేరులు పెట్టఁబడుచున్నయవి.
వేమయరెడ్డి వంశములోనేగాక, వారితో బాంధవ్యమును నెఱపిన

దువ్వూరు రెడ్లలోఁగూడ వేమాంబిక, వేమారెడ్డి యుండుట చూడ, వానపల్లిగ్రామదేవతవంటి గ్రామదేవత వారికిఁగూడ నున్నదేమో యని యూహకలుగుచున్నది.

వేమారెడ్డికిఁ బిమ్మట నారెడ్డిమహారాజ్యమున కాతనితనయుఁడైన యనపోతారెడ్డియు, నాతనికిఁ దరువాత వేమారెడ్డిమూఁడవ కుమారుఁడైనయనవేమారెడ్డియుఁ బ్రభువులై రాజ్యమును బరిపాలించిరి. కాని ఎఱ్ఱాప్రెగ్గడ కీయిరువురితోను సంబంధము లేదు. వేమారెడ్డిజీవితకాలములోనే ఎఱ్ఱాప్రెగ్గడ తనకు ౬౫ సంవత్సరముల వయసున క్రీ. శ. ౧౩౪౫ సంవత్సరప్రాంతమునఁ జనిపోయియుండునని తలంపవచ్చును. కావున వేమారెడ్డికిఁ దరువాతివారిచారిత్రమున కిటప్రసక్తిలేదు. వారినిగూర్చి వేమారెడ్డివంశీయులతో సంబంధమున్న వెన్నెలకంటిసూరన, శ్రీనాథకవి మున్నగువారి చారిత్రముల యందు వ్రాయుచున్నాఁడను

---

## 46. నాచన సోముఁడు

ఈమహాకవిసోముఁడు నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబ సూత్రుఁడు. భారద్వాజగోత్రుఁడు. ఇతఁడు "ఉత్తరహరివంశ"మను నాఱాశ్వాసములయుత్తమప్రబంధమును రచించి హరిహరనాథున కంకితము చేసెను. ముద్రితమై ప్రచారములోనున్నయుత్తరహరివంశమునం దవతరణిక లేదు. అవతరణికయున్నప్రతి యెచ్చటను లభింపలేదు. అదియుత్సన్నమైపోయినదని కొందఱియుద్దేశము సంస్కృతమునందు హరివంశము పూర్వభాగ మని యుత్తరభాగ మని రెండుభాగములుగా నున్నది. ఈరెండు భాగములను గవిత్రయములోనివాఁడైనయెఱ్ఱాప్రెగ్గడకవీంద్రుఁ డాంధ్రీకరించి యుండెను. అట్లే యీకవికూడ రెండుభాగములను రచియించియుండె ననియు,

గ్రంథాదిని (పూర్వభాగాదియందు) గృత్యాదియుండి యుండు నని యు, నందుచే నుత్తరభాగాదియం దవతరణిక వ్రాయనే లేదనియుఁ గొందఱనుచున్నారు. అదియే నిజమైయుండునని తోఁచుచున్నది. ఉత్తరహరివంశప్రథమాశ్వాసములోని మూఁడవపద్య మీయూహను గొంతవఱకు బలపఱచుచున్నది.

క. హరివంశప్రథమకథాం
తరమునఁ గలవింతలెల్లఁ దప్పక మదిలోఁ
దిరమయ్యెఁగదా మీఁదట
నరవర ! యేకథలాకో వినం బ్రియ మనుడున్.

భారతరచనానంతరమున వ్యాసుఁడే హరివంశమును సంస్కృత భాషలో రెండుభాగములుగా రచించియుండెను. భారతేతిహాస మును వినుటచేఁ దృప్తిచెందలేను. కావున హరివంశమునుగూడ వినిపింపు మని శౌనకాదులు సూతు నడిగిరని హరివంశకథ ప్రారం భింపఁబడినది.

నాచనసోముఁడు తనహరివంశ గద్యయందు "భారతకథానం తరమున" అని వ్రాసికొనియున్నాఁడు. ఇతఁడు పూర్వభాగమును విడిచి యుత్తరభాగమునుమాత్రమే రచియించియున్నయెడల గద్యలో నావాక్యములను వ్రాసికొనియుండఁడు. మఱియుఁ బూర్వభాగమును విడిచి యుత్తరభాగమునుమాత్రమే వ్రాయుట కవసరముగాని కార ణముగాని లేదు. ఈమూఁడు కారణములును, నాచనసోముఁడు పూ ర్వభాగమును రచియించె నని నిశ్చయముగాఁ జెప్పుటకుఁ జాలినంత సాక్ష్యము గాకపోయినను, అట్లు దృఢముగా నమ్ముటకుఁ దగినవిగా నున్న వని చెప్పవచ్చును.

నాచనసోముని యుత్తరహరివంశమును గూర్చి ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలోనడకుదుటి వీరరాజుపంతులుగారొకవ్యాసమును వ్రా సియున్నారు. అందలి యీక్రిందివాక్యములవలన సోముఁడు పూర్వ

హరివంశమును వ్రాసియున్నట్లును, నది కాలగర్భమునఁ బడిపోయి నట్లును గన్పట్టుచున్నది.

"సోముఁడు పూర్వహరివంశమును రచించిన ట్లొండు రెండు నిదర్శనములు గానవచ్చుచున్నవి శ్రీమదోగిరాలజగన్నాథకవిరాజు గారు తమసుమనోమనోభిరంజనకావ్యము వ్యాఖ్యానమున నాచనసోమ నాథుని యీక్రిందిప్రయోగము నుదాహరించినారు.

"శతతాళదఘ్నహ్రదమున నుఱికెన్" సుమ. ద్వి48వ వ్యాఖ్య ఈపాదముగలపద్యము ఉత్తరహరివంశమున లేదు. ఇది శ్రీకృష్ణుఁడు యమునానదియందలి కాళీయనాగరాజు హ్రదమున నుఱికినఘట్టము లోనిదని తోఁచుచున్నది. నలువదియేండ్లక్రిందటఁ గవియే ము ద్రింపించుకొన్న గ్రంథములోనిదీయుదాహరణము. ప్రక్షిప్తమనుట కుఁగాని, లేఖక ప్రమాదమనుటకుఁగాని, వలనుపడునది గాదు. కాళి యునిమడువున శ్రీకృష్ణుఁడుఱికినది పూర్వహరివంశములోనికథ యై యున్నది.

నలువదియేండ్లక్రిందటి వఱకునుగల యమ్మహాగ్రంథ మిప్పుడే మయ్యెనో యని భాషాభిమానుల కెవ్వరికివిచారము గలుగకుండును? మొన్నటిజగన్నాథకవియఁట! సోమునిహరివంశపునిండు ప్రతియఁట? నేఁడుగానరాఁదట! కాలమా! శ్రీజగన్నాథ కవిగారికుటుంబము గో దావరిమండలములోని ఫ్రెంచివారియానాముకడ నున్నసీలపల్లెగ్రా మమునకు వెడలిపోయినట్లు వినియుంటిని. మహాశయు లెవ్వరైన దాని యునికిని గనుగొందురుగాక యని వేఁడుచున్నాఁడను"

ఈవాక్యములపై వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఉత్తరహరి వంశమునకుఁ బీఠిక వ్రాయుచు నందుఁ దమయభిప్రాయము నిట్లు తెలిపి యున్నారు.

"శతతాళదఘ్నహ్రదము పేరు పింగళి సూరనార్యుఁడురచించి నకళాపూర్ణోదయమందు సుగాత్రీశాలీనులకథలోనున్నది. కాని పద్య

పాదము భిన్నవిధముగలది. ఓగిరాల జగన్నాథకవిగారు ప్రామాదికముగా దానినిహరివంశమందలిదానిఁగాస్మరించియుందురేమో. (అప్పకవి "ఒకనాఁ డిందుధరుండు" ఇత్యాదిపద్యమును దెనాలిరామలింగని యిందుధరోపాఖ్యానమందలి దానిఁ గాఁ జెప్పినట్లుగానే)"

కళాపూర్ణోదయమునందు శతదాళదఘ్నహ్రద ప్రశంసగల పద్యములివి:—

క. ఘనరోషుఁ డగుచు నతఁడా
వనితయుఁ దోఁనరుగుదేర వడిఁ జని యాచే
న్పనను శతతాళదఘ్నం
బను పేరన్ వెలసియున్న హ్రదమున నుఱికెన్.

చ అదె శతతాళదఘ్న మనుసార్థపునామముతోడ నుత్తమ
హ్రదములలోఁ బొగడ్తఁ గనినట్టిది యాందునుబడ్డవారికిం
బ్రదుకులె యంచుఁ దప్పదు పురాకృత మెవ్వరికైన నంచుఁ గొం
తతడవుగుందె నేనప్పుడు తద్ద్విజముఖ్యునిఁ జూచి యెయ్యనన్.

ఈరెండు పద్యములలోనుగూడ 'శతతాళదఘ్నహ్రద' మనుసమాసపదము లేదు. ఇంతేకాదు. జగన్నాథకవి యెందుకొఱకీవాక్యము గ్రహించెనో ఆకార్య మీపద్యములయందలి ప్రయోగముల వలన నెఱవేఱదు. జగన్నాథకవి 'దేవవల్లభహ్రాదినీవిలసిత మయ్యు,
జంభజయాధికసంపదఁ దగి'
అని తనగ్రంథమున వ్రాసి, ఇందలి భ యనునక్షరము లఘువగుటకు లక్ష్యముకొఱకు సంస్కృత సమాసములందు రేఫసంయుక్తవర్ణపూర్వాక్షరమునకు లఘుత్వమును గల్పించిన పింగళి సూరనార్యాదుల ప్రయోగముల నుదాహరించుచు, నాచనసోమనాథునిదని పైనఁజెప్పిన ప్రయోగమును లక్ష్యముగా నిచ్చియున్నాఁడు. కళాపూర్ణోదయమందలి పైరెండుపద్యములలోని ప్రయోగములు నీలక్ష్యమునకు లక్షణములు గానేరవు. కందపద్యములోని హ్రదము సంస్కృతపదముతో

సమసించ లేదు. రెండవపద్యములోని ప్రాదము పూర్వాక్షరమును గురువుగాఁ జేయుచున్నది కాని లఘువుగాఁ జేయుటలేదు. కావున జగన్నాథకవి శ్రీప్రభాకరశాస్త్రిలుగా రనినట్లు కళాపూర్ణోదయము లోనిశబ్దమును బొరపాటున నాచనసోమనాథునిదని వ్రాయలేదు. దీనినిబట్టి నాచనసోముఁడు పూర్వహరివంశమును వ్రాసియున్నట్లే నిశ్చయింపఁదగియున్నది. ఎఱ్ఱాప్రెగ్గడ రచించినహరివంశమున జగన్నాథకవి యుదాహరించిన పద్యపాదములేదు. భాగవతమునఁ గాళియమర్దనకథయందు "ప్రాదమున" 'నుఱికెన్' అనుశబ్దములున్నవికావి 'శతతాళదఘ్న' శబ్దము లేదు శ్రీకృష్ణలీలలను వర్ణించినపద్మపురాణమునను నీవాక్యము గన్పట్టలేదు. ఏవిధముగాఁ జూచినను బూర్వహరివంశమును నాచనసోమనాథకవి రచియించినట్లే కన్పట్టుచున్నది నీలపల్లెలో నిప్పు డోగిరాలవారు లేరు. కొంతకాలముక్రితము వఱకు నొకవృద్ధస్త్రీ యచ్చటనుండెడిదనియు, నామె కాకినాడ వెళ్ళిపోయినదనియు నచ్చటివారు తెలిపిరి పూర్వహరివంశప్రతికొఱకు శక్తికొలఁది ప్రయత్నించుచున్నాఁడను. ఆంధ్రు లెట్లయిన నాగ్రంథమును సంపాదించుట కర్తవ్యము.

ఈకవి పేరునందలినాచనశబ్దము గృహనామమా? పితృనామమా? ఈసంశయమును దొలఁగించుటకు గ్రంథమునం దాధారమేదియు లభింపలేదు. ఈకవిచారిత్రమును దెలిసికొనుటకుఁ బ్రిధానాధార మైన దొకశాసనము కలదు. ఈకవికిని మఱియైదుగురుబ్రాహ్మణులకును 'పెంచుకలదిన్నె' యనునొకగ్రామమును తనపేరున బుక్కరాయపురముగామార్చి బుక్కరాయలు దానముగా నిచ్చినట్లాశాసనమునఁ జెప్పఁబడినది. ఆదాన మాఱుగుఱు బ్రాహ్మణులకిచ్చుటచే వారాఱుగుఱికి నాఱుశాసనపుఁబ్రతులను దాత వ్రాయించియిచ్చెనఁట. అందు రెండుప్రతులు లభించినందున వానిని "ఎపిగ్రాఫికా కర్నాటికా"లోఁ బ్రకటించినారు. ఆశాసనపుప్రతిని బ్ర. శ్రీ. వీరేశ

లింగముపంతులుగారు తమయాంధ్రకవులచరిత్రమునం దుదాహరించి యున్నారు. ఆశాసనము నిట వ్రాయుచున్నాఁడను.

“ఇది మైసూరు రాజ్యములోని కోలారుమండలము నందలి హొబ్లీరామపురమునపటేలయిన జటావల్లభుఁడను విప్రునినుండి గైకొనఁబడి ఎపిగ్రాఫికాకర్నాటికాలో జి. డి. ౭౬౮ సంఖ్యను ప్రకటింపఁబడినతామ్రశాసనము.

శ్రీగణాధిపతయే నమః

శ్లో॥ నమస్తుంగశిరశ్చుంబి చంద్రచామరచారవే
త్రైలోక్యనగరారంభమూలస్తంబాయ శంభవే. ౧

అవ్యాదవ్యాహతైశ్వర్య కారణో వారణాననః
వరద స్త్రీవ్రతిమిరమిహిరో హరనందనః. ౨

శ్రీమా నాదివరాహో యచ్ఛ్రియం దిశతు భూయసీం
గాఢ మాలింగతా యేన మేదినీ మోదతే సదా ౩

అస్తి కౌస్తుభమాణిక్యకామధేనుసహోదరః
రమానుజః కళానాథః క్షీరసాగరసంభవః. ౪

ఉదభూ దన్వయే తస్య యదు ర్నామమహీపతిః
పాలితా యత్కులీనేన వాసుదేవేన మేదినీ. ౫

తత్కులే బుక్కనామాయః కీర్తిశౌర్య విచక్షణః
మంగాంబికా భవద్రాజ్ఞీ లక్ష్మీరివ హరే ర్యథా. ౬

అభూ త్తస్యకులే శ్రీమా నభంగురగుణోదయః
అపాస్తదురితాసంగః సంగమో నామభూపతిః. ౭

మాలాంబికాఽభవ ద్రాజ్ఞీ తస్యరాజ్ఞః శుచిస్మితా
దమయంతీ నలస్యేవ ఇంద్రస్యేవ యథా శచీ. ౮

ఆసన్ హరిహరః కంపో బుక్కరాయమహీపతిః
మారపో ముద్దప శ్చేతి కుమారా స్తస్యభూపతేః. ౯

పంచానాం మధ్యగ స్తేషాం ప్రఖ్యాతో బుక్కభూపతిః
ప్రచండవిక్రమో మధ్యే పాండవానా మివార్జునః. ౧౦

భంగాః కళింగామిత శౌర్యవృత్తే
ర్వంగా విభిన్నాంగ విఘూర్ణనేత్రాః
ఆంధ్రాశ్చరంధ్రాణి విశంతి యస్య
బాహాగ్రఖడ్గేన విశీర్యమాణాః. ౧౧

తురుష్కా శ్శుష్కవదనాః పాండ్యభూపాః పలాయితాః
స్వభుజార్జితవీర్యేణ తస్మిన్రాజ్యం ప్రశాసతి ౧౨
బుక్కరాయో భవచ్ఛ్రీమాన్ భుజార్జితపరాక్రమః
మేదినీవ ప్రజా యేన స్వపుత్రా ఇవ రక్షితాః. ౧౩
రాజాధిరాజ స్తేజస్వీ యో రాజపరమేశ్వరః
భాషాలంఘితభూపాల భుజంగమవిహంగమః. ౧౪
రాజరాజభుజంగో యః పరరాజభయంకరః
హిందురాయసురత్రాణ ఇత్యేతైః రుపశోభితః. ౧౫
విద్యాభిధాననగరీ విజయోన్నతశాలినీ
విద్యారణ్యకృతా తస్యాం రత్నసింహాసనే స్థితః. ౧౬
యస్మిన్ షోడశదానానాం ధరాయాం పరిశోభితే
దానాంబుధారయా తస్య వర్ధతే ధర్మసాధనః. ౧౭
అలంకృతే శకస్యాబ్దే రసభూనయనేందుభిః
తారణాబ్దే చైత్రమాసే నవమ్యాం శుక్లపక్షకే. ౧౮
పంపాయాం భాస్కరక్షేత్రే విరూపాక్షస్య సన్నిధౌ
ఆపస్తంబాఖ్యసూత్రాయ భారద్వాజాన్వవాయినే. ౧౯
యాజుషాణాం వరేణ్యాయ సకలాగమవేదినే
అష్టాదశపురాణానా మభిజ్ఞాతార్థవేదినే. ౨౦
అష్టభాషాకవిత్వ శ్రీవాణీవిజిత*సంసదే
సోమాయ నాచనాంభోధేః సోమ యామితతేజసే. ౨౧

గుత్తిదుర్గాభిదేరాజ్యే కోడూరాజ్యమహీతలే
పెన్నమాగాణివిఖ్యాతే సర్వసస్యోపశోభితే ౨౨

కోడూరు నాగమల్లాఖ్య దిన్నాభ్యా మపిపశ్చిమం
గ్రామోత్తమాద్వేళుమంకూరోః ప్రాచ్యాద్దిశి సమన్వితం ౨౩

ఊరచింతలనామ్నశ్చ గ్రామా ద్దక్షిణసంస్థితం
నంగలూరోక్కడుతాళాభ్యా ముత్తరాశా ముపాశ్రితం. ౨౪

పినాకినీతటే పెంచుకలది న్నాహ్వయంపురా
బుక్కరాయపురాఖ్యాతి ప్రతినామ్నా చ శోభితం. ౨౫

నిధినిక్షేపసంయుక్తం జలపాషాణసంయుతం
అక్షిణ్యాగామిసహితం సిద్ధసాధ్యసమన్వితం. ౨౬

అష్టభోగమిదం సర్వస్వామ్య మాచంద్రతారకం
సహిరణ్యపయోధారాపూర్వకం దత్తవా న్ముదా. ౨౭

శ్రీమన్నాచనసోమాఖ్య మహాకవివరోవ్యధ
రాజాన మాశిషంచైవ చిరజీవీ భవత్వితి. ౨౮

స్వయమన్వకరోద్వృత్తిం దశోత్తరశతం కవిః
షట్త్రింశదత్రభాగాః స్యు ర్యజమానాహ్వయ స్తతః, ౨౯

భారద్వాజాన్వయేజాతః తల్లపో నామయాజుషః
అష్టావింశతివృత్తీనా మధిపో నాచనాత్మజః ౩౦

కాశ్యపాన్వయసంభూత అన్నదాతాధ్వరీంద్రజః
యాజుషైకాదశాంశీచ సర్వజ్ఞః సింగయోబుధః ౩౧

దేవణస్యసుతః శ్రీమాన్ సింగపోనామయాజుషః
కౌండిన్యాన్వయసంభూతో దశవృత్తీశ్వరఃస్మృతః, ౩౨

నాగయస్య సుతః శ్రీమాన్ వత్సయోనామయాజుషః
కాశ్యపాన్వయసంభూతో వృత్తిత్రయ మిహాశ్నుతే. ౩౩

శ్రీవత్సాన్వయసంభూత స్తిమ్మయస్య తనూభవః
యాజుషోభాస్కరశ్చేతి వృత్తిద్వయ మిహాశ్నుతే. ౩౪

అస్యాగ్రహారవర్యస్య చతుస్సీమా వినిర్ణయం
సర్వేషాం సుఖబోధాయ లిఖ్యతే దేశభాషయా. ౩౫
ఇద మఖిలరాజశేఖర మధుకర ఝంకారగీతమాహాత్మ్యం
శ్రీమద్బుక్క రాజేంద్రనృపతేః శాసన మచలైకపారిజాతస్య
ఆత్రేయాణాం యాజుషః కోటిదేవారాధ్యాచార్య సాంగజో మాధమూర్తిః
చ॥ కేసమ్యక్సర్వశాస్త్రప్రవీణః శ్లోకా నేతాన్ మల్లనారాధ్యవర్యః ౩౬
త్వష్ట్రి తచ్ఛాసనం స్వామిశాసనేన వినిర్మితం
శాసనాచార్యవర్యేణ నాగిదేవేన శిల్పినా ౩౭
దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం
దానాత్స్వర్గమవాప్నోతి పాలనా దచ్యుతంపదం ౩౮
స్వదత్తా ద్ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ౪౦
సామాన్యోయం ధర్మసేతు ర్నృపాణాం
కాలేకాలే పాలనీయో భవద్భిః
సర్వా నేతాన్ భావినః పార్థివేంద్రాన్
భూయోభూయో యాచతే రామచంద్రః ౪౧

శ్రీవిరూపాక్ష

ఈశాసనముయొక్క ౧౯, ౨౦, ౨౧, ౨౭ శ్లోకములలో నీగ్రామమును నాచనసోమున కిచ్చినట్లకన్పట్టుచున్నను ౨౯ మొదలు ౩౮ వఱకుఁగల శ్లోకములలో నాగ్రామమును ౧౧౦ భాగములుగాఁ జేసియందు ౩౬ భాగములు కవికిని (నాచనసోమునకును) ౨౮ భాగములు భారద్వాజగోత్రుఁడును నాచనయొక్క తనయుఁడునైనతల్లపకును, ౧౧ భాగములు కాశ్యప[illegible]త్రుఁడును అన్నదాతాధ్వరిపుత్రుఁడు నైనసింగయపండితునకును ౧౦ భాగములు కౌండిన్యగోత్రుఁడును దేవణునికుమారుఁడు

నైనసింగనకును కాశ్యపగోత్రుఁడు నాగయసుతుఁడు నైనవత్సయకు మూఁడుభాగములును, శ్రీవత్సగోత్రుఁడును తిమ్మయాత్మజుఁడు నైన భాస్కరునకు రెండుభాగములును, ఈయఁబడియున్నట్లుచెప్పఁబడినది. పరిగృహీతలందఱు యజుశ్శాఖీయులు. ఈభాగనిర్ణయములోఁ బొరపాటు కనఁబట్టుచున్నది. మొత్తము ౧౧౦ భాగములకు వివరములోఁ దొంబదియే యున్నవి. వత్సయకు "వృత్తిత్రయ" మనియు, భాస్కరునకు "వృత్తిద్వయ" మనియు నుండగా మొత్తమునూటపదికి సరిపుచ్చుటకుఁ గాఁ బోలు వీరేశలింగముపంతులుగారు వత్సయకుఁబదు మూఁడనియు, భాస్కరునకుఁ బం|డెండనియుఁ జెప్పియున్నారు. ౨౯వ శ్లోకములోని "దశోత్తరశతం" అను వాక్యమును దొంబదియని యర్థమిచ్చునట్లుగా "దశన్యూనశతం" అని సవరింపవలసియుండు నేమో!

౨౧వ శ్లోకములో నాచనాంభోధికిఁ జంద్రునివంటివాఁడైన సోముని కనియున్నది. వంశమును గాని, కులమునుగాని, సముద్రముతోఁ బోల్చుట కవిసాంప్రదాయము. అట్లయినచో నీకవి నాచనవంశమువాఁ డనిచెప్పుటయుక్తము. కొన్నితావులఁ దండ్రిని, గొన్నితావుల దల్లినిసముద్రముతోఁ బోల్చుటకూడఁ గలదు. కావున నిటనాచనయనువ్యక్తినే సముద్రునితోఁ బోల్చినాఁడందుమేని, సోమునకు నాచన తండ్రియగును ప్రతిగ్రహీతలందఱకును దండులనామములను శాసనమునఁ జెప్పియున్నాఁడు సోమునితండ్రిపేరు చెప్పకుండనుండడు కావున నాచనశబ్ద మీతనితండ్రిపేరే యైయుండు ననుటకూడ సమంజసమైన యూహయే యగును. కొక్కోకమును రచించినయెఱ్ఱనకవి తనసకలనీతికథానిధానమునఁ బూర్వకవిస్తుతిచేయుటలో "నాచనసుతుసోము" అని చెప్పియున్నాఁడు దీనినిబట్టి నాచనశబ్దము పితృనామమే యనిస్పష్ట మగుచున్నది. సింహాసనద్వాత్రింశికనురచించినకొఱవిగోపరాజు "నాచిరాజు సోముని" యని|వ్రాసియున్నాఁడు. దానిని బట్టికూడ నాచనశబ్దము పితృనామమే యనిధృవపడుచున్నది. పిల్లల

మట్టివినవీరన శకుంతలాపరిణయమున 'నాచిరాజునిసోము' అని చెప్పి యుండెను. వీనినిబట్టి యీకవి నియోగి శాఖాబ్రాహ్మణుఁడని స్పష్ట మగుచున్నది

ఇరువది యెనిమిదిభాగముల కధికారియైనతల్లప్ప నాచనయొ క్కకుమారుఁ డనియున్నది. ఇతఁడును భారద్వాజగోత్రుఁడే. ఈనాచ నశబ్దము గృహనామముగాక తల్లప్పకుఁ బితృనామ మగుట స్పష్టము. ఈనాచనయు, సోమునితండ్రి పేరు నాచన యైన సందర్భములోనానా చనయు, నొక్కఁడేనా? వేఱువేఱువ్యక్తులా? యనుప్రశ్నకూడవచ్చు చున్నది. ఇరువురు నొక్కరేయైనచోఁ దల్లప్పసోమునకు సోదరుఁడై యుండును. వీరిరువురు సోదరులని శాసనమునందు లేదు. నాచన శబ్దముగృహనామమైనను, బితృనామమైనను సోమునిగుఱించుట కేర్పడినదే కాని వేఱుప్రయోజనములేనిది. కావున నీవిషయము నింతటితో విడిచి కవియొక్క కాలనిర్ణయమును జేయుటకై ప్రయ త్నించెదను.

పైనవ్రాసినశాసనములోని ౧౮ వ శ్లోకములో శాసనకాలము చెప్పఁబడినది దానమిచ్చినవాఁడు సుప్రసిద్ధుఁ డగు మొదటిహరిహర రాయలతమ్ముఁ డైనబుక్కరాయలు. దానమిచ్చినదినము తారణ సంవత్సర చైత్రశుక్లనవమి. శాలివాహనశకసంవత్సరములు "రస భూనయనేందుభిః" (అనగా ౧౨౧౬) అని యొకశాసనప్రతిలోను, "రసాభ్రనయనేందుభిః" (అనగా ౧౨౦౬) అని యొకశాసనప్రతి లోను ఉన్నవి. ౧౨౧౬ వ సంవత్సరము తారణాబ్దము కాలేదు. కావున నది పొరపా టని భావింపవలసియున్నది. ౧౨౦౬ వ సంవత్స రము తారణాబ్దమే యైనది. కాని యప్పటికి దానమిచ్చిన బుక్కరా యలు జన్మింపనేలేదు. శాసనముయొక్క ౧౬ వశ్లోకములో విద్యా రణ్యకృతమైన విజయనగరమును పేర్కొనియుండుటచే దానకాలము నాటికి విజయనగరనిర్మాణ మయియుండవలయును. కాపలూరుశాస

నమునందు శాలివాహనశకసంవత్సరములు ౧౨౫౮ అగుధాతృనామ సంవత్సర వైశాఖశుక్లసప్తమిదినమున పుష్యానక్షత్రయుక్తసింహ లగ్నమునందు విద్యారణ్యస్వామియాజ్ఞానుసారముగా విద్యానగర మున హరిహరరాయలు పట్టాభిషిక్తుఁడయిన ట్లీక్రిందిశ్లోకములలోఁ జెప్పఁబడియున్నది.

"తథా హరిహరేశ్వరవిరచయ్య తచ్ఛాసనం
నృపాసన మపాస్థితోచ్ఛ్రితసితాతపత్రోజ్జ్వలః
విధాయ ఖలు షోడశాప్రతినిధోనిదానా
న్యహో వ్యరాజత విశాలసీమ్నినగరే హి విద్యాభిదే॥ ౨౭

అష్టపంచయుగశైకసంఖ్యయా
సంయుతే నృపశకస్య వత్సరాత్స రే
ధాతృ మాధవ వలక్షసప్తమీ
పుష్యతారహరిలగ్న కే భుజే" ౨౮

కావున దానమిచ్చినదిన మానాఁటికిఁదరువాత నేమైయుండవలయును. అందుచేఁ బైశాసనమందలి "రసాభ్రనయనేందుభిః" అనువాక్యము కూడ సరియైనదికాదని నిర్ణయింపవలసియున్నది. అందువలన శాసన మందలిదానకాలమును దెలుపువాక్యమును సవరింపక తప్పదు. అట్లు సవరించుటలో మూఁడు ముఖ్యాంశములను గమనింపవలసియున్నది. మొదటిది బుక్కరాయలపరిపాలనాకాలమయియుండవలయును. రెండ వది తారాణాబ్దము కావలయును. మూఁడవది విద్యానగర నిర్మాణ మప్పటికిఁ బూర్వమైయుండవలయును.

సుప్రసిద్ధచరిత్రకారు లగు కొమఱ్ఱాజు లక్ష్మణరావుపంతులు గారును, చిలుకూరి వీరభద్రరావుపంతులుగారును, బుక్కరాయలు క్రీ. శ. ౧౩౫౫ మొదలు ౧౩౭౭ వ సంవత్సరమువఱకును రాజ్యపాల నము చేసె నని చెప్పియున్నారు. క్రీ. శ. ౧౩౭౬ వ సంవత్సరము నందే బుక్కరాయలు మృతినొందెనని కొంద ఱనుచున్నారు. షిమో

గామండలమందలి శాసనములలో ౧౫౭ సంఖ్యగల శాసనమునందు బుక్కరాయలు శా. శ ౧౨౬౮ (క్రీ. శ. ౧౩౪౬) వ్యయసంవత్సర మార్గశిరశుక్లద్వితీయనాఁడు సింహాసనమెక్కినట్లు చెప్పఁబడియున్న దని శ్రీవీరేశలింగముపంతులుగారు కవులచరిత్రములో నుదాహరించి యున్నారు.

బుక్కరాయల పెంచుకలది న్నె శాసనమును సంపాదించినవైరో పీయుఁ డగు రైసుపండితుఁడు పండితులసాహాయ్యమున "తారణ" ను "సాధారణ" అనియును, "రసాభ్రనయనేందుభిః" అనువాక్యమును, "కరాజనయనేందుభిః" అనియును సవరించి, శాసనకాలమును శా.శ. ౧౨౯౨ (క్రీ. శ. ౧౩౭౦) వ సంవత్సరమునకు మార్చినారు. శాసన కాలమును బుక్కరాయలపరిపాలనాకాలములోనికిఁ దెచ్చుటకై యీ మార్పులను చేయవలసివచ్చినది. వీరేశలింగముపంతులుగారీమార్పు నంగీకరించి యీకవి క్రీ. శ. ౧౩౬౦-౭౦ సంవత్సరప్రాంతములయం దున్నాఁడని నిశ్చయింపవచ్చు ననిరి.

ఉత్తరహరివంశమునకుఁ పీఠికవ్రాసిన వేటూరి ప్రభాకర శాస్త్రిగారు "రసాభ్రనయనేందుభిః" అనువాక్యమును "రసర్తున యనేందుభిః" యని సవరించి శాసనకాలమును శా. శ. ౧౨౬౬ (క్రీ.శ. ౧౩౪౪) అనినిర్ణయించియున్నారు. అప్పటికి బుక్కరాయలు రాజ్య మునకు రాకపోయినను యువరాజుగా నున్నాఁడనియు, నన్నగారి రాజ్యకాలములోనే సర్వసమర్థుఁడైన బుక్కరాయ లొకయగ్రహార మును దానమొసంగె ననుటలో నాక్షేపముండదనియు, ఎపిగ్రాఫికా కర్ణాటికావాల్యుంఖహాసన్ జిల్లా చెన్నరాయపట్నంతాలూకా శాస నము ౨౫౬ సంఖ్యగలదానిలో హరిహరరాయలు రాజుగానున్నను వాస్తవమునకు విద్యానగరమును నిర్మింపఁజేసినవాఁడు పేరుపెట్టిన వాఁడు బుక్కరాయలే యనియున్నదనియు, నాగరలిపిలో "భ్రూ" "భ్ర" అనునక్షరములు "ర్తు" ను బోలియుండుటవలన శాసనమును

వ్రాసినవారో చదువువారో పొరపాటుపడియుందురనియు, ప్రభాకర శాస్త్రిలుగారు తమనిర్ణయమునకు హేతువులను జెప్పియున్నారు. ఆలోచించిచూడఁగా రైసుపండితునిపూర్వకంటె శాస్త్రిలవారి మార్పుసమంజసమైనదిగాఁ దోఁచుచున్నది. రైసుపండితునిమార్పులో సంవత్సరమును సంఖ్యయునుగూడ దిద్దవలసి వచ్చినది. శాస్త్రిలుగారి హేతువులుగూడ బలవత్తరముగాఁగన్పట్టుచున్నవి. కావుననింతకంటె ప్రబలసాక్ష్యము లభించువఱకును శాసనకాలమును శా. శ ౧౨౯౯ (క్రీ. శ. ౧౩౭౭) గానేభావించుటుచితము. తిరుపతిదేవస్థానమువారు ప్రకటించిన వంశవృక్షసంపుటములో బుక్కరాయలకాలము క్రీ. శ. ౧౩౭౭-౧౩౭౩ అనివ్రాసియున్నారు. కాని వారికట్లుచెప్పుటకులభించిన యాధారముల నందుదాహరింపలేదు. అది సత్యమని నమ్మునెడల శాస్త్రిలవారిమార్పున కది బలవత్తరమయిన యాధారమని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. అట్లయినచో నీకవి, ఎఱ్ఱాప్రెగ్గడకుఁ గొలఁదికాలము తరువాతివాఁడో, లేక యాతనితో సమకాలికుఁడో, యైయుండును. రైసుపండితుఁడు ప్రకటించిన, ఎపిగ్రాఫియా కర్ణాటికా ౧౦ వ సంపుటము [M.G. 158; G. D. 46] శాసనములో శాసనకాలము ౧౨౯౯ అనిస్పష్టపరుపఁబడినది. కావున శాస్త్రిగారి యూహయే సత్యమైనది.

ఎఱ్ఱాప్రెగ్గడ, నాచనసోమునకుఁదరువాతవాఁడనియు, సోముని గ్రంథమునుండి యెఱ్ఱాప్రెగ్గడ గ్రంథచౌర్యము చేసెననియు లోకమునఁనొకప్రవాదము కలదు. కాని యది నిరాధారమును కేవలకల్పితము నైయున్నది. నాచనసోముని కాలనిర్ణయమును బట్టి ఎఱ్ఱాప్రెగ్గడకవి, సోమునికంటె నించుకపూర్వుఁడని స్పష్టమైనదికదా! బాణాసురఘట్టములోని, "నిండారుతెగఁగొని" ఇత్యాది సీసపద్యమును, "చేతులకసివో" అను కందపద్యమును. ఇద్దఱి హరివంశములలోను గలవు. ఇవిరెండును ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశములోని వనిచెప్పుట కివి యాతని హరివంశముయొక్క యముద్రితప్రతులలో నుండుటయు

సోముని హరివంశాముద్రితప్రతులలో నొకటిరెండిటిలో మాత్ర ముండి తక్కినవానిలో లేకపోవుటయు నిదర్శనములు. ఇట్లని, కవులలో నెవ్వరికిని గ్రంథచౌర్య మాపాదింపరాదు. ఇది ప్రతిలేఖకుల కృత్య మనిచెప్పఁదగియున్నది.

ఎఱ్ఱాప్రెగ్గడయు, నాచనసోముఁడునుగూడ ఉత్తర హరివంశము నాంధ్రీకరించినను, రెండింటికిని సామ్యములేదు. ఈరెండింటిని బోల్చిచూచుటకునుబోలదు. సోముఁడు ప్రధానాంశములను గైకొని ప్రబంధరీతిని విశృంఖలుఁడై రచించెను. ఎఱ్ఱాప్రెగ్గడ మూలము ననుసరించి పురాణవైఖరిని రచించెను ఈయిరువురిలోను సోముని కవిత్వము రసవత్తరమయినదని కొందఱుపండితులును, ఎఱ్ఱాప్రెగ్గడకవిత్వము రసవత్తరమయిన దని కొందఱుపండితులును అభిప్రాయపడుచున్నారు. సోముని కవిత్వమునం దెక్కువగుణములు కలవనువారు బ. సీతారామాచార్యులు, కం. వీరేశలింగముపంతులు, వ. వీరరాజు పంతులు మొదలయినవారు. ఎఱ్ఱాప్రెగ్గడ కవిత్వమునం దెక్కువయభిమానమును గనుపఱచినవారు రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు మొదలయినవారు. ఇరువురి రచనలయందలి సారస్యమును గ్రహించుభారము పాఠకమహాశయులపైఁ బెట్టఁదలంచి, ఒకటేసందర్భమును వర్ణించుపట్టులలోని యిరువురి పద్యముల నిటనుదాహరించుట మంచిదని తలంచితినిగాని యది కుదిరినది కాదు. ఒకటిరెండుపద్యములలో నా తారతమ్యనిర్ణయ మసాధ్యము. ఉత్తర హరివంశమును బూర్తిగ సోమనార్యుఁడు ఆంధ్రీకరించినట్లు కనుఁబడదు. ఎఱ్ఱాప్రెగ్గడ యుత్తర హరివంశ మించుమించుగ నిరువదియాఱు నూఱుల పద్యములను, బదియాశ్వాసములను గలిగియున్నది. సోమునియుత్తరహరివంశ మాఱాశ్వాసములలోఁ బదునైదువందల పద్యములను మాత్రమే కలిగియున్నది. ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశము సామాన్యముగ నంతటను మూలము ననుసరించియున్నది. మూలానుసరణనిర్బంధముండుటచే నీతని కవితాలహరి కొన్ని తావులఁ జక్కగాఁ బ్రవహింపక పోయియుండ

వచ్చును. ప్రాచీనాచారలాలసయగుటచే నీతనికవితాకన్య నూతనాలంకారభూషిత గాకపోవచ్చును. అంతమాత్రముచే నాతనికవిత్వమునందు సహజమాధుర్యలావణ్యాదులు లేవనితలంప రాదు. సోముని గ్రంథమునఁ గొన్నికథలు పూర్తిగా విడిచిపెట్టఁ బడినవి. ఆంధ్రీకరించిన కథపట్టులైనను మూలము ననుసరించియుండవు. కవియెక్కువ స్వాతంత్ర్యమును గైకొని తనయిచ్ఛవచ్చినట్లు పెంచియుఁ దుంచియు, రచనమును సాగించినవాఁడు. సోముని యుత్తరహరివంశమునఁ బ్రథమాశ్వాసమున నరకాసురునికథయు, చతుర్థాశ్వాసమున హంసడిభకోపాఖ్యానమును, నయిదాఱు ఆశ్వాసములలో బాణాసురుని కథయు, రెండవ మూఁడవ యాశ్వాసములలోఁ బౌండ్రకవాసుదేవ కథ మొదలుగాఁ గొన్ని ఇతరకథలును వర్ణితములు. ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశమున నింక నెన్నియోకథలుకలవు.

భిన్నరీతులలో వీరిరచనము లున్నప్పుడు వీరినిరువురిని బోల్చి చూచుటవలనఁ బ్రయోజన ముండదనియు, 'లోకోభిన్నరుచిః' యను వాక్య మిట వర్తించుననియు, దలంచుచున్నాఁడను. ఇరువురిగ్రంథములను వేఱువేఱుగ జదివిచూచినవారి కొకరికొకరు దీసిపోరని తోఁచునని నాయభిప్రాయము.

వైశాసనకాలమున కిరువదిసంవత్సరములకుఁ బూర్వము నాచనసోముఁడు హరివంశమును రచియించెనని తలంచితిమేని యిరువురి హరివంశములును నేకకాలముననే పుట్టినవని చెప్పవచ్చును. ఒకరిరచనావిషయము నొకరెఱుంగక యిరువురునుగూడరచియించియుందురు. ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశమును జూచియున్నను లేక వినియున్నను నది వ్యాసునిభారతా నంతరరచనమగుటవలనను దిక్కన యందలి గౌరవముచేతను దనప్రయత్నమును విడువనేరక తాను ఎఱ్ఱాప్రెగ్గడ రచనారీతినివిడిచి ప్రబంధమార్గమున దీనిని రచియించియుండును. ఈ యిరువురు నొకరినొకరు యెఱిఁగి యుందురని యనఁ జాలము. ఎఱ్ఱా

పెగ్గడ నివాసము నెల్లూరుమండలము. నాచనసోముని నివాసము కడపమండలములోని పెంచుకలదిన్నె.

ఈకవి గొప్పపండితుఁడు. సకలాగమవేది. అష్టాదశపురాణార్థ విజ్ఞాత. అష్టభాషాకవిత్వ విశారదుఁడు. ఈతని కవిత్వము ప్రౌఢమై ధారాశుద్ధి కలిగి లోకోక్తులతో నిండి మనోహరమై యున్నది. చదివినకొలఁదిని పాఠకుని హృదయ మానందముచే నుప్పొంగుచుండును. ఇందుఁబ్రస్తుతకాలమున వాడుకలో లేనిపదము లందందుఁ జూపట్టుచుండును. కాని వానియర్థమును గ్రహించినపిమ్మట నందలిస్వారస్య ము గోచరమగును.

ఈకవికిఁ దిక్కనసోమయాజికవిత్వమునందుఁ జాలగౌరవము కలదనుటకు గద్య వ్రాసిన "ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి ప్రణీతంబైన శ్రీమహాభారతకథానంతరంబున" అను వాక్యములే నిదర్శనములు తిక్కనసోమయాజికవిత్వముతో సమానమైన కవిత్వము వ్రాయఁగలవాఁడ ననుభావ మీకవికిఁ గలిగియున్న ట్లీవాక్యములు సూచించుచున్నవి. సూచనయేకాదు. ఉత్తరహరివంశమునఁ బలుతావులయందు దిక్కనపోకడలను జయప్రదముగా ననుకరించియున్నాఁడు. తిక్కనకవిత్వము ననుకరింపయత్నించినకవు లందఱిలో జయముగాంచి మొదటిగుఱుతు సంపాదించినవాఁ డీతఁడే. గ్రంథవిస్తరభయముచేఁ దిక్కన ననుకరించినపద్యముల నిటనీయలేదు. ఈకవి తాను 'సకలభాషాభూషణ, సాహిత్యరసపోషణ సంవిధానచక్రవర్తి, సంపూర్ణకీర్తి, నవీన గుణసనాథుఁడ' నని గద్యలో వ్రాసికొనియున్నాఁడు. ఈతనిగ్రంథమును జదివినవారల కీబిరుదములయం దతిశయోక్తిలే దని తోఁచును.

ఈకవి "వసంతవిలాస" మనునొక ప్రబంధమును రచియించియున్నట్లుఅప్పకవి మొదలుగాఁగలలక్షణవేత్తలు తమగ్రంథములయందు లక్ష్యములుగాఁ గైకొనినపద్యములనుబట్టి తెలియుచున్నది. కాని

యా గ్రంథ మిప్పు డెచ్చటను గన్పించుట లేదు. ఆ గ్రంథము మాచయ బ్రహ్మయ కంకితము సేయఁబడినదనియు, నందలి మొదటిపద్య మిది యనియు బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవిగారుదాహరించియున్నారు.

శా. శ్రీచన్నంగవ కేళిఁ గొమ్మలఁగులన్ శృంగారపుందోఁటకున్
బ్రాచీనం బగుచున్న వింశతికఖప్రోఢిన్ సుఖాంభోధి వే
లాచంద్రోదయ మైన దేవుఁడు కృపాలంకారచిత్తంబునన్
జూచున్ మాచయబ్రహ్మధీమణిఁ గవిస్తోమైకచింతామణిన్.

ఈమాచయబ్రహ్మని శాసన మొకటి పల్నాడు తాలూకాలోని కారెమపూఁడిలో నున్నదనియు, దానిని తాముచూచితిమి కాని వ్రాసికొనరాలేదనియు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఉత్తరహరివంశ పీఠికలో వ్రాసియున్నారు. కారెంపూడిలో మాచయనాయనింగారి శాసనములు రెండు శా. శ. ౧౨౨౫-౧౨౨౬ సంవత్సరములనాఁటివి కలవు. శ్రీశాస్త్రులువారు చూచినశాసనమా రెంటిలో నేదైన నగునో కాదో చెప్పఁజాలను వొప్పిచర్లలో మాచయసాహిణిపేర నొకశాసనము కలదు. (A. R. 549, 561, 564 1909) ఇవి నాచనసోముని పెంచుకలదినశాసనముకంటె నలువదిసంవత్సరములు పూర్వము పుట్టినవి కడపమండలమువాఁడైన నాచనసోముఁడు గుంటూరుమండలమునకువచ్చి కృతియిచ్చెనా? ఎటు చెప్పుటకునవకాశములేదు. మాచయబ్రహ్మయనఁగా నీతఁడు మాచయగారి బ్రహ్మయ యని యందు మేని, యీశాసనములలోని మాచయ, బ్రహ్మయకుఁ దండ్రి యనిచెప్పవచ్చును. కాలమును సరిపోవును.

ఈమాచయబ్రహ్మనిమీఁది యీక్రిందిచాటువు చాటుపద్యమణిమంజరిలోఁ బ్రకటితమయినది.

సీ. కమలంబునకుఁబుట్టి కమలంబుచుట్టమై
కమలంబు తననాభిఁ గాంచి గాక
గంగకు నుదయించి గంగ నౌదలఁ దాల్చి
గంగలో భువనంబు గలిపి గాక

జలరాశి జన్మించి జలరాశి లంఘించి
జలరాశి బాణాగ్నిఁ జమరి గాక
వహ్నికినుదయించి వహ్ని నెచ్చెలిఁ జేసి
వహ్ని ఖాండవముపైఁ బ్రాఁకి గాక
గీ. ఊరకెవ్వారు నీతోడ నోరయువారు
బుద్ధితేజోరమాశౌర్యభూతియత్న
కాంతివిక్రమఖ్యాతిసంగతుల నలరి
ప్రాభవోదార ! మాచయబ్రహ్మధీర !

వసంతవిలాసమునుండి లక్షణవేత్త లుదాహరించినపద్యములఁ గొన్నిటి నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

శా. ప్రాలేయప్రతిసీరసేనఁ బఱపెన్ బైపై వసంతంబిలన్
గాలోన్మీలితకోరకోదరపరాగప్రోక్షకోపాగ్నులై
హేలాపానవిహారపౌరమహిళాహంకారదోస్సారమై
హేలాపల్లవహేతిఖండితమహాహేమంతసామంతమై.

వితాళచౌపద: వీణాగానము వెన్నెలతేట
రాణమీఱఁగా రమణులపాట
ప్రాణమైనపిన్రబ్రాహ్మణు వీట
జాణలు మెత్తురు జాజరపాట.

క. అత్తరి విటనాగరికులు
చిత్తముల వసంతకేలి చివురొత్తంగా
మొత్తములు గట్టి తరచిరి
ముత్తెపుజల్లులకుఁ దోఃబూగటగొమ్మల్.

అప్పకవి నాచనసోముని దనియుదాహరించిన యీక్రిందిపద్య మేగ్రంథమునందలిదో తెలియలేదు.

శా. నాతోమార్కొనలేరు నిర్జరపురీనాగేంద్రబృందారకా
రాతున్ మున్నుగ దేవసంఘములు ఘోర స్థిరసంగ్రామకుం

డీత్రైలోక్యమునందుఁ గల్గఁడు రణం బెచ్చోట లేకుండఁగాఁ
జేతు ల్వ్రేయు వృథాభరం బగుచు వచ్చెన్ దేవ యీ మేనికిన్.

ఈపద్యము త్తరహరివంశమున బాణాసురకథలో నుండవలసిన దిగాఁ గన్పట్టుచున్నది. కాని యందు లేదు. ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశ మునను లేదు. భాగవతమునను లేదు.

వెల్లంకి తాతంభట్టు నాచనసోమనాథుని దని చెప్పిన యీక్రింది పద్య మేగ్రంథములోనిదో తెలియ లేదు.

క. ఆపాదశిరోలంకా
రాపాదిత చారుతాభిరామాత్మీయా
రూపాలోకనతుష్టా
కూపారకుమారి కాముకురమణిబింబా!

నాచనసోముని హరివిలాసము లోనిదని, కస్తూరిరంగకవి తన కస్తూరిరంగ రాట్ఛందమున నీక్రింది రెండుకందపద్యముల నుదాహరించి యున్నాఁడు సోమకవివసంతవిలాసమే యీహరవిలాసమో కాక వేఱు గ్రంథమో తెలియదు. ఈపద్యములు శ్రీనాథుని హరవిలాసములోని వేమోయని పరీక్షించిచూచితిని గాని యందీపద్యములు కన్పట్టలేదు. ఈగ్రంథము హరవిలాసమో హరివిలాసమో సంశయముగానున్నవి.

ఈతనికవితాశైలి చూపుటకై ఉత్తరహరివంశములోని కొన్ని పద్యముల నిట నుదాహరించుచున్నాఁడను

ఉత్తరహరివంశము:—

చ. చతురవచోవిలాసగుణసాగర ? సాగరమేఖలావనీ
పతి యగునీకు నింతు లొకరు బోఁతియె ? నీవిటు గోరు టెల్ల నా
యతులితభాగ్య ; మింతనిజ ; మైనఁ గలంగకమున్న వైభవో
న్నతి మెఱయంగ వచ్చి యొకనాఁ డయినన్ నను గారవించితే.

క. తనవలచుకాంత యేపని
మానసమునఁ దలఁచినను జేయు మగవానికి న
వ్వనిత బిగియారు కౌఁగిలి
దినదినమును మదనకామధేనువు గాదే. ఆ ౨.

సీ. అభ్రంకషం బైనయాలపోతు నితండు
త్రుంచినాఁ డీతండు పెంచినాఁడు
సాధుసమ్మతముగా సామజంబు నితండు
గాచినాఁ డీతండు ద్రోచినాఁడు
బర్హిర్ముఖార్థమై పర్వతేశు నితండు
దాల్చినాఁ డీతండు వ్రాల్చినాఁడు
ఫణపరంపరతోడి పన్నగేంద్రు నితండు
మెట్టినాఁ డీతండు సుట్టినాఁడు

తే. నేఁడు నాఁడును నాఁడును నేఁడు మనకు
జూపఁ జెప్పంగఁ జెప్పంగఁ జూపఁ గలిగె
ననుచుఁ గొనియాడు సంయమిజనుల కొదవె
రజతగిరిమీఁద హరిహరారాధనంబు ఆ ౨

చ. తొలితొలి రుక్మిణీరమణితో నెఱవాదివి నెత్తమాడుమా
గెలిచెద వేని మేలు సరికిం దగ నాడెద సూఁడు వట్టి నీ
కొలఁది యెఱుంగమే యనుడుఁ గోపము గన్నులఁ గ్రోలి నవ్వి య
చ్చెలువలతోడ శౌరి పొలిచెం జతురంతసమాసనంబునన్. ఆ ౩.

సీ. వడఁకు పన్నగరాజు పడగలమీఁద స
ర్వంసహాకాంత ప్రేరణము సూప
నుబ్బూత లూఁగెడునుదయాస్తగిరులతో
నాకాశలక్ష్మి కోలాట మాడఁ
దెరలెత్తి సప్తసాగరములుఁ బొరలంగ
వరుణుండు గొండిలి పరిఢవింప

మెకముల చాయ వేఱొక చందముగ నిల్చి
కమలసంభవుఁడు ప్రేంఖణ మొనర్ప

తే. మంగళములోని పేరిలాలమూడ్కిఁ జుక్క-
లిక్కడక్కడ పడ దిక్క లెనిమిదియును
బగులఁ బాతాళతలము గుబ్బటిలఁ జెలఁగె
శౌరి పూరింప నపాంచజన్యరవము. ఆ ర.

నా చ న సో మ ుఁ డు — "హ ర వి లా స ము"

క. జయవిజయవినుత జన్యా
వ్యయదూరానందరూప భాసురదత్తా
భయహారిహయముఖ నిర్జర
నయనన్నతకత్రియూథ! నళినీనాథా!

క. శంబరవైరి! విభంజన!
సాంబశివా! యంధకప్రశాసక! గజచ
ర్మాంబరధర! యని నీదుప
దంబులు పూజించువాఁడు ధన్యుఁడు సుమీ!

క. జయమగుటకు నీమది సం
శయ మేటికి విను మనుచు సమంచితకరుణా
లయుఁ డగుమునీంద్రుఁ డెంతయుఁ
బ్రియముగ మంత్రంబు చెప్పె నృపతికి నెలమిన్.

క. మానితిలక! సజ్జనసం
తానమహీరుహా! భవత్సుధాలాపము నా
వీనులకు విం దొనర్చెన్
మేనునఁ గలతాప మణఁచె మృపగాదుసుమీ!



# 47. అప్పనమంత్రి

భోజమహారాజుచే సంస్కృతమునరచియింపఁబడిన చారుచర్య యనువైద్యగ్రంథము నీకవి యాంధ్రీకరించెను: ఈ గ్రంథమును ముక్త్యాలసంస్థానాధీశులు బ్రి. వేటూరి ప్రభాకరశాస్త్రులుగారిపీఠికతోఁ బ్రకటించియున్నారు. ఈ గ్రంథమునఁగవి తననుగూర్చి యిట్లువ్రాసి కొనియున్నాఁడు.

క. ప్రత్యూహబహుళతిమిరా
దిత్యుఁడు శ్రీకీర్తిభారతీసంతతసం
పత్ప్రసన్నుఁడు శ్రీహరి
నిత్యుఁడు నాగాంబ యప్పనికిఁ బ్రియ మొసఁగున్.

సీ. విద్వన్నుతుండు భారద్వాజగోత్రుఁ డా
పస్తంబసూత్రుండు పరమపుణ్య
విమలోజ్జ్వలాంగి గోవిందార్యునకుఁ గుల
ద్వయశిరోభూషణ ధర్మచరిత
నాగమాంబకుఁ గూర్మినందనుఁ డప్పయ
మణిమాళిసింగనామాత్యు మేన
యల్లుఁడు ధార్మికుఁ డనఘుండు శ్రీవల్ల
భాచార్యకృతమున్మంచు హరిపదాంబు

గీ. జాతషట్పదుఁ డుభయభాషాకవిత్వ
మానవైదగ్ధ్యుఁ డప్పనమంత్రి విదుఁడు
సంస్కృతంబున నొప్పారు చారుచర్యఁ
దెనుఁగు సేసెఁ దానెంతయుఁ దేటపడఁగ

ఉ. రాజహితంబు పొంటె సుకరంబుగ వైద్యసునీతిధర్మని
ర్వ్యాజపథానుసారమధురంబుగ నిర్జరభాషఁ దొల్లియా
భోజునిచేతఁ జెప్పఁబడి పొల్పగు నీకృతి నూత్నసత్కళా
భోజుఁడు మంత్రియప్పన ప్రబుద్ధుఁడు చేసెఁ దెనుంగు బాసగన్.

పైపద్యములనుబట్టి యీతఁడు నియోగిబ్రాహ్మణుఁడనియు, నాపస్తంబసూత్రుఁడనియు, భారద్వాజగోత్రుఁడనియు, గోవిందార్యనాగమాంబికలకుఁ బుత్రుఁడనియు, సింగనామాత్యునకు మేనల్లుఁడనియు, వల్లభాచార్యున కగ్రజుఁడనియు, నుభయభాషాకవిత్వవిశారదుఁ డనియుఁ దెలియుచున్నది.

చారుచర్యలోని యీక్రిందిపద్యమును, మడికి సింగనకవి తనసకలనీతికథానమున నుదాహరించియున్నాఁడు. కావున నీకవి సింగనామాత్యునికంటెఁ బూర్వపువాఁడనుట నిశ్చయము. కవి సింగనామాత్యుఁడు తనకు మేనమామయని పైపద్యములో వ్రాసియున్నాఁడు. కాని యీసింగన మడికిసింగన కాఁడు. మడికిసింగన భారద్వాజగోత్రుఁడు. మేనమామయు మేనయల్లుఁడు నేక గోత్రీయులగుట యసంభవము. మడికిసింగనకవి క్రీ శ ౧౪౨౦ ప్రాంతమువాఁడు. కావున, నీయప్పనకవిని పదునాల్గవశతాబ్దియందలి కవులలోనొక్కనిగా బరిగణింపవచ్చునని తలంచుచున్నాఁడను.

ఈచారుచర్య 75 పద్యములు కలది. భోజవిరచిత మగుచారుచర్య రెండువిధములుగా నున్నదనియు, నందొకటి పెద్దదనియు, నొకటి చిన్నదనియు, మంత్రి యప్పనగ్రంథ మారెంటికినిగూడ ననువాదముగాక సంగ్రహముగా వ్రాయఁబడిన యొకచిన్నగ్రంథ మనియు, ప్రభాకరశాస్త్రిలుగారు పీఠికలో వ్రాసియున్నారు. ఇదియాత్మసంబోధనగ్రంథము. ఇట్టిగ్రంథము బద్దెనసీతిసార మొకటి కలదనియు, దానికి దీనికిని శైలిసాదృశ్యము కలదనియు, నందుచే నీకవి తిక్కనబద్దెనలతో సమకాలికుఁడై యుండునని ప్రభాకరశాస్త్రిలుగా రభిప్రాయపడి యున్నారు. కవిత్వశైలి తెలియుటకై మూఁడుపద్యముల నిట నుదాహరించుచున్నాఁడను.

ఉ. అంగసుఖంబు దుర్గుణము లారయఁ బొందనిమందు, మేనికిన్
రంగు సుపోషణంబు సుకరంబునఁ బ్రాయము మళ్లివచ్చు న

భ్యంగనమాచరించుటకుఁ దర్హవిధం బగునుష్ణవారిఁ జే
యం గడునొప్ప నాల్గుగడియల్ జలకంబు యథావిధిజ్ఞుఁడై.

మ. ఇరుప్రొద్దు న్నరుఁ డల్పభోజియయి, తా నేప్రొద్దు శుద్ధాత్ముఁడై
చరణత్రాణములందు నేమరక యోజం బగ్వవర్జ్యంబుగాఁ
బరనారీరత మాంసధంబుక్రియ నిర్వ్యాంఛామతిం బొంది యో
క్రూరుఁడున్ నిద్రభజింప వీతభయదాఖ్యంగాంచు శ్రీయుక్తుఁడై

చ. గొనకొని కొండముచ్చులఁ జకోరములన్ శుకశారికావలిన్
బెనుతురు భూపతుల్ విషము పెట్టినయన్నము చూచి యోలిఁ జ
య్యన నవి వెంట్రుకల్ విడువ నక్షులు మూయుఁగఁ గూయు
చుండఁగాఁ

గని కుటిలప్రయోగములు గాంచుటకై నృపమంత్రిశేఖరా !

ఈపద్యమే మడికిసింగనచేనుదాహరింపఁబడినది. ఈకవితనను గూర్చి చెప్పుకొనిన పద్యములోఁ దండ్రికంటెఁ దల్లికిఁ బ్రాముఖ్యము నిచ్చియున్నాఁడు. తండ్రి బాల్యముననే గతించెనేమో ! ఈతనినివాస మెచ్చటనో తెలియదు. "మంత్రిశేఖరా! గణకలలామా!" యని సంబోధించుకొనినాఁడు. కాని తనప్రభువెవరో, ఏగ్రామమో చెప్ప లేదు. చారుచర్యయందలి పద్యములలోఁ గొన్ని పెదపాటి జగ్గనసంధానగ్రంథములోఁ జేరినవి. ఈతని నివాసము కృష్ణామండల మని తోఁచుచున్నది. పేరునుబట్టి విశాఖమండల వాస్తవ్యుఁడైనను గావచ్చునని యూహ కలుగుచున్నది. ఈతనిపేరు మంత్రి యప్పన యనుటచే నీతనిగృహనామము మంత్రివారై యుండునని సంశయము కలుగును. కాని యొకతావున, నప్పనమంత్రి యనుటచే నేదియు నిశ్చయింప నను వగుచున్నది. 'మంత్రి' అనునింటిపేరు గలవారు నియోగులలో నున్నారు.

ఈకవి క్రీ. శ. ౧౩౫౦ ప్రాంతము వాఁడని నాయభిప్రాయము. ఈకవిచారిత్రమింతకంటె నేమియు నధికముగ నిప్పటి వఱకుఁ దెలియరాలేదు.

## 48. చిమ్మపూడి యమరేశ్వరుఁడు

లక్షణగ్రంథములయం దుదాహరింపఁబడిన పద్యములవలనను గొందఱాంధ్రకవులు తమకావ్యములలో నీతనిని స్తుతించియుండుట వలనను నీతనిపే రెఱుంగఁగలిగితిమి. ఇతఁడు రచియించిన గ్రంథ మిప్పుడేదియుఁ గానవచ్చుట లేదు. ఇతనిని తమ గ్రంథములలోఁ జేర్కొనిన కవుల నామములను వారి వాక్యములను నీక్రింద నిచ్చుచున్నాఁడను.

"పేరెన్నిక కెక్కినట్టి యమరేశ్వరు" —అనంతామాత్యుఁడు.

"పేరెన్నిక జిమ్మపూడి యమరేశ్వరు"—ప్రౌఢకవి మల్లన్న.

"చెన్నమరిన చిమ్మపూడి యమరాధిపు"నూతనకవి సూరన్న.

"వచఃప్రసాద సంసిద్ధునిఁ జిమ్మపూడి కులశేఖరు నయ్యమరేశ సత్కవిన్" —అంగర నృసింహకవి.

"అమరేశ్వరుని సహస్రముఖదృష్టి"—రామరాజభూషణుఁడు.

"అమరేశ్వరురి దలఁతు మత్కులచంద్రుల సత్కవీంద్రులన్"
కొఱవి గోపరాజు

"అమరేంద్రుఁదలఁతు" —అయ్యలంకి బాలసరస్వతి

"అమరేశు" —కూచిమంచిజగ్గకవి

"జిమ్మపూడి యమరేశు" —ఒకకవి

"జిమ్మపూడి యమరాధిపుఁడన్నను" వల్లభామాత్యుఁడు

ఈకవి విక్రమసేన మనుపద్యకావ్యమును రచియించినట్లు కూచిమంచి తిమ్మకవి రచించిన సర్వలక్షణసార సంగ్రహములో నుదహరించిన లక్ష్యములను బట్టియు, పెదపాటి జగ్గన ప్రబంధరత్నావళిలో నుదాహరించిన పద్యములనుబట్టియుఁ దెలియుచున్నది.

అనంతామాత్యుఁడును వల్లభామాత్యుఁడును నీ యమరేశ్వరుని నుతించియుండిరి. కావున నీతఁడు శ్రీనాథునికంటెఁ బూర్వుఁడనియు నెఱ్ఱాప్రెగ్గడ కాలమున ౧౩౫౦ ప్రాంతమున నున్నవాఁడనియుఁ జెప్పవచ్చును. ఈతనినిగూర్చిన వివరము లింక నేమియుఁ

దెలియవు ఇతనిది రసవంత మగుకవిత్వ మగుటంబట్టియు, నెవ్వరైన నీపద్యములను జదివి యందలి స్వారస్యమును గ్రహించి యీగ్రంథమును సంపాదింపఁ బ్రయత్నింతురనియుఁ దలంచి లభించినపద్యములలో ౨౦ పద్యముల నీక్రిందఁ బొందుపఱచుచున్నాఁడను.

సీ. సారథి శతవృద్ధు చక్రంబు లొనగూడి
జరగవు రథమున సంఘటించి,
యుదకంబు సోకున కోర్వనియురదంబు
చేతికి బిరుసైన ప్రాతివిల్లు
గఱితాఁకు కోర్వక గడగడ వడఁకుచు
మువ్వంకఁ బోయెడి చివ్వనారి,
మేపు నీరును లేక మెదలాడ నోపక
వర్ణహీనం బైనవారువములు
గీ. నిట్టిసాధనములు నీకు నెట్లు లొదవెఁ
ద్రిపురముల నెట్లు గెలిచితి దేవదేవ!
యనుచు నగజాత చెలు లాడ నలరు శివుఁడు
చిత్త మిగురొత్త మనల రక్షించుఁ గాత!

చ. చనవున రెండువక్త్రములుచన్నులపా ల్గుడువంగ నొక్కమో
ము నగఁగనొక్కయాననము ముద్దునటింపఁగ నొక్కయాస్యము
న్గనగ ని దేమిపల్కు దనియాలపనంబునఁ బెక్కులించు ను
బ్బున నగు షణ్ముఖుం డెలమి బొంది త్రిశక్తులు మాకు నీవుతన్

చ. గొనయము తమ్మినూల్ చెఱకుఁగోల ధనుర్లత పూవు లమ్ము లే
టును నొకమాటు తా నతనుఁడున్ మును నుగ్గు జయించె జీవరా
శి నొడుచు టేమిచెప్ప నని చేయునుతుల్ తగుమోహాన ప్రవ
ర్తనగలకాముఁ డీవుత ముదంబున మీకిలఁ గామసౌఖ్యముల్.

సీ. భట్టనారాయణ భాషారమాదేవి
లబ్ధవర్ణుల కర్థలబ్ధిఁ జేయు,

బాణవాగ్భామినీ ప్రసవ మంజరి విశా
　　రదుల కలంకారరమణఁ జేయు
రాజశేఖరభారతీజహ్నుకన్యక
　　సుకవీంద్రులకు భావశుద్ధిఁ జేయు
మాఘ వాణీశీతమారుతగతి సార
　　మతులకు రోమోద్గమంబుఁ జేయు

గీ. నని యెఱింగి వారియడుగులు దలఁచి న
　మస్కరించి దండి మఱిమురారి
వామనుని గుణాఢ్యు క్షేమేంద్రు నిల నలం
కారవిదులఁ దలఁచి గారవమున.

సీ. పరిత్యగ్రిరచనాతిభాసుర ప్రాసాద
　　నిర్జితగోత్రావనీధరంబు
ప్రాకారశిఖరాగ్ర బంధురమణిగణ
　　ద్విగుణితతారకా విభ్రమంబు
పరిఖాజలాంతర ప్రతిబింబితద్రుమ
　　న్మారిత పాతాళభూరుహంబు
వరపుష్పసారభావర్జిత మధుప శూ
　　న్యీకృతా శావారణేంద్రగండ

గీ మప్సరస్స్త్రీ ప్రహాణీయ లీలాతిశయ వి
లాసినీ జననేత్రవిలాస జనిత
కుసుమశరబాణ వైహ్వాత్య మసదృశార్థ
నిర్జితాలక ముజ్జయినీపురంబు

మ. కులశైలంబులలో సువర్ణగిరి, దిక్కుంభీంద్రవర్గంబులో
బలభిన్నాగము, లోకపాలకులలోఁ బర్జన్యుఁ డుగ్రోరగం
బులలో శేషుఁడు, పెంపుఁగన్నకరణిం బూజ్యాధిపశ్రేణిలో
వెలసెన్ విక్రమసేన భూవిభుఁడు దోర్వీర్యప్రతాపంబునన్.

సీ. ప్రాణంబులెడల నభ్యాసంబు సేయుమా
ర్గంబన నిట్టూర్పుగాడ్పు లెసఁగ
గవ్యశాలను నేయిగ్రిమ్ముక్రై వడిఁ గామ
శిఖిఁ గ్రాఁగి మైదీఁగె చెమట వోడమ
మదనునమ్ములు నీరుపదను పెట్టినక్రియ
వాలుఁగన్నులు బాష్పవారి మునుఁగఁ
బగలేమటయు నోడఁబడు రథాంగము చంద
మునఁ జన్నులు ముభోద్గమము వడంక

గీ. ప్రాణ మెడలి నెఱపు వడిన... యొడలు
భూషణములతోడి పొత్తు విడిచి
లాఁతులైరిసఖులు లలఁతులు వాయని
ప్రాతవైరి నిషధరాజసుతకు.

సీ. ధర వియోగుల నెల్లఁ బరిమార్పఁ బూని హ్రా
ద్భవుఁడు గట్టిన పీఁపట్ట మనఁగ
విరహులపై దండు వెడలుచో మదనున
కెత్తిన కెంజివు రెల్లి యనఁగఁ
దోయధి వెడఁగ్రుంకఁ ద్రోఁచుపురందర
కుంభిసిందూరితకుంభ మనఁగఁ
గులిశాయుధుని పెద్దకొలువునఁ జెన్నొంద
దీపించు మాణిక్యదీప మనఁగఁ

గీ. కుముదినీరాగ రససిద్ధఘుటిక యనఁగఁ
గాముని నిరంజనౌషధికబళ మనఁగఁ
బొడుపుఁ గెంపున బింబంబు పొలుపు మిగులఁ
జంద్రుఁ డుదయించెఁ గాంతిని స్తంద్రుఁ డగుచు.

చ. మరలఁగఁబోదు రిండ్లకును మా పవునంతకుఁ జేలలోపలం
దిరిగి యొకింత లేఁతవడ దేరెడు మోములఁ జెన్ను సేయుచున్
బిరిగొని కాళ్లిలుద్భృగుళ్లుచులపెల్లునఁ జీఁకటి నెల్ల బాచినం
దెరువరు లర్థిఁ గూడఁ బఱతేరఁగఁ బామరభామినీజనుల్

సీ. సుదతులు డస్సినచో నలంతలు వోవ
సొబగుఁ దై చలిమిరి చూపి చూపి,
యువిదలు తిలకించియున్నచో వేడుకఁ
గొలఁది మీఱఁగ నొజ్జఁ గుదిసి కుదిసి
సొబగులు పెనఁకువచోఁ దాన వలఁతి వై
మెఱుకువ వాసన కెక్కి యెక్కి
వెలఁదులు ముదమున విహరించుచో సోయ
గంబున వీథులఁ గ్రాలి క్రాలి

గీ. యతులితం బైనశృంగారరతుల నిజవి
భూతి పొం దాస సేసి తత్పురములోనఁ
బవలు రేయును నుడుగక తవిలి తిరుగు
మిండఁడును బోలె మందానిలుండు లీల.

సీ. పాంథులహృదయముల్ పల్లటంబులు సేయ
దర్పకుపనిచిన దం డనంగ
విరహిమృగంబుల సురిఁగింపఁ దివిరెడు
కాయసంభవుని మొక్కలమనంగఁ
గడు నల్గి చైత్రు నాగారంబు ముద్రింప
మనసిజుపనిచిన యనుఁగు లనఁగ
సహచరుం డగు గంధవహుఁ గానఁగా మీన
కేతనుపంచినదూత లనఁగ

గీ. నభినవాకారసౌందర్య సుభగలీల
లతిశయంబుగ మెలఁగుచు నసమబాణు

పుష్పలావికాజనముల పోలె నెఱసి
కోమలాంగులు పువ్వులు గోసి రెలమి

సీ. పరిణతాఘణిలతాపత్రింబుఁ గదిసిన
చివుర్చునాఁ జెక్కునఁ జేయి చేర్చి
కందర్పమదకరికరముపైఁ జక్కన
లెఱఁగెనాఁ దొడఁ గుచ మిఱియమోపి
దవనంబు పొరకలఁ గవిసిన మంచు నాఁ
బలుచని చెమట మైఁ గలసి మెఱయఁ
గలువరేకులు మౌక్తికముల నీనెడిని నాఁ
గన్నులఁ బొప్పం పుఁ గణము లురలఁ

గీ. వేడినిట్టూర్పుగాడ్పులు విరహవహ్ని
శిఖలు ప్రబలంగ వలవంత చింత నొగిలి
యేకతం బున్నదాని రాజేంద్రతనయఁ
గనిరి లతికాగృహంబులో వనజముఖులు.

చ. పలుచని చంద్రికారసము ప్రిన్నినినున్నని తేట క్రొమ్మెఱుం
గులతుదల న్విదిర్చి నెలక్రొమ్ములకాంతి పసిండినిగ్గుతోఁ
గలిపి యలంతివన్నెనిడి కాయజునిల్పిన రత్నపు త్రిక
న్నలువ సజీవిఁ జేసెనొకొ నాఁ దగు భాతిని నాతిచూడ్కికిన్

ఉ. పూవులప్రోవులై చిలుకబోదలు కోయిలపిండుమందలై
తావులక్రోవులై యలివితానము గానము తానకంబునై
కావను బండఁజాలుటఁ ద్రికాలముఁ గల్గ రవంబుఁ గన్నయ
ట్లై వనరాజి పొల్పగుఁ బురాంతికభూముల నెల్లఁ జూడఁగన్.

చ. పొడవుగ నెల్లయంగళులఁ బ్రోవులు వోసిన నూత్నరత్నముల్
కడఁక ననేకవేషములు గైకొని వచ్చిన యర్థికోటికిన్
బిడికెఁడు లాదిగాఁగ బలివెట్టుదు రప్పురి వైశ్యభామిను
ల్కడపక హస్తకంకణ ఝుళధ్వను లొప్పఁగ నెల్లయప్పుడున్.

సీ. కేలిఁ దెప్పము సేసి క్రాలి లీలావతి
ఈఁదించుచును నొక్కయింతి డాసి
చేయిచ్చి యిందు విచ్చేయుమంచును దన్వి
నడిపించుచును నొక్కపడఁతి నూదిఁ
ముదితచేహూడను ముద్దులాడుచు నొక్క-
తరుణికి నిమ్మలఁ దమ్మియొసఁగి
రమణిపాపటఁ బుష్పరజముఁ బోయుచు నిదే
మిగిలెఁ గొమ్మని యొక్కమగువ కిచ్చి

గీ. కదలఁబడినట్టు లొక్కతెఁ గౌఁగిలించి
ముంపు మునిఁగిన ట్లొక్కతె మోవి యాని
లలితనాయక కేలివిలాసమమర
లీల జలకేలిసలిపె భూపాలసుతుఁడు

చ. కొలఁదికి మీఱఁ బెద్ద యగు కోట తనర్పవ వస్తుసంతతో
జ్జ్వలతరిసత్ప్రభాతిరవిచంద్రరుచుల్ సొర నేరకున్న సం
ధ్యలు దివసత్రియామలును దత్పురిపౌరజనం బెఱుంగుద
వమ్మలముచవిన్ విహంగగతిఁ బూవులతావి రతిప్రసంగతిన్.

గీ. కమలినీకాంత యెంతయుఁ గంది వాడ
వారుణీసక్తు డై వసువ్యయము చేసి
యరిగినట్లు సరాగియై యంబరంబుఁ
దొఱఁగి పశ్చిమ జలధిలో నుఱికెఁ దరణి.

చ. వరముఁడు కంధరస్థలము పై నిడి వేడుక ముద్దులాడఁగాఁ
గరమున మాళి గంగ యుదకంబులు మెల్పునఁ బీల్చియాని శ్రీ
కరములు భూషణేందునకు గారవతారకలీలఁ జేయుత
త్కరివదనుండు మత్కృతికిఁ దాను ముఖస్థితితోడఁ దోడగున్.

ఉ. వల్లభుఁ డేగు దుర్లభుఁడు వానిదెసం దగు లూది యిమ్మెయిన్
దల్లడ మందె దేల యుచితస్థితికి న్ననుఁ బాపఁజూచినన్

దల్లియు బంధులోకమును దండ్రియు నే మను వా రెఱింగిరే
నుల్లమ యిట్లు నీకుఁ దగునో తగదో పరికించిచూడుమా !

ఆ. నీర సగ్న యునికి యారయ విస్మయం
బనుచు బాడబాగ్ని కడలి యప్పు
రంబు బొల్చె నొక్కరత్నాకరము మణు
లనఁగఁ జెలువ మమరు నాపణములు.

కొఱవి గోపరాజీతని నుతించుటలో "మత్కులచంద్రిల" నని చెప్పియుండుటచే నీయమరేశ్వరుని నియోగిశాఖకుఁ జెందిన బ్రాహ్మణుఁ డని నిశ్చయింపవచ్చును.

ఇందలి కథానాయకుఁడు నిషధరాజగు నలచక్రవర్తి కుమారుఁ డైన విక్రమసేనుఁ డని తోఁచుచున్నది.



## 49. దోనయామాత్యకవి

ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; శ్రీవత్సగోత్రుఁడు; సూచిరాజు రుద్రాంబలకుఁ బుత్త్రుఁడు.

ఈకవి సస్యానందము, సర్వలోకాశ్రయము నను రెండుపద్యకావ్యములను రచియించెను. సస్యానందము నాలుగాశ్వాసములు గల చిన్నకావ్యము ఇందు మొత్తము ౨౨౫ పద్యములుగలవు. దీనిని శ్రీశైలమందలి మల్లిఖార్జునస్వామి కంకితము చేసెను. ఏసంవత్సరమున వర్షము లెట్లుకురియునో పంట లెట్లుపండునో, అతివృష్టియోగములు, అనావృష్టియోగములు మొదలగు వ్యవసాయకుల కుపయోగించు విషయములు పెక్కులు దీనఁగలవు. ఈకవి రచించిన సర్వలోకాశ్రయ మిప్పుడెచ్చటను గానరాదు. అందలి విషయమును దెలియదు. సస్యానందమునఁ గవివృత్తాంత మీక్రింది గద్యపద్యముల వలనఁ దెలియవచ్చుచున్నది.

క. వనజాసను మానసమున
జనియించి తపం బొనర్చి జలమధ్యమునం
దును మును లాపస్తంబుం
డని కొనియాడంగ నిశ్చలాత్ముం డగుచున్.

వ అట్టి యాపస్తంబసూత్రంబున

క. వత్సలుఁ డనవద్యుఁడు ని
ర్మత్సరుఁ డష్టాంగ యోగమహనీయుఁడు శ్రీ
వత్సాంకమూర్తియును శ్రీ
వత్సమునీంద్రాన్వయమున వైభవయుతుఁడున్.

ఉ ధీనిధి సూచిరాజునకు ధీరగుణాన్విత రుద్రమాంబకున్
సూనుఁడ ధర్మతత్పరుఁడ సోమకళాధరపాద పంకజ
ధ్యానపరాయణుండ నయతత్త్వవివేక విచారదక్షుఁడన్
గోనయనామధేయుఁడ వికుంఠచరిత్రరసైకలోలుఁడన్.

సీ. వసుధలోనఁ బరమవంశవిభూషణ
మైనన న్నుపేంద్రుఁ డాదరింప
ప్రాకటంబుగ సర్వలోకాశ్రయముఁ జెప్పి
మిన్నుముట్టఁ గీర్తిఁ గన్నవాఁడ.

క. సదమలవాక్యస్ఫురణము
పదలాలిత్యంబుఁజూచి, ప్రాజ్ఞులు మెచ్చన్
ముదమున సప్యానందము
వదలక రచియింతు విబుధవర్గం బలరన్.

ఈకవిపేరు "గోనయ" యని ముద్రిత ప్రతులలో నున్నను, తాళపత్రప్రతులలో "దోనయ నామధేయుఁడ విధూతకళంక పవిత్ర చిత్తుఁడన్" అనియున్నదనియు, దీనిని మొట్టమొదట క్రీ. శ. ౧౮౯౧ లో ముద్రించినప్రతిని పరిశోధించిన శ్రీ తడకమళ్ళ వేంకటకృష్ణా

రావు పంతులుగారు, వ్రాఁతప్రతియందలి "దో" యనునక్షరమును "గో" యనుకొని, గూయన స్వామీ కవియనుటచే యతిభంగము గా కుండుటకై "విభూతి"యనుపదమును"వికుంఠ" యనిసవరించియుందు రనియు శ్రీ నిడదవోలు వేంకటరావుగారు భారతిపత్రికలో (వ్యయ-జ్యేష్ఠము) వ్రాసియున్నారు. ఇది సత్యమనుటకు సంశయింప నక్కఱ లేదు. కవి దోనయామాత్యుఁడే కాని గోనయకాఁడు.

కొన్ని తాళపత్ర ప్రతులలో నిది "అద్దంకి లింగకవి" కృతమైన ట్లీక్రిందిగద్యపద్యములలో నున్నది.

"ఇది సకలజనస్తుత్య గ్రోణయామాత్య (దోనయామాత్య) పుత్ర అద్దంకి లింగకవి నామధేయ ప్రణీతం బైన సస్యానందంబున"

క. ఈసస్యానందమునకు
భాసురముగ కాలగతులు పరమార్థముగా
నీసవి నెఱుఁగుఁ డని కృతిని
వాసన నద్దంకిలింగవర్యుఁడు చెప్పెన్."

గ్రంథము లింగకవి కృతముకా దనుట నిశ్చయమే. కాని యీతఁడు దోనయామాత్యుని కుమారుఁడా ? యని శంకకలుగుచు న్నది. అట్లయ్యోనేని, కవిని "అద్దంకి దోనయామాత్యుం డనవలసి వచ్చును. అద్దంకివారీ మండలమునం దున్నారు. కాని వారు కాశ్యప గోత్రులు. దోనయామాత్యుఁడు శ్రీవత్సగోత్రుఁడు. అద్దంకివారిలో శ్రీవత్సగోత్రులున్నా రని తెలియువఱకును లింగకవి, దోనయామా త్యుని కుమారుఁడుకాఁ డనియుఁ బ్రతివిలేఖకుఁడే తనపేరు నందుఁ జేర్చికొనెననియు నిశ్చయింపవలసియున్నది.

గ్రంథరచనాకాలమును దాళపత్రవ్రాఁత ప్రతులలో వేఱు వేఱువిధమున నీక్రింది రెండుపద్యములలో నిచ్చియున్నాఁ డని శ్రీ వేంకటరావుపంతులుగారు వ్రాసియున్నారు.

క. కరినగదినకర శశిన
　త్సరములు భువిఁ బరగుచుండ సన్యానందం
　బిం పుగ శ్రీగిరినాథున
　కరుదుగ రచియించె దోనయామాత్యుఁ డిలన్.

క. కరవసుధిశశిశశన (కరవసుదినకర)
　త్సరములు దివి బెరుగుచుండ సన్యానందం
　బరయగ శ్రీగిరినాథున
　కరుదుగ రచియించె దోనయామాత్యుఁ డిలన్.

మొదటిపద్యము ననుసరించి శా. శ. ౧౨౭౮యును, రెండవపద్యమును బట్టి ౧౨౮౨యును, రెండవపద్యములోని "కర" ను "కరి" గానెంచి నచో ౧౨౮౮యును గ్రంథరచనాకాల మయినట్లు తెలియుచున్నది. కావున దోనయామాత్యుఁ డీగ్రంథమును శా. శ. ౧౨౮౦ క్రీ. శ. ౧౩౫౮ ప్రాంతమున రచియించినట్లు నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

　　పై నుదాహరించిన గీతపద్యములో, "నన్ను పేందుృఁడాదరింప ... సర్వలోకాశ్రయుఁడు జెప్పి" అని కవియుదాహరించియున్నాఁడు. సర్వలోకాశ్రయుఁడు బిరుదము చాళుక్యులకున్నది. దీనినిబట్టిచాళుక్యులచరిత్ర మిందునన్నిత మైయుండునని యూహింపనగును. కవి నాదరించినయు పేందుృఁడుతూర్పుచాళుక్యవంశములోనివాఁడు. ఉపేంద్రనామధారులు నల్గురైదుగు రుండుటచేనందుఁ గవిపోషకుఁడెవ్వఁడో తెలిసికొనుటకై వారి వంశవృక్షము నీక్రింద నిచ్చుచున్నాఁడను.

ఈక్రింది వంశవృక్షమునకు రెండుశాసనములాధారములు.(ద.హిం.శా. సం౬.సంఖ్య౬౬౨-౬౬౩) ఇందులో మొదటిదానియందువిజయాదిత్యుఁడు కులోత్తుంగునికుమారుఁ డైనట్లున్నది. రెండవదానియందుఁ గులోత్తుంగునకుఁ బిమ్మట "తస్మిన్ కులే" అనివ్రాసిపిమ్మట విజయాదిత్యుని పే రుదాహరించినాఁడు. అందుచే, కులోత్తుంగునివంశములోనివిజయాదిత్యుఁ డని శాసనకర్తయుద్దేశ మని గ్రహింపవలసియున్నది.

విమలాదిత్యుఁడు

రాజరాజనరేంద్రుఁడు (మహాభారతకృతిభర్త)

కులోత్తుంగుఁడు

విజయాదిత్యుఁడు శా. శ. ౧౧౨౭

మల్లపదేవుఁడు = లక్ష్మీదేవి

(1) ఉపేంద్రుఁడు = గంగాంబ శా. శ. ౧౧౨౫-౧౧౮౧

మల్లపదేవుఁడు = చోడాంబ

(2) ఉపేంద్రుఁడు = మల్లాంబ శా. శ ౧౨౦౫

(రాజనారాయణాంకుఁడు) కొప్పరాజు = గంగాంబ శా. శ. ౧౨౩౬

(3) ఉపేంద్రుఁడు = భీమాంబ

చెన్నేశ = ముమ్మడమ్మ

(4) మనమోపేంద్రుఁడు = లక్ష్మాంబ ఈమెకు మూర్తి అంబికాదేవి ౧౩౦౦

(5) ఉపేంద్రుఁడు చోడేంద్రుఁడు శా. శ. ౧౨౯౪

విశ్వేశ్వరరాజు శా. శ ౧౨౯౯, ౧౩౨౩ ౧౩౨౯

ఉపేంద్ర నాగేంద్ర నృసింహ

కులోత్తుంగుఁడు, రాజరాజు మొదలగువారు ప్రఖ్యాత పురుషులగుటచే వారినామములను దాహరించి, వారివంశములోనివాఁడని ఈవంశము నకు మూలపురుషుఁ డైన విజయాదిత్యునుదాహరించినారు రాజరాజు నకు సవతిసోదరుఁడైన విజయాదిత్యుఁ డొకఁడు కలఁడు కాని యాత నికి శక్తివర్మ యనుకుమారుఁడే కాని మల్లనదేవుఁ డనుతనయుఁడు న్నాఁడని యెచ్చటను జెప్పలేదు. ఇదిగాక తరువాతివారిశాసనముల లోనికాలమునుబట్టి చూచినను, వంశవృక్షములోని విజయాదిత్యుఁడు ను పైవిజయాదిత్యుఁడును, ఒక్కఁడు కారని స్పష్ట మగుచున్నది. ఇఁకను బేటవిజయాదిత్యుఁ డొకఁ డున్నాఁడు ఇతఁడు తూర్పుచాళు క్యవంశములోనివాఁడే. రాజరాజునకుఁబినముత్తాతకొడుకు. ఇతని వంశమును ఆంధ్రకవితరంగిణి మొదటిసంపుటము ౯౨వ పుటలోనిచ్చి యున్నాఁడను. అందు విజయాదిత్యుఁడును, మల్లపదేవుఁడునున్నారు. వారే యీవంశవృక్షములోని విజయాదిత్య మల్లపదేవులని చెప్పఁజాల ము. కాని మొత్తముమీఁద నావంశములోనివారే వీరని చెప్పుటకు సంశయింప నక్కఱలేదు.

పైఁజూపిన వంశవృక్షములోనివారు విశాఖపట్టణమండలము లోని ఎలమంచిలి రాజధానిగా ఎలమంచిలిప్రసిద్ధి తాలూకాలను బరి పాలించియుండిరని చరిత్రకారులు వ్రాసియున్నారు. "ఎలమంచిలి" శాసనములలో "ఎలమంచి" అని చెప్పఁబడినది. వంశవృక్షము నందలి విశ్వేశ్వరరాజునకు చిన్నకోట పెద్దనకవి తనకావ్యాలంకార చూడా మణిని కృతి యిచ్చియుండెను. ఈతని శాసనములు శా. శ. ౧౨౯౯, ౧౩౨౩, ౧౩౨౯ సంవత్సరములలోఁ గన్పట్టుచున్నది. (దహిం. శా) సం. ౬ సంఖ్య ౮౪౦, ౯౧౯, ౬౬౫)

మల్లపదేవమహారాజులభార్య చోడమహాదేవియును, నీయన సుతుఁ డైనయుపేంద్రచక్రవర్తియుఁ గలసి వ్రాయించిన శా. శ. ౧౨౦౫ నాఁటియొకశాసనముకలదు. (దహిం. శా.సం.౬సంఖ్య౯౩౮.

తలిదండ్రులనామముల నుదాహరించుటచే నీతఁడు రెండవయుపేంద్రుఁ డనుట స్పష్టము.

శా. శ. ౧౨౩౮లో "ఉపేంద్రదేవచక్రవర్తులసుపుత్రుఁడైన రాజనారాయణచక్రవర్తి" యొకశాసనము వ్రాయించిరి. (ద హిం. శా. సం ౬ సంఖ్య ౧౩౮) ఇందలి యుపేంద్రుఁడు రెండవవాఁడనియు, నీతనికుమారుఁడైన కొప్పరాజు శాసనకర్తయని చెప్పుటకు సంశయింప నక్కఱలేదు.

శా. శ. ౧౧౭౫ లో ఉపేంద్రదేవచక్రవర్తి తమతండ్రి మల్లప్ప దేవచక్రవర్తికి ధర్మార్థము దానముచేసి వ్రాయించిన శాసనమొకటియున్నది (ద. హిం. శా సం. ౪ సంఖ్య౧౩౭౧)ఇతఁడు మొదటియుపేంద్రుఁ డనుట స్పష్టము. శా. శ. ౧౧౮౧లో ఉపేంద్ర దేవచక్రవర్తి శాసన మింకొకటి కలదు. శాసనమునుబట్టి యితఁడే యుపేంద్రుఁడో తెలియదు. కాని కాలమునుబట్టియీతఁడు మొదటి యుపేంద్రుఁడనుట స్పష్టము.

శా. శ. ౧౨౯౪ లో చెన్నిశ్వారుని భార్యయుమ్మడమ్మయు నామెతనయుఁడైనయుపేంద్రదేవచక్రవర్తియు నొకశాసనము వ్రాయించినారు. (ద హిం. శా. సం ౬ సంఖ్య౯౨౧) ఇతఁడైదవయుపేంద్రుఁడు.

శా. శ. ౧౩౦౦సంవత్సరమున "ఎలమంచిమహారాజులక్కము దేవికూఁతురు అంబికాదేవి" యొకశాసనమువ్రాయించినది. (ద హిం శా. సం ౬ సంఖ్య ౯౧౬) ఈమెవిశ్వేశ్వరమహారాజు సోదరియైయుండునని తలంపవచ్చును.

శా. శ. ౧౨౭౮ సంవత్సరమునందు ఉపేంద్రదేవచక్రవర్తి శాసనమొకటి కలదు. (ద. హిం. శా. సం ౬ సంఖ్య ౯౧౦). ఇతఁడే యుపేంద్రుఁడో శాసనమువలన దెలియుటలేదు. ఇతఁడు మూఁడవ

యాతఁడు గాని, నాల్గవ యుపేంద్రుఁడు గాని కావచ్చును. విశ్వేశ్వరరాజుశాసనము ౧౨౫౯ వ సంవత్సరమున నుండుటచే నిదినాల్గవ యుపేంద్రునిదిగాఁ దలంపఁదగు నని నాయభిప్రాయము. శాసనములో మనుమఁడుపేంద్రుఁ డనిలేదు. కాని యంతమాత్రమున నిది యాత నిది కాదనియనరాదు. ఈసంవత్సరమునందే దోనయామాత్యుఁడు సస్యానందమును వ్రాసియుండెను. సర్వలోకాశ్రయ మంతకుపూర్వము రచియించియుండెను. కావున నందుదాహరించినయుపేంద్రుఁడు మూఁడవయాతఁ డని యనుకొనవలసియున్నది. బ్ర. నిడదవోలు వేంకటరావుపంతులుగారు మూఁడవయుపేంద్రుఁడే దోనయ నాదరించిన వాఁ డని నిర్ధారణము చేసియున్నారు. కాని యితఁడు నాల్గవయాతఁ డని యనుటకుఁగూడ నవకాశము లేకపోలేదు. సస్యానందరచనాకాలము శా. శ. ౧౨౭౮ కాక, ౧౨౫౨ గాని ౧౨౮౮ గాని అయియున్నచో నీయుపేంద్రుఁడు నాల్గవయాతఁ డని నిశ్చయింపవచ్చును. ఇతరాధారములు దొరకువఱకు నిదమిత్థమని నిర్ణయింపలేము. అయినను బ్రస్తుతమున మూఁడవ యుపేంద్రుఁడే యీతనినాదరించినవాఁ డని నిశ్చయింతము

శా. శ. ౧౧౨౭ వ సంవత్సరమునఁ దూర్పుచాళుక్యప్రశస్తి నుదాహరించుచు, విజయాదిత్యచక్రవర్తియప్పయైన గోమతీదేవి యొకశాసనమువ్రాయించినది. (దహిం శా. సం ౭ సంఖ్య౧౨౫౭) ఇందలివిజయాదిత్యచక్రవర్తియుఁ బైవంశవృక్షమునందలి మూలపురుషుఁడైనవిజయాదిత్యుఁడు నొక్కఁడే యనుటకుఁ గాల మడ్డము రాదు. కావున నాయూహయందు సత్యమున్నదనియే తలంప వలసియున్నది.

కవికాశ్రయదాత యైనయుపేంద్రునిఁబట్టియు, సస్యానందమున:—

చ. దురితమహోల్కఁ బెంపుడిపి దుఃఖదవానల మార్చి చక్రవి
స్ఫురణ తటిల్లతామహిమ సొంపు వహింపన నారతంబున నా

దరమున సింహాశైలమునఁ దగ్గయు వేడ్కఁ జరింపుచున్న సుం
దరజలదంబు ధాత్రికి సుధాంతకృపామృతవృష్టిఁ జేయుతన్''

అనిసింహాచలస్వామిని నుతించుటంబట్టియుఁ గవినివాసము విశాఖ మండల మనియూహింప నగును. కవి వీరశైవుఁడు కాఁడు గాని ''సోమకళాధరపాదపంకజధ్యానపరాయణుండ'' నని వ్రాసికొనుటవలనను, శ్రీగిరిమల్లిఖార్జునునకు సస్యానందమును గృతియిచ్చుటచేతను శివభక్తియుక్తుఁ డని చెప్పవలసియున్నది.

నేను పదునాఱేండ్ల వయసున నున్నప్పు డీసస్యానందమును జదివి, రాఁబోవుసంవత్సరమునఁ గురియువర్షమును దెలిసికొనుటకై సస్యానందమందలి యీక్రిందిపద్యమునుబట్టి తులాపరీక్షఁ జేసియుందు సత్యమున్నదని కనుగొంటిని.

సీ. దైవజ్ఞు లాత్మ మీఁదటియేట వర్షంబు
కొలఁదిని దెలియంగఁ గోరిరేని
పుష్యమాసంబునఁ బున్నమమునిమాపు
దొరకొని పలిమెడు దూదియుంచి
మడకలోపలఁ బెట్టి మఱుగేమియునులేని
పొడవున నిడి వేగుబోక దూది
పిడువంగ ధారయై బెరసిన నయ్యేట
వానకాలములోన వఱపులేదు.

అందులేక కొన్ని బిందువు లగునేని
మధ్యవృష్టి దూది మంచునిట
దోఁగ దేని, వానవోగదు మేదిని
చిన్మయప్రకాశ! శ్రీగిరీశ!

ఈకవి కవితాశైలి తెలియుటకై మఱినాల్గుపద్యముల నుదాహరించుచున్నాఁడను.

క. హరిదశ్వుఁడు వృశ్చికమున
కరిగెడు నెడ రెంట మూఁట నల నాల్గింటన్
దిరమై కవిబుధగురుహిము
కరు లుండిన ధాత్రి యెల్లకడలం బండున్. ౧ అ

గీ. ఎన్నఁడేని భానుఁ డేపార రోహిణి
గూడియుండ శశిని గూడెనేని
నింగి నాటిమూపు నిశ్శేషమై యున్న
వానకొలఁది దెలియవశము గాదు ౨ అ

క. పోలుపగు నాషాఢంబున
దొలిపాద్యమి మృగశిరంబుతోఁ గూడి ఘనా
వలి యాకసమునఁ బన్నిన
వెలయు ధరం బూర్వసస్యవితతులు తఱచై...... ౩ అ

గీ. నెఱయ గురుఁడు రోహిణీమధ్యమమున నుండి
వక్రయుక్తుఁ డయిన వాన లేదు
చాయ తారలందు వక్రించి నిలిచిన
వారిమయముఁ జేయు వసుధ యెల్ల.

"ఈ గ్రంథమున మేఘనిర్ణయము, ధాతుప్రకారము, గర్భకాలము, మాసగర్భలక్షణములు, ద్రోణపరిమాణము, చంద్రయోగము, ఫలపక్తి యోగము, వాయుప్రకారము, ఈతిలక్షణము. గ్రహణోత్పాతము, గ్రహచారలక్షణము, వర్షప్రశ్నోత్తరములు మొదలగునవి చెప్పఁబడినవి. శాస్త్రీయవిషయము లగుటచే గ్రంథ మంతయు సుబోధ మగు కవితతో నున్నది. ఈగ్రంథమును శాస్త్రీయ దృష్టిచేత నేగాక భాషావిషయ దృష్టిచేతను బరిశీలింపఁ దగియున్నది. రచన ప్రాచీనధోరణి ననుసరించియున్నది. తరువోజ, తోటకము మున్నగు ప్రాచీన వృత్తములు వాడఁబడినవి. "చెలువగుచున్న యట్టిమృగశీరుషమాదిగ" మున్నగు ప్రయోగములు 'నూలుపున్నము'

'ఓరంత హద్దు' 'సుడక' మున్నగు తెలుగుపదములును బ్రియుక్తము లైనవి. కవిరాజవిరాజితమున నన్నయభట్టు మతము ననుసరించి యొక టియే యతిస్థానము కలదు. మఱియు జ్యోతిశ్శాస్త్ర సాంకేతిక పద జాలముకూడ నీకవి వాడియున్నాఁడు.''



## 50. పశుపతి నాగనాథుఁడు

ఆంధ్రసాహిత్యపరిషత్తునం దున్న యుదాహరణ గ్రంథములో పశుపతి నాగనాథుని శ్రీవిష్ణుపురాణములోని దని యీక్రిందిపద్య ముదాహరింప బడియున్నది.

ఉ. మాసరిమయ్యె నంత మధుమాసము పాంథవిలాసినీ జన
  త్రాసము పుష్పబాణనవరాజ్యవిలాసము వల్లరీవధూ
  హాసము మత్తకోకిలసమంచిత పంచమనాదమంజు వి
  న్యాసము జీవలోకహృదయంగమసౌఖ్యవికాస మెంతయున్.

నిజామురాష్ట్రములో ఏకశిలానగర దక్షిణభాగమున నున్న అయ్యనవోలు దేవస్థానమునందలి స్తంభముపైన నొక శాసనమున్నది. అది పద్మనాయకకులజుఁడైన సింగమనాయని అనపోతానాయఁడు శా. శ. ౧౨౭౧ అగు సౌమ్యసంవత్సర శ్రావణశుద్ధపంచమీశనివా రమునాఁడు ఓరుగంటి దక్షిణాన అయ్యనవోలితీర్థస్వామియైనమైలా రదేవరకు పవిత్రారోహణ మహోత్సవపుణ్యసమయమందు అష్టభోగ సహితముగా అయ్యనవోలు గ్రామమును సమర్పించివేయించినది. ఆశాసనమునందు శాసనవిషయములు సంస్కృతభాషలో ౨౭ శ్లోక ములలోను ఆంధ్రములోనుగూడ వ్రాయబడినవి. ఆశాసనమును రచించినవాఁడీపశుపతి నాగనాథుఁడే శాసనాంతమున "ఇతిశ్రీకా శికబ్రహ్మర్షి గోత్రజనునా పశుపతిపండిత పుత్త్రేణ నాగనాథకవి నా లిఖితమిదం శాసనంశాశ్వతప్రతిష్ఠమస్తుమంగళంమహా. శ్రీ శ్రీ శ్రీ"

ఈశాసనకాలము క్రీ. శ. ౧౩౬౯ సంవత్సరమయినది. కావున నీకవి యానాటివాఁడని స్పష్టమగుచున్నది. పైశాసనమును శ్రీనాథ కవి చారిత్రమున నిచ్చెదను. ఈ నాగనాథకవి, మదనవిలాస మను భాణమును సంస్కృతమున రచియించి అనపోతానాయనికిఁ గృతి యిచ్చెను. "చమత్కారమంజరి" యనురసాలంకార సాహిత్యలక్షణ గ్రంథమును రచియించిన విశ్వేశ్వర కవిచంద్రున కీతఁడు శిష్యుఁడు. ఈ గురుశిష్యు లిరువురు ననపోతానాయని యాస్థానము నలంకరించి యున్నవారు.

పైశాసనమునుబట్టి యీనాగనాథకవి పదునాల్గవశతాబ్దియం దుత్తరార్ధమున నున్నవాఁ డనుట నిశ్చయము. విష్ణుపురాణము నాంధ్రీకరించినవారిలో నీతఁడే మొదటివాఁడు. ఈతనిగ్రంథము లభింపకపోవుట యాంధ్రులదురదృష్టము. అనపోతానాయఁడు, నైజామురాష్ట్రిమందలిరాచకొండరాజ్యమును బరిపాలించిన వెలమనాయకుఁడు. కావున నీకవియు నాప్రాంతములయందు శ్రీనాథపోతనార్యులకుఁబూర్వమున నున్నవాఁ డనిచెప్పుటకు సంశయింపనక్కఱలేదు. ఈతని తండ్రి పశుపతిపండితుఁడు. ఈతఁడింకను గొన్నిసంస్కృతాంధ్రిగ్రంథములు రచించియుండును. కాని వానిపేరులయినను దొరకలేదు.

సింహాసనద్వాత్రింశకను రచించిన కొఱవిగోపరాజు పూర్వకవిస్తుతిని జేయుచు:——

చ. అనఘు హుళక్కిభాస్కరు మహామతిఁ బిల్లలమఱ్ఱి వీరరా
జును ఘను నాగరాజుఁ గవిసోమునిఁ దిక్కనసోమయాజిఁ గే
తనకవి, రంగనాథు నుచితజ్ఞుని నెఱ్ఱన నాచిరాజు సో
మన నమరేశ్వరుం దలఁతు మక్కలచంద్రుల సత్కవీంద్రులన్.

అనిచెప్పియున్నాఁడు. ఇందలినాగరాజు పశుపతినాగనాథుఁ డైయుండునని బ్రి. శ్రీ నిడదవోలు వేంకటరావుగారు వ్రాయుచున్నారు. అది సత్యమేయని తోఁచుచున్నది. ఆకాలమున నాగనాథుఁ డనుపేరుగల

కవి యింకొకఁడు గన్పట్టలేదు. నాగనాథుఁడు రాచకొండసంస్థాన మున నున్న పండితుఁడు. గోపరాజునకుఁ బెదతండ్రివరుసలో నున్న బాచనసింగన లేయనపోతనాయునికిఁ బిమ్మట రాచకొండసంస్థానము నఁ గుమారసింగమనాయనికడ మంత్రులుగా నుండియుండిరి. కావున గోపరాజీ నాగనాథుని స్మరించియుండును. ఈయూహ నిజమయ్యేనేని పైపద్యములో "మత్కులచంద్రుల' నని చెప్పియుండుటచే నాగనా థుఁడు నియోగిబ్రాహ్మణుఁడని చెప్పవచ్చును. మదనవిలాసభాణ మైనను సంపూర్ణప్రతి దొరకలేదు. కావున నీకవినిగూర్చి యిఁకనేమియు వ్రాయజాలనైతిని.

పైనఁజెప్పిన కుమారసింగమనాయఁడే రసార్ణవసుధాకరమును రచించిన సర్వజ్ఞసింగమనాయఁడు ఈతని తాతకూడ సింగమనా యఁడే యగుటచే నీతనిని గుమారసింగమనాయఁ డందురు. శార్ఙ్గదే వకృత మగుసంగీతరత్నాకరమునకు, సింగభూపాలుఁడును, నాగనాథు నిసుతుఁ డగుగంగాధరుఁడును కలసి సంగీతసుధాకర మనువ్యాఖ్యను రచించియుండిరని, శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు భారతి (ధాతసం॥ కార్తికమాసము)లో "సంగీతరత్నాకరవ్యాఖ్యలు" అను శీర్షికక్రింద వ్రాసిన వ్యాసములోఁ జెప్పియున్నారు. ఆగంగాధరునితండ్రి యీ నాగనాథు డేమోయని సంశయముకలుగుచున్నది నాగనాథకవి అన పోతానాయనియాస్థానకవి. అనపోతానాయనికుమారుఁడును రసార్ణ వసుధాకరకర్తయు నైనసర్వజ్ఞసింగమనాయనికడ, నాగనాథకవికు మారుఁడైనగంగాధరుఁ డుండి, యాతనితోఁ గలసిసంగీతసుధాకరనా మవ్యాఖ్యను రచించినాడనుటలో విరుద్ధమేమియును లేదు. కానిగంగా ధరుఁడు వేసికొనిన గద్యలోని "ఇతిశ్రీనర్మదాతటాధీశ్వర మహారా జాధిరాజ శ్రీగోపినాథధర్మాధికారభట్ట శ్రీశ్రీనాగనాథసుత" అనువా క్యములను సమన్వయించినగాని, పైనఁజెప్పినసంబంధము స్థిరపడనే రదు. ఈవిషయ మింకను శోధింపఁబడవలసియున్నది.

---

# 51. భవదూరుఁడు

ఇతని సంపూర్తినామము భాస్కరభవదూరమహీపతియనియు నీతఁడు, విజయనగర పరిపాలకులగు సంగమవంశజుఁడైన మొదటి బుక్కరాయల కుమారుఁడనియు, నాతనికాలమున తూర్పునాఁటిని ఈ భవదూరుఁడు పరిపాలించెననియు పోరుమామిళ్ళ తటాకమును నిర్మించినవాఁ డీభవదూరుఁడే యనియు నీతనిపద్యములు సంకలిత గ్రంథములలోఁ గానవచ్చుచున్నవనియు, నీతఁడు రచించిన గ్రంథములు గానవచ్చుట లేదనియు, ప్రాచీనులలోఁ గొందఱుకవు లీతనిని నుతించినవారు గలరనియు శ్రీనిడదవోలు వేంకటరావుగారు భారతి పత్రికలో వ్రాసియున్నారు. మల్హణచరిత్రను రచించిన యెడపాటి యెఱ్ఱనకవి

చ. వినుతు లొనర్తు నాంధ్రసుకవిప్రభు నన్నయభట్టు దిక్కయ
   జ్వను, శివదేవు, భాస్కరుని, జక్కన నాచనసోము సర్వదే
   వుని, భవదూరు వేము నలపోతనఁ బిల్లలమఱ్ఱి వీరభ
   ద్రుని శరభాంకు వీరకవి ధూర్జటిఁ గేతన భట్టబాణునిన్.

కురగా రామకవి, అయ్యంకి బాలసరస్వతులుకూడ నాగరఖండమున నీతనిని నుతించియున్నారు. మొదటిబుక్కరాయల కుమారు లేడుగురిలో భాస్కరుఁ డాఱవవాఁడు ఆతఁడే యీతఁడైనచో, మొదటిబుక్కరాయలకాలము క్రీ. శ. ౧౩౪౩-౧౩౭౯ కావుననీభవదూరుఁడు నాకాలమువాఁ డనుటనిశ్చయము

ఈతనిపోరుమామిళ్ళశాసనము శా. శ. ౧౨౯౧ సౌమ్యసంవత్సరములోనిది (క్రీ. శ. ౧౩౬౯) పోరుమామిళ్ళగ్రామము కడపమండలము నందలి బద్వేలతాలూకాలోనిది (A.R. 91 of 1903)

ఇతఁడు తండ్రికాలములోను, జ్యేష్ఠసోదరుఁడైన రెండవహరిహరరాయలకాలములోను వారియధికారమునకు లోఁబడి కడపమండలములోఁ గొంత దేశమును బాలించియుండును. ఈతనిగ్రంథము లేవియు లభింపకపోవుటచే నీతనినిగూర్చి యింక నేమియుఁ దెలియదు.

## 52. కొఱవి సత్యనారన

ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; హారితస గోత్రుడు సింగయగంగమలకుఁబుత్త్రుఁడు. అమరేశ్వరమంత్రికిఁబౌత్త్రుఁడు; సింహాసనద్వాత్రింశిక యనుప్రబంధమును రచించినకొఱవి గోపరాజున కీతఁడు పినతాత. ఈతనివంశవృక్షము నాగోపరాజుచరిత్రమున నిచ్చియున్నాఁడను. ఈకవికి భీమన యనునామాంతర ముండె ననియు, నితఁడాంధ్రకవితాపితామహబిరుదాంచితుఁడై రామాయణమును రచియించియుండె ననియు నీక్రిందిపద్యములో గోపరాజకవి వ్రాసియున్నాఁడు.

క. రామాయణకృతికృతియై
తా మెఱయుచు నంధ్రకవిపితామహుఁ డనఁగా
భూమిని మించిన భీమన
నామంబునఁ బరఁగె సత్యనారన ఘనుఁడై

ఇందలి మొదటిపాదములోని 'కృతికృతి' యనుశబ్దమునకు 'కృతిపతి' యనియును, పద్యాంతమందలి 'ఘనుఁడై' యను శబ్దమునకు "కవియై" యనియును పాఠాంతరములు కలవు. ఇతఁ డాంధ్రకవితాపితామహబిరుదాంచితుఁ డగుటచేఁ 'కృతిపతి' యనుపాఠముకంటెఁ గృతికృతి యనుపాఠమే సమంజస మని నాయభిప్రాయము. ఈతఁడు రచించిన రామాయణ మిప్పు డెచ్చటను గన్పట్టుట లేదు. ఇతఁడు రామాయణమును రచించెనని యిదివఱ కెవ్వరు నెఱుఁగరు. ఎప్పటికైన నీతనిగ్రంథము బయటపడునేమోయని యీతనినామమీగ్రంథమునఁ జేర్చితిని. ఇతని వంశచారిత్రమును గోపరాజుకవి చారిత్రమున వ్రాసియున్నాఁడను. ఇతనిపూర్వులు చందవోలు నివాసులు. కావున నితఁడును నచ్చటనే యుండియుండును. ఈతని యన్నకుమారులు సర్వజ్ఞసింగమనాయనిమంత్రులై యున్నారనియు వారికాలము క్రీ. శ. ౧౩౮౦ ప్రాంతమనియు గోపరాజుకవి చారిత్రమున నిర్ణ

యించియుంటిని. కావున నీతని కాలము పదునాల్గవ శతాబ్దియం దుత్త రార్థమై యుండును. ఈకవినిగూర్చి ప్రస్తుతమున నింతకంటె వ్రాయఁ దగిన దేమియు లేదు.

వెలనాటి పృథ్వీశ్వరుని మంత్రియై యసామాన్యఖ్యాతిని గడించిన వెన్నయామాత్యున కీకవి మనుమని మనుమఁడు. కావునఁ బై కాలము సరియైన దనియే చెప్పవచ్చును. ఈకవినివాసము నిజాము రాష్ట్రములోని రాచకొండప్రాంతమై యుండును.



## 53. శ్రీ గి రి క వి

ఇతఁడు నవనాథచరిత్రమును పద్యప్రబంధముగా రచియించినట్లు గౌరనమంత్రి, రచించిన ద్విపదనవనాథచరిత్రమున నీక్రింది విధమునఁ జెప్పియున్నాఁడు.

> "నవిరళయోగవిద్యాధికులైన
> నవనాథవరుల పుణ్యప్రవర్తనలు
> పరగ శ్రీగిరికవి పద్యబంధముల
> విరచించినాఁ డది ద్విపదకావ్యమునఁ
> జెప్పింపవలయుఁ బ్రసిద్ధి పెంపలర.

ఇప్పు డాగ్రంథ మెచ్చటను గనఁబడుట లేదు. ఈకవి యేకుల మువాఁడో యెప్పటివాఁడో యేమియుఁ దెలియదు. కాని గౌరనమంత్రికిఁ బూర్వుఁడగుటచే, క్రీ శ ౧౩౦౦-౧౪౦౦ నడుమ నుండెననుట స్పష్టము. ఇతఁడు "శ్రీగిరీశ" యనుమకుటముతో శ్రీగిరిశతకమును రచించెనని చెప్పుదురు. మడికిసింగన సకలనీతిసమ్మతమున శ్రీగిరిశతకము లోనిదని యీక్రిందిపద్యము నుదాహరించియున్నాఁడు.

సీ. జీతంబు గిలిబిలి చిలుకలు దూరంబు
వహిఁ జూడ నది పొల్లు వ్రాఁతకల్ల

అపరాధములు కోటి నృపుఁ జంపఁ డనుపాటి
మాన్యత వెడవెడ మాటబొంకు
కోపంబు ముమ్మడి కోలాస నలుమడి
సత్య మూరజ విూగి జమలితొట్టు
ఆచార మెడఁదప్పు నాశ్రిమ మట్టట్టు
దొరతనం బది పూఁత దురము లేఁత
చరిత మెల్ల నింద్రజాలంబు తలఁపెల్ల
నెల్లిదంబు మాటలెల్ల దంభ
మిట్టికుమతిఁ గొలిచి యెవ్వాఁడు మననోపుఁ
జిరతరప్రకాశ ! శ్రీగిరీశ !

ఈశతకమును నిప్పుడగపడుటలేదు. పడమటి గోదావరిమండలము లోనిభీమవరముతాలూకా మోగల్లుగ్రామమున ప్రమథకవి శ్రీగిరి యనునతఁ డొకఁడు అనవేమారెడ్డికాలములో నున్నట్లు రెండుశాసనములు గన్పట్టుచున్నవి. అన వేమారెడ్డి, ఆశ్రీగిరికి భూదాన మొసంగియున్నాఁడు (A.R.No. 753, 754 of 1920) "ప్రమథకవి" శబ్దమాయనయింటిపేరో లేక "శివకవి" యనునర్థ మిచ్చుబిరుదమో తెలియదు. ఆతఁడే నవనాథచరిత్రమును రచించినవాఁ డేమో పరిశోధింపవలసియున్నది. ఆతఁడే యాతఁ డైనచో నీకవికాలము క్రీ. శ ౧౩౭౦ ప్రాంత మగును.

ఈకవి శ్రీరంగ మహాత్మ్యమును పద్యకావ్యముగా రచించె నని తెలియుచున్నది. కాని యీగ్రంథ మిప్పుడెచ్చటను గానరాదు.



## 54. శాకల్య అయ్యలార్యుఁడు

ఇతఁడు భాస్కరరామాయణ యుద్ధకాండమున, హుళక్కి భాస్కరకవి రచింపఁగా మిగిలినభాగమును రచించి నట్లీ క్రింది పద్య గద్యములవలనఁ దెలియుచున్నది.

చ. అమరహుళక్కి భాస్కరమహాకవి చెప్పఁగనున్న యుద్ధకాం
డము తరువాయి చెప్పెఁ బ్రకటప్రతిభాషణుఁ డప్పలార్య స
త్తముఁసుతుఁ డయ్యలార్యుఁడు గృతస్థితి నార్యులు మెచ్చునట్లుగా
హిమకరతారకారవి మహీవలయస్థిర లక్ష్మి చేకుఱన్.

గద్యము:— ఇది శ్రీశాకల్యమల్లకవి వీరనరసింహావరజాప్ప లార్యనంద నోభయభాషాకవితావిశారద శారదాచరణకమలపరిచ రణ పరివీథమాన సాయ్యలార్యవిరచితం బయిన శ్రీరామాయణ మహాకావ్యంబునందు యుద్ధకాండశేషంబు సర్వంబు నేకాశ్వాసము"

ఈగద్యమువలన నీకవియప్పలార్య నందనుఁ డైనట్లును, వీర నరసింహుఁడీకవికిఁ బెదతండ్రి యైనట్లును, మల్లకవి పితామహుఁ డైన ట్లును దెలియుచున్నది. మల్లకవికూడ పెదతండ్రియే యనికొందఱను చున్నారు. ఈగద్యకు రెండువిధములనుగూడ నర్థము చెప్పవచ్చును. కాలములో నించుకభేదము కలుగునుగాని యీబాంధవ్య మెట్లున్నను బాధకముకాదు.

హుళక్కిభాస్కరుఁడును మల్లకవియుఁ బ్రతాపరుద్రునియాస్థా నమునం దున్నవారని సోమదేవరాజీయమునఁ జెప్పఁబడినది. కావున మల్లకవిమనుమఁ డైన (1) అయ్యలార్యుఁడు క్రీ. శ. ౧౩౭౦ ప్రాంత మున నీయుద్ధకాండశేషమును రచించియుండునని తలంపవచ్చును. ఈయయ్యలార్యుఁడు హుళక్కిభాస్కరకవికిమిత్రుఁడని వీరేశలింగము

---

(1) మాయూరనాకు లభించిన యొక తాళపత్రప్రతిలో అయ్యలార్యులు మల్లకవికి మనుమఁ డని ప్రతిలేఖకుఁడు వ్రాసికొని యుండుటచే నేనును మనుమఁ డనియే వ్రాసితిని.

పంతులుగారు వ్రాసియున్నారు. కాని యది సత్యముకాదు. ఈవిషయమును భాస్కరకవిచారిత్రమునఁజర్చించితిని. హుళక్కిభాస్కరునికాలమున నయ్యలార్యుఁడుండెనని నిశ్చయముగాఁ జెప్పఁజాలము. ఉండినను చిన్నవయసులో నుండియుండునుగాని వారిరువురును మిత్రులుగా నుండఁదగినవయసులోఁ నుండియుండరు. అయ్యలార్యునితాతయును భాస్కరుఁడును మిత్రులుగా నుందురు. అట్టిచో నయ్యలార్యుని మిత్రునిగాఁ దలంచుట సమంజసముకాదు

అయ్యలార్యుఁ డీభాగమును పెదవేదగిరినాయనింగారి ప్రేరణచే రచియింపఁబడినట్లు తాళపత్రప్రతులలో నున్నది. ఈ వేదగిరినాయనింగారు రేచర్లగోత్రుఁడైన పద్మనాయక కులజుఁడు. సర్వజ్ఞ సింగమనాయకప్రభువును, ఈతఁడును అన్నదమ్ములబిడ్డలు. సింగమనాయకునిమనుమఁడైన సర్వజ్ఞసింగమనాయనికాలము క్రీస్తుశకము ౧౩౭౦ ప్రాంతమని శ్రీనాథుని చారిత్రమునఁ జెప్పియున్నాఁడను. ఈవేదగిరినాయనింగారును, ఆకాలమువాఁడే. కావున నాతనిచే గ్రంథరచనమునకై ప్రేరేపింపఁబడిన మన యయ్యలార్యకవియు నాకాలమువాఁ డని చెప్పవచ్చును. ఇతఁడు యుద్ధకాండశేషమును క్రీ. శ. ౧౩౭౦ ప్రాంతమున రచించియుండును. ఇతనితాతయైన శాకల్యమల్లుభట్టు హుళక్కిభాస్కరునితోసమకాలికుఁడై, ద్వితీయప్రతాపరుద్రుని యాస్థానపండితుఁడుగానున్నట్లు సోమదేవరాజీయమునఁ జెప్పఁబడినది. కావున నీమల్లుభట్లు ద్వితీయప్రతాపరుద్రునిరాజ్యకాలమయిన క్రీ. శ. ౧౨౯౫-౧౩౨౩ మధ్యనున్నాఁ డనుట స్పష్టము. ఈతనిమనుమఁడైనయయ్యలార్యుఁడు ౧౩౭౦ ప్రాంతముననున్నాఁడనినచో నందు విరుద్ధ మేమియునులేదు. హుళక్కిభాస్కరుఁడు మల్లుభట్టుతోఁ గూడ నాకాలముననున్నవాఁడే. కావున హుళక్కిభాస్కరుని కాలమున నయ్యలార్యుఁడున్నాఁ డనిచెప్పుట కాధారములులేవు. భాస్కరుని తరువాత నే యయ్యలార్యుఁ డీయుద్ధకాండశేషమును బూరించెనని నిశ్చయింపఁదగియున్నది. వేదగిరినాయనింగారి పేరున్న శాసనమొకటి శా. శ.

౧౩౭౯ లోఁ గన్పట్టుచున్నది. అయ్యలార్యుని ప్రేరేపించిన వేదగిరి యాతఁడగునో కాదో చెప్పఁజాలము. ఈతఁడేయైనచో నయ్యలార్యుని రచనాకాలము గొంచె మీవలకు వచ్చునేమో!

అయ్యలార్యునిపితామహుఁ డైనమల్లుభట్టు సంస్కృతమున నిరోష్ఠ్యరామాయణమును రచియించినట్లు మతింగంటి సింగరాచార్యులు దశరథరాజనందనచరిత్రకృత్యాదియందుఁ జెప్పిన యీ క్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

మ. ముని రామాయణమున్ నిరోష్ఠ్యముగ నింపుల్ మీఱ శాకల్య మ
ల్లన తా సంస్కృతిభాషఁ జేసె నన నాలాగున్ జెవుల్ నిండఁగా
విను టే కాని ధరిత్రిపై నిజముగా వీక్షింప లే దట్టి దేఁ
దెయుఁగుం జేసెద నెల్లెడం గవులకుం దృష్టాంతమై యేర్పడన్.

ఈమల్లుభట్టు సంస్కృతభాషకు వ్యాకరణమును రచించినట్లు కాకునూర్యప్పకవి, యీ క్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు.

తే. సంస్కృతమునకు నాంధ్రభాషకును దొల్లి
లక్షణములు శాకల్లిమల్లన సుధీంద్ర
విన్నకోట పెద్దన సుకవిప్రముఖులు
క్షితినొనర్చిరి లోకోపకృతిగఁ బెక్కు.

ఈమల్లుభట్టు అన్యాయసంగ్రహానిఘంటువు నిర్మించె నని సంస్కృతవాఙ్మయచరిత్ర చెప్పుచున్నది. దానినే యప్పకవి యీపద్యములోఁ జెప్పియుండును.

ఈమల్లుభట్టు హరిహరరాయలయాస్థానమునఁ గవిగా నున్నాఁడనియు, విశిష్టాద్వైతమతప్రవర్తకు లయిన వేదాంతదేశికులవారికు మారు లగువరదదేశికులును, ఈమల్లుభట్టును శాస్త్రార్థములు సలిపి పరస్పరము శత్రువులుగా వర్తిల్లిరని వైష్ణవులగురుపరంపరాప్రభావమునం దున్నదనియు, నీతఁడు సంస్కృతమున "ఉదారరాఘవ మను గ్రంథమును రచించియున్నాఁడనియు బ్ర.శ్రీ. వేటూరిప్రభాకరశాస్త్రి

లుగారు వ్రాసియున్నారు. మల్లుభట్టుతండ్రి మాధవసుధియంట. మొదటిహరిహరరాయలు క్రీ. శ. ౧౩౩౬ మొదలు ౧౩౪౪ వఱకును రాజ్యపాలనము చేసినవాఁడు. ద్వితీయప్రతాపరాయల యనంతరమున నీమల్లకవి హరిహరరాయలయాస్థానమునఁజేరి యతని రాజ్యకాలమున మొదటిసంవత్సరములలో నుండియుండును. వేదాంతదేశికులు క్రీ. శ. ౧౨౬౭ వ సంవత్సరమున జన్మించి నూటరెండుసంవత్సరములు జీవించెనని చెప్పుదురు. ఆయన ముప్పదియవసంవత్సరమున వరదదేశికులు జన్మించి, తనముప్పదియవసంవత్సర ప్రాంతముననఁగా క్రీ శ. ౧౩౨౭ సంవత్సరకాలమున శాకల్యమల్లుభట్టుతో శాస్త్రార్థములు చేసియుండును. దీనినిబట్టిచూచినను, పైనిర్ణయించిన యయ్యలార్యుని కాలమునందు వ్యత్యాసములేదు. మల్లుభట్టు రచించిన సంస్కృతగ్రంథములేవియు నాకులభింపలేదు. అయ్యలార్యుని గోత్రాదికము తెలియరాలేదు. వైదికశాఖాబ్రాహ్మణుఁడనియు నిజామురాష్ట్రనివాసియనియుఁ దలంపవచ్చును.

అయ్యలార్యుని కవిత్వముప్రౌఢమై, సలక్షణమై, చక్కగానున్నది. ఆతనికవిత్వశైలి తెలియుటకై నాల్గుపద్యములనిట నుదాహరించుచున్నాఁడను.

మ. భజనీయం బనుచింతలేక మదిలోఁ బ్రాజ్యక్షమారాజ్యముం
దృజనీయంబుగఁ జేసి కాఱడవులం దద్భంగి వర్తింపఁగా
నిజమై యాపురుషార్థముం గలుగునే నిక్కంబుకాదే పుర
స్థజగన్మానితవస్తువుల విడిచినన్ సౌఖ్యంబు సిద్ధించునే ? ౧౨౪

శా. లంకానాథుఁడ సర్వరాక్షసకులాలంకారభూతుండ ని
శ్శంకుండన్ సమరంబులం దురుభుజాసారోగ్రుఁడన్ వాసవా
తంకాపాదనదక్షసాహసమహోదగ్రుండ నే నన్ను మీ
నాంకుం డిప్పుడు నీదునేత్రవిశిఖవ్యాలీఢుఁ జేసెన్ వెసన్ ౧౬౫

చ. ఎఱుఁగుదుఁ బద్మబాంధవకులేశుఁడు బంకజనాభుఁడౌట యే
నెఱుఁగుదు మున్న యిందిర మహీసుతయై తనరారుసీతగా
నెఱుఁగుదు నాకు రాఘవమహీశుని చేతివధక్రియంబు ని
క్కెఱిఁగియు ముక్తిఁబొందగ నభీష్టము గల్గుట నింత చేసితిన్. ౧౯౩౬

ఉ. సీతయుఁ దాను నంగజవశీకృతుఁడై వివిధోపభోగముల్
ప్రీతవిచారుఁడై యనుభవించుచునుండియు నప్రమాదుఁడై
భూతలభారమంతయు బ్రభూతబలంబునఁ దాల్చి సంతత
ఖ్యాతిమహోదయంబు దనరారఁగ రాఘవుఁడొప్పె నెంతయున్. ౨౬౮౮



## 55. ప్రకాశభారతీయోగి

ఇతఁ డనవేమారెడ్డియాస్థానమం దుండెడికవి. సంస్కృతాంధ్రములయం దనేక కావ్యములను రచియించెనని చెప్పుదురు. ఒక్క కావ్యమునుకూడ నిప్పుడగుపడుట లేదు. గోదావరి మండలమందలి దక్షారామ భీమేశ్వరునియాలయములోని శిలాశాసనములలో నీతనిరచనములు రెండుసీసపద్యములున్నవి. వానినీక్రిందఁ బొందుపఱచెదను.

ద. హిం శా. సం ర సంఖ్య ౧౩౭౯ :—

శకవరుషంబులు ౧౩౦౩గు నేంటివైశాఖశు ౧౦ గు

సీ. నంది దీపావళినాట్యకళ్యాణహో
మశనివారగయార్కమంటపములు
దిరుచుట్టుమాలియ దివ్యలింగంబుల
గుళ్లు వజ్రింపురాకోట గోపు
రములు పాతాళగేహములు సోపానభాం
డాగారవివిధధాన్యాలయములు

వంటయిండ్లును జతుర్ద్వారకవాటముల్
పేర్మి దక్షారామభీమనాథు
నగర నాచంద్రతారకోన్నతులు దిశల
వెలయఁ జేయించె ననవేము వేమరాను
చండధాముని జగనొబ్బగండఁ డహిత
ఖండనోద్దండదోర్దండమండనుండు.
సంఖ్య ౧౩౮౦:—

సీ. అమరాద్రి భీమేశ్వరావాస మభ్రిస
ప్తకము శ్రీసప్తగోదావరంబు
వలయాచలేంద్రంబు వజ్రింపుతాకోట
గులపర్వతంబులు గోపురములు
దిక్కుచుట్టుమాలిక యరవిందజాండ మ
మర్త్యలోకము నాట్యమంటపంబు
పరివారదేవతాభవనంబు లీచతు
ర్దశభువనంబులు దారకములు

తే॥ గనకకుంభతతులు గాఁగ దక్షారామ
మన్నపోతు వేమనానుజుండు
గడు నపూర్వసృష్టి గావించి వాసికి
... ... ... ... సితయశుండు.

ప్రకాశభారతీయోగికావ్యం
పెద్దనాచార్యలిఖితం.

ఆంధ్రకవితకు రెడ్డిరాజులకాలములో విశేషప్రోత్సాహము లభించినది. రంగనాథరామాయణమును రచియింపఁజేసి గోనబుద్ధారెడ్డియు నాతనితనయు లైనకాచరాజు విఠలరాజులును గీర్తిఁ గాంచియుండిరి కదా? కొండవీటిరెడ్డిప్రభువులలో మొదటివాఁడైన వేమా

రెడ్డి భారత, రామాయణ హరివంశములను రచించిన యెఱ్ఱాప్రెగ్గ డను బోషించి గౌరవమునందెను. మఱియు, వెన్నెలకంటిసూరనార్య కవి కగ్రహారము లిచ్చి యాదరించినట్లు జక్కయకవి విక్రమార్క చరిత్రమున నీక్రిందిపద్యములోఁ దెలిపియున్నాఁడు.

ఉ. వెన్నెలకంటిసూర్యుఁడు వివేకగుణాఢ్యుఁడు వేదశాస్త్రసం
పన్నుఁడు రెడ్డివేమనరపాలకుచేత మహాగ్రహారముల్
గొన్నకవీం దకుంజరుఁ డకుంఠితతేజుఁడు పెద్దతండ్రిగా
సన్నుతిగన్న సిద్ధనకు సంతతదానకళావినోదికిన్.

ఈవేమారెడ్డి పెద్దకుమారుఁ డైన యనపోతారెడ్డికూడ నాంధ్ర కవుల నాదరించిన ట్లీక్రిందిపద్యములో జక్కయ చెప్పియున్నాఁడు.

ఉ ఈనిఖిలంబు మెచ్చ నమరేశ్వరు దేవుఁడు జూడఁ గృష్ణవే
ణీనది సాక్షిగా నసికి నిల్చినరావుతుఁ గేసభూవిభుం
గానకుఁ దోలి వెన్నడిచి కాచిన వేమయయన్నపోతభూ
జానికి సత్ప్రబంధము లొసంగిన వెన్నెలకంటివారిలోన్.

వేమారెడ్డికి రెండవ కుమారుఁడైనయనవేమారెడ్డి కవిపండితపో షకుఁడనియు నౌదార్యముగలవాఁడనియు నీక్రిందిచాటువులవలనను, కథనుబట్టియు, దెలియుచున్నది. ఒకనాఁ డాతనియాస్థానమున కొఱు వేలనియోగిబ్రాహ్మణకవి వచ్చి:—

"శ్లో॥ అనవేమమహీపాల
స్వస్త్యస్తు తవ బాహవే
ఆహవేరిపుకోదండ
చంద్రమండలరాహవే.

అనుశ్లోకమును జెప్పఁగా నతఁడుసంతోషించి, యాతనికి మూఁడు వేల సువర్ణములు పారితోషిక మొసంగఁ బోయెనఁట! కవి వానిని స్వీకరింపక నేను నాలుగు వేలియ్యఁగా మీరు మూఁడువేలే యిచ్చె

ద రా యనెనఁట! నాలుగు వే లనఁగా తానుసమర్పించినశ్లోకములో నున్న నాలుగు వే యనునక్షరములని కవియభిప్రాయము. అప్పుడు రాజు నాలుగువేలే యిచ్చెద ననె నఁట ! దానిపై కవి నేనిచ్చినవే నాకిచ్చెదరా యనెనఁట! అట్లయిన నైదువే లిచ్చెదనని రాజు పలి కెనఁట ! నేనాఱువేలవాఁడను నన్ను తక్కువపఱచెదరా యని కవి వచించెనఁట! తక్కువ పఱుపక యేాఱువేలే యిచ్చెదనని రాజనె నఁట ! అందుకు కవి నేనుపుట్టువుచేతనే యేాఱువేలవాఁడనే యిం దధికమేమున్నదని యడిగెనఁట ! అధికముకావలసినచో రాజేడు వే లిచ్చెద ననెనఁట ! కవి యది గోదనసంఖ్య మంచిది కాదనెనఁట : రాజాతనివాక్చాతుర్యమునకు మెచ్చి యెనిమిది వే లిచ్చి సంతోష పెట్టి యాతనిని బంపివేసెనఁట ? ఇదివట్టికల్పనకథయే యైనను, అన వేమనృపాలుఁడు కవిత్వాభిమానము కలవాఁ డని యు మహోదాతయా నియు బోధించుచున్నది ”

క. కవితాకన్యకు నలుగురు
కవి జనకుఁడు భట్టు దాది గణుతింపంగా
నవరసరసికుఁడె పెనిమిటి
యవివేకియె తోడఁ బుట్టు వన వేమనృపా !

క. కొంచెపుజగములలోపల
నంచితముగ నీదుకీర్తి యనవేమనృపా !
మించెను గరి ముకురంబున
పంచాక్షరిలోన శివుఁడు బలసినభంగిన్.

గీ. పందికొ మ్మెక్కి పెనుబాముపడగ నెక్కి
మేటితాబేటివీఁ పెక్కి మెట్టలెక్కి
విసివి వేసారి యనవేమవిభునిఁ జేరి
రాణివాసంబుగతి మించె రత్నగర్భ.

క. రాకున్నఁ బిలువఁ డేనియు
రాకకు ముద మంది చేరి రమ్మనఁ డేనిన్

ఆఁకొన్న నియఁ జేవియు
నాకొలు వటు కాల్పనలయు ననవేమనృపా !

అనపోతనృపతియు ననవేమారెడ్డియుఁ గవిపండితపోషకులను బ్రఖ్యాతిని గాంచియుండిరి. కాని వీరుకృతిపొందిన గ్రంథము లేవియు గాన్పించుట లేదు. జక్కయకవిరచించినపద్యములో "ననపోతభూజానికిసత్ప్రబంధము లొసంగిన వెన్నెలకంటి సూరిలోన్" అనియును, వెన్నెలకంటి సూరనకవి విష్ణుపురాణమున: —

క. అనవేమ మండలేశ్వరుఁ
డును నల్లయవీరభద్రుఁడును మొదలుగఁ గ
ల్గినతొంటిరెడ్డిరాజులు
ఘనకీర్తులు గనిరి కృతిముఖంబున ననుచున్.

అని చెప్పియుండుటవలనను, నీయిరువురునృపాలురును గూడఁ గృతులనందియుండిరని విశదమగుచున్నది. అవి కాలగర్భమునఁ బడి పోయియుండును.

అనపోతారెడ్డికుమారుఁడైన కొమరగిరిరెడ్డియు, నాతనిభావుకుఁడైనకాటయవేమారెడ్డియు, గవిపండితపోషకు లగుటయేగాక, తాము స్వయముగఁ బండితులై గాళిదాసునిశాకుంతలమునకు వ్యాఖ్యానమును మఱికొన్నిసంస్కృతగ్రంథములను రచించిపేరొందిరి. అనపోతారెడ్డికి బెదతండ్రిమనుమఁడైన పెదకోమటి వేమారెడ్డి, శ్రీనాథుని, వామనభట్టునుదనయాస్థానమునం దుంచి పోషించెను. కాటయవేమునియల్లుఁడైనవీరభద్రారెడ్డి శ్రీనాథునిచేఁ గాశీఖండమును గృతినందెను. ఈతనిసోదరుఁడైన దొడ్డారెడ్డి నిశ్శంకకొమ్మన్నచే శివలీలావిలాసమును గృతిపొందెను. వెన్నెలకంటిసూరనార్యునిచే విష్ణుపురాణమును గృతినందినదికూడ రెడ్డిప్రభువే. ఇంక నెందఱో రెడ్డిరాజులు కవులబోషించి భాషకు ఘనత దెచ్చినవారు కలరు.

ప్రకాశభారతీయోగి కులగోత్రాదులుకాని, యాతఁడురచించిన కావ్యముల పేరులుగాని తెలియవు.

## 56. మడికి సింగన

ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; భరద్వాజగోత్రుఁడు; అయ్యలమంత్రికిని సింగమాంబకును బుత్త్రుఁడు. ఇతని తాత అల్లాడమంత్రి, ఈకవితల్లజుఁడు పద్మపురాణోత్తర ఖండము, భాగవతదశమస్కంధము, జ్ఞానవాసిష్ఠరామాయణము, సకలనీతిసమ్మతము, అను గ్రంథములను రచించెను.

ఈకవిగృహనామమును 'మడికి' యని బ్రహ్మశ్రీ. వీరేశలింగము పంతులుగారు కవులచరిత్రమున వ్రాసియుండిరి అట్లు వ్రాయుట కాధారము లేదని చెప్పి బ్ర. శ్రీ. గురుజాడ శ్రీరామమూర్తి పంతులుగారు తమకవిజీవితములలో నీకవియింటిపేరు 'రామగిరి' వారని యుదాహరించుచు "ఇఁకనీవాసిష్ఠరామాయణమును దెనిఁగించిన సింగనకవి యింటిపేరేమని విచారించవలసియున్నది అట్టిదాని గ్రంథకర్త యెచ్చటనుస్పష్టముగావివరించియుండ లేదు ... .. "అనివ్రాసియున్నారు సింగనకవి రచించినపద్మపురాణములో:—

"క. ఆపరమేశ్వరమకుట
వ్యాపితగంగాప్రవాహవరకవితాస
ల్లాపుఁ డగుమడికిసింగనఁ
జేపట్టక కీర్తిగలదె శ్రీమంతునకున్"

అనికవియే వ్రాసికొనియుండుటచే నీతనియింటిపేరు మడికివారని నిశ్చయించుటకు సంశయింపనక్కఱలేదు. ఈకవితాత యైనయల్లాడ మంత్రి రావెలనివాసుఁడైనట్లును, తండ్రియైనయయ్యలమంత్రి మడికి నివాసుఁ డైనట్లును వాసిష్ఠరామాయణమునం దీక్రిందిపద్యములలోఁ జెప్పియున్నాఁడు. తండ్రినివాసగ్రామమునుబట్టి యీతని కీగృహనామము వచ్చియుండును.

సీ. అతఁడు తిక్కనసోమయాజులపౌత్త్రిఁడై
కొమరారు గుంటూరుకొమ్మవిభుని
పుత్త్రిఁ జిట్టాంబిక బుధలోకకల్పక
వల్లి వివాహమై వైభవమున
భూసార మగుకోటభూమిఁ గృష్ణానదీ
దక్షిణతటమున ధన్యలీల
నలరారు వెల యనునగ్రహారము తన
కేకభోగ్యంబుగా నేలుచుండి

గీ. యందుఁ గోవెలఁ గట్టి గోవిందు నెన్న
గోపికానాథునిఁ బ్రతిష్ఠఁ గోరి చేసి
యఖిలవిభవంబులందును నతిశయిల్లె
మనుజమందారుఁ డల్లాడమంత్రివిభుఁడు.

సీ. ఆత్రేయగోత్రపవిత్రకేసయమంత్రి
పుత్త్రి సింగాంబికఁ బుణ్యసాధ్వి
వెలయ వివాహమై వేఁగిదేశంబులో
నేపారు రాజమహేంద్రపురికి
నధిపతి తోయ్యేటియనపోతభూపాలు
మంత్రియై రాజ్యసంపదలఁ బొదలి
యొప్పార గౌతమి యుత్తరతటమున
మహనీయ మగుపెద్దమడికియందు

గీ. స్థిరతరారామతతులు సుక్షేత్రములును
నెక్కు లార్జించి సితకీర్తిఁ బెంపుమిగిలి
యఖిలజగదన్నదాత నా ననఁగ బరఁగె
మధురగుణధుర్యుఁ డయ్యలమంత్రివరుఁడు.

చ. ఒనరఁగ నవ్యఘూవరు లహోబలదేవునిఁగొల్చి తద్వరం
బున నొగి సింగనార్యుని నమోఘగుణాఢ్యు ననంతుని న్మహీ

జననుతు నోబయాంబ బుధ ప్రసన్నుతిపాత్రుని నారయాహ్వా
యున్

గని నరసింహనామకుల గౌరవమారఁగఁ బెట్టి రందఱున్.

క. వారలలో నగ్రజుఁడను
వారిజదళనయనచరణవారిజసేవా
సారమతి నతులవాక్య
శ్రీరచనాసారమతిని సింగాహ్వయుఁడన్

పైపద్యములో సింగనకవితాత యైన యల్లాడమంత్రి రావెలా గ్రహారాధిపతియై తిక్కనసోమయాజి మనుమఁడైన కొమ్మయామాత్యపుత్రికయగు చిట్టాంబికను వివాహమాడెనని చెప్పియున్నాఁడు. తిక్కనసోమయాజికిఁ గొమ్మన పుత్రుఁడు కానిపౌత్రుఁడు కాఁడు. తిక్కనమనుమని పేరు హరిహరామాత్యుఁడు. (తిక్కనసోమయాజిచరిత్రము జూడుఁడు) తిక్కనతండ్రి పేరు కొమ్మన. తండ్రిపేరు కుమారునకుఁ బెట్టియుండును. కావునఁ బైపద్యములోనిపౌత్త్రిఁడై యను మాటను, "పుత్త్రుఁడై" యని చదువవలసియున్నది. "పౌత్రుఁడై" అని వాసిష్ఠరామాయణ ముద్రితప్రతిలోను, దాళపత్రప్రతులలోను ఉన్నమాటనిశ్చయమే. కానియది లేఖకప్రమాదమైయుండును. "గుంటూరు కొమ్మవిభుని" అనిపైపద్యములోనున్నది ఈ "గుంటూరు" శబ్దము కొమ్మన యింటిపేరు సూచించుచున్నది. తిక్కన యింటిపేరు "కొట్టరువు" అనిదశకుమారచరిత్రము నందున్నది. కొట్టరువు బిరుదునామమై "గుంటూరు" నిజమైనగృహనామ మైనట్లు కనుపట్టుచున్నది అది సత్యమయ్యేనేని గుంటూరు తిక్కనసోమయాజి యని పిలువవలసియుండును. సింగనకవికాలమువఱకును వీరు గుంటూరువారనియే పిలువఁబడుచుండిరా యని సంశయము కలుగుచున్నది. పాటూరు కరణీకము సంపాదించిన దీకొమ్మనయే యైనను తత్క్షణమే యింటిపేరు మారలే దని తలంపవలసియున్నది. తరువాత కొలఁదికా

లమునకు పాటూరివారై యందుఁ దిక్కనతరువాతివారిని వర్ణించిన పద్యములోఁగూడ (రెండవసంపుటము 15వ పేజి) తిక్కయజ్వ యింటిపేరు గుంటూరువారని యేయున్నది. అయ్యలమంత్రి తొయ్యేటి యన పోతభూపాలుని మంత్రియై గౌతమీనది కుత్తరమున నున్న మడికిలో భూములను సంపాదించినట్లు పైపత్త్రములలో నున్నది. ఇందుఁ జెప్పఁబడిన యనపోతభూపతి యెవ్వరో తెలిసికొనవలసి యున్నది. ఆ కాలమున ననపోతనామధారులు మువ్వురున్నారు (౧) ప్రోలయ వేమారెడ్డి కుమారుఁడైన యనపోతారెడ్డి (౨) రేచర్లసింగమ నాయుని కుమారుఁడైన అనపోతానాయుఁడు (వెలమవారు) (౩) కాపయనాయకుని పినతండ్రి కుమారుఁడైన అనపోతభూపతి. మహమ్మదీయులు ప్రతాపరుద్ర చక్రవర్తిని జెఱగొనిపోయి వరంగల్లు రాజధానిగాఁగల తెలుఁగుదేశము నాక్రమించిన కొలఁది కాలములోనే ప్రతాపరుద్రుని సేనానులలోఁ బరాక్రమవంతుఁడును, ప్రతాపశాలియు నగు ప్రోలయనాయకుఁడు (వీరిని ముసునూరి నాయకులందురు) విజృంభించి, గోదావరి కృష్ణామండలములను తురుష్కుల స్వాధీనమునుండి తప్పించి తన యేలుబడిలోనికిఁ దెచ్చుకొనినట్లు అనితల్లి కలువచేఱు శాసనమందలి, శ్లోకములవలనఁ దెలియుచున్నది. ఈ శాసనమునకు శ్రీనాథకవి చారిత్రమునఁ బనియుండుటచే దాని నచ్చట వ్రాసెదను. ఈ ప్రోలయ నాయకుఁడు వ్రాయించిన శాసనము (విలసతామ్రశాసనము) కూడ నీవిషయమును ధ్రువపఱచుచున్నది. గోదావరిమండలమునందలి అమలాపురముతాలూకాలోని విలసయను గ్రామమును భారద్వాజగోత్రుఁడును అన్నయకుఁ గుమారుఁడును గణపయ్యకు సోదరుఁడునగు వెన్నయపండితునకుఁ జంద్రగ్రహణ నిమిత్తమున దానమొసంగినప్పు డిది వ్రాయఁబడియెను. గ్రంథవిస్తరభీతిచే నాశాసనము నిట నుదాహరింపలేదు. ఈ శాసనమున దానకాలమీయఁబడలేదు. కాని చరిత్రకారులు క్రీ. శ. ౧౩౩౦-౪౦ ప్రాం

తమని నిర్ణయించియున్నారు. ఈప్రోలయనాయకుఁడు క్రీ.శ ౧౩౪౦ ప్రాంతమునఁ గాలధర్మము నొందినట్లు కన్పట్టుచున్నది. పిమ్మట నీతని కుమారుఁడు కాపయనాయకుఁడు తండ్రికంటె సమర్థుఁడును రాజనీతి చతురుఁడునునై గోదావరీకృష్ణామండలములే కాకుండ, ప్రతాపరుద్రునిచేఁ బాలింపఁబడిన యావదాంధ్రరాజ్యమును దన పరిపాలనమునకుఁ దెచ్చి, యందుండి మహమ్మదీయులను దఱిమివైచెను. కొండవీడు, అద్దంకి మొదలుగాఁగల దుర్గములను బరిపాలించుచున్న రెడ్డిరాజులుకూడఁ నీతనికి సామంతులైయుండిరి ఈకాపయనాయకుని గూర్చికూడఁ బైనఁ జెప్పిన అనితల్లికలువచేఱుశాసనమున వ్రాయఁబడినది. ఈకాపయనాయకుఁడు ప్రోలవరమనుగ్రామమును తనతండ్రి పేరిట నాతనికి పుణ్యమునకుగాను శా. శ. ౧౨౬౭ వ సంవత్సరమున శౌనకగోత్రుఁడును శ్రీశైల సమీపమున సత్రయాగమును జేయుచున్నట్టియు గిరీశ సహస్రవ్యాఖ్యాతయునగు పెద్దిభట్టను విప్రునకు దానమిచ్చి వ్రాయించిన శాసనమునుబట్టి యాకాఁడోరుగల్లు రాజ్యమును బరిపాలించుచుండెనని స్పష్టమగుచున్నది. ఈ కాపయ నాయకుఁడు క్రీ. శ. ౧౩౨౫ మొదలు ౧౩౬౭ వఱకును, ఓరుగల్లురాజ్యమునుబరిపాలించుచున్నట్లు శాసనములవలనఁ గన్పట్టుచున్నది. గోదావరినదికుత్తరముననున్న గోదావరి మండలప్రదేశమును బరిపాలించుటకై కాపనాయకుఁడు తనకుఁ బ్రతినిధిగ తన పినతండ్రికుమారుఁడైన అనపోతానాయకుని (1) నియమించెను. అప్పటికీ ప్రదేశమునకు గోదావరిమండలమందలి చోడవరము డివిజనులోని తొయ్యేరు రాజధానిగా నుండెడిది. మఱి కొంతకాలమునకు రాజధాని, తొయ్యేరు నుండి రాజమహేంద్రవరమునకు మార్పఁబడియెను. ఈ యనపోత భూపాలుఁడు రాజమహేంద్రవరమునఁ బరిపాలకుఁడుగా నున్నను,

(1) భారతి సం ౧౧ పు ౯౩౯ టలో కాపయనాయకుఁడు ప్రోలయకుమారుఁడని వ్రాయఁబడినది. కాని అది పొరపాటు. ప్రోలయకు కాపయనాయకుఁడు తిమ్మనికుమారుఁడు. కాపయనాయకునకు అనపోతానాయకుఁడు పినతండ్రికుమారుఁడు కాని పినతాతకుమారుఁడు కాఁడు.

అతఁడు తొయ్యేటి యనపోతభూపాలుఁడనియే పిలువఁబడుచుండెను. ఈతనియొద్దనే మన సింగనకవి తండ్రి మంత్రిగా నున్నవాఁడు.

ఈ యనపోతభూపతియుఁ గాపయనాయకుఁడును దాదాపు క్రీ.శ. ౧౩౭౦ వఱకు మాత్రమే జీవించియున్నట్లు కన్పట్టుచున్నది అనపోతభూపతి చోడవంశపురాజయినభక్తిరాజుచేఁ జంపఁబడియెనని చెప్పుచున్నారు. భక్తిరాజుశాసనము క్రీ.శ. ౧౩౫౫లోను, ఇతనికుమారు. డైనఅన్నచోడదేవునిశాసనము క్రీ. శ. ౧౪౦౮ లోను గనుపట్టుచున్నవి. అనవేమారెడ్డివియ్యంకుఁడైనభక్తిరా జీతఁడేనా? అయినచో నీయుద్ధమున ననవేమారెడ్డి సాహాయ్యముండెనా? యనువిషయములనుగూర్చి శ్రీనాథునిచరిత్రమున వ్రాసెదను. అయ్యలమంత్రికిఁ బ్రభువు అనపోతారెడ్డి యనిశ్రీమానవల్లి రామకృష్ణకవిగారు సకలనీతిసమ్మతపీఠికలో వ్రాసిరి కాని యదిపొరపాటు.

కాపయనాయకుఁడు, రేచర్లసింగమనాయకునికుమారుఁ డగు ననపోతానాయకునితో నైనరణములో నిహతుఁ డయ్యెను. కాపయనాయకునికుమారుఁ డగువినాయకదేవుఁడు కాపయనాయకునిజీవితకాలములోనే బహమనివంశజుఁ డగుమహమ్మదుషాహాచే బలవంతముగాఁ జంపఁబడియెను. ముసునూరినాయకునిపరిపాలన మాంధ్రమండలములలో క్రీ.శ. ౧౩౭౦ ప్రాంతమునుండి యంతరించిపోయినది.

రాజమహేంద్రవరమున కాగ్నేయభాగమునఁ బదిమైళ్లదూరములో గౌతమీనదికుత్తరమున మడికి యనుగ్రామ మిప్పుడున్నది. ఆగ్రామము మానివాస మైనకపిలేశ్వరపురమునకుఁ బశ్చిమమునఁ బదిమైళ్ళ దూరమున నున్నది. ఆగ్రామము నిప్పుడు పెద్దమడికి యనుట లేదు. మడికి యనియే వాడుచున్నారు. సింగనకవి తండ్రికాలమునాఁటికి చిన్నమడికి యింకొకటి యుండెడిదేమో! అది నదీపాతమైయుండిననుండవచ్చును. లేదా యిప్పుడున్నదియే చిన్నదియై పెద్దమడికియే నదీపాతమై యుండవచ్చును. మడికియం దిప్పుడు మడికి

యను నింటిపేరుగలవారు లేరు. ఆత్రేయపురమువా రున్నారు. వారిది భారద్వాజగోత్రమే సింగనకవి తమపూర్వుఁడే యనివారు చెప్పు చుందురు.

కాపయనాయకుని పూర్వులనివాసము గుంటూరుమండలమని తెలియుచున్నది. అయ్యలమంత్రి నివాసము గుంటూరుమండలము నందలి గుంటూరు. తాలూకా రావెలయను గ్రామము. ఏకమండల వాస్తవ్యులగుటచే, అనపోతభూపతి అయ్యలమంత్రి సామర్థ్యము నెఱింగి యాతనిని మంత్రిగాఁ జేసికొనియుండును. అనపోతభూపతి రాజ్యపరిపాలనాకాలము దాదాపు పిరువదిసంవత్సరములు.

సింగనామాత్యుఁడు మడికిగ్రామముననే జన్మించి, విద్యాభ్యాసమొనర్చి కవిత్వ మలవడినపిమ్మటఁ బ్రస్తుతపు నిజాము రాజ్యమున కేఁగి కందనామాత్యాదుల నాశ్రయించి ముప్పిడిభూపతి సంస్థానమునం దాస్థానకవియై యచ్చట వృత్తులను సంపాదించి యాప్రాంతమునసే నివాస మేర్పరచుకొనియుండెను. ముప్పిడిభూపతి పూర్వులు గుంటూరు మండలములోని గురిజాల నివాసులైనట్లు వారియింటిపేరునుబట్టి తెలియుచున్నది. వారు ప్రతాపరుద్రుని సేనానులై యాతని యనంతరమున సబ్బిరామప్రమున కధిపతులైరి. ఆపరిచయముచే సింగనామాత్యకవి ముప్పిడిభూపతి యాస్థానమునఁ గవియైయుండును. మడికినుండి వచ్చినవాఁ డగుటచే నచ్చటివా రీతనిని మడికి సింగన యని పిలుచుచుండి రని తలంపవచ్చును అందుచేతనే పైనివ్రాసిన కందపద్యములో నీతనిని 'మడికి సింగన' యని చెప్పఁబడినది. మడికి గ్రామమునకు రాకపూర్వ మీతనితండ్రిగా రింటిపేరేదియో మనకుఁ దెలియదు. బహుశః రావెలవా రేమో!

ఈకవి తానురచించిన పద్మపురాణోత్తరఖండమును వాణస వంశీయుఁ డగు కందనామాత్యునకంకితము చేసెను. మనకుఁ గవుల చారిత్ర మెంతయగత్యమో కవులు కీర్తికాయులనుగా జేయఁదలపె

ట్టిన కృతిపతులచారిత్రముకూడ నంత యవసరమే. కావున నీకృతి పతి వంశచారిత్రమునిటు వ్రాయుచున్నాఁడను. ఈకందనామాత్యుఁడు కాశ్యపగోత్రుఁడైననియోగిబ్రాహ్మణుఁడు. ఇతనికి వెలిగందలామాత్యుఁడనునామాంతరముకూడ నున్నది. రామగిరిపట్టణాధీశ్వరుఁడైన ముప్పిడిభూపతి కీతఁడు మంత్రియు దండాధీశుఁడునై యుండిన ట్లీక్రింది వాక్యములవలనఁ దెలియుచున్నది.

"తత్కవితావధూముఖతిలకం బగు వెలిగందలకందనామాత్యుం డను సుత్తమరత్నంబున కుపాశ్రయం బగు రామగిరిపట్టణాధీశ్వరుం డైన ముప్పిడిక్షోణిపాలునియన్వయగుణవిశేషంబు లెట్టివనిన"

అని ప్రశంసింపందగి విభవవిలాస విక్రమ విజయ విఖ్యాతులం బ్రసిద్ధుండైన ముత్తభూపాలుండు తనకుసహాయుండుగా గౌతమీదక్షిణంబునం బరమపావనం బగు సబ్బినాటిరాష్ట్రంబున రామగిరిపట్టణంబు రాజధానిగాఁ బురందరవిభవుండై రాజ్యంబుచేయుచు, నిరువెత్తుగండ, గండగోపాల, కాంచీరక్షపాలక చోడరాజ్యస్థాపనాచార్య, దొంతిమన్నియవిభాళన, చలమర్తిగండ, గజగంధవారణ, రాయగజకేసరి, మూరురాయరగండాళాది నానాబిరుదవిఖ్యాతుండును, అనవరత దానశీలుండు నగు ముప్పభూపాల చంద్రునకు నిఖిలసామ్రాజ్యభూభార ధురంధరుండును,ధర్మచరిత్రుఁడును, చాతుర్యవివేక విశేషగుణగణాలంకారుండునునై యమ్మహారాజు మన్ననవడసివిశేష వస్తువాహన ఛత్రచామరాందోళికాది చిహ్నంబులం బెంపొందుకందనామాత్యు వంశావతారం బెట్టిదనిన"

పైనచెప్పిన ముప్పభూపతియు నీతనిసోదరుఁడైన ముత్తభూపతియుఁ దెలుగురాయనికుమాళ్ళు, వీరితల్లి మల్లాంబ తెలుగుఁరాయని తండ్రి ముప్పభూపతి. ఆతనితండ్రి కూనయ. వీరియింటిపేరుగురిజాలవారు. వీరు పరిపాలించిన సబ్బిరాష్ట్రము నిజాము రాష్ట్రములోనిది. దీని నిప్పుడు కరీమ్‌నగరు జిల్లాయనియెదరు. ఇది యచ్చట నున్న

గౌతమీనదికి దక్షిణమున నున్నది. కోర్కొండశాసనకర్త యగు ముమ్మడి భూపాలునితండ్రి కూనయ. ఇతఁడు కాపనాయకునికి సహాయము చేసినవాఁడు. ఈకూనయయు, ముప్పభూపతి ప్రపితామహుఁ డగుకూనయయు, నొక్కఁడేమో తెలిసికొనవలసి యున్నది.

కృతిపతి యైనకందనామాత్యునిపూర్వులు మంత్రులును, దండాధీశులును, కీర్తికాములునై యున్నారు. వారివంశవృక్షము నీక్రింద నిచ్చుచు, వారినిగూర్చియిటఁ గొంచెము వ్రాయుచున్నాఁడను

రుద్రమంత్రి = భార్య అన్నమాంబ.




ఈవంశమువారికి మొలగూరు నివాసమైనట్లు గాన్పించుచున్నది. మూలపురుషుఁడైన రుద్రమంత్రి మొలగూరు నేలుచున్నట్లీ క్రింది పద్యములో నున్నది. మొలగూరు నిజాము రాష్ట్రములోనిది.

క. ఇల వాణసవంశంబున
జలరుహాభవనిభుఁడు నీతిచాణక్యుఁడు నాఁ
జెలు వమరు రుద్రసచివుఁడు
మొలగూ రేలుచును సౌఖ్యమునఁ జెలువొందున్.

ఈతఁడు మొలగూరునకుఁ గరణమో కాక నిజముగాఁ బ్రభువో తెలియదు. ఈరుద్రమంత్రితనయుఁడైన గన్నయ (మొదటి గన్నయ్య) మంత్రి కాకతీయప్రభు వైనగణపతిదేవునిచేత మన్ననలందినట్లును శైవవైష్ణవాలయములను నిర్మించినట్లును, తనతండ్రిపేర రుద్రసముద్ర మను తటాకమును త్రవ్వించినట్లును నీక్రిందిగద్యపద్యములలోఁ జెప్పియున్నాఁడు.

చ. పరువడిఁ గాకతీయగణపక్షితినాయకునొద్ద మాన్యుఁడై
ధరణిఁ బ్రశస్తుఁడై నెగడి దానము లెల్లను జేసి భక్తి పెం
పెరవుగ గుళ్లుగట్టిగణపేశ్వరదేవుని గోపికాధిపున్
దినమగుచున్న లక్ష్మిని బ్రతిష్ఠలు చేసెఁ బ్రభుత్వ మేర్పడన్
మఱియు నమ్మొలగూరిపడమటిగవనియందు రుద్రసముద్రంబనం దమ తండ్రిపేరిట నగాధనిర్మలజలపూరం బగుబావియును గాడియును గల్పించె.

ఈగన్నయమంత్రికుమారుఁడైన మల్లన మొలగూరునందు ామేశ్వరాలయమును గట్టించిన ట్లీక్రిందిపద్యములో నున్నది.

ఉ. ఆశతమన్యువైభవపుఁ డహార్పతితేజుఁడు చంద్రచంద్రికా
కాశసమానకీర్తి యగుగాదమమల్లనమంత్రి దిక్కులన్
వాసికి నెక్క భక్తి ననివారణమై గుడికట్టెఁ గట్టెఁ రా
మేశుఁ బ్రతిష్ఠఁ జేసె నుతికెక్కఁగ నా మొలగూరివాకిటన్.

అబ్బయమంత్రికి రెండవకుమారుఁడును, పద్మపురాణకృతిపతి యగు కందనామాత్యున కగ్రజుఁడు నగు కేసనమంత్రి ముప్పిడిభూపతి యొద్ద దండనాయకుఁడుగా నుండెను. ఈతఁడు ధర్మపురియం దన్నసత్రము పెట్టినట్లును ఆయూరనున్న శ్రీనరసింహస్వామి యుత్సవములు

చేయించినట్లును రామగిరియందు విష్ణ్వాలయమును గట్టించి బంగారపు శిఖరమెత్తించినట్లును నీక్రిందిపద్యములవలనఁ దెలియుచున్నది. (ఈ ధర్మపురినృసింహక్షేత్రమునుగూర్చి శేషప్పకవిచారిత్రమున వ్రాయ నున్నాఁడను.)

చ. అతులితలీలఁ గేసనచివాగ్రిణి ధర్మపురంబునందు సం
చితముగ సన్నసత్ర మిడి శ్రీనరసింహుని కుత్సవంబులన్
సతతమహోపహారములు సల్పుచు రామగిరీంద్రమందు సు
స్థితి గుడికట్టి విష్ణునిఁ బ్రతిష్ఠ యొనర్చె నుదాత్తసంపదన్.

మ. అనఘాత్ముల్మను పెక్కుభంగుల ధనం బార్జించి పాతాళమం
దెనయం బాతుదు నూర్ధ్వలోకములకం జేయూరి కేత్రోవ రా
యని మా కేసనకేశవేంద్రుగుడిపై నాచంద్రతారంబుగా
దినతుల్యం బగు హేమకుంభశిఖరం బెత్తించె సత్యోన్నతిన్.

కందనమంత్రిపూర్వులు కట్టించినయాలయములును నిర్మించిన తటాకములును సువర్ణశిఖరము నిప్పు డున్నవో లేవో చెప్పఁజాలను. ఉన్నను నానిర్మాతలపే రిప్పటివా రెఱిఁగియుండరు. కందనమంత్రి పద్మపురాణమును గృతినంది తనకీర్తి చిరస్థాయియగునట్లు చేయుటయేకాక, తనపూర్వులయశస్సును గూడఁ జిరకాలముండునట్లు చేయగలిగెను. సప్తసంతానములలోఁ గృతిప్రశస్తతమముగదా !

పద్మపురాణోత్తరఖండమును దనపేర నంకితము సేయుమని కందనమంత్రి కవిని ప్రార్థించినపద్యము లివి.

సీ. పొలుపారుచున్న యీభువనత్రయమునందు
నమరలోకము సార మైనయట్లు
విశ్వపూజ్యంబైన వేదత్రయమునందు
నమరసామము సార మైనయట్లు
కీర్తిఁ బెంపారెడి మూర్తిత్రయమునందు
నంబుజాక్షుఁడు సార మైనయట్లు

సౌభాగ్యమయ మైనశక్తిత్రయమునందు
　　నబ్జవాసిని సార మైనయట్లు
అవనిపద్మంబు ఖండత్రయంబునందు
సర్వసారాంశమై పుణ్యజనక మగుచు
మండితం బైనయుత్తరఖండ మీవు
తెనుఁగుఁ గావింపు నా[illegible]ముచరిత.

క. కృతిపతులకీర్తి దిక్కుల
నతులితమై యునికిఁ జేసి యనవరతంబున్
మతి వాంఛగలదు నన్నుం
గృతిపతిఁ గావింపు పెంపుకీర్తియు నెగడున్.

ఈకృతిపతికి వెలిగందలామాత్యుఁ డని నామాంతరముండుట వలనను, ప్రథమాశ్వాసాంతపద్యములలో:—

క. వెలిగందల నరహరిపద
జలరుహమకరందమత్తషట్చరణ! గుణో
జ్జ్వల! నవ్యమకరకేతన!
విలసితనవకావ్యగీతవిద్యానిలయా!

అని వెలిగందలనృసింహదేవునిభక్తుఁడని చెప్పియుండుటచేతను గందనమంత్రినివాసము వెలిగందలయై యుండుననిస్పష్టమగుచున్నది.

ఈసింగనకవి, ముప్పిడిభూపతియాస్థానకవి నని పద్మపురాణములోఁ జెప్పలేదుకాని వాశిష్ఠరామాయణమునందు తానానృపాలుని యాస్థానకవి ననియు, నతనివలన వృత్తులను బడసితిననియు, నీక్రింది పద్యములలోఁ జెప్పుకొనియున్నాఁడు.

క. కూతయ ముప్పనృపాలక
సూను శ్రీ తెనుఁగునృపతి సుదతీమల్లాం
బానందనుఁ డగుముప్పయ
భూనాథుని సుకవివరుఁడ బుధసన్నుతుఁడన్.

గీ. ఆమహీవిభుచేత రామాద్రిసీమఁ
బెక్కువృత్తులు గ్రామముల్ వెలయఁ గాంచి
యతనియాశ్రితులం దెల్ల నధికుఁ డనఁగ
జతురుఁడన ధన్యుఁడన నడిసన్నవాఁడ.

మ. అనిలో రాయగజేంద్రసింహ మగుముప్పాధీశుచే భగ్నులై
చని స్వప్నంబున నవ్విభుండు వెలయన్ శంకించినన్ మోసమా
నని చింతించి నఖాంకురాంకుశవినోదాసక్తి నిద్రింపనీ
క నివారింతురు రాజకుంజరములన్ గాంతామణుల్ కానలన్.

ఈకవికాలమును నిర్ణయించుటకు విశేషశ్రమ నొందవలసిన యవసరము లేకపోయినది. పద్మపురాణరచనాకాలమును గవియే గ్రంథాంతమున నీక్రిందిపద్యములోఁ దెలిపియున్నట్లు బ్ర శ్రీ. వీరేశలింగము పంతులుగారును మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమువారును వ్రాసియున్నారు. నాకులభించిన ముద్రితప్రతిలో నీపద్యము లేదు. ఇతరవిధములఁ బరిశీలించినను, నీపద్యమందలి కాలమునకు సరిపోవుటచే నీపద్యము గ్రంథకర్త రచియించినను మఱియొకరు రచించినను, విశ్వసనీయమైనదే యగుచున్నది.

మంగళమహాశ్రీవృత్తము.

ఆకరయుగానల మృగాంకవత్సరములై పరఁగు శార్వరినిబున్యా
ప్రాకటితమార్గశిరపంచమిని బొల్పు నుడుపాలనుత వాసరమునందున్
శ్రీకరముగా మడికి సింగన తెనుంగునరచించెఁదగఁ బద్మసుపురాణం
బాకమలమిత్రశశిరాంశువుగఁ గందసచివాగ్రణికి మంగళ మహాశ్రీ.

ఇందలిసంవత్సరము. శా. శ. 1342=క్రీ శ 1420 వ సంవత్సరము.

కాపయనాయకుఁడు క్రీ. శ. ౧౩౭౨ మొదలు౧౩౬౨ వఱకును రాజ్యముచేసెను. తొయ్యేటి యనపోతభూపాలుఁడుకూడ నాకాల

మునం దున్నవాఁడు. సింగనకవితండ్రి యైన యయ్యలమంత్రియు నా కాలములో నున్నవాఁడు అయ్యలమంత్రియొక్క జననము ౧౩౩౦ సంవత్సర ప్రాంతమనియుఁ దనయిరువదియవయేట మంత్రిత్వము వహించెననియుఁ దలంపవచ్చును. పద్మపురాణమును ముగించునాఁటికి సింగనకవికినలువదియయి దేండ్లుండెననియనుకొందుమేని, అయ్యల మంత్రికి ౨౫ సంవత్సరముల వయసున నఁగా క్రీ శ ౧౩౫౫ సంవత్సరప్రాంతమున సింగనకవి జన్మించియుండునని యూహింపవలసి యున్నది. ఈయూహ సరియైనదనియే నాయభిప్రాయము. కృతిపతిని బట్టిచూచినను నీకాలము సరిపోవుచున్నది. గణపతిదేవుడు క్రీ శ. ౧౨౬౦ సంవత్సరమువఱకు రాజ్యముచేసియున్నట్లు శాసనములవలన నిర్ధారణ మయినది. ఆకాలమున గన్నయమంత్రి యున్నట్లు పైన వ్రాయబడిన పద్యములలో నున్నదికదా! గన్నయకు, గందనమంత్రి మనుమనికి మనుమఁడు. వీరిరువురినడుమ నాల్గుతరము లున్నవి. తరమునకు ముప్పదేండ్లవంతున చూచితిమేని, కందనమంత్రి నలువదేండ్ల వయసున క్రీ శ. 1420 వ సంవత్సరములోఁబద్మపురాణమును గృతి నందియుండెననుట సమంజసముగనే యుండును.

సింగనామాత్యుఁడు రచించినగ్రంథములలోఁ ¹పద్మపురాణము మొదటిది. ఈపద్మపురాణోత్తరఖండమునఁ జాలభాగము శ్రీరామా వతారకథలతోను, శ్రీకృష్ణావతారగాథలతోను నిండియున్నది. ఈ పురాణము విష్ణుకథాప్రధానమైనది. పద్మపురాణమునకుఁ బిమ్మట రచించినది భాగవతదశమస్కంధము². సింగనకుఁ బూర్వము భాగవతము తెల్గింపఁబడలేదు. అయిన నాతఁ డేలకో దశమస్కంధమును మాత్రమె రచియించెను. ఈతనిదశమస్కంధము పద్యకావ్యము కాదు. ద్విపదకావ్యము. ఇదియును గందనమంత్రికే యంకిత మీయఁబడినట్లు ³వాసిష్ఠరామాయణములోని యీక్రింది వాక్యముల వలనఁ దెలియుచున్నది.

"తొల్లి హరిభక్తిరసావేశంబునఁ గతిపయాక్షరాభ్యాసచాప లంబునం (ఎఱ్ఱాప్రెగ్గడ నృసింహపురాణ కృత్యాదయం దిట్లే "కతిపయాక్షరాభ్యాసచాపల్యంబున" నని వ్రాసికొనియున్నాఁడు.) జేసి విష్ణువిభవాభిరామకథాప్రభూతంబులగు పద్మపురాణోత్తరఖండమును భాగవతదశమస్కంధంబును దెనుఁగున రచియించి యప్పుణ్యపురాణ బులకున్ గృతిపతిగా నేపుణ్యుం బ్రార్థింతునో యని విచారించి... వాణసవంశాబ్ధిసుధాకర కౌశ్యపగోత్రపవి త్రాబ్బనార్యతనూభవుండును నగుకందనామాత్యుండు నాకుఁ గతిస్నేహబాంధవ్యుండును, నపూర్వవచనరచనాబంధురకావ్యరసాభిజ్ఞుండును సత్కవిజనపారిజాతుండును గావున నమ్మంత్రియుగంధరుం గృతిపతిం గావించితి."

ఈదశమస్కంధ మింకను ముద్రింపఁ బడలేదు. మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునం దొకప్రతి యున్నదని తెలియుచున్నది.

ఇతనిమూఁడవగ్రంథము వాసిష్ఠరామాయణము. ఇది వేదాంతబోధకగ్రంథము. శ్రీరామచంద్రుఁడు పదునారేండ్లవయసున నీప్రపంచ మనిత్యమనియు, సుఖపదార్థవిరహిత మనియు, దోఁచుటచే ఖిన్నమనస్కుఁడై యున్నతఱిని విశ్వామిత్రుని సూచనపై వశిష్ట మహర్షి శ్రీరామచంద్రునకుఁ దత్త్వోపదేశము చేసెను. అదియే వాసిష్ఠరామాయణ మను పేరున సంస్కృతభాషలో నున్నది. దీనినే జ్ఞాన వాశిష్ఠమందురు. అది చాలపెద్దగ్రంథము. సింగనామాత్యుఁడాగ్రంథమును క్లుప్తీకరించి, యైదాశ్వాసములుగ నించుమించు పండ్రెండువందలపద్యములలో నాంధ్రీకరించెను. నన్నయతిక్కనాదుల వలె నీగ్రంథాది నాంధ్రపద్యమును మానిసంస్కృత శ్లోకమును వేసినాఁడు.

వాసిష్ఠరామాయణాంధ్రీకరణము తేట తెలుఁగు పదములతో సుబోధకముగ నున్నది. అతిగహనమగు వేదాంతవిషయమగుటచే

నీగ్రంథ మందఱకుఁ దెలియునో లేదో యని సందియము తోఁచి కవి యీక్రిందిపద్యములలోఁ బాఠకులను హెచ్చరించి యున్నాఁడు.

క. ఇది తత్త్వరహస్యార్థము
పదసంగతిఁ దెలుఁగుపఱుపఁ బ్రాజ్ఞులకును బె
ట్టిదమగుఁ దత్పరవాసన
విదితంబుగఁ గవులు మెచ్చ విరచింతుఁ దగన్.

క. విజ్ఞానులు మును సెప్పిన
సంజ్ఞాభ్యాసములు కొంతజాడలు దోఁపన్
విజ్ఞాపనం బు సేసెదఁ
బ్రాజ్ఞులు తార్కికులు తప్పుపట్టకుఁడు దయన్.

క. కఱ కిది నీరస మని వే
సర కల్లన వినుఁడు తుద రసాయన మగుఁ దా
జెఱకుఁ దుదనుండి నమలిన
తెఱఁగున మది కింపుఁ దనుపుఁ దీపున్ జూపున్.

క. మృదుమధురరచనఁ గావ్యము
గదియించినయట్ల తత్త్వగాఢార్థము చె
ప్పెదఁ బువ్వుఁ దేనెఁ గొను తు
మ్మెద మాక్రికుఁలు దొల్చునేర్పు మెఱసినభంగిన్.

క. ఇది యల్పగ్రంథం బని
మునుఁ దలఁపకుఁ డఖిలశాస్త్రమతములు దీనన్
విదితం బగు నద్దములో
మదదంతావళము దోఁచుమాడ్కిని దెలియన్.

వేదాంతవిషయములను దెలియఁగోరువారి కీవాసిష్ఠరామాయణ ముపయోగకరమైనది. ఈగ్రంథమును గందనమంత్రి కొఱ్ఱపై శ్రీనరసింహునకంకితము చేసెను. ముద్రితప్రతిలో "కొండమంత్రి" యనియున్నది. కాని యది పొరపాటు. అబ్బయామాత్యునకుఁ గొండమంత్రి యనుతనయుఁడు లేఁడు.

ఈతనినాల్గవగ్రంథము సకలనీతి సమ్మతము. ఇది స్వతంత్ర గ్రంథముకాదు. పూర్వకవులగ్రంథములనుండియుఁ దానురచించిన పద్మపురాణాది గ్రంథములనుండియు నీతిదాయకములైన పద్యముల నేర్చి కూర్చి సకలనీతిసమ్మత మని పేరిడినాఁడు. పూర్వకవులు రచించినపద్యముల నిట్లుకూర్చు టెందుల కనుప్రశ్నమునకుఁ గవియే యిట్లు ప్రత్యుత్తర మిచ్చియున్నాఁడు.

చ. మును కవులెల్లఁ జెప్పినవి మున్నొకని చర్విత చర్వణంబుగాఁ
బనివడి వ్రాయనేల? కవిప్రాజ్ఞులు చిత్తములందుఁ జూడుఁడా
ఘనుఁ డగుపౌరిఁ మాలకరి కమ్మనిపువ్వులుగూర్చి దండ గ
ట్టినక్రియ నీతిదామము ఘటింపుదు మీరలు మెచ్చునట్లుగన్

సీ. ఆలోలకల్లోల మగుదుగ్ధనిధిఁ దరిచ్చి
దేవామృతము తేటతేర్చు పగిది
గంధకారుఁడు మున్నుగలవస్తువులు జోకఁ
గూర్చి సుగంధంబు గూడినట్లు
అడవిపువ్వుల తేనె లన్నియు మధుపాళి
యిట్టలంబుగ జున్ను వెట్టుభంగి
దననేర్పు మెఱసి వర్తకుఁడు ముత్తెము
లేడుగూర్చి హారంబు తాఁ గుచ్చుకరణిఁ
గృతులు మునుచెప్పినట్టి సత్కృతులు దరివ్వి
కాంచుకంటెను నొకచోటఁ గానఁ బడఁగ
సకలనయశాస్త్ర మతములు సంగ్రహించి
గ్రంథ మొనరింతు లోకోపకారముగను.

క. కడనెడు దుగ్ధములోపలఁ
దోడఁబడఁ గోణిదెండు సల్ల తోడంబడిన
ట్లెడనెడ నొక్కొకపద్యం
బడరించి మదీయకావ్య మనివ్రాయింతున్.

నీతిశాస్త్రపఠనావశ్యకతను గవి యీక్రిందిపద్యములలోఁ జెప్పి యున్నాఁడు.

చ. కరిహయశిక్షలందు నృపకార్యములందును సంధియానసం
గరములయందు వర్తకముఖంబునఁ గర్షకలీల మోక్షత
త్పరుఁడగుచోట నీతియను దర్పణముం బరికించి చూడకే
వెరవునఁ గార్యనిశ్చయ వివేకము దోఁచునె బ్రహ్మకేనియున్.

క. నీతియెఱింగినమర్త్యుఁడ
రాతుల భంజింపనోపు రాజులచేతన్
ఖ్యాతియు లాభముఁ బొందు స
మాంతముగ ముక్తికాంతఁ డధికారియగున్.

ఈగ్రంథమును గందనమంత్రి కగ్రజుఁ డగు కేశవమంత్రిచేఁ బ్రతిష్ఠితుఁ డైన కేశవస్వామి కంకితమొసంగెను.

ఈకవి పద్యములనుగైకొనిన పూర్వకవుల గ్రంథము లివి:—
1 కామందకము 2 పంచతంత్రి 3 నీతిభూషణము 4 పురుషార్థసారము 5 ముద్రామాత్యము 6 నితిసారము 7 నీతితారావళి 8 భారతము 9 బద్దెనసీతి 10 పద్మపురాణము 11 శాలిహోత్రము 12 కుమార సంభవము 13 చారుచర్య 14 రామాయణము 15 మార్కండేయ పురాణము 16 కేయూరబాహుచరిత్రము 17 శ్రీగిరీశశతకము.

ఇందు మొదటి యేడుగ్రంథములనుండి యెక్కువగాఁ బద్య ములను గైకొనియున్నాఁడు. ఈయేడుగ్రంథములు నింతవఱకు ము ద్రింపఁబడలేదు. అందు మొదటియాఱుగ్రంథముల కర్తలనామముల నీ. వి పేర్కొనియుండలేదు. ఏడవగ్రంథమైన నీతితారావళిని "కంద నామాత్యనీతితారావళి" యని కవి చెప్పియున్నాఁడు. ఈకందనా మాత్యుఁడు పద్మపురాణకృతిపతి యగు కందనామాత్యుఁడే కాని య న్యుఁడుకాఁడు. దీనినిబట్టి యీనీతితారావళిని గందనామాత్యుఁడు రచించినట్లూహింపఁదగియున్నది. కాని యిందలిపద్యములలో "కంద

నమంత్రీ" "కందనామాత్యా" యనిసంబోధనములున్నవి. అందుచే సీసీతితారావళి సింగనకృతమేమోయని సంశయము కలుగుచున్నది. లేదా వేమనశతకము కవిచౌడప్పశతకము మొదలగువానివలె నాత్మ సంబోధనశతకమై కందనామాత్య కృతమైనను గావచ్చును.

రామాయణములోని దని యీక్రిందిపద్య మొక్కటియు నీగ్రంథమునం దుదాహరింపఁబడినది.

క. బలియుసకుఁ దనకు నగుమై
నిలిచిన సామంతుఁ జెఱుప నేరమి వచ్చున్
పులిబోనుతలుపు దెఱచినఁ
బొలియింపదె మీఁద నఱికి పురుషనిధానా!

ఈపద్యము శ్రీరామచంద్రునకు సముద్రము నింకింపఁ జేయుటకై బ్రహ్మాస్త్రమును బ్రయోగింప నుద్యుక్తుఁడై యున్నసమయమున సముద్రుఁడు బ్రత్యక్షమై శ్రీరామచంద్రునితోఁ జెప్పిన సందర్భమున రచియింపఁబడియున్నట్లు తోఁచుచున్నది. లేదా వాలివధా సందర్భమున రచియింపఁబడియుండవలయును. భాస్కరరామాయణమునం దీపద్యము లేదు. మఱికి సింగనకుఁ బూర్వ మెఱ్ఱాప్రెగ్గడ దక్క రామాయణమును రచించిన కవు లెవ్వరు నున్నట్లు గన్పట్టదు మంత్రిభాస్కరుఁడున్నను భాస్కరరామాయణమున నీపద్యము లేదు. 'శాకల్యమల్లకవి యొకఁ డున్నాఁడు. కాని యాతనిరామాయణము నిరోష్ఠ్యము. సంస్కృతభాషలోనిది. పై పద్యము నిరోష్ఠ్యము కాదు. అందువలనఁ దగినయాధారము లభించువఱకును నీపద్యకర్త యెఱ్ఱాప్రెగ్గడయనియే యనుకొందము. కోఱవి సత్యనారన యొకరామాయణమును రచించెనఁట.

సకలనీతిసమ్మతమున గలపద్యములు వేయింటిలో నించుమించుగ మూఁడువందల పద్యములు, కామందకము లోనివి. ఈకామందకమును రచియించినకవి యెవ్వరో తెలియదు. సంస్కృతమున

కామందకీయ మనునీతిశాస్త్ర మొకటి యున్నది. దాని కిది యాంధ్రీ కరణ మని తలంపవలసియున్నది.

వేంకటరామకృష్ణకవులు కామందకీయము నాంధ్రీకరించి కొండ్రాజు కుమారుం డైన వేంకటేంద్రున కంకిత మొనర్చియుండిరి. కాని యాగ్రంథమిది కాదు. వేంకటరామకృష్ణకవులు ౧౭౭౦ ప్రాంతమువారు. ఆగ్రంథ మింత ప్రౌఢమయినదికాదు. సింగనకవిచే నుదాహృతమైన కామందకమునందలి కవిత ప్రౌఢమై మనోహరముగా నున్నది. ఆకవినామము నెఱుంగుభాగ్యము కలుగలేదు. అందలి పద్యములను గొన్నిటి నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

కామందకమునకుఁ దరువాత సింగనకవి విశేషపద్యములను గ్రహించిన గ్రంథము పంచతంత్రి. ఈపంచతంత్రిని రచించిన కవి నామ మెఱుంగరాకున్నది. బైచరాజు వెంకటనాథకవి దూబగుంట నారాయణకవి యనుకవులిరువురును బంచతంత్రము నాంధ్రీకరించిరి. కాని వారు మడికి సింగనకుఁ దఱువాతివారు. సింగన యుదాహరించినపద్యము లాపుస్తకములలో లేవు. ఈపంచతంత్రము వెంకటనాథ నారాయణకవులనాఁటికే యంతరించనదేమో! పంచతంత్రములోని పద్యము లించుమించుగ రెండువంద లీసకలనీతిసమ్మతమున నుదాహరింపఁబడినవి. వానినుండి మచ్చునకై కొన్నిపద్యముల నీక్రింద నిచ్చుచున్నాఁడను. భానుకవి యనునతఁడొక పంచతంత్రిని రచించెనని తెలియుచున్నది. అతఁడు ప్రతాపరుద్రగజపతియొద్ద దండనాయకుఁడుగానున్న లక్ష్మీనారాయణామాత్యునకుఁ గృతి యొసఁగెనని చెప్పుచున్నారు. ప్రతాపరుద్రగజపతి క్రీ. శ. ౧౫౦౦ ప్రాంతమువాఁడు. అందుచే మడికి సింగన యుదాహరించిన పంచతంత్రపద్యములు భానుకవివి కావు.

ఇతనికవిత్వము సలక్షణమై మృదువై మనోహరముగానున్నది. ఈతనికవిత్వశైలి తెలియుటకై యాశ్వాసమునకొక పద్యము నీక్రింది నుదాహరించుచున్నాఁడను. ఇపుడు మనకు లభించుచున్న సకలనీతి

సమ్మతము సమగ్రమైనదికాదు. ఇందు మూఁడాశ్వాసములు మాత్రమేకలవు. మొత్తమైదాశ్వాసములనిచెప్పెదరు. తాను చెప్పఁదలఁచిన నీతులపట్టికను గ్రంథాదిని గవి చెప్పియున్నాఁడు. వానిలోఁ గొన్ని యీముద్రితప్రతిలో లేవు. అవి తక్కిన యాశ్వాసద్వయము నం దుండియుండును. అది లభించినచో మనమెఱుంగనికవులం దెందఱు బయలుపడుదురో !

పద్మపురాణోత్తరఖండము :—

చ. ఘన మునునెండ తాఁకొనకుఁ గాయను కంది పరిభ్రమార్తుఁడై
జనపతి విశ్రమించె విలసన్మతిఁ జల్లవిరాజుగాన న
య్యనఘుఁ దపింపఁజేయఁదగ దంచుఁ దొలంగినభంగి నర్కుఁ డా
య్యనఁజనియెన్ రథాంగకసమాఖ్యము లంగజుచేత బెగ్గిలన్. ౧ ఆ

ఉ. తులసీకానన మెవ్వరింట నలరున్ దోషాంధకారార్కుఁడై
తలఁప న్నొప్పగుఁ దద్గృహంబు ధరఁ దీర్థం బెందు నయ్యింటికిన్
బలిమి న్గాలునికిం గనవ్రజము రాఁబట్టించు నూహింపఁగా
దులసీగంధము గల్గుచోటు సుకృతస్తోమాలయం బెప్పుడున్. ౨ ఆ

శా. ఆరాజాస్యలు గాంచి రయ్యెడ సముద్యల్లోలకల్లోలసం
చారోద్ధూత నవీనఫేనదరహాసస్ఫారమున్ నిర్జరా
హారశ్రీకరవారిపూరముఖరవ్యాపారవిస్తారముం
బారావారగభీరసారము మహాపారమ్ముఁ గాసారమున్. ౩ ఆ

ఉ. కేరళ దేశభూసురుఁడుఁ గేవలలోభి నదత్తదానవి
స్ఫారుఁడు ధర్మహీనుఁడుఁ గృపారహితుండుఁ బరాన్నభక్షణో
దారుఁడుఁ బాతకాఢ్యుఁడను దారుణవర్తనుఁడ న్మహోగ్రహిం
సారసికాంతరంగుఁడ నసంగతవాక్యుఁడ భక్తిహీనుఁడన్. ౪ ఆ

మ. కమలాపాంగవిలోకనం బయుతభాగం బందుఁ దన్మాత్రనా
ప్రమథేశాచ్యుతపుండరీకభవశక్రశ్రీల ధర్మానిలా

ర్యముచంద్రాదులు నిత్యవైభవములం బ్రాపించుచుం దేవతో
త్తములై యొప్పుదు రమ్మహామహిమ యేతన్మాత్రమే పార్వతీ ! ౪౪

శా. మార్గాసుం డనుమాని దేవతతిపై దోషంబు గల్పించి తా
దుర్వారం బగు శాప మిచ్చుటయుఁ దత్కోపంబునన్ లోకముల్
నిర్వాహంబులు దప్పియున్న కతనన్ నీపాదసంసేవకుల్
సర్వజ్ఞా ! చనుదెంచినారము జగత్స్వామీ ! కటాక్షింపవే ! ౪౫

మ. వినరా! యర్జున! నాఁడు మద్గురువు నుర్విం గూల్చి యేతెంచి నా
కనుగంటం బొడచూపి తింకఁ దొలఁగంగా రాదు నీమస్తకం
బునఁ బిండం బిడి తర్పణావలి యసృక్పూరంబునం జల్పి మ
జ్జనకుం దృప్తునిఁ జేసి నీకులము నిఃక్షత్రంబు గావించెదన్. ౪౬

చ. జనకజ యంకభాగమున సంతస మారఁగ సుప్తుఁ డైనయ
జ్జనపతి డాయవచ్చి యతిసాహసియై యొకవాయసంబు దా
ననుపమ మైనసీతవదనాంబురుహంబును గ్రోలుకన్నులున్
ఘనకుచకుంభయుగ్మమును గాంచి మనోజశరార్తచిత్తమై ౪౭

సీ. అలిగి నొచ్చియు నోరఁ బలుకని పెనిమిటి
యేతప్పుగని నన్ను నింత చేసె
నెఱి నాదు చెమట నెత్తురుగాఁగఁ దలఁకెడు
మఱఁది కానలఁ గాడుపరచె నెట్టు
లతిభక్తి నఱకాళ్ళ కరచేతు లొగ్గడి
యత్త లేగతి నిర్దయాత్మలైరి
తగ నన్నుఁ దనపాలిదైవంబుగాఁ జూచు
మంత్రి లేగతి నీతి మాలిపోయి
రకట నాదుకర్మ మదియేల చననిచ్చు
వ్రయ్యఁబడెడు నట్టి బ్రదుకుకంటెఁ
జావు మేలు పాపజాతిగర్భం బేల
కలిగె నెవ్వరింకఁ గలరు దిక్కు. ౪

క. తనకేమి కొఱంత కృష్ణుఁడు
మనమునఁ గనికరము లేక మఱి కై యకటా
వనమునకు వేఁట నెపమునఁ
గొనిపోయి ప్రసేనుఁ జంపఁగూడునె తనకున్. ౧౦ ఆ

ఆ. వేగుజాము లేచి వెస వార్చి యాచార్య
భక్తిఁదలఁచి విష్ణుఁబంకజాక్షుఁ
దలఁపునందు నిలిపి తనదు నామసహస్ర
మును బఠింపవలయుఁ బురుషుఁ డెలమి. ౧౧ ఆ

వాశిష్ఠ రామాయణము:—

గీ. యౌవనంబునందు నవికారి యై తనున్
బరులు మే లనంగ బ్రతికెనేని,
యతఁడు పుణ్యపురుషుఁ డతఁ డుత్తమోత్తముఁ
డతఁడు వంద్యమానుఁ డఖిలమునకు ౧ ఆ

మ. పరమార్థంబునఁ బుట్టుట ల్మడియుటల్ భావింప లేవెన్నఁడున్
నిరుపాధిస్థితి శుద్ధబోధమయమై నీయందు నీవుండి తి
ట్టిరువారన్ సకలంబు గన్గొనుచు నొండీక్షింప నొక్కింతయున్
బొరి సర్వాత్మతఁ జేసి నీవ జననంబుం దాల్తు నీయం దొగిన్

ఉ. ఇచ్చటఁ గాన నొక్కఁడవ యేటికి నేడ్చెదవన్న! యేడ్వఁగాఁ
జచ్చినవారు వచ్చెదరె చావును బుట్టును సృష్టి కింతకున్
వచ్చినఁ జాలుగాక మనవారికె వచ్చెనె! దేహకోటికిం
జచ్చు టవశ్య మెందును విచారము సేయకు దేహధర్మముల్

క. పొలియుట బ్రతుకుట పోవుట
కలుగుట నే నతఁడు ననుట గలుగక మదిలో
దలఁచిన యట్టిమహాత్ముం
డిల జీవన్ముక్తుఁ డగు నహీనవివేకా! ౨ ఆ

సీ. సకలార్థవితతికి సంగంబు హేతువు
సంగంబు నిలయంబు సంసృతికిని
సంగంబు మూల మాశాలతావలికిని
సంగంబె యాపద్దశలకు నెలవు
సంగవర్జనమె మోక్షము సంగవిరతిని
జన్మనాశం బగు జనవరేణ్య
కలిమిలేములు రెండు కడు దుఃఖ మొనరించు
మలినవాసన సంగమం బెసంగ

గీ. నింక సన్ముక్తిరక్తుల కిట్లువితత
జన్మఖేదము హర్షవిషాదగతియు
సడలవర్తిల్లు శుద్ధవాసన యెసంగ
ననుచుఁ గొనియాడుదురు మును లనఘచరిత. ౪ ఆ

ద్విపదభాగవతదశమస్కంధము:—

నగరంబు వెలువడి నగరాజతనయ
నగరంబు సొత్తెంచె నరనాథవర్య
అపుడు జరాసంధుఁ డాదిగాఁ గల్గు
నృపుఁ లేఁగి వెంట రా నిలయంబుకడకు
హరియు నాయతపడి యన్నతోఁ గూడఁ
బరివారసహితుఁడై బంధుభావమున
నాసన్న మెఱఁగి తదాననసీమ
భాసిల్లె కుండినపతిపుత్రి యపుడు
వచ్చిన ముత్తైదువలతోడఁ గూడ
నచ్చుగా నచట కృత్యములెల్లతీర్చి
దళుకొత్తఁగా నోట దరలించినట్టి
వలరాజు చికిలిక్రొవ్వాఁడు చందమున
బొదలి మేఘంబు చాటునుండి వెడలి

చదలఁ బర్వినయట్టి శంపయో యనఁగఁ
జలజాతముల దాటి చనుదెంచినట్టి
కలికి తామరయింటిగరితయో యనఁగ
సరగున చండికాస్థానంబు వెడలి
హరిఁ జూడఁగోరెడు నాలేమఁ జూచి
సుదతి ముంగురులపై సొబగెల్ల చూచి
ముదురు తుమ్మెద లెట్లు మొరయక యుండుఁ
బడఁతుక బొమదోయి భావంబు చూచి
పొడివడ కెట్లుండు బువ్వులవిల్లు
కలకంఠి యాసోగకన్నులు చూచి
తలవంప కెట్లుండు ధవళాంబుజములు
వనజాక్షి మాటలవరుసలు చూచి
వసరక యెట్లుండు వరకీరసమితి
యల్లలనామణి యధరంబు చూచి
కుల్లిపో కెట్లుండు గురుబింబఫలము
దిట్టగు బెరయూరు తెఱఁగెల్ల చూచి
నిట్టూర్పు విడ కెట్లు నిలుచుఁ గాలాహి
కన్నియనడుము చక్కదనంబుచూచి
చిన్నవో కెట్లుండు సింగంబునడుము.

కామందకము:—

క. గతదోషుఁడు గుణవంతుఁడు
కృతవిద్యుఁడు శక్తియుతుఁడు గీర్వాణసమా
న్నతచరితుఁ డాత్మరతా
రతుఁడగుపతి యనుభవించు రాజ్యసుఖంబుల్ ౧౫౧

గీ. పతి యథావిధి దండసంపన్నుఁ డైన
వెసఁ త్రివర్గఫలంబును వృద్ధిఁ బొందుఁ

గాక యున్మార్గదండన కర్కశమున
మునులకైనను గోపంబు నొలవకున్న. ౨౦౧

చ. నృపతిపురోహితుండు నృపనీతివిదగ్ధుఁడునై సమగ్రతయూ
నిపుణుఁడునై తనర్చి ధరణీపతికెప్డు హితాభిలాషియై
రిపునృపకర్మభేదనధురీణత శాంతికపౌష్టికక్రియా
విపులమనీషఁ జేయఁదగు వేడ్కదలిర్పగృహప్రయోక్తయై ౩౨౩

చ. జనపతిసంస్థలు న్మిగుల సచ్చరితంబులు గల్గువానిఁగా
నొనరఁగఁ గార్యసిద్ధికొఱకున్నికఁ జేయుట వోలు వానియం
దనువునఁ జారులుండి వెరవాడి విదేశములోని మర్మముల్
గనుఁగొనుచుండఁగా వలయుఁగావున శాత్రవరాజధానులన్.
౩౨౪

మ పరగన్ భూపతి యిట్లుదండువిడియింపన్ యోగ్యమౌసేనకున్
వెరవారంగ శుభాశుభంబులు గను న్వీక్షించు టొప్పారు ని
ట్లరికి న్నేలును గీడుఁ జూచి యరిసైన్యం బల్పమైనన్ శుభం
బరియం దొందకయున్న నుద్యమము సేయ న్నేలగున్ యాత్ర
కున్. ౪౧౪

చ. అలసుని విక్రమశ్రీను నుపాయఫలప్రవిదూరునిన్ ఘృయా
కులితు నయప్రహాసపరిఘూర్ణితు నిద్రితు భీతు మూర్ఖుఁ గాం
తలఁ బసిబాలురన్ బలు నధార్మికు దుర్జనమైత్రిశీలు ని
శ్చలశుభబుద్ధియుక్తిఁదగ సామమునందజయించు టొప్పగుః
౫౨౬

క. గాంగేయు ద్రోణు రాధే
యుం గపటంబునన గెల్చియును బాండవులు
ర్వీంగడు నుతి కెక్కిరి
రంగజయం బఖలదోషరాశిం గడగున్. ౭౯౯

ఉ. ఒక్కఁటఁ గూటయుద్ధమున నుక్కఱ శత్రువధించినన్ జయం
బెక్కును గల్గి పాప మొకయించుక పొందదు నిశ్చయంబు పై
రుక్కున ద్రోణసూనుఁ డొక కొక్కెడ నున్నదు రేయి నిద్రమైఁ
జొక్కినపాండునందనులఁ జూచివధింపఁడె సౌప్తికక్రియన్ గ్రూర

పంచతంత్రి:—

చ. అరయఁగ శబ్దశాస్త్రము ననంతములాయువు కొంచె మందులోఁ
గరము ఘనంబు విఘ్నములు గావున సారము పట్టికొప్పగున్
బరఁగ నసారము ల్విడిచి పాలును నీరును చేర్పరించి నీ
ర్పరుదుగఁ బాలు పుచ్చుకొనునంచ తెఱంగున భూవరాగ్రణీ.

ఉ. మానుగ శత్రునైన నభిమానము సేయక చొచ్చి వాఁడు దన్
హీనముగాఁగఁ బల్కిన సహించుచుఁ బ్రాజ్ఞుఁడు శక్తియుక్తియున్
గానఁబడంగనీక పొసగం ధృతి పెంపును గప్పికొంచు నిం
పూనఁగ వారి గెల్వవలయుం దనకార్యములైనయంతకున్.

చ. నగరము లంక దుర్గము ఘనం బననొప్పుత్రికూటశైల మ
య్యగడిత వార్ధి యోధులు సురారులు శ్రీలు కుబేరు పెన్నిధుల్
నెగడినసీతిశాస్త్రములు నిచ్చలుఁ జెప్పెడివాఁడు శుక్రుఁ డీ
జగమున నట్టిరావణుఁడు జచ్చెన కాక మనంగనేర్చెనే.

మ. చెలువం బేది రరణ్యవాసగతులై శ్రీరాముఁడున్ బాండవే
యులు చేటొందిరి వృష్ణివీరు లురుదైత్యుం డైనలంకేశుఁడుం
గలఁగె న్మర్త్యులచే నలంగె నలుఁ డీకష్టంపురాజ్యంబుకై
తలపోయం గడు దుఃఖహేతు విది వ్యర్థం బొప్ప దాశింపఁగన్.

మ. ఘనబాహాబలుఁ డైనశాత్రవునిపైఁ గార్తిక్య చైత్రంబులన్
జను టొప్పు న్మఱి దాడిపోవ నెపుడైన న్మేలు శత్రుండు దా
ననయంబున్ వ్యసనం బొకంటఁ బడ యుద్ధాసక్తిమైనున్కిఁ దా
విను నే నత్తఱి భేదమందు హతుఁ గావింపన్ దగున్ జయ్యనన్.

ఉ. దైవవశంబునం గలుగు దండ మవగ్రహతీవ్రరోగపీ
డావలి యెట్టిదేశమున నైనను గాలబలాపకృష్టమై
కేవల మట్టివేళఁ బరికించుచు నల్పకుఁ డేల దండయా
త్రావిదుఁ డైన గెల్వఁడె యరణ్యసురక్షితదేశ మేనియున్.

చ. అమలబలాఢ్యుఁ డైన నరుఁ డాజడి దేశము కేగియుఁ స్వదే
శమునవపోలె నొప్పి మను శాతనఖంబులశక్తిమై యర
ణ్యములకు నేఁగినం దివిరి యచ్చటసింహము కుంభికుంభ మాం
సము తినుఁగాక యాకొనిన చక్కటిఁ బూరికి నఖ్ఖు సాచునే.

ఉ శ్రీగలవానిఁ బేదయుఁ బ్రసిద్ధపతివ్రతఁ జెడ్డయింతియున్
జాగిని వజ్రలోభియు సుజాతి విజాతియు ధర్మనిర్మలో
ద్యోగిని బాపకర్ముఁడును నొప్పెడువానిఁ గురూపుఁడున్ విశే
షాగమవేది మూర్ఖుఁ డెడనాడుచు నుండు టనీతినైజముల్.

ఈసింగయకవి, "శాలిహోత్రము" అను గ్రంథమునుండి :—

క. నాలుగుకాళ్ళును గొనచెవి (గొనయును)
వాలము వదనము విశాలవక్షము దెలుపై
మే లైన యష్టమంగళ
నేలినపతి యేలు నవని యేలెడుపతులన్.

అనుపద్యము నుదాహరించి యున్నాఁడు

ఈగ్రంథమునకు "అశ్వలక్షణసార"మని నామాంతరమున్నది. ఈకవి పేరు తెలియలేదు. అందుచే నాకవిచారిత్రమును వేఱుగ వ్రాయ లేనైతిని. ఈగ్రంథము మనుమంచి భట్టుదని యనుచున్నారు. కాని యిది నిజముకాదు. ఈవిషయమును మనుమంచి భట్టుచరిత్రమునఁ జర్చించెదను.

ఈగ్రంథములోఁ దాను జెప్పఁదలఁచుకొనిన నీతులకుఁ దగిన పద్యములు లభింపనపుడు అందుకొఱకుఁ దాను ప్రత్యేకముగఁ గొన్ని పద్యములను వ్రాసినట్లు కనఁబట్టుచున్నది. అట్టివానిలో "గోపబాల"

అనుమకుటము గలిగినవి రెండుపద్యములును "కేశవేశ" అనుమకుట ముగలవి రెండుపద్యములును గలవు. ఈమకుటములతో సింగనకవి శతకములను రచించెనేమో యని యనుమానము కలుగుచున్నది. వానినుండి చెఱియొకపద్యమును నీక్రింద నుదాహరించెదను.

సీ. గ్రామ్యంబు దుస్సంధి కాకు విరోధోక్తి
పొల్లసంశ్లిష్టంబు జల్లిపొదవు
వ్యర్థబంధంబు నిరర్థంబు పునరుక్తి
దోషం బలంకారదూషణంబు
రసవిరుద్ధము క్రియారాహిత్య మస్పష్ట
భావంబు గణయతిభంగశబ్ద
భంగంబు లెఱుఁగక సంగతంబుగ వట్టి
మాటలు పురికొల్పి మచ్చగమునఁ
బెనచి వడ్లను బెరుకును బిసికినట్లు
కెలను నవ్వఁగ జిలిబిలి కృతులు సెప్పి
వాదు లడువంగఁ బఱతెంచువారు కవులె
గోపికాజాలసుఖలోల! గోపబాల!

సీ. ఘనకశాఘాతకర్కశకిణ చేటికా
స్తనముల నలఁదిన చందనంబు
నిశితకంటకశిలానికటమర్కటకటిఁ
జెలువారఁ గట్టిన చేలుచేల
ప్రకటితాసవమత్తభల్లూక మాదలఁ
జాలుపారఁ జెరివినపుష్పమాల
సతతపల్వలపంకసంగిలులాయంబు
నెఱుతఁబెట్టిన తారహారపంక్తి
కరణిఁ గాకున్న సాహిత్యసరణి యెఱుఁగ
గవులు తర మెఱుఁగక యిచ్చుకావ్యకన్య
కజ్ఞసంగతిఁ బోదలు దురాత్మకులకుఁ
క్లేశసంసారభవనాశ! కేశవేశ!

## 57. పండికి అనంతయ్య

ఇతఁడైదాశ్వాసములు గలయొక యుత్తమ ప్రబంధమును రచియించెను. కాని దురదృష్టవశమున నిగ్రంథకర్తృత్వము వేఱొక సుప్రసిద్ధకవి కారోపితమైనందున నీతఁడు గ్రంథచోరుఁ డనునప ఖ్యాతికిఁ బాల్పడినాఁడు. ఆ గ్రంథరాజము పేరు "విష్ణుమాయా నాటకము."

ఈగ్రంథము యొక్క తాళపత్ర ప్రతులు రెండు మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునను, ఆంధ్రసాహిత్యపరిషత్కార్యాలయమున నసమగ్రమయిన ప్రతి యొకటియుఁ గలవు. మదరాసు ప్రతులలో నొకటి మాతృక, రెండవది దానిప్రతిక. వీనిలో గద్యము "ఇది శ్రీమదనగోపాల చరణ కమల సేవాధురీణ సత్కళాపారీణ కృష్ణ భట్టారకపౌత్ర చింతలపూడి కామయప్రభుపుత్ర సుకవివర్యరాధా మాధవ యెల్లనార్యప్రణీతంబైన విష్ణుమాయానాటకము" అనియు న్నది. పరిషత్తులో నున్న ప్రతి "౯౦ పత్రముల గ్రంథము. కాని నడుమనడుమ ౮౦ పత్రములు లేవు. మొదటియాకు లేదు. కడపటియా కులో గద్యము "ఇది శ్రీమదనగోపాల వరప్రసాదలబ్ధ కవితావిలాస భారద్వాజగోత్రపవిత్ర అయ్యలామాత్యపుత్త్ర అనంతనామధేయ ప్రణీతంబైన విష్ణుమాయానాటకం బను మహాప్రబంధంబు నందు సర్వంబును బంచమాశ్వాసము" అని యున్నది. ద్వితీయాశ్వాసాంత మున గద్యము కనఁబడుచున్నది. కనఁబడినంతవట్టు కృతిగోపాలమూర్తికి నిచ్చినట్లే తెలియవచ్చుచున్నది. కాని యేయాశ్వాసాంతపద్యములలోనైన నీగోపాలదేవుని 'దేయూరో' తెల్పునని చూచినఁ గన్పడలేదు. మొదటిపత్రము లేనికతంబునఁ గవి వంశాదికమును దెలియ రాలేదు.

ఈమూఁడుప్రతులనుగూడఁ బరిశీలించి, మదరాసువిశ్వవిద్యాలయమువా రీగ్రంథమును బ్రకటించిరి. దానికి శ్రీ కోరాడ రామ

కృష్ణయ్య M. A.గారు విపుల మగుపీఠికను వ్రాసియుండిరి. ఈముద్రిత ప్రతియందుఁ గొన్నిస్ఖాలిత్యము లున్నవని తలఁచి శ్రీ శ్రీ పిఠాపురం మహారాజా వారొకసిద్ధప్రతిని ముద్రింపించిరి. దానికి శ్రీ తేకుమళ్ల అచ్యుతరావు M.A.L.T గారు విపులమైన పీఠికను వ్రాసియున్నారు. వీరిరువురునుగూడ నీగ్రంథకర్త చింతలపూఁడి యెల్లనారాయణుఁ డని నిర్ణయించియున్నారు. శ్రీ రామకృష్ణయ్యగారు తమపీఠికలో, నీగ్రంథ కర్తృత్వమునుగూర్చి యిట్లు వ్రాసిరి.

"కృత్యాదిపద్యములు గలప్రతి మనకు దొరకలే దనుటకన్న కృత్యాదిరచనయే చేయఁబడియుండలే దేమో యని తలంచుటకుఁ గలకారణము మఱియొకటికూడఁ గలదు ఇప్పటికి లభించిన రెండుప్ర తులలోనుగూడ కృత్యాది లేకుండుట యటుండఁగా ఆంధ్రసాహిత్య పరిషత్ప్రతిలోని యాశ్వాసాంతగద్యము ప్రాచ్యలిఖిత పుస్తకాలయ ప్రతిలోనిదానికంటె భిన్నమైకనఁబడుచున్నది దీనినిబట్టి చూచినచో గ్రంథకర్తృత్వమునుగూర్చియే సందేహము బయలుదేరినది, ఈగద్యమునుబట్టి చూడఁగా బాదరాయణగోత్రుఁడును, అయ్యలామాత్య పుత్రుఁడును నగు అనంతయ్య యనునాతఁ డీగ్రంథకర్త యన వలసియున్నది. రాధామాధవకవి గద్యలో గోత్రము లేదు. ఇంటిపేరు చింతలపూడివారనియున్నది ఈగద్యములో గోత్రము చెప్పఁబడినది. కాని యింటిపేరు లేదు తండ్రులపేళ్ళుభిన్నములై యున్నవి. రాధా మాధవకవి తాతపేరుగూడఁ జెప్పుకొనియున్నాఁడు. మొత్తము మీఁద వీరిద్దఱు నొక్కరే యనుటకుఁ దగినకారణము లేమియుఁ గనఁబడవు ఒక్కఁడేయయి, దత్తుఁడగుటచేఁ దండ్రులపేళ్ళు భిన్న ముగాఁ జెప్పుకొనియె నందమా యివి భిన్నగ్రంథములు కావు ఒక్క గ్రంథముయొక్క భిన్నప్రతులలోనే యిట్లాశ్వాసాంతగద్యము భిన్న మయియుండుట యెట్లు సంభవించును? గ్రంథభాగమున మార్పులే మియుఁ గనఁబడవు. ఆశ్వాసాంతపద్యములుగూడ రెండు ప్రతుల

లోను సమానములుగనే యున్నవి. కావున నీయనంతయ్యయే యనంతా
తఁ డెవరో తరువాతికాలపు సాహసికుఁడు రాధామాధవకవి యీగ్రంథ
మును స్వకృత్యాదిగద్యములు లేకయే రచించుటను జూచి యాశ్వాసాంత
గద్యమును మార్చి తనకృతియని గ్రంథమును దనపేర వెలయిం
పఁజేయవచ్చునని తలంచెను. దాని వ్రాసిన ప్రతిలో నాశ్వా
సాంతములలోని గద్యములు చేర్చకపోయియుండును. దానినిబట్టి వ్రాసిన ప్రతు
లలో నితనిపేరుతో గూడిన గద్యము నిలిచియుండుట తటస్థించియుం
డును. కాని యనంతయ్య గద్యములు కూడ దేశమునఁ గొన్ని నిలిచి
యుండుటచే నీ గ్రంథచౌర్యము కొంతకాలమునకైన బయలుపడక
తప్పినది కాదు. గ్రంథ నామ్నమయు చరిత్రమునఁ గవులలో పద్యములయొ
క్కయు, పాదములయొక్కయు, భావములయొక్కయు, చౌర్యముండి
నను చెప్పిన చెప్పవచ్చునుగాని గ్రంథచౌర్యమున కిది ప్రథమోదా
హరణము కాఁగలదు. ఇట్టి సాహసకృత్యమునకుఁ దొలుత రాధా
మాధవకవి స్వకృత్యాది లేక రచించియుండుటయే కొంత యవకాశమును
గల్పించియుండును. ఎల్లనార్యుఁడే గ్రంథచౌర్యము చేసినాఁడనుట
కేమియు నవకాశము లేదు. ఇంతలి యాశ్వాసాంతగద్యములతో సభి
న్నానుగద్యము గల మఱి రెండు గ్రంథము లాతనివి ప్రసిద్ధములై
కనఁబడుచునే యున్నవిగదా! కృష్ణరాయలయాస్థానమున నాతఁడు కవిత
చేఁ బెద్దన్నగారిని మెప్పించి రాయలవలన రాధామాధవకవియను
బిరుదమును బొందెనన్న కథయు నాతని ప్రసిద్ధినిఁ జాటుచునే యున్న
ది. మఱియు, పరమనిష్ఠాగరిష్ఠుం డగునొక బ్రాహ్మణుఁడొక బోయ
వనిత తగులమునఁ బడుటనుగూర్చి తారకబ్రహ్మరాజీయమునఁ దె
లుపఁబడిన ఘంటికథయే విష్ణుమాయానాటకమునఁగూడ నంతకంటె
రమ్యతరంబుగఁ జెప్పఁబడియుండుటనుబట్టికూడ నీరెండుగ్రంథములు
రచించినవాఁడొక్కఁడే యయియుండు ననువాదమునకు మఱింత బలమే
ర్పడుచున్నది. దీనినిబట్టి యీవిష్ణుమాయానాటకకర్త 'రాధామాధవ
కవి' యగు చింతలపూడి యెల్లనార్యుఁడే యనిధ్రువపడుచుండుటయే
కాక 'అనంతయ్య' గ్రంథచౌర్యముకూడ సువ్యక్తంబగుచున్నది."

ఈగ్రంథకర్తృత్వవిషయమును శ్రీఅచ్యుతరావుపంతులుగారు తమపీఠికలోఁ దలపెట్టలేదు సంపూర్ణగ్రంథచౌర్యమున కిది యేప్రథమ మగుటచేతను, గ్రంథనామము విష్ణుమాయానాటక మగుటవలన నిందుఁగూడ వైష్ణవమాయ యున్నదేమో యనియనుమానము గల్గుటచేతను, నీచౌర్య మొనర్చిన యనంతయ్య యెవ్వఁడై యుండునని విమర్శించి చూచితిని. నాకీక్రిందియంశములు పొడఁగట్టినవి.

పద్మపురాణ, వాసిష్ఠరామాయణాదిమహాకావ్యములను రచించిన మడికి సింగనకు అనంతయ్యయను తమ్ముఁడున్నాఁడు. అతఁడు భారద్వాజగోత్రుఁడే, అయ్యలమంత్రిపుత్రుఁడే పరిషత్కార్యాలయమునను-౨ ప్రతిలోనిగద్యయందుఁ జెప్పఁబడిన గోత్రమును పితృనామమును సరిగా సరిపోవుటచే శ్రీరామకృష్ణయ్యగా రూహించిన చోరుఁడీతఁడే యనిస్పష్టమైనది సింగనకు "అనంతయ్య" యను తమ్ముఁడున్నట్లు వాసిష్ఠరామాయణములోఁ దననుగూర్చి సింగనకవి చెప్పుకొనిన యీక్రిందిపద్యములవలనఁ దెలియుచున్నది

చ. ఒనరఁగ నవ్వధూవరు లహోబలదేవునిఁ గూర్చి తద్వరం
 బున నొగి సింగనార్యుని, నమోఘగుణాఢ్యు ననంతుని, న్మహీ
 జనసుతు నోబయాంబ బుధసన్నుతిపాత్రుని నారయాహ్వయున్
 గని నరసింహనామములు గారవ మారఁగఁ బెట్టిరందఱన్.

క. వారలలో నగ్రజుఁడను
 వారిజదళనయనచరణవారిజసేవా
 సారమతి నతులవాక్య
 శ్రీరచనాసారమతిని సింగాహ్వయుఁడన్.

దీనినిబట్టి పైగద్యయందుఁజెప్పఁబడిన యనంతయ్య యితఁడే యనుట కణుమాత్రమును సంశయింపనక్కఱ లేదు

అనంతయ్యను, కవియని సింగన చెప్పలేదు. కాని యంతమాత్రమున నతఁడు కవికాఁడని చెప్పరాదు. అనంతయ్య విష్ణుమాయా

నాటకమును రచించెనా? లేక గ్రంథచౌర్యమొనరించెనా? యనునంశము లిట విమర్శనీయములు.

అనేకహేతువులనుబట్టి మడికిసింగనకాలము క్రీ. శ. ౧౩౭౫–౧౪౩౫అని యాతనిచరిత్రమున నిర్ణయించియుంటిని. అనంతయ్యకూడ నాకాలమువాఁడగును గదా? రాధామాధవకవికాలము క్రీ. శ ౧౫౩౦–౧౫౫౦ ప్రాంతమని యాతని రాధామాధవ, తారకబ్రహ్మరాజీయములు స్పష్టముగాను సంశయరాహిత్యముగాను జెప్పుచున్నవి. దీనినిబట్టి, రాధామాధవకవికంటె 'అనంతయ్య' నూఱుసంవత్సరములు పూర్వుఁడు. అందుచే నితఁడు రాధామాధవకవిగ్రంథమును చౌర్య' మొనర్చెనని చెప్పుట కిసుమంతయు నవకాశములేదు. ఇందుమూలమున నితనిపై నారోపితమైన యపఖ్యాతి పోవుటయే కాక గ్రంథకర్త యాతఁడేయని నిర్ధారితమగుచున్నది. ఇంతియే కాదు. రాధామాధవకవియే గ్రంథచోరుఁడనికూడఁ దేలుచున్నది. గద్యలనుబట్టి చూచినచో నియిరువురిలో నెవరో యొకరు గ్రంథచోరులు కాకతప్పదు, కాలవ్యత్యాసమునుబట్టి యనంతయ్య చోరుఁడుకాఁడని నిర్దిష్టమైనప్పుడిఁక రాధామాధవకవియే చోరుఁడగుట నిశ్చయము కదా! ఇట్లు నిశ్చయించుట తప్పనిసరియైనను, నాతనిపై నీచౌర్యదోషమాపాదింపలేము. రాధామాధవ, తారకబ్రహ్మరాజీయముల వంటి యుత్తమ కావ్యములను రచించినమహాకవి, అనంతయ్యగ్రంథమును దాను రచించితినని వ్రాసికొనునంతటి నీచకార్యమున కొడంబడునని తలంపరాదు ఇఁక నీకార్యము, ప్రతివిలేఖకులదై యుండునని తలంపవలసియున్నది. అంతకంటె వేఱుమార్గము లేదు.

ఈదోషము విలేఖకుల దనిచెప్పినంతమాత్రమునఁ జరిత్రకారునిధర్మము నెఱవేఱదు. ఎందుకొఱకే కాలమున నీమార్పు చేయఁబడియెనని విమర్శింపవలసియున్నది. మఱియు నీవిలేఖరి 'అనంతయ్య' గ్రంథమునకు' "ఎల్లయ" (రాధామాధవుఁడు) గద్యను జేర్చెనా?

ఎల్లయగ్రంథమునకు 'అనంతయ్య' గద్యను ముడిపెట్టెనా? యనువిష యమునుగూడఁ దేల్చవలసియున్నది.

విలేఖకుఁ డెల్లయకాలముననో, ఆతనికిఁ దరువాతనో, యీ మార్పు చేసియుండునను నిశ్చయము అంతకుఁ బూర్వపువిలేఖరికి రాధామాధవుని (ఎల్లయ) నామము తెలియుట యసంభవము. దీనిని బట్టిమార్పుచేసినకాలము క్రీ. శ. ౧౫౩౦ వసంవత్సరమునకుఁ బూర్వము కాఁజాలదు. ౧౫౫౦ ప్రాంతమని నిశ్చయింపవచ్చును. ఆకాలము నాఁటి విలేఖకుఁడు 'అనంతయ్య' నెఱిఁగియుండఁడు. "అనంతయ్య" సుప్రసిద్ధకవి కాఁడు. ఆతనిగ్రంథమొకటిలేదు. అందుచే నాతని పేరునైనను నీవిలేఖకుఁ డెఱిగియుండుట యసంభవము. సింగనగ్రంథ మునుజదివి తన్మూలమున ననంతయ్య నెఱిఁగి ఆతనిని కవియని సింగ నచెప్పకపోయినను ఊతనినిదీసికొనివచ్చి యెల్లయకవి గ్రంథమునకీ విలేఖరి యంటఁగట్టెనని తలంచుట సమంజసము కాదు. అనంతయ్య వంశములోనివాఁడైనవిలేఖరి తనవంశములోని పూర్వునకు ఘనత కల్గించుటకై యెల్లయ గ్రంథాంతమున నీయనంతయ్యగద్యను జేర్చె ననియనవచ్చును. కాని యీయూహ యంగీకార్యము కాదు. ఈయ నంతయ్యకును నావిలేఖరికిని నడుమ నాల్గుతరములు గడచినవి. తన పేరువేసికొనక నూటయేఁబదియేండ్లకు పూర్వుఁడైన వానిపేరుచేర్చె ననుట యసమంజసము. అనంతయ్యవంశమున, క్రీ. శ. ౧౫౫౦ ప్రాంత మున, అయ్యలమంత్రి కుమారుఁడైన వేఱొకయనంతయ్య యుండి, ఆతఁడే తనపేరును జేర్చి గ్రంథచౌర్యము చేసె నని యూహింపకూ డదా! యని యెవ్వరైన ననవచ్చును. ఊహింపఁదలఁచినచో, నాధా రరహితములైన నిట్టియూహలకు పరిమితి యుండదు. అట్టిహానితోఁ బ్రయోజనము లేదు.

ఈచర్చనుబట్టి విలేఖకుఁడు, అనంతయ్య గ్రంథమునం దెల్లయా మాత్యుని గద్యను జేర్చుట సంభవముకాని, యెల్లయ గ్రంథముననన తునినామమును పొదుగుటసంభవముకాదని, తేలినది. ఇఁక విలేఖకుఁ

డెందుల కీమార్పుకావించె నను ప్రశ్నకు సమాధానము కావలసియు
న్నది. తాళపత్రప్రతులలోఁ గృత్యాది లేదని పీఠికాకారులు వ్రాసి
యున్నారుగదా! అట్లే కృత్యాదియు గద్యయు లేనిప్రతి యొకటి విశే
షకునకు లభించియుండును. రాధామాధవమును జదివియుండిన యీ
విశేషకి, యీరెండుగ్రంథములును బరీక్షిన్నరేంద్రునకు శుకునిచేఁ
జెప్పఁబడి నట్లుంచుటచేతను, రెండు గ్రంథములయందలి ప్రథమా
శ్వాసములును శ్రీకృష్ణునికథలతోఁ గూడియుండినవగుటచేతను నీ
రెండుగ్రంథములును గోపాలాంకితములే యగుటవలనను, నీరెండు
కావ్యముల కర్తలును నొక్కరే యగుదురని యూహించి, యెల్లయా
మాత్యుని రాధామాధవ గద్యమును దెచ్చి విష్ణుమాయానాటకమున
వేసియుండునని యూహింపఁదగియున్నది.

శైలినిబట్టియు, శిల్పమునుబట్టియుఁ గవియొక్క హృదయపరి
పక్వస్థితి రచనమునఁ గన్పట్టుటంబట్టియు, రాధామాధవ, తారకబ్ర
హ్మరాజీయముల యనంతరమున విష్ణుమాయానాటకమును, నెల్ల
యామాత్యుఁడు రచియించెనని పీఠికాకారులు నిర్ణయించియున్నారు.
మొదటి గ్రంథగద్యలో "సుకవివర్య రాధామాధవయెల్లనార్య" అని
వ్రాసికొని యుండెను. తారకబ్రహ్మ రాజీయ గద్యములో (కృష్ణ
దేవరాయలచే రాధామాధవబిరుద మందినకారణమునఁ దననిజనామ
మును విడచి బిరుదనామ మైన రాధామాధవనామమును మాత్రమే
యుదాహరించుచు దాని కనుగుణముగా శబ్దాలంకారము
కొఱకు 'సుకవివర్య' యనుశబ్దమును మార్చి) "శుద్ధసారస్వత విభవ
రాధామాధవ ప్రణీతంబైన" యని చెప్పుకొనియున్నాఁడు. మఱియుఁ
దారకబ్రహ్మరాజీయములో:—

"క. రాధామణాధ రోరుప
యోధర కాశ్మీరవర రసోదయకవితా

మాధుర్యధుర్య నన్నున్
రాధామాధవుని సుకవిరత్నముఁ బలికెన్."

అని తనబిరుదునామమునే చెప్పి నిజనామమును విడచిపెట్టి నాఁడు.

మూఁడవగ్రంథ మగు విష్ణుమాయానాటకములో రాధామాధవగద్యవలె 'సుకవివర్య' రాధామాధవయెల్లనార్య' అనియున్నది. నిజముగా నెల్లనార్యుఁడే యీగ్రంథమును రచించి, తాను గద్యను వ్రాసికొనియున్న మొదలఁ దారకబ్రహ్మరాజీయమునందువలెనే తన బిరుదనామమును మాత్రమే యుదాహరించుచు, శుద్ధసారస్వతవిభవ రాధామాధవ, అనియే వ్రాసికొనియుండును. గాని మరల వెనుకకుఁ బోయి "సుకవివర్యయెల్లనార్య" అనివ్రాసికొనియుండఁడు. దీనినిబట్టి పైన నేనుజెప్పిన లైవరో విలేఖరి రాధామాధవగద్యనుబట్టి గద్యమును వ్రాసి యీగ్రంథమునకుఁ దగిల్చినాఁ డనుటయందే సత్యమున్నదని నిశ్చయింపవలసియున్నది.

పీఠికాకారుల యూహలపై నాధారపడ రాదనియు, వానినివిడచి విష్ణుమాయానాటకమును రెండవగ్రంథముగానే పరిగణింపవలయుననియుఁ గొందఱనవచ్చును. అట్లెంచినను క్లేశము మార్పుండదు. తననిజనామమును జాఱవిడచి, యాత్మోత్కర్షముచాటుబిరుదనామమును జెప్పుకొననుత్సుకుఁడైనయెల్లయ మూఁడవగ్రంథరచనమువఱకును దనయుత్కంఠ నాపుకొనియె ననితలంపరాదు. రెండవగ్రంథమునందే తనను "శుద్ధసారస్వతవిభవ, రాధామాధవ" యనియే చెప్పుకొను నని తలంచుటయే సమంజసము. కావున నీగద్య రాధామాధవకవి వ్రాసినది కాదనియు, విలేఖకుఁడు వ్రాసినదియే యనియు నిర్ణయింపఁదగియున్నది.

రాధామాధవమునకును విష్ణుమాయానాటకమునకు గొన్ని పోలిక లున్నవనియు, నందుచే నివి రెండు నేకకర్తృత్వములని నిశ్చ

యింపవలయుననియుఁ గొంద ఱందురు. దానినిగూర్చి యాలోచింతము. ఈరెండుగ్రంథములును, నైదాశ్వాసములుగలవియే యగుటయు, గోపాలాంకితములే యగుటయు నిజమే. కాని యంతమాత్రమున నవి యేకకవికృతము లనినిర్ణయించుటకుఁ దగినయాధారములు కావు. ఇఁక నాశ్వాసాద్యంతములను బరికింతము రెండు గ్రంథములయందును ఆశ్వాసాంతపద్యములు వేఱుగానున్నవి. ఆశ్వాసాదిపద్యములు కొన్ని యొకరీతిగనున్నవి. వాని సీక్రింద నిచ్చెదను. విష్ణుమాయానాటకమునఁ గృత్యాదిలేదు ప్రారంభపద్యమిది.

తే. భాగవతముఖ్యుఁ డగుశుకబ్రహ్మచేత
భాగవతసత్కథాపరబ్రహ్మవిద్య
నెఱిమి వినుచుఁ బరీక్షిన్నరేంద్రచంద్రుఁ
డచ్యుతక్రీడ లాత్మ కింపారఁ బలికె.

ఈపద్యమును బోలినపద్యము రాధామాధవమున లేదు. రాధామాధవమున నాశ్వాసాదిపద్యము లివి.

౧ క. శ్రీరాధాధరమధురసు
ధారసధారాప్రశాంత దారుణనిశిత
స్మారశరానల ధీరో
దారగుణాపాల నవమదనగోపాలా! ౨ ఆ

౨ క. శ్రీకర రాధావదనసు
ధాకరబింబప్రసన్న దరహాసరుచి
వ్యాకోచదృగుత్పల! వి
ద్యాకేవలమూల! నవమదనగోపాలా! ౩. ఆ

3. క. శ్రీరాధామదనద్వ
క్షోరుహమకరీకలాప శోభనముద్రా
ప్రారంభ జృంభసునిశిత
ధారానఖజాల! నవమదనగోపాలా. ౪ ఆ.

ఠ. క. శ్రీరాధానఖరక్షత
తారేశకళానిరస్తదన్పక దర్పో
దారాంధకార! జగదా
ధార! గుణావాల! నవమదనగోపాలా, ౫ ఆ.

ఇందలి మొదటిపద్యము ద్వితీయాశ్వాసాదిని, మూఁడవపద్యము నాల్గవయాశ్వాసాదిని, నాల్గవపద్యముమూఁడవయాశ్వాసాదిని, విష్ణుమాయానాటకమునం దున్నవి. రెండవపద్యమునకు బదులుగా నైదవయాశ్వాసాదిని: —

క. శ్రీకరరాధాకైరవ
రాకాసితకరుణ! మునివినాశితచేతో
వైకుంఠనిలయ! గుణర
త్నాకరకల్లోల! నవమదనగోపాలా!

అనుపద్యమున్నది. మఱియు, రాధామాధవమున ౨, 3, ౪, ౫ ఆశ్వాసములలో:

తే. అవధరింపుము దేవ! సంయమివరుండు
సకలవేదాంత విద్యావిశారదుండు
శుకమహాయోగి పలికె నుత్సుకత మెఱయ
నింపుగా నాపరీక్షిన్న రేంద్రుతోడ.

అనుపద్యము రెండవదిగానున్నది. ఈపద్యమే విష్ణుమాయానాటకమునను, ౨, 3, ౪, ౫ ఆశ్వాసములలో రెండవ పద్యముగానే యున్నది.

దీనినిబట్టి రెండుగ్రంథములకర్తయు నొక్కఁడేయని నిర్ధారణ మగుచున్నదని కొందఱియభిప్రాయము. కాని నేను వారితో నేకీభవింపఁజాలను. ఇదియు విలేఖకుని కృత్యమే యనినాయభిప్రాయము. ఆశ్వాసాంతపద్యములను వేఱుగావ్రాసిన రాధామాధవకవి ఆశ్వా

సాదిపద్యములను నాల్గింటిని వేఱుగా వ్రాయలేఁడా? రాధామాధవములోని పద్యములను దెచ్చి వేయుటెందులకు? వేసిన వాఁడు తార్మారుచేయుటేల? రాధామాధవములోనిగద్యను దెచ్చి యీగ్రంథమునకుఁ జేర్చినవిలేఖకుఁడు గద్యలోఁబాటుగ ప్రతియాశ్వాసాదినున్న రెండుపద్యములను బ్రతిలోఁ దాఱుమాఱుగ జేర్చియుండును. అందుచే నాశ్వాసాద్యంతపద్యములీ వివాదమును దీర్చుటకుఁ దోడు పడవు.

ఇఁకగ్రంథస్థవిషయములను బట్టి కవిని నిర్ణయింపఁగలమేమో చూడవలసియున్నది. విష్ణుమాయానాటకపీఠికాకారులిప్పుడునుగూడ నీగ్రంథమునఁ దృతీయాశ్వాసమునం దున్నగోదావరీ ప్రాంత భూమివర్ణనమును, బంచమాశ్వాసమునందలి సర్వవరక్షేత్రమాహాత్మ్యవర్ణనమును, నాధారముగాఁగొని యీకవి గోదావరిమండలమువాఁడని యూహించిరి. రాధామాధవమునకుఁ బీఠిక వ్రాసిన శ్రీనడకుదుటి వీరరాజు పంతులుగారు, చింతలపూఁడిగ్రామముపై నాధారపడి చర్చించి మొదట నెల్లూరుజిల్లా చింతలపూడియో, గుంటూరుజిల్లా చింతలపూడి కవి నివాసమై యుండుననియుఁ బిమ్మట ఏలూరు తాలూకా చింతలపూఁడికి వచ్చి యాతరువాత గోదావరిప్రాంతమునకు వచ్చియుండుననియు, నూహించినారు. శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు చింతలపూఁడి యెల్లనార్యుని నివాసము కడపమండల మందలి చింతలపూఁడియనిరి. ఈచింతలపూఁడి వివాదముల నొక్కింతసేపాపి, పీఠికాకారులాధారపడిన విష్ణుమాయా నాటకమందలి పద్యము లేమిచెప్పుచున్నవో చూతము.

పుండరీకుఁ డను బ్రాహ్మణుఁడు, యమునానదీపరిసరదేశవాసి, సావిత్రీప్రాణప్రియుఁడు, విష్ణుమాయాప్రభావముచే నొకబోయవనితం దగుల్కొని, దానియం దొకకూఁతు నొకకొడుకుంగని, యిరువదేండ్లాసంసారంబునం బడియుండ నింతలో ననావృష్టి దోషంబున

నా దేశమున నొకమహాకాటకము తటస్థింప నప్పుడా ప్రాంతమునజీవనో
పాధిలేక, సుభిక్షంబుగానుండు మఱియే ప్రదేశంబునకైన బోవ
యత్నించు సందర్భమున నాప్రుండకీకుఁ డాబోయువనితతో ననినట్లీ
క్రింది పద్యములను గవి రచించినాఁడు.

తే. పొలఁతి! విను పూర్వదక్షిణభూము లెల్ల
నెపుడు దుర్భిక్షదోషంబు నెఱుఁగ వండ్రు
బహునదీమాతృకలుగాని ప్రతిదినంబు
దివి నిరీక్షించు దేవమాతృకలుగావు.

సీ. కర్ణాటరాజ్యంబు గంభీరతుంగభ
ద్రాజలౌఘంబులఁ దఱచు పండు
ద్రావిడదేశ ముత్తరభోర్మిరమ్య కా
వేరికాలువల ముక్కారుఁబండు
త్రైలింగ్యమధ్యభూతలము కృష్ణాగౌత
మీప్రవాహంబుల మిగులఁ బండుఁ
గాళింగమధ్యదిక్ఖండంబు లాంగూల
శారదానదులచేఁ జాలఁ బండు

గీ. వెండియును జిత్ర మిట్లనావృష్టియైన
నంబుజాక్షి! నభోనభస్యద్వయమున
వర్ష మొప్పార గౌతమివరద ముంపఁ
బార్శ్వములయూళ్ళఁ బదివేలుఁ బండు నెపుడు.

సీ. ఏత్రోవఁ జూచిన నేప్రొద్దు సలిలాన్న
సత్త్రశాలాజనసంభ్రమంబు
లేయూరఁ జూచిన నెల్లధాన్యంబులు
కోరుపట్టెడు ప్రజాఘోషణంబు
లేయిండ్లఁ జూచిన నిందిరాకరసంత
తోత్సవతోరణాభ్యుదయరేఖ

లెవ్వరిఁజూచిన నివ్వటిల్లెడు దయా
దానసౌజన్యవిద్యానిగూఢి

తే. యెచటఁ జూచిన గనుపండు విందువదన
నారికేళామ్రపనసపున్నాగముఖ్య
భరితశృంగారవన పరంపరలచేతఁ
గోరికలుముంచు గౌతమీతీరభూమి.

తే. దివ్యమై తగుగౌతమీతీరభూమి
భోగమోక్షంబులకు జన్మభూమి సువ్యో
జన్మసంస్కారఫల విశేషంబుగలుగు
వారలకుఁ గానిగలుగ దవ్వసతిసుఖము.

ఇవియే కాక గౌతమినిజూచినతోడనే కలుగు నానందమును వెల్లడించుచు, గౌతమినిసంబోధించుచు మఱియైదు పద్యములనుగూడ వ్రాసియుండెను. ఇఁకసప్తవరక్షేత్రమును వర్ణించిన పద్యములనుగూడ నుదాహరించెదను.

క. నేదిష్ఠదక్షిణాశా
ప్రాదుర్భూతార్ద్రతుల్యభాగాజలజా
మోదభరితమా మారుత
మాౙైత్యారాతిహృదయ మలరఁగఁ జేసెన్

క. సవిధప్రాచీనమహా
లవణజలధిఘుమఘుమితకలధ్వని కెనయై
సవనాస్త్రశ్రోత్రియముఖ
వివిధరవం బావనమున వీనులఁ దనిపెన్.

క. అతినిబిడజలదమాలా
ప్రతిమానక్రతుసముత్థబంధురధూమ
ప్రతతుల గగనం బాచ్ఛా
దితమయ్యెన్ దద్వనమున దివిజులు పొగడన్.

పౌత్రాహ్మణుఁడగుపుండరీకుఁడ కీనదుమహాప్రదేశమున నెచ్చటను సన్నమే దొరకనట్లు గౌతమీతీరమునకుఁ దెచ్చి యానదినివర్ణించుట వలనను గోదావరిమండలమందలి తుల్యభాగానదిని, లవణసముద్రమును వర్ణించుచు, సర్పపురక్షేత్రస్థలనిర్ణయమును బహుసూక్ష్మపరిశీలనతోఁ జేయఁ బడినట్లు స్పష్టముగ గోచరించుచుండుటనుబట్టియు, నీకవి గోదావరిమండలము వాఁడై యుండునని పీఠికాకారులు నిర్ణయించియున్నారు ఆనిర్ణయముతో నేనును నేకీభవించుచున్నాఁడను. కాని యింతతో మనకార్యము తీరిపోలేదు. ఈగ్రంథకర్తయెవ్వరో ధృవపడలేదు.

విష్ణుమాయానాటకకర్త, యెల్లయార్యుఁడను నిశ్చయముతోఁ బై పద్యములనుబట్టి యాతఁడు గోదావరిమండలమువాఁ డని వారభిప్రాయపడిరి. ఆగ్రంథకర్తృత్వము వివాదాస్పదమైనందున వారినిర్ణయమంగీకరింపఁదగినది కాఁజాలదు. రాధామాధవకవి రచించిన తక్కినగ్రంథములు రెండిటిలోను, నాతనినివాసమును నిర్ణయించుట కాధారములు లేవు అతఁడు రాధామాధవమును కృష్ణరాయల సభకుఁ గొంపోయి, రాధామాధవబిరుదమును సంపాదించియుండుటచే, గోదావరిమండలమువాఁ డంతదూరముపోఁగలఁడా? యని సంశయించియు, తారకబ్రహ్మరాజీయమును అచ్యుతదేవరాయలమంత్రియగునంజయతిమ్మరుసుకుఁ గృతియిచ్చుచు:—

ఉ. నావుడు నీకు నంకిత మొనర్పఁదలంచినవాఁడ బంధుసం
భావన నీకు నిష్టముగ బ్రహ్మమయుం డగురామభద్రధా
త్రీవరమౌళి కంకితమిదే యొనరించిన మంచిపైఁడికిం
దావి ఘటిల్లె నేమియన నంజయతిమ్మ! వివేకభూమణా!

యనుపద్యమునఁ గృతిపతితోసంబంధము బంధుసంభావన మని చెప్పుటచే నీతఁడు బళ్ళారిమండలమువాఁడేమో యని యనుమానించియుఁ బై మువ్వురు పీఠికాకారులును, విష్ణు మాయానాటకమందలి

సర్వేశ్వరక్షేత్రి గౌతమీతీర వర్ణనములకు సమాధానము కుదురక అనుమానహృదయములతోనే కృష్ణాగోదావరి మధ్యస్థమైనవేఁగినాఁ డితని నివాస మని యొకరును, గుంటూరు, నెల్లూరు, ఏలూరు, తుదకు గోదావరిమండలవాసుఁడని యొకరును, కళింగదేశమునుండి కృష్ణరాయలతో వచ్చిగోదావరిమండలమున నివాస మేర్పరచుకొనియెనేమో యని యొకరును, విశాఖపట్టణ మండలములోని వీరవిల్లి తాలూకావాఁడై యుండునని శ్రీ విడదవోలు వెంకటరావుపంతులుగారును వ్రాసియున్నారు. విష్ణుమాయానాటకము నెఱిఁగియుండకపోయినచో వీరెవ్వరును నెల్లయామాత్యుని నివాసము గోదావరిమండలమని నిర్ణయింపక మఱియేమండలమనియో నిర్ణయించియుందురు. ఇందువలన విష్ణుమాయానాటకమునుబట్టి రాధామాధవకవికి గోదావరిమండల నివాసము లభించినదికాని, గోదావరిమండల నివాసకారణముచే, నీతనికి విష్ణుమాయానాటకకర్తృత్వము లభింపలే దని తేలినది. కావున నీతనిగ్రంథకర్తృత్వము సంశయాస్పదముగా నున్నదని ప్రస్తుతమనుకొని, యిఁక "అనంతయ్యను" గూర్చి యాలోచింతము.

అనంతయ్యతండ్రి నివాసము, గోదావరిమండలములోని రాజమహేంద్రవరమునకు సమీపముననున్న మడికిగ్రామ మని, మడికి సింగనకవికృత గ్రంథమువలన మనకుఁ దెలియుచున్నది (సింగనచరిత్రమును జూడుము). అయ్యలమంత్రి నివాసము మడికి యను నప్పుడనంతయ్య నివాసముకూడ నదియే యనుట నిర్వివాదాంశముకదా! ఈమడికిగ్రామము గౌతమీనదియొడ్డుననే యున్నది. గౌతమి వరదవలనఁ గొంతగ్రామము నదీపాతముకూడ నైనది. పై పద్యములలోని "గౌతమివరద" "గౌతమీతీరభూమి" అనువాక్యము లీమడికిగ్రామమునకు సరిగా నన్వయించుచున్నవి. గోదావరిమండలమందలి కాపిచింతలపూఁడి గౌతమీనదికి దక్షిణముననున్న వృద్ధగౌతమీస్రవంతికింకను దక్షిణమున రెండుమైళ్ళలోనున్నది. వన్నెచింతలపూఁడియింకను దక్షిణముననున్నది. అందుచే నివిరెండునుగూడ "గౌతమీతీర"

గ్రామములు కావు. ఎల్లయామాత్యకవి చింతలపూఁడి వాస్తవ్యుఁడైనను పైవాక్యము లతనికన్వయించుననుటకంటె ననంతయ్య కన్వయించుననుటయే సమంజసము. అయ్యలమంత్రి, "గౌతమీయుత్తరతటమున మహనీయమగు పెద్దమడికియందు. స్థిరతరారామతతులు, సుక్షేత్రములును జేకుఱ్ఱలార్జించి సితకీర్తిఁబెంపుమిగిలి యఖిలజగదన్నదాత నా నవనిఁ బరఁగె" నని సింగన చెప్పియున్నాఁడు. అనంతయ్య తన నివాసగ్రామమును మనసునందుంచుకొని విష్ణుమాయానాటకమందలి పైపద్యములలో "సలిలాన్నసత్త్రశాల జనసంభ్రమంబు" "ఏయూరఁజూచిన నెల్లధాన్యంబులు" "నారికేళామ్లపనస పున్నాగముఖ్య భరితశృంగార వనపరంపరలచేత" అను వాక్యములలోఁ దనయన్న చెప్పిన యభిప్రాయములనే వెల్లడించినాఁడు. పంచమాశ్వాసమునందలిపద్యములలో వర్ణితమైన తుల్యభాగ, గౌతమీనదికొకశాఖయై మడికిగ్రామమున కుత్తరమున నొక క్రోశమాత్రదూరమునఁ బ్రవహించుచున్నది.

ఈమడికి గ్రామమున వేణుగోపాలస్వామి ప్రతిష్ఠితుఁడై యున్నాఁడు. బహుశః అనంతయ్య యీదేవునికే యీగ్రంథమునుకృతి యిచ్చియుండును ఈకవిగద్యములో "ఇది శ్రీమదనగోపాలవరప్రసాదలబ్ధకవితావిలాస" అనిచెప్పుకొనుటనుబట్టియు, "నవకామగోపాల" "కందర్పగోపాల" శబ్దములు విష్ణుమాయానాటకమునఁ గొన్నితావులయందు వాడుటంబట్టియు, నీకవి మదనగోపాలమంత్రోపాసకుఁడనియు, మదనగోపాలునకే యీకృతియిచ్చినట్లు భావింపవలయునుగాని వేణుగోపాలున కంకితము చేసెనని తలంపరాదనియు, నందుచే దీనితో మడికి వేణుగోపాలునకు సంబంధము లేదనియు, దీనినిబట్టి యనంతయ్యకర్తృత్వము సందేహాస్పద మగుననియుఁ గొంద ఱనవచ్చును. వేణుగోపాల, మదనగోపాల శబ్దముల కీతఁడు భేదమును జూపలేదు. పంచమాశ్వాసమందలి దండకమును 'జయజయ నవకామగోపాల" యని యారంభించినను నందు వేణు, వేణునాథ, వేణుగోపాలస్వరూప,

వేణుదండస్ఫుటోష్ఠప్రసవన్మాధురీవృష్టివర్ణనములతో దండక మందలి చాలభాగమును నింపివైచినాఁడు. ఆశ్వాసాదిపద్యములలో వేణుగోపాల వర్ణనముండియుండుననియు ప్రతివిలేఖరి వానిని దొలఁగించి, యెల్ల యామాత్యున కనుగుణముగ నుండుటకై యందులకు బదులుగ రాధా సాధనమునందలి పద్యములను వేసియుండుననియుఁ దలంచుచున్నాఁ డను.

రాధామాధవకవి మదనగోపాలమంత్రోపాసకుఁడైనట్లు రాధామాధవపంచమాశ్వాసమందలి ౧౨౨ వ పద్యమును, నాశ్వాసాది పద్యములును, జెప్పుచున్నవి. అట్టివేవియు నీవిష్ణుమాయానాటకమునఁ గానరావు. ఆంధ్రసాహిత్యపరిషత్కార్యాలయమున నున్న తాళపత్ర ప్రతిని జూచితిని. అందాశ్వాసాదిభాగ ముండవలసినయాకులలో నొక్కటియును లేదు. ఆ భాగము లభించెనేని, యిప్పుడు ముద్రిత ప్రతిలోనున్న పద్యములకంటె భిన్నములైన పద్యము లందుండునని నావిశ్వాసము. కావున వేణు, మదనశబ్దభేద మీ గ్రంథకర్తృత్వము నుండి యనంతయ్యను దొలఁగింపఁజాలదు.

అనంతయ్యతాత యైన యెల్లాడమంత్రి రాచెలయందు గోపాలస్వామిని ప్రతిష్ఠించియుండెను. తరతరములనుండి వీరు గోపాలభక్తులు. సింగనకవికూడ గోపబాల శతకమును వ్రాసియుండెను. అందుచే ననంతయ్య తనగ్రంథమును గోపాలాంకితము చేసియుండెనని నిశ్చయింపవచ్చును.

ఇఁక రాధామాధవకవి గోదావరిమండలము వాఁడనుట కెట్టి యాధారము లున్నవో చూతము. చింతచెట్లు విశేషముగా నుండుటనుబట్టి చింతలపూఁడి యను గ్రామనామము లేర్పడినవనియు, ఆగ్రామనామములనుబట్టి చింతలపూఁడి యనునింటిపేరులు వచ్చినవనియు నంగీకరింతము. గోదావరిమండలము నందలి చింతలపూఁడి గ్రామములలో గోపాల, మదనగోపాలాలయములు లేవు. మఱియునా

గ్రామములో నిప్పుడు చింతలపూఁడి యనునింటిపేరుగల బ్రాహ్మణులు లేరు. కాని చింతలపూఁడియండా యింటిపేరుగలవారు, కాఁపులున్నారు. ఆసమీప గ్రామములయందు చాకలి, మంగలి, కుమ్మరి కులములలో నాయింటిపేరుగలవారున్నారు. చింతలపూఁడి గ్రామములలో లేకపోయినను గోదావరిమండలములో నాయింటి పేరు కల నియోగిబ్రాహ్మణకుటుంబములు చాలఁగలవు. అనంతయ్యకాలమున గోదావరిమండలమందలి సర్పవరమున జింతలపూఁడి వారున్నట్లీ క్రింది శాసనము సాక్ష్యమిచ్చుచున్నది.

"స్వస్తి శ్రీశకవర్షంబులు ౧౩౭౮ అగునేంటి చిత్రభాను మార్గశిర బ౧౩వ శ్రీభావనారాయణ పెరుమాళ్ళకు చింతలపూఁడి కాచంన్నంగారు తమతండ్రి కృష్ణమరాజుంగారికిన్ని విన్నమదేవులఁగారికిన్ని సుకృతంగాను మాచిరెడ్డిపంపున గలక్షేత్రం జేపట్టికొనబోనానకై ఆక్షేత్రమున్ను పళ్ళెమున్ను ధేనువున్ను సమర్పించిరి...."

ఈశాసనదాత ఏకులమువాఁడో తెలియదు నియోగి బ్రాహ్మణుఁడే యనుకొందము. దానమిచ్చినభూమి సర్పవరము గ్రామములోనిదే కావున నీతనికాపురము సర్పవరమే యని నిశ్చయింతము. ఈ గ్రామమునకు సమీపముననున్న చాళుక్యభీమవరమున నిప్పుడును చింతలపూఁడివారున్నారు. రాధామాధవకవితాత కృష్ణభట్టారకుఁడును దండికామయయు నగుటచే రాధామాధవకవి, పైశాసనదాతయొక్క వంశమువాఁడేమోయని యనుమానించుటకుఁగూడ నావకాశమున్నది. విష్ణుమాయానాటకములోని సర్పవరక్షేత్ర మహాత్మ్యవర్ణన మీయూహను బలపఱచుచున్నది. కాని దీనికొక్క ప్రబలమైన ప్రతిబంధకమున్నది. గోదావరిమండలవాసు లగు చింతలపూఁడివారు భారద్వాజగోత్రులు—ఎల్లయామాత్యుఁడు శ్రీవత్సగోత్రుఁడు. ఈ గోత్రభేదముచే, రాధామాధవమందలి చింతలపూఁడివారికిని, గోదావరిమండలమందలి చింతలపూఁడివారికిని, ఎట్టిసంబంధమును లేదని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. నెల్లూరు మండలమందలి దరిసి

తాలూకా చింతలపూఁడిలో చింతలపూఁడివారున్నారు వారిది కౌశిక గోత్రము. గుంటూరుమండల మందలి చింతలపూఁడిలోఁ జింతలపూఁడివారున్నారు. వారిది పరాశరగోత్రము. బళ్లారిమండలమునఁ జింతలపూఁడి లేదు కాని చింతకుంట యున్నది రాధామాధవకవి నివాసము బళ్లారి మండలమేమో! దీనిచే రాధామాధవకవికి గోదావరిమండలస్థితి పోయినది. దానితో తాను విష్ణుమాయానాటక కర్తృత్వమును పోయినది ఇఁక ననంతయ్యయే యీగ్రంథకర్త. ముమ్మాటికిని యీతఁడే ఇతఁడు గ్రంథచోరుఁడు కాఁడు

తారక బ్రహ్మరాజీయమునందు, విష్ణుమాయానాటకములోని పుండరీకుని కథవంటికథ యొకటి యుండుటచే, రెండుగ్రంథములు రచించినవాఁడొక్కఁడే యని శ్రీరామకృష్ణయ్యగారు పీఠికలో వ్రాసియున్నారు. ఈకారణమువలననే యీగ్రంథకర్తలు భిన్నులని తలంపవలయునని నాయభిప్రాయము. ఏకవియును ఒకమారు తాను వ్రాసియుండినకథను మఱల నింకొకగ్రంథమున వ్రాసియుండఁడనియు రామనామమాహాత్మ్యమును దెలుపుటకై చెప్పినకథను, విష్ణుమాయాప్రభావమును బోధించుటకై రెండవమాఱుపయోగింపఁడనియుఁ దనరెండవ గ్రంథమున నింకొకకథను గల్పించి చెప్పి తన ప్రతిభను వెల్లడింపఁ బ్రయత్నించుననియు నాయుద్దేశము. అనంతయ్యకథను క్లుప్తముగా, రాధామాధవకవి తనతారక బ్రహ్మరాజీయమునఁ జెప్పియుండెనని తలంపవచ్చును. లేదా, విష్ణుమాయానాటకము నెఱుంగకపోయినను పెద్దలవలన వినియో, యేపురాణమునందైనఁ జదివియో, (భాగవతమందలి అజామిళోపాఖ్యానమును బోలినది) రాధామాధవకవి యీకథను వ్రాసియుండవచ్చును. రాధామాధవకవి కర్తృత్వమును నిలుపుట కిదియొక కారణము కాదు.

ఇఁక శైలినిగూర్చి యోచింతము. అనంతయ్యగ్రంథ మింకొకటి యేదియును లభింపకపోవుటచే శైలీసామ్యవిమర్శన మసాధ్యము. ఇట్టి

శైలిలో యనంతయ్య వ్రాయలేఁడని చెప్పఁజాలము. ఎచ్చటనైన పద్యములలో, పాదములలో, భావములలో సామ్యమో యనుకరణమో కనఁబడినను, అనంతయ్యగ్రంథమును జూచి, యెల్లయార్యుఁడు. అట్లే వ్రాసియుండెనని సమాధానము వచ్చును. అందువలన నిజము తేలదు. కావున నీచర్చతోఁ బ్రయోజనము లేదు.

విష్ణుమాయానాటకమునందు గోవిందశర్మయను బ్రాహ్మణుఁ డొకఁడున్నాఁడు. ఇతఁడు శ్రీకృష్ణునకు మిత్రుఁడు. కుపితయగు సత్యభామను ప్రసన్నగాఁ జేయుటకై విష్ణుమాయాప్రభావమును దెలుపు కథలను గోవిందశర్మ సత్యభామకుఁ జెప్పెను. ఆకథలను వినవలయునని సనకసనందనాదులు శ్రీకృష్ణునికడకు రాఁగా, పాండవేయుఁడగు ధర్మరాజును, ఈకథలను వినఁదలంచియున్నాఁడు కావున గోవిందశర్మతోఁగూడ ధర్మరాజసభకేగి యచ్చట నీతనిచే నాకథలనువినుండని, శ్రీకృష్ణుఁ డానతిచ్చెను. వారట్లే ధర్మరాజసభకుఁ బోయిరి. గోవిందశర్మ ధర్మరాజున కాకథలనుజెప్పెను ఆకథలనే పరీక్షన్మహారాజునకు శుకబ్రహ్మ చెప్పినట్లు, అనంతయ్య, యీవిష్ణుమాయానాటకమున మనకీకథలనురచియించి పెట్టియున్నాఁడు మనకే పురాణమునను గోవిందశర్మ కనఁబడఁడు. అనంతునిసృష్టిలో నీతఁ డొక క్రొత్తవ్యక్తి.

వినుకొండవల్లభరాయలపేర శ్రీనాథమహాకవి రచించినక్రీడాభిరామ మను గ్రంథములో నొక గోవిందశర్మ యున్నాఁడు. గోవిందశర్మను సృష్టించుటకు శ్రీనాథునకుఁ దరువాతివాఁడైన రాధామాధవకవికి సాధ్యముకాని, యనంతయ్యకు సాధ్యము కాదనియు, నందుచే నీగ్రంథకర్త రాధామాధవుఁ డని నిర్ణయింపవలసి యుండుననియు నొకపూర్వపక్షము రావచ్చును. ప్రతాపరుద్రుని భోగకాంత యగు మాచల్దేవి నివాససౌధమును జూచి, దానిసమీపమున నున్నయొకనిని ఈమహాసౌధమెవ్వరి దనిగోవిందశర్మ ప్రశ్నింపనాతఁడు:—

శా. ద్వీపాంతంబుననుండి వచ్చితి వె ! భూదేవా ! "ప్రశాంతం మహా
పాపం" సర్వజగత్ప్రసిద్ధసుమనోబాణాసనావాసాయవి
ద్యోపాధ్యాయు ప్రతాపరుద్రధరణీశోపాత్త గోష్ఠీ ప్రతి
ష్ఠాపారీణ నెఱుంగ నయ్యోదవె ? మాచల్దేవి వారాంగనన్.

అని ప్రత్యుత్తర మిచ్చినట్లు క్రీడాభిరామ మందున్నది.

ఇట్టిపద్య మొకటి విష్ణుమాయానాటకమునందును నున్నది. శ్రీమహాలక్ష్మి యొకప్పుడు జగత్తునకంతకును దానేమూలము నని గర్వించి కృష్ణుఁదిరస్కరించి, వైకుంఠసౌందర్యమును హరించి యెచ్చ టకేనిం బోవ శ్రీమహావిష్ణువు మాయాలక్ష్మిఁగల్పించి వైకుంఠంబు నతిశోభాయమానంబుగాఁ జేసెను. ఆదిలక్ష్మి మఱల గొంతకాలం బున కచ్చటికి వచ్చి వైకుంఠసౌందర్యమును గాంచి యచ్చెరువంది యట లీలావిహారణంబులఁ బరిభ్రమించుచున్నతీఁగెఁబోండ్ల నిదియేమి యని ప్రశ్నింప, వారు:—

ఉ. ఎయ్యెడనుండి వచ్చితివి ? యీపురిదానవుగావె, యైతి వే
నియ్యెడ మమ్ము నిట్లడుగుదే ! మరి వార్తలు మంచి వన్నియున్
నెయ్యముతో జనార్దనుఁడు నేఁ డొకనూతనలక్ష్మిఁ దెచ్చినాఁ
డయ్యెలనాఁగవిభ్రమమహత్త్వము లెన్న వశంబె యేరికిన్.

అనిప్రత్యుత్తరమిచ్చిరఁట.

ఈ యనుకరణము పైపూర్వ పక్షమున కుదాహరణము కావ చ్చును. కాని, యీసంఘటనముకూడ ననంతయ్య నీ కర్తృత్వము నుండి త్రోసివేయఁజాలదు. అనంతయ్యయు శ్రీనాథుఁడును సమ కాలికులు. శ్రీనాథుఁడు రాజమహేంద్రవరమున వీరభద్రారెడ్డి యాస్థానమున నున్నవాఁడు. అనంతయ్య రాజమహేంద్రవరమునకుఁ బదిమైళ్ళదూరమున నున్న మడికి గ్రామమునం దున్నవాఁడు. అనం తయ్య శ్రీనాథునిగ్రంథమునుజదివి దాని ననుకరించియుండవచ్చును. లేదా గోవిందశర్మను శ్రీనాథుఁ డనంతయ్యనుండి గ్రహించెనని

తలంచినను దలంపవచ్చును. లేదా గోవిందశర్మయుఁ బైబద్యము లోనిభావమును రావిపాటి తిప్పన ప్రేమాభిరామములోనిది. తిప్పన అనంతయ్యకంటె నెనుబదియేండ్లుపూర్వుఁడు. అనంతయ్య ప్రేమాభిరామము నాధారముచేసికొనినదైన నుండును. కావునఁ బైఁజెప్పిన పూర్వపక్షమునందు బలములేదు.

రాధామాధవమున శ్రీశుకునిం జెప్పవలసివచ్చినప్పుడు శుక యోగి, శుకమౌని, శుకమహర్షి యనిచెప్పుచువచ్చినాఁడు. విష్ణుమాయానాటకమునం దెచ్చటఁ జూచినను, "శుకబ్రహ్మ" యని ప్రయోగించినాఁడు. ఇది యొకగొప్పభేదముకాకపోయినను, గ్రంథకర్తలు భిన్నులని తెలుపుట కొకయుదాహరణముగా గ్రహింపవచ్చును.

అనంతయ్యను, గవులెవ్వరును నుతింపలే దేమని యెవరైన నడుగవచ్చును. సింగనను, నన్నెచోడుని, ఎవ్వరును నుతింపలే దేమి? అనివారిని మఱలఁ బ్రశ్నించుటయె యీప్రశ్నకు సమాధానము. ఏ విధమునఁ జూచినను, నీకృతికన్యకు అనంతయ్యయే జనకుఁడని తేలుచున్నది. అదియే సత్యమని నాదృఢవిశ్వాసము.

విష్ణుమాయానాటకవ్రాతప్రతి మరియొకచోనున్నదని విని దానికై ప్రయత్నించుచున్నాఁడను. నాయత్నము సఫలీకృతమై యందేమేని విశేషములున్న మున్ముందు దాని నాంధ్రలోకమునకుం దెలుపుచుండెదను. మెఱుంగఁ గలదు.

శ్రీమహావిష్ణువు, అహంకారపూరితులైనవారికిఁ దనమాయాపరిభావమును జూపి వారిగర్వమడంచిన కథ లీగ్రంథమునఁ జెప్పఁబడినవి. సత్యభామ తనయింటనే పారిజాతవృక్షముండె ననియు శ్రీకృష్ణుఁడు తనయందే యనురక్తుఁడై యుండెననియు గర్వమును గలిగియుండెను.

తే. అష్టమహిషులయిండ్ల సహస్రసంఖ్య
లైనగోపాంగనలయిండ్ల నందఱకును

నన్నిరూపంబులై కేలి సలరె విభుఁడు
పారిజాతప్రసూనసౌభాగ్యలీల.

క. ఇందీవరదళలోచన
లందఱుఁ దన్మాయ మెఱుఁగ కజ్ఞాత్ముఁడు నా
యంద యనురక్తుఁ డనియిం
పొంది తదాసక్తలగుచు నుండిరి ప్రేమన్.

ఇది ప్రథమాశ్వాసమందలికథ. ద్వితీయాశ్వాసమున శ్రీమహాలక్ష్మి విష్ణునితో నెత్తమాడి యందామెకుఁ గలిగిన మోటమివలన భర్తపైఁ గోపించి వైకుంఠపురమునందలి వైభవమున కంతకుఁ దానె కారణ మని తలఁచినదగుటచే దాని నుపసంహరించి తుదకు విష్ణునిచే మోసపోయిన తెఱఁగును. మూఁడవయాశ్వాసమున "బ్రహ్మ తానే జగత్సృష్టికర్తనని గర్వించి మార్కండేయుని ప్రతిబోధనువినక సృష్టికార్యము చాలించి తపస్సు చేయఁబోయి విష్ణుమాయచే మోసపోయిన తెఱంగును, అనంతరము శివుఁడు మన్మథుని సంహరించుటచేఁ దా నింద్రియనిగ్రహము కలవాఁడనని గర్వించి విష్ణుని తనమోహినీరూపమును జూప బలవంతపెట్టి దానిచే మోసపోయిన విధంబును" బంచమాశ్వాసమున "నారదుఁడు విష్ణుమాయను దెలిసికొన్నవారు తనకంటె నెవ్వరు లేరనుగర్వముచే దానిం దిరస్కరించి స్త్రీరూపమును బొందించిన విష్ణునిచే మోసపోయినవిధంబును" దెలుపు కథలిందతిచమత్కారముగా వర్ణింపఁబడినవి.

అనంతయ్య కవిత్వ మతిమనోహరమై సర్వవిధములఁ జక్కనై యున్నది. విష్ణుమాయానాటకమునకుఁ బీఠికలను వ్రాసిన పండితులిరువురును, నిందలికవిత్వమును మిగులఁ బ్రశంసించియున్నారు. కవి పేరు మారినను నా ప్రశంసావాక్యములలో మార్పుండదు. ఆవాక్యములీయనంతయ్యకవిత్వమునకును నన్వయించును. ఈ గ్రంథమందలి కవితారీతి తెలియుట కయిదాశ్వాసములనుండియు నైదుపద్యముల నుదాహరించెదను.

ఉ. ద్వారకనుండి వచ్చె వటువర్యుఁ డొకండు విసిలకంథ రా
కారుఁడు, గోపిచందనవికస్వరఫాలుఁడు, పారిజాతమా
లారమణీయవక్షుఁడు, మిళత్తులసీనవమంజరీశ్రవో
హారి, ద్వితీయకృష్ణుఁ డన హాటకపుస్తకహస్తుఁడై దివిన్ ౧ఆ

మ. సలిలాంతః ప్రతిబింబితార్కరుచిరోజం బొల్చె ధూమచ్ఛటా
కులకాంతి న్నవహేతి యట్లడరుచున్ గుప్తప్రభావంబు మై
మలినత్వంబును గల్గి యోగనిగతిన్ బ్రహ్మన్విలోకించు నీ
యలఘుప్రక్రియఁ బొల్లి యేసతులయందైనం గనుంగొంటిరే ౨ఆ

చ. పరమమునీంద్ర! యోభువనపా.తచరిత్ర! మృకండుపుత్త్ర! నీ
గురుపరమార్థబోధమునకున్ మఱఁ గొల్వక బ్రహ్మ దానహం
కరణపరాయణత్వమునఁ గానకనన్ను నధఃకరించి దు
ష్కరతరపీడ చేసెఁ ద్రిజగంబుల కంచుఁ దలంక నేటికిన్ ౩ఆ

శా. ఏ విచ్ఛావతినై చరింతుఁ బతిలేఁడెవ్వాఁడు నాకొక్కఁగుం
డేనాఁడుం గనుదృష్టి వెట్టె మదిలో నెవ్వాఁడు నేవాని బ్ర
హ్మానందంబునఁ దేలు వేఱెయొకచో నాసక్తుఁ డెవ్వాఁడు దా
వానిం గైకొన, తాపదగ్ధుఁ డయిపోవం జేతు నాకోకలన్ ౪ఆ

తే. మానధనుఁ డైనపెనిమిటి, మానధనులఁ
గొడుకులను గోలుపోయితి, బడితి నిడుమ
సరిగడా మూడుజన్మంబు చాలు నాఁడు
జన్మ మే నొల్ల నేఁడేడు జన్మములకు. ౫ఆ

—:0:—

## 58. కందనామాత్యుఁడు

ఇతఁడు కవియని చరిత్రకారు లెవ్వరును జెప్పియుండలేదు. మడికిసింగనకవి తన సకలనీతిసమ్మతమునఁ గందనామాత్యునీతితారావళిలోనివని కొన్ని పద్యముల నుదాహరించియున్నాఁడు. "తారావళి" యని యితఁ డెన్నిపద్యములను వ్రాసియున్నాఁడో తెలియదు. ఈ కందనమంత్రి మడికిసింగన రచించిన పద్మపురాణకృతిభర్త. ఇతనిని గూర్చి మడికిసింగన చారిత్రమున వ్రాసియున్నాఁడను. ఇతని కాలము క్రీ.శ. ౧౩౮౦–౧౪౩౦ అయియుండును. నీతితారావళిలోని నాల్గు పద్యము లిట నుదాహరించెదను.

చ పలుకులు గొన్ని నేర్చి వడిఁ బ్రాసము సందుల దోఁపనేర్చు భం
గుల నెటువంటిపద్యములు గూర్చిన గూర్పఁగవచ్చుఁ గాక తద్
జ్ఞులు వొగడం బ్రబంధములు చోద్యము పుట్ట రచింప వచ్చునే
చెలువలు ద్రిప్పినట్లగునె చెర్వులుగట్టుట భూతలంబునన్. ౧౮

క బలవంతుఁడు మన్నించిన
బలహీనుఁడు బలియుఁ డగుఁ గదా ధారుణిలో
వలరాయఁడు చేపట్టిన
యలరులు బాణములు గావె యోబళకందా!

క వివిధకళాకోవిదుఁడై
సవినయుఁడై యీఁగి గలిగి సంగరజయుఁడై
నివుడనిన్నృపతులఁ బొందును
యువిదయుఁ గీర్తియును నోబళోత్తమకందా!

క. వడిఁ దునిమిన్పైవఁ దనకిగ
పడునంతకు శత్రునెడఁ గపటభక్తిదగున్
కడుగదె నదీప్రవాహము
వడి ద్రిప్పగవలసి యంఘ్రిపము పాదంబుల్

## 59. జక్కయ కవి

ఈ కవి నియోగిబ్రాహ్మణుఁడు; అన్నయామాత్యపుత్త్రుఁడు. పెద్దయామాత్యపౌత్త్రుఁడు ఈతని గృహనామము గాని, గోత్రము గాని, నివాసస్థలముగాని గ్రంథమువలన నేమియుఁ దెలియుట లేదు.

ఇతఁడు విక్రమార్కచరిత్ర మను నెనిమిదాశ్వాసముల యుత్తమ కావ్యమును రచించి సిద్ధయమంత్రికిఁ గృతియొసంగెను. కవికిఁ బితామహుఁడైన పెద్దయకవి తిరుకాళవిభునిచే గౌరవము నందినట్లీ క్రింది సీసమాలికలోఁ గృతిపతిపలికినట్లుగా చెప్పఁకొనియున్నాఁడు.

సీ. సంస్కృత ప్రాకృత సౌరసేన్యాదుల
గడియలో నొకశతకంబుఁ జెప్ప
బ్రహసనప్రకరణ భాణాదిబహువిధ
రూపకంబులయందు రూఢి మెఱయఁ
జక్క చతుర్భద్రచతురుత్తరాధిక
క్షుద్రకావ్యములు పెక్కులు రచింప
నాంధ్ర కవిత్వంబునందుఁ బ్రబంధంబు
మేలుగాఁ దజ్ఞులు మెచ్చఁ జెప్ప
నిమ్ముల నేరీతి నేధాతువున నేమి
నవరసములను వర్ణనలు సేయ
సరి నేకసంథా ద్విసంథాత్రిసంథలఁ
దొడరినఁ బోరిఁ బోరిఁ గడవఁ జదువ
నెవ్వఁ డేయవధాన మెఱుఁగు నయ్యవధాన
మున వాని కించుక ముల్లు సూప
వృత్తకందము కందవృత్తంబులును జతు
ష్కందంబు మొదలుగాఁ గలుగు గర్భ
కావ్యవర్గము చెప్పఁ గమ్ర ప్రబంధముల్
క్రొత్తలు పుట్టించుకొని లిఖింపఁ

గా నక్షరచ్యుతకంబు మాత్రాచ్యుత
కంబు బంధచ్యుతకంబు నామ
గోప్యంబులును క్రియాగోప్యంబులును భావ
గోప్యంబులును జెప్ప గోష్ఠియందు
బక్ష్యంబు రీతి నార్భటమునం జదువంగ
నెల్లవిద్యల సంచు లెఱుంగ నేర్తు
వనుచు నెల్లూరితిరుకాళమనుజవిభుని
సమ్ముఖంబున సాహిత్యసరణి మెఱసి
మహిమ గాంచిన పెద్దయామాత్యసుకవి
మనుమఁడవు నీవు సినంశమహిమ యొప్ప

కవి తండ్రి నీ క్రింది పద్యములలోఁ గీర్తించియున్నాడు.

క. ఆఁడకు మయూర రేఖను
గాడం బాఱందు బాణగతి మనమెరియన్
బోడగు పెద్దయయన్నయ
మాడకు మాడెత్తు నతనిమాటలు జగతిన్.

క. అని మీతండ్రి మహత్త్వము
జనవినుతరసప్రసంగ సంగతకవితా
ఘన తేజులు కవిరాజులు
గొనియాడుదు రఖిలరాజకుంజరసభలన్.

జక్కనకవి పెద్దయకు మనుమఁడును, అన్నయ్యకుఁ బుత్త్రుఁడు నయినట్లు పై పద్యములలో స్పష్టముగాఁ గానవచ్చుచుండఁగా ముద్రిత ప్రతియందలి గద్యలో "పెదయన్న యామాత్యపుత్త్ర" అనివేయుట పొరపాటు "పెద్దయయన్నయామాత్యపుత్త్ర" అని యుండవలయును. ముద్రితప్రతి పీఠికలో "జక్క న పేరయాన్నయామాత్యుని కొడుకు. పెద్దయామాత్య సత్కవి మనుమఁడు" అని వ్రాసియున్నాడు. "పేర యాన్నయామాత్యుని కొడుకు" అని వ్రాసినదికూడఁ బ్రమాద

జనితమే. కృతిపతి తండ్రియైన జన్నమంత్రికి పేరయయన్నయా మాత్యుండు, మేనమామ. అతండు కవి. ఆతనిసోదరి సూరమాంబికను, జన్నమంత్రి తండ్రియైన సిద్ధనమంత్రి బరిణయ మైనట్లీ క్రింది పద్య ములో నున్నది.

చ. పరిణత నవ్యకావ్యరసభావవిజృంభణ భూరివిక్రమా
స్ఫురితచరిత్రతత్త్వసరసుం డగు పేరయ యన్నయార్యుసో
దరి యగు సూరమాంబిక ముదం బలరంగ బరిగ్రహించె భా
స్వరకమలాజనార్దన వివాహమహోత్సవలీల మీఱఁగన్

ఈ పేరయయన్నయామాత్యునికుమార్తె అక్కమాంబను జన్న మంత్రి వివాహమాడెను ఈ యక్కమాంబయే కృతిపతి తల్లి. చతుర్థాశ్వాసాంతపద్యములో:—

క భూరిమణి హేమభూషా
పూరిత కన్యాప్రదాన పుణ్యచరిత్రా
పేరయ యన్నయ వరతన
యారత్న శ్రీమదక్కమాంబాపుత్రా!

అని కృతిపతిని సంబోధించియున్నాఁడు. పీఠికాకారులు పొర పాటున నీపేరయ యన్నయనుకవి తండ్రిగా భావించియుందురు. లేదా 'పెద్దయా' అనుటకు బదులుగ 'పేరయా' అని పొరపాటున పడియుం డును.

జక్కయకవికిఁ బితామహుఁడైన పెద్దయామాత్యకవి ప్రబంధ కర్తయనిచెప్పినాఁడు కాని, ఆయన రచియించిన ప్రబంధము లేవి యో చెప్పలేదు. ఇతఁడు నెల్లూరి తిరుకాళవిభునిచేత మన్ననలంది నట్లు పై సీసమాలికలో నున్నది. ఈతిరుకాళవిభుఁ డెవ్వఁడో తెలిసి కొనవలసియున్నది. తిక్కన రచించిన నిర్వచనోత్తర రామాయణ కృతిపతి యగు మనుమసిద్ధికిఁ దండ్రియైన తిక్కరాజునకుఁ దిరుకాళ చోడుఁడని నామాంతరమున్నది. ఆతిరుకాళ చోడునకుఁ గవిసార్వ

భామ బిరుద ముండుటచేఁ బండితప్రభు వగునాతఁడే యీపెద్దనామాత్యుని గౌరవించెనని యూహకలుగును. శ్రీ చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు పెద్దయామాత్యకవిని బోషించిన దాతిరుకాళచోళవిభుఁడే యని యాంధ్రులచరిత్రములో వ్రాసియున్నారు. కాని దీనికొక్క ప్రతిబంధకము కన్పట్టుచున్నది పెద్దయామాత్యుఁడు తిక్కరాజుకాలములో నున్నాఁడనిన, నాతనికుమారుఁడైన యన్నయ మనుమసిద్ధికాలములో ననఁగాఁ దిక్కన సోమయాజికాలములోను, అన్నయకుమారుఁడైన జక్కయకవి తిక్కనసోమయాజికిఁ దరువాత ముప్పది నలువదిసంవత్సరములలోను నున్నాఁడని చెప్పవలసివచ్చును. తిక్కనసోమయాజి క్రీ.శ. 1260 సంవత్సరప్రాంతము వాఁడై నందున జక్కనకవి 1300 సంవత్సరప్రాంతమున నున్నట్లు తేలుచున్నది. జక్కయకవి విక్రమార్క చరిత్రమునం దెఱ్ఱాప్రెగ్గడను బూర్వకవిగా నుతించియుండుటచే, నాతఁ డెఱ్ఱాప్రెగ్గడకుఁ దఱువాతివాఁడై నట్లు స్పష్టముకదా ! క్రీ. శ. 1300 సంవత్సర ప్రాంతమున జక్కయామాత్యకవి యున్నాఁడనినచో, 1320వ సంవత్సరము మొదలు 1350వ సంవత్సరము వఱకును రాజ్యపరిపాలన మొనర్చిన వేమారెడ్డి యాస్థాన కవియగు నెఱ్ఱాప్రెగ్గడ, జక్కయకవికిఁ బూర్వుఁడనుట పొసఁగ నేరదు

పోనిండు. ఎఱ్ఱాప్రెగ్గడయు జక్కనయు సమకాలీనులని భావింతము. అట్లు భావించుట కొకయాధారముకూడఁ గన్పట్టుచున్నది. జక్కయకవి యెఱ్ఱాప్రెగ్గడను నుతించినపద్యమును జూడుఁడు.

ఉ. ఈ త్రయిఁ దాఁ బ్రబంధపరమేశ్వరుఁడై విరచించె శబ్దవై
　చిత్రి నరణ్యపర్వమున శేషము శ్రీనరసింహరామచా
　రిత్రములున్ బుధప్రతగరిష్ఠత నెఱ్ఱయ శంభుదాసుఁ డా
　చిత్రకవిత్వవాగ్విభవ జృంభితుఁ గొల్చెద భక్తియుక్తితోన్.

ఎఱ్ఱాప్రెగ్గడ నాలుగు గ్రంథములను రచించియుండగా నిందు మూఁడు గ్రంథములను మాత్రమే జక్కయకవి చెప్పియున్నాఁడు. తుదను రచించిన హరివంశము నీతఁడు పేర్కొనియుండలేదు. ఇందువలన జక్కయకవి విక్రమార్క చరిత్రమును రచించునాఁటికి ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశమును రచించియుండలేదని యూహించుట కవకాశము కలుగుచున్నది. ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశమును క్రీ. శ. 1330-40 సంవత్సర ప్రాంతమున రచించియున్న ట్లాతని చారిత్రమునఁ జెప్పియున్నాఁడను. కావున జక్కయకవి తన విక్రమార్క చరిత్రము నంతకుపూర్వము చేసియుండెనని చెప్పవలసివచ్చును. ఆ కాలము క్రీ. శ. ౧౩౨౦ ప్రాంతమగును. కృతిపతినిబట్టి కాలనిర్ణయము చేసినచో విక్రమార్కచరిత్ర రచనాకాలము క్రీ. శ. ౧౩౯౦ సంవత్సర ప్రాంతమై యున్నట్లు తేలుచున్నది. ఈ రెండుకాలముల నడుమ డెబ్బదేండ్లు వ్యత్యాసమున్నందున నిందేదియో యొకటి యసత్యము కాకమానదు.

ఇఁక కృతిపతివిషయ మాలోచింతము. విక్రమార్కచరిత్రయందలి వర్ణనమునుబట్టి కృతిపతివంశవృక్షము నీక్రింద నిచ్చుచున్నాఁడను.



ఈ వృక్షమునకు మూలపురుషుఁడైన సూరనసోమయాజి గొప్ప పండితుఁడును, కర్మిష్ఠియునై రాజేంద్రచోడునివలన నగ్రహార ములను బడసియున్న ట్లీ క్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

సీ. వేదశాస్త్రపురాణవిజ్ఞానసంపన్నుఁడై
　　　　యధిగతపరమార్థుఁడై తనర్చి
నెద్దనపూడి, రాజేంద్రచోడక్ష్మా
　　　　రమణుచే నగ్రహారములు వడసెఁ
గనకదండాందోళికాచ్ఛత్రచామర
　　　　ప్రముఖసామ్రాజ్యచిహ్నముల నొప్పి
సర్వతోముఖముఖ్యసవనక్రియాప్రౌఢి
　　　　నుభయవంశంబుల నుద్ధరించె
నన్నదానాదిదానవిద్యాఘనుండు
పరమశైవసదాచారపారగుండు
హారితవంశాంబునిధిచంద్రుఁ డార్యనుతుఁడు
సుగుణవిభ్రాజి సూరనసోమయాజి

క. అమ్మహితాత్మునిమనుమఁడు
సమ్మాననదయానిధానసౌజన్యరమా
సమ్మోదితబాంధవుఁడై
యిమ్మహిలో సిద్ధమంత్రి యెన్నిక కెక్కెన్.

ఈ కందపద్యములోని మనుమఁడు అనుశబ్దమునకు బదులుగా ము. దిత. ప్రతిలో తనయుఁడు అనియున్నది. కొన్ని తాళపత్రప్రతులలో మనుమఁడు అనియున్నది. సూరనసోమయాజికి మొదటి సిద్ధమంత్రి (ఈవంశవృక్షములో నిరువురు సిద్ధమంత్రులుండుటచే నితనిని మొదటి సిద్ధమంత్రియంటిని.) కుమారుఁడా? మనుమఁడా? యని సంశయించు చుండఁగా వీరేశలింగము పంతులుగారు కవుల చారిత్రములో 'మను మఁడు' అను పాఠమునే గైకొని మనుమఁడని వ్రాసెనేగాని యాతఁడు

తనయుఁడును గాడు, మనుమఁడును గాఁడు. మనుమఁ డనగా సూరన సోమయాజివంశీయుఁ డని యర్థమని వ్రాసియున్నారు. అట్లనుటకు వారు వ్రాసిన కారణ మిది.

సూరనసోమయాజి కగ్రహార మొసంగిన "రాజేంద్రచోడుఁడు ౧౧౪౬వ సంవత్సరము మొదలుకొని ౧౧౬౩వ సంవత్సరమువరకును రాజ్యపాలనము చేసెను. సిద్ధమంత్రికొడుకైన జన్నమంత్రి ౧౪౦౬ సంవత్సరము మొదలుకొని ౧౪౨౨ వ సంవత్సరమువఱకును రాజ్య పరిపాలనము చేసిన దేవరాయనికాలములో నుండెను. తాతకును మనుమనికిని నిన్నూటయేఁబది సంవత్సరములు వ్యత్యాస ముండుట సంభవింపనేరదు. గావున నిచ్చట మనుమఁ డనఁగా సంతతి వాఁడని యర్థము చెప్పవలెను. అందుచేత సిద్ధనమంత్రి సూరనసోమయాజికి మనుమఁడుగాక తద్వంశజుఁ డయియుండుట నిశ్చయము"

శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు :—

"ఎద్దనపూడి రాజేంద్రచోడక్ష్మా
రమణుచే నగ్రహారముగఁ బడసె"

అని సూరనసోమయాజి వర్ణితుఁ డగుటవలన అతఁడు రాజేంద్రచోడ రాజునకు సమకాలికుఁ డన్నది స్పష్టము, ఈరాజేంద్రచోడరాజు వెల నాఁటిదుర్జయవంశజుఁడును క్రీ.శ. ౧౧౬౩ మొ॥కొని క్రీ. శ. ౧౧౮౧ వరకు పాలించిన రాజేంద్రచోడరాజు అనుటకు సందియములేదు. ఈవిధముగాఁ జూచినచో పెద్దయామాత్యుఁడును, అతనిపోషకుఁడు. తిక్కరాజు (రెండవతిక్కరాజును) సూరనసోమయాజియు నించు మించు సమకాలికులని విదితమగుచున్నది." అని వ్రాసియున్నారు. (భారతి ౨౪ వ సంపుటము ౨౮౩ వ పుట) శ్రీశర్మగారే ౨౮౪ వ పుటలో "వెన్నెలకంటి సూరనసోమయాజి వెలనాటి రాజేంద్రచోడు నికి సమకాలికుడు. రాజేంద్రచోడుని చివరికాలములో అనగా క్రీ శ. ౧౧౮౦ ప్రాంతముననున్న వాఁడు. జక్కన తాత పెద్దయామాత్యుఁడు క్రీ.శ ౧౨౮౦ నాటి రెండవతిక్కరాజు కాలమువాఁడు అని వ్రాసిరి.

శ్రీ శర్మగారి యీవాక్యములు పరస్పరవిరుద్ధముగా నున్నవి. చూసిమాటయుటుండనిందు. పంతులుగారు చూపిన వ్యత్యాసమును శర్మగారు సమన్వయింపలేదు. క్రీ శ ౧౧౮౦ లోనున్న సూరనసోమయాజికి మునిమనుమఁడైన జన్నమంత్రి దేవరాయల కాలములో ననగా క్రీ.శ. ౧౪౨౦ ప్రాంతమున నుండుట యసంభవము ముత్తాతకును మునిమనుమనికిని నడుమ ౨౦౦ సంవత్సరములు వ్యత్యాసముండుట యస్వాభావికము. ఈ యసందర్భమును తొలగింపవలయునన్నచో, పంతులుగారనినట్లు సూరనసోమయాజికి సిద్ధనమంత్రి మనుమఁడుగాఁక యాతని వంశజుఁడైన నై యుండవలయును. లేదా రాజేంద్రచోడుడు మఱియొకఁడైననై యుండవలయును.

వెలనాఁటిచోడులలో రాజేంద్రచోడనామధారులు నలువురున్నారు ఇందుఁ గడపటివాఁడు కులోత్తుంగ రాజేంద్రచోడుఁడు. ఇతఁడును మనుమసిద్ధియు సమకాలికులు. ఇతని శాసనములు శా శ. ౧౧౭౧-౧౧౭౬ సంవత్సరములలోఁ గన్పట్టుచున్నవని తిక్కనసోమయాజి చరిత్రములో వ్రాసియుంటిని. ఆతఁడే సూరనసోమయాజికగ్రహార మొసంగెనని తలంచితిమేని, సూరనసోమయాజి క్రీ. శ. ౧౨౫౦ ప్రాంతమున నాతనిచే నగ్రహార మందెననియు నాతని మునిమనుమఁడైన జన్నమంత్రి క్రీ. శ. ౧౩౫౦ ప్రాంతమునం దుండెననియు నిశ్చయింపవచ్చును. ఇందు విరుద్ధ మేమియు నుండదు. పంతులుగారు చూపిన వ్యత్యాసమునకుఁ దావుండదు. మనుమఁడని వ్రాసినదానిని వంశీయుఁ డని దలంపనక్కఱ యుండదు. దాన మొసంగిన ఎద్దనపూఁడి గుంటూరుమండలములోని నర్సారావుపేట తాలూకాలోనిది ఈప్రాంత మాకాలమున వెలనాఁటిచోడుల పాలనములో నున్నట్లు తెలంపవచ్చును.

సూరనసోమయాజికి మనుమఁడైన మొదటిసిద్ధనమంత్రిని గవి యీక్రింది రెండుపద్యములలో వర్ణించియున్నాడు.

మ. శ్రుతులన్ వన్నియకెక్క శాస్త్రములచే సొంపగ్గలించెన్ మహో
న్నతిఁ బోషించెఁ బురాణకావ్యరస నానానాటకాలంకృతుల్
క్రతువర్గంబుల సుప్రయోగమహిమన్ గాంచెన్ విరించ్యాన్వయో
ర్జితపుణ్యుం డగుసిద్ధమంత్రి సుగుణశ్రీమించి సేవించినన్

చ. వనరుహనాభు కుద్ధవుఁడు వజ్రికి జీవుఁడు వల్లభారుణీ
శునకు యుగంధరుండు దితిసూతికి దైత్యగురుండు విక్రమా
ర్కునకును భట్టిరీతి నధికుం డగునన్నయగంధవారణం
బునకుఁ బ్రధానుఁడై నుతులఁ బొందెను సిద్ధనమంత్రి యుద్ధరన్

సిద్ధనమంత్రిని మంత్రిగాఁ జేపట్టిన యీ నన్నయగంధవారణం బెవ్వఁడో తెలిసికొనవలసియున్నది. నీతిశాస్త్రముక్తావళిని రచించిన బద్దెనృపాలునకు నన్ననగంధవారణుఁ డని బిరుదుకలదు. ఆతఁడే యీతఁ డని యెంచినయెడల, పైఁ జెప్పినజక్కయకవికాలమునకు సరిపోవును. కాని యిందుల కొకయాటంకము కనఁబట్టుచున్నది. ఈబద్దెనృపాలుఁడు క్రీ. శ. ౧౨౬౦ ప్రాంతమువాఁడని యాతనిచారిత్రమున వ్రాసియున్నాఁడను. అతనిమంత్రి యైనచో సిద్ధనకూడ నానాఁటివాఁ డేయగును కదా? ఈసిద్ధనకుమారుఁ డైన జన్నయ దేవరాయల (౧౪౦౬–౧౪౨౨ నడుమనున్నవాఁడు) యొద్ద నుద్యోగిగా నెట్లుండఁ గలడు? ఈనన్ననగంధవారణుఁడు మఱెవ్వఁడో కాని బద్దెనృపాలుఁడు కాఁడు. నన్ననగంధవారణ బిరుదాంచితులు పెక్కురున్నారు. అందీ సిద్ధనమంత్రిని జేపట్టినయాతనిని గనిపెట్టుట సుకరమైన కార్యము కాదు.

ఈ సిద్ధనమంత్రికి మంత్రిభాస్కరుఁడును జన్నమంత్రియు నను నిరువురు తనయులు గలిగినట్లీక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

క. ఆదంపతులకు సుకృత
ప్రాదుర్భావమున మంత్రిభాస్కరుఁడు దయా

పాదిత బాంధవనికరము
హోదయుఁ డగుజన్నమంత్రియునుఁ గల్గి రొగిన్

ఈయిరువురిలోనగ్రజుఁ డైన భాస్కరమంత్రిని గవి యీ దిగువ రెండు పద్యములలో వర్ణించియున్నాఁడు.

చ. అమృతగిరీంద్రసంయమిపదాంబుజ షట్పదనాయకుండు నా
నమితకవిప్రశాంతికరాంచితపుణ్యుఁడు నాఁగ నీశ్వరా
గమపరమార్థవేది యనఁ గంజభవాన్వయవర్ధనుండు నాఁ
బ్రమహితకీర్తిఁ బెం పెసఁగె భాస్కరమంత్రి ప్రతాపధాముఁడై

తే. సుజనమిత్రుఁ డాదిత్యుండు సుతుఁడు గాఁగ
మానముఁ దైనారఫీమణి మహిమ మెఱయ
భాగ్యనిధి యైనభాస్కరప్రభువరుండు
పుత్త్ర,పౌత్త్రాభివృద్ధిచేఁ బొలుపు మిగిలె.

ఈ భాస్కరమంత్రి, విక్రమార్కచరిత్రము కృతినందిన సిద్ధనమంత్రికి పెదతండ్రి.

జక్కయకవి చరిత్రతో సంబంధించిన విషయములను జెప్పుట నొక్కింత యాపి యత్యవసర మగునొక విషయమునుగూర్చి యిఁట ముచ్చటింతును. ఇంతవఱకుఁ గవి, కృతిపతియింటి పేరేదియో మనకుఁ జెప్పలేదు. పూర్వపు కవులు కొందఱు తమ గృహనామము లనుగాని కృతిపతి గృహనామములనుగాని చెప్పక పేరులనుమాత్రమే చెప్పుచుండెడివారు. అట్టివారిలో నీజక్కయయొకఁడు. కవి చెప్పక పోయినను, గృతిపతియింటిపేరు వెన్నెలకంటివారని ప్రతీతికలదు. శ్రీకృష్ణవిలాసమును రచించిన వెన్నెలకంటి వేంకటాచలకవి యీ సిద్ధనమంత్రిని దనపూర్వునిగాఁ జెప్పుకొనియున్నాఁడు. వెన్నెలకంటి వారు హారితసగోత్రులు. ఈకృతిపతియు హారితసగోత్రుఁడే. వెన్నెల

కంటివారు నియోగిబ్రాహ్మణులు. ఈకృతిపతియు సీతనిపూర్వులును మంత్రిశబ్దవాచ్యులగుటచే నియోగిబ్రాహ్మణులే. కావున కృతిపతి యింటిపేరు వెన్నెలకంటి వారనియే నిశ్చయింపవచ్చును. ఈసందర్భమున విక్రమార్క చరిత్ర పద్యాంతములలో నున్న యీక్రింది పద్యమునుగూర్చి కొంచమాలోచింపవలసియున్నది.

ఉ. వెన్నెలకంటి సూరన వివేకగుణాఢ్యుఁడు వేదశాస్త్రసం
పన్నుఁడు రెడ్డివేమనరపాలకుచేత మహాగ్రహారముల్
గొన్నకవీంద్ర కుంజరుఁ డకుంఠితతేజుఁడు పెద్దతండ్రిగా
సన్నుతిఁగన్న సిద్ధనకు సంతతదానకళావినోదికిన్.

ఈ పద్యములోనున్న సూర్యుఁడు విక్రమార్క చరిత్ర కృతిపతియైన సిద్ధనకుఁ బెద్దతండ్రిగా సన్నుతిగన్నవాఁడు. పైనఁ గనుఁబరచిన వంశవృక్షములో సూర్యుఁడులేఁడు. సిద్ధనపెదతండ్రి భాస్కరమంత్రిగాని సూర్యుఁడుగాఁడు, భాస్కరసూర్యశబ్దము లేకార్థద్యోతకములు కావున నా భాస్కరుఁడే యీసూర్యుఁడని చరిత్రకారులందఱు నభిప్రాయపడియున్నారు వెన్నెలకంటి వెంకటాచలకవి యీ క్రింది పద్యములో సిద్ధన పెద్దతండ్రి సూరపరాజు అని చెప్పినాఁడు. కాని భాస్కరమంత్రి యని చెప్పలేదు.

ఆ. విక్రమార్కచరిత వేడ్కతో నందిన
సిద్ధిరాజు జగత్ప్రసిద్ధిరాజు
అతని పెద్దతండ్రి యైన సూరపరాజు
పరమశైవశాస్త్ర పారగుండు

వేంకటాచలకవి ఈ సూరపరాజును శైవశాస్త్రపారగుఁ డని చెప్పుటచేతను "ఈశ్వరాగమ పరమార్థవేది" యని భాస్కరమంత్రిని జక్కయకవి నుతించుటచేతను వీరిరువురు నొక్కరేయని కొందఱను

చున్నారు. శ్రీకృష్ణవిలాసము నాకు లభింపనందున వేంకటాచలకవి
యభిప్రాయమును బూర్తిగాఁ దెలిసికొనుటకు నాకవకాశము లేక
పోయినది. పండితాభిప్రాయ మిట్లున్నను, నాహృదయము వారితో
నేకీభవించుట లేదు. పైన చెప్పఁబడిన భాస్కరమంత్రియును సూర
నయు నొక్కరుగా రనియు, వేఱువేఱు వ్యక్తులనియు నాయభి
ప్రాయము. భాస్కరుని పేరును సూర్యుఁడని, సూరపరాజనియను టేల?
ఆ పేరు బాగుగా లేదనియా ? పద్యమునం దిముడదనియా ?

భాస్కరమంత్రిని జక్కయకవి వర్ణించిన రెండు పద్యములను
పై ననుదాహరించినాఁడను. ఈ పద్యములలో మంత్రిభాస్కరుఁడు
కవియని చెప్పలేదు. వేమారెడ్డిచే నగ్రహారముల నందెనని చెప్ప
లేదు. కృత్యాదియందుఁ జెప్పవలసిన నీరెండు ప్రధానవిషయముల
నచ్చట వ్రాయక విడచిపెట్టి కృతిపతియొక్క ప్రతిభావిశేషములను
జెప్పవలసిన "షష్ఠ్యంతములలో నగస్త్యభ్రాత" యని నట్లుచెప్పుట
చూడఁగవికి ఈప్రధానవిషయములు షష్ఠ్యంతపంచ పద్యరచనాంత
రమువఱకు స్ఫురణకు రాలేదనియు నప్పుడు జ్ఞప్తికిరాఁగా నచ్చట
మాంసపాదము నుంచి వ్రాసినట్లును గనఁబడుచున్నది. అందుచే నీ
"వెన్నెలకంటి సూర్యుఁడు" అనుపద్యము ప్రక్షిప్తమనియు, నే సంద
ర్భమునన్నో ఎవ్వరో రచియించిన దానిని నిట నెవ్వరో చేర్చియుందు
రనియుఁ దలంచుచున్నాఁడను. షష్ఠ్యంతములు సామాన్యములు
కందపద్యములై యుండును. ఆఱు ఎనిమిది పద్యములను రచించినవారు
కూడఁ గలరు. కాని యవి కందపద్యములలో నుండుట సర్వసాధార
ణము. విక్రమార్క చరిత్రమున నైదు కందపద్యములు నున్నవి
సామాన్యసూత్రమునకు విరుద్ధముగా నుత్పలమాల నాఱవపద్యముగఁ
గవిరచించి యుండఁడనియు, నందుచే నాపద్యము ప్రక్షిప్తమనియు
నేనూహించుచున్నాఁడను. అది ప్రక్షిప్తముగాక జక్కనకవి రచించిన
దనియే తలంచు నెడల నందలిసూర్యుఁడు భాస్కరుఁడుగాక వరుసకు

పెదతండ్రియైన మఱియొకసూర్యుఁడై యుండవలయును. అనగా దాయాదులలో నొకఁడో, లేక పెదతల్లి పెనిమిటియో అయియుండును పై పద్యమునందుఁ గేవలము పెద్దతండ్రి యని చెప్పక, "పెద్దతండ్రిగా సన్నుతిఁగన్న"యని చెప్పినవాక్యములు నాయూహకుఁ బలమొసంగు చున్నవి. నిజముగాఁ బెదతండ్రియైనచో "గా"కు బదులుగ "యై" యుపయోగించియుండును. పెదతల్లి భర్త యనుపక్షములో సిద్ధన మంత్రి యింటిపేరు మారిపోదా యనుప్రశ్న రావచ్చును. అప్ప చెల్లెండ్రను వెన్నెలకంటివారిలోని దాయాదుల కిచ్చియుందురని తలంపవచ్చును. కావున నాప్రశ్న కవకాశము లేదు. సిద్ధన్నకు దాయాదియైన సూర్యుఁడు కవికుంజరుఁడై యుండవచ్చును. షోడశ కుమారచరితమును రచించిన యన్నయ వెన్నెలకంటి వాఁడే. "కవితపుట్టిల్లు వెన్నెలకంటియిల్లు".

ఈవెన్నెలకంటి సూర్యుఁడు విక్రమార్కచరిత్రమును గృతినందిన సిద్ధయమంత్రికిఁ బితృసంబంధియైనను, మాతృసంబంధియైనను, పెద తండ్రి వరుసలోనివాఁడు. కావున సిద్ధయమంత్రికంటె వయసున నలు వది, యేఁబదిసంవత్సరములు పెద్దవాఁడై యుండునుకాని యంతకం టెఁ బెద్దవాఁడై యుండఁడు. హూణశకము ౧౩౭౨వ సంవత్సరము మొదలు రాజ్యము చేసిన దేవరాయలకడ జన్నమంత్రియు సిద్ధమంత్రి యుఁగూడ నుద్యోగులైనట్లు విక్రమార్కచరిత్రమునం దున్నది. సిద్ధమంత్రి ౧౩౮౦ వ సంవత్సరమున జన్నమంత్రి తరువాతనో జన్న మంత్రియుండగనో యుద్యోగియయ్యె ననియు, నప్పటి కాతని కిరువది యైదుసంవత్సరము లుండుననియుఁ దలంచినచో నాతనిజననము ౧౩౫౫ ప్రాంతమై యుండును. సిద్ధమంత్రికంటె వెన్నెలకంటి సూర్యుఁడు ఏఁబదియేండ్లు పెద్దవాఁడయ్యెనేని యాతనిజననము ౧౩౦౦ సంవత్సర ప్రాంత మని తేలినది. క్రీ. శ. 1320 మొదలు 1350 వఱకు రాజ్య మేలిన వేమారెడ్డికడ నీతఁ డగ్రహారముల నందెనని చెప్పుట కభ్యం

తరము లేదు. అందుచేతఁ బై పద్యమందలి "రెడ్డివేమనరపాలకుఁడు" ప్రోలయవేమారెడ్డియే. సూర్యున కగ్రహారము లొసంగినది ప్రోలయవేమారెడ్డియే. యనియు మఱియొక వేమారెడ్డి కాఁడనియు నాయభిప్రాయము.

ఈయవాంతరకథ నింతటితో విడచి ప్రధాన విషయమునకు మఱలుచున్నాఁడను.

కృతిపతి తండ్రియైన జన్నయమంత్రిని కృతిపతియైన సిద్ధనమంత్రిని గవి పెక్కుపద్యములలో వర్ణించియున్నాఁడు. వర్ణనాంశములను గలిగియున్న పద్యములను గ్రంథవిస్తరభీతిచే వదలి చరిత్రాంశములున్న రెండు సీసపద్యముల నీక్రింద వ్రాయుచున్నాఁడను.

సీ. విమలవర్తనమున వేదశాస్త్రపురాణ
వాక్యార్థసరణికి వన్నె పెట్టెఁ
బరమహృద్యం బైనపద్యశతంబున
దేవకీతనయు విధేయుఁ జేసె
గసికత్వమున దేవరాయమహారాయు
కరుణాకటాక్షవీక్షణముఁ గాంచెఁ
గర్ణాటకటకముల్ గలయంతయును మెచ్చ
గణకవిద్యాప్రౌఢి ఘనతకెక్కె

తే. గురులఁ బోషించె సత్కవివరుల మనిచెఁ
బ్రజలఁ బాలించె భాగ్యసంపదవహించె
హారితమునిముఖ్యవంశరత్నాకరేంద్ర
చంద్రుఁ డై యొప్పుసిద్ధయ జన్నమంత్రి.

సీ చిత్రగుప్తునకైనఁ జింతింప నరుదైన
గణితవిద్యాప్రౌఢి ఘనతకెక్కె
నవరసంబులయందు నవ్యకావ్యంబులు
కవిజనంబులు మెచ్చఁగా నొనర్చె

నాణెముత్తెములసోయగము మించినవ్రాలు
వడుపుతో నిగనేల వ్రాయనేర్చె
నాత్మీయలిపి యట్లు లన్యదేశంబుల
లిపులను జదువంగ నిపుణుఁ డయ్యె

తే. దేవరాయమహారాయ ధీవిధేయ
మంత్రివల్లభ చామనామాత్యదత్త
చామరచ్ఛత్రశిబికాదిసకలభాగ్య
చిహ్నముల నొప్పెజన్నయ సిద్ధమంత్రి.

ఈపద్యములలో జన్నమంత్రియు, సిద్ధమంత్రియు, దేవరాయుని కడ మంత్రులుగానున్నట్లు కన్పట్టదు. కాని వారికడ నుద్యోగులై యుండినట్లు తెలియుచున్నది. దేవరాయనిమంత్రి చామామాత్యుఁడై నట్లును నాతనివలనఁ గృతిపతి ఛత్రచామరాదులను బడసినట్లును పై పద్యములోఁ జెప్పియున్నాఁడు. ఎట్లయినను దండ్రికొడుకు లిరువురుఁగూడ దేవరాయని కాలమునం దున్నారనుట నిశ్చయము.

విక్రమార్కచరిత్రచతుర్థాశ్వాసాంతమం దున్న:-

శా. శ్రీకర్ణాటమహామహీశ్వరసదాసేవాప్రధానోత్తమా
నేక స్తుత్యలిపిక్రియానిపుణపాణిద్వంద్వపంకేరుహా !
యాకల్పాంతకనిత్యకీర్తి జలజాస్యాకేళిగేహాభవ
ల్లోకాలోకధరాధరావృతధరాలోకైకరత్నామణీ !

యనుపద్యమునందుఁ గర్ణాటమహీశ్వరునికడ నీకృతిపతి యుద్యోగి యైనట్లు చెప్పియున్నందునఁ బైనచెప్పిన దేవరాయఁడు కర్ణాటమును బరిపాలించిన ప్రభువనుట నిశ్చయము. కర్ణాటరాజ్యమును హూణశకము ౧౩౩౬ వ సంవత్సరము మొదలు పరిపాలించిన సంగమవంశజులలో దేవరాయనామధారు లిరువురున్నారు. ఇందు మొదటి దేవరాయలు ౧౪౦౬ మొదలు ౧౪౨౨ వఱకని కొందఱును ౧౪౦౪ మొదలని కొందఱును జరిత్రకారులు వ్రాసియున్నారు. ఈ దేవరాయలే

మన కృతిపతికిఁ బోషకులు. కావున జక్కయకవి యాకాలమున నుండినట్లు తేలుచున్నది. విక్రమార్కచరిత్రమును రచించునాఁటికి సిద్ధయమంత్రికిఁ దిప్పన యనునొక కుమారుఁడున్నట్లీ క్రింది పద్యము వలనఁ దెలియుచున్నది.

క. చందురుఁ గన్నపయోనిధి
చందంబున సిద్ధమంత్రి జనతానయనా
నందనుఁడు తిప్పధీమణి
నందనుఁడుగ నిత్యసేవనస్థితి మించెన్.

ఈ బాలునివయసు ౧౦ వత్సరములుండునేమో! దీనినిబట్టి సిద్ధనమంత్రి కృతిపతి యగునాఁటికి ౪౦ సంవత్సరముల వయసువాఁడై యుండును. ఈకావ్యరచనాకాలము కవినిబట్టి చూచినచో క్రీ. శ. 1320 అనియుఁ గృతిపతినిబట్టిచూచినచో క్రీ. శ. ౧౪౦౦ ప్రాంత మనియుఁ దేలినది. ఇం దేదిసత్యము? దీంనిసమన్వయము చేయుటెట్లు? అను ప్రశ్నలుమిగిలియున్నవి. ఈ ప్రశ్నలకు సమాధానము లారయఁ బ్రయత్నింతము. దేవరాయలు హరిహరరాయల కుమారుఁడు. హరి హరరాయలు విజయనగర సింహాసనమున క్రీ. శ. ౧౪౦౬ వఱకు నున్నను ఇతనిజీవితకాలములోనే దేవరాయలు విజయనగర రాజ్యము లోనిదై నెల్లూరుమండలమందున్న యుదయగిరి దుర్గమునకుఁ బతి పాలకుఁడుగా నుండెను. అతని శాసనములు నెల్లూరు మండలమున క్రీ. శ. ౧౩౭౨ మొదలు కన్పట్టుచున్నవి. (నె. శా. సం ౧. ౬౬౮, ౬౭౩, ౧౩౯౬ పుటలు) విజయనగర సింహాసనాధిపతుల కాలములో వారి కుమారులు ఉదయగిరియందు రాజ్యము చేయుచుండుటయు ధర్మములనొసంగి శాసనములు వ్రాయించుచుండుటయుఁ గలదు ఈదేవరాయలు విజయనగరసింహాసన మధిష్ఠించినపిమ్మట నీతని తనయుఁడైన రామచంద్రరాయలు ఉదయగిరిదుర్గాధిపతియై శాస నములను వ్రాయించియుండెను. (నె. శా. సం. ౩౧౦ ౩౯౦ పుటలు)

సిద్ధనమంత్రిని వర్ణించిన పద్యములో చామయామాత్యునివలన నాతఁడు గౌరవింపఁబడినట్లు జక్కయకవి చెప్పియున్నాఁడు. ఈచామయామాత్యుఁడు రెండుశాసనములలో నుదహరింపఁబడియుండెను (నె శా. సం ౬-౩ ౩౧౦ పుటలు) ఇందులో మొదటిది దేవరాయలది రెండవది ఆతనికుమారుఁడైన రామచంద్రరాయలది. చామయామాత్యుఁడు, దేవరాయ లుదయగిరియందున్నంతకాల మాతని యొద్దను దేవరాయలు విజయనగర సింహాసన మధిష్ఠించిన పిమ్మట నాతనికుమారుఁ డుదయగిరియందుండఁగా నాతనియొద్దను మంత్రిగా నున్నాఁడనియు దేవరాయలతోఁగూడ విజయనగరమున కేఁగ లేదనియు నీతఁడు నెల్లూరుమండలమువాఁడై యుండుననియు నిశ్చయింపఁ దగియున్నది. జక్కయకవి విక్రమార్కచరిత్రమున దేవరాయలను చామయామాత్యునిఁ జెప్పెనే కాని, రామచంద్రరాయలను దలపెట్టలేదు. కావున దేవరాయ లుదయగిరి దుర్గాధిపతిగా నున్నకాలముననే విక్రమార్కచరిత్ర రచియింపఁబడియెనని నిస్సంశయముగా నిశ్చయింపవచ్చును. ఆ కాలము క్రీ. శ. ౧౩౭౫-౧౪౦౪ నడుమనై యున్నది. ౧౩౮౫ ప్రాంతమనియనుకొందము. అప్పటికి జక్కయకవికి నలువది, నలువదియైదేం డ్లుండెనని యనుకొనిన నాతనిజననము ౧౩౪౫ ప్రాంతమును, నాతనితండ్రియైన యన్నయ జననము ౧౩౦౫ ప్రాంతమును, నాతనితండ్రియైన పెద్దయామాత్యుని జననము ౧౨౭౦ ప్రాంతమై ఇమ్మడితిరుకాళప్రభువు (మనుమసిద్ధి కుమారుఁడు)చే గౌరవమందియుండుననిసమన్వయింపవచ్చును. పైనఁజెప్పిన ప్రశ్నకిదియే సమాధానము. ఈపెద్దయామాత్యుఁడు తిక్కనసోమయాజి చరమవయసునఁ బ్రాజ్ఞుఁడై ౧౨౯౦-౧౩౦౦ ప్రాంతమునఁగవిత్వము చెప్పుచుండవచ్చును. ఈ పెద్దయామాత్యునిప్రభావము పై సీసమాలికలో జక్కయ వర్ణించియున్నాఁడు. ఆతని గ్రంథము లేవియు లభింపకపోవుట విచారకరమైన విషయము. కృతిపతియైన సిద్ధనమంత్రికూడఁ గవియనియు, గణితశాస్త్రజ్ఞుఁడనియు, ముత్యములవంటి

యక్షరములను రెండుచేతులతోను వ్రాయఁగలవాఁడనియు, నితర భాషలయందలి వ్రాఁతలను మాతృలిపివలెఁ జదువఁగలఁడనియు వర్ణించియున్నాఁడు. సిద్ధనమంత్రి రచించిన కావ్యముల పేరులనైనను జెప్పలేదు.

జక్కయ కవిత్వము ప్రౌఢమైనది. వర్ణనాంశములు పెక్కులు గలవు. స్వాభావికములైన వర్ణనలకంటె నుత్ప్రేక్షాదులయందే యీ కవి కభిరుచి మెండు. ఇతని కవిత్వమున మూఁడువంతులు సంస్కృత శబ్దములును ఒకవంతు తెలుఁగుపదములునుండును. ఈతఁడు కవిత్రయమును మాత్రమే నుతించెను. కుకవినిరసనము పేరున మహాకవుల నీతఁ డీ క్రింది మూఁడు పద్యములలో నుతించియున్నాఁడు.

మ. నవశబ్దార్థరసానుబంధపదవిన్యాసక్రియాభావ గా
రవపాకధ్వనిరీతిశయ్యలఁ గవీంద్రశ్రేణి కావ్యాళిఁ జె
ప్ప వృథా మత్సరమూని దుష్కవులు జెప్పం జూతు రశ్లీకదా
శివుఁడుం దాండవమాడ నాడనె పిశాచీభూతభేతాళముల్

మ. నవనానారసభాస్వరార్థ పదవిన్యాసక్రియాలంక్రియా
శ్రవణానందకథాసుధామయమహాసారస్వతాంబోధిలో
నవలీల న్విహరించు తజ్జ్ఞులు గతాహంకారులై
గవితాప్రౌఢిమ లేనియజ్ఞులు వృథా గర్వాంధు లేలౌదురో.

క. ప్రతిపద్యముఁ జోద్యముగాఁ
గృతిఁ జెప్పిన నొప్పుఁగాక కృతినొకపద్యం
బతిమూఢుఁ డైనఁ జిత్రతఁ
బ్రతిపాదింపఁడె ఘుణాక్షరన్యాయమునన్.

ఇతఁడు పదునెనిమిది వర్ణనలను సందర్భోచితముగా నీకావ్యమున మనోహరముగా వర్ణించియుండెను. కవియుఁ బండితుఁడునైన కృతిపతిసిద్ధనమంత్రి :—

క. చక్కన నీవై దుష్యము
చక్కన నీకావ్యరచనచాతుర్యంబుల్
చక్కన నీవాగ్వైఖరి
చక్కన నీవంశమహిమ జక్కయసుకవీ.

క. స్వాభావికనవకవితా
ప్రాభవముల నుభయభాషఁ బ్రౌఢిమఁ జెప్పన్
భూభువనంబున సరి లే
రాభారతి నీవుఁ దక్క నన్నయజక్కా !

అని కొనియాడినప్పుడీతనికవిత్వమునుగూర్చి నేఱుగ వ్రాయ నక్కఱలేదు. ఇప్పటికాలపు విద్యార్థుల కీకావ్యము కష్టమైనదిగాఁ దోఁపవచ్చును కాని కష్టపడి ఓర్పుతోఁ జదువువార లిది రమ్యతరమైనకావ్యమని యంగీకరింపకపోరు. ఈకవి లోకోక్తుల నెన్నిటినో సందర్భోచితముగ నీకావ్యమం దిమిడ్చియున్నాఁడు.

విక్రమార్కుఁడు చారిత్రకపురుషుఁడు. శకకర్త. కాని మహాకవు లీతనికతిమానుషచర్యల నారోపించి పురాణపురుషునిగాఁ జేసివైచిరి. వితరణసాహసౌదార్యాది సద్గుణవిరాజితుండగు నీతని కథలయందుఁ గొంచెమేని సత్య ముండకపోదు. కాని యది మఱుగు వడిపోయి గోచరించుటలేదు.

విక్రమార్కచరిత్ర ముత్తమములైన యాంధ్రకావ్యములలో నొకటి. కవిత్వశైలి తెలియుటకై యాశ్వాసమున కొకటివంతున పద్యముల నీక్రింద నుదాహరించెదను.

విక్రమార్కచరిత్రము :—

ఉ. క్రొన్ననవింటివాఁడో నలకూబరుఁడో నలుఁడో జయంతుఁడో
యన్నరమూర్తియంచుఁ గొలువెల్లను నచ్చెరువంది చూడఁగా
విన్ననువొప్ప నొక్కరుఁడు విప్రకుమారకుఁ డేఁగు దేర న
త్యున్నత రత్నపీఠమున నుంచి నృపాలకుఁ డిచ్చెనర్చనల్ ౧౬

చ. అరిజనపాలకానన తృణాంకురవృద్ధి యొనర్చు విద్విష
త్సరసిజలోచనాస్యజలధారల వర్ధనమొందు నెప్పుడుం
జరణసమీపవర్తులకుఁ జల్లదనం బొదవించు నమ్మహీ
వరుని ప్రతాపవహ్ని జనవర్ణితచిత్రచరిత్రలీలలన్ ౨౮

చ. పరహితకారి కెందు ననపాయశుభంబులు వొందుఁజాల ము
ష్కరులగు క్రూరకర్ము లపకారము సేయఁ దలంచి రేని న
ప్పురుషవరేణ్యుఁ గీడొకటి వొందునె తేజముదక్కఁ దక్కరుల్
పొరయునె లోకబాంధవు నపూర్వమనోభవు సప్తసైంధవున్ ౩౮

శా. భూచక్రాఖిలరాజ్యభోగ మొనరుం బోరన్ జయంబందినన్
బ్రాచీనాయక లోకలోలనయనా పంచాస్త్రకేళీకళా
వైచక్షణ్యము సంభవించుఁ గదసవ్యాపారతన్ మాలినన్
"కాచింతా మరణే రణే" యనుట నాకర్ణింపవే యెన్నఁడున్ ౪౮

సీ. చంద్రబింబముఁ బాలసంద్రంబులోఁ దోఁచి
కందెల్లఁ బోఁబలు కడుగకున్నఁ
కామబాణంబులఁ గరసానఁ బట్టించి
తోలుకారు మెఱుఁగునఁ దోడయకున్నఁ
బసిఁడి సలాకకుఁ బరిమళం బొనగూర్చి
గగనంపు వెన్నెలఁ గరఁగకున్న
జిగికందకుండ లేఁజిగురాకు గొనివచ్చి
యొగరెల్లఁ బుచ్చియింపొసఁగకున్నఁ

తే. గాంతనమ్మోమునకు వాలుఁగన్నులకును
వఱలు నును మేనికిని నొప్పునా తెఱకును
నీడు జోడైన ప్రతియని యెన్నఁగడిది
హస్తిమశకాంతరము సహజైకకాంతి. ౫౮

వ. వినుమా పట్టణమాది రాజవిలసద్విఖ్యాతి ధర్మధ్వజుం
డనుభూపాలకుఁ డేలుచుండును జనాధ్యక్షుండు భూమీశ భూ

జనసంస్తుత్యుఁడు నిత్యసత్యుఁ డురుసౌజన్యుండు ధన్యుండు స
త్త్వనయప్రాభవధీవిధేయుఁడు గుణాధానుండు ధీరుండిలన్. ౬౧

చ. అనవినిభూవిభుండు నగి యానిది చెప్పెడువారు చెప్పినన్
వినియెడువారి కించుకవివేకము లేదె శుకాగ్రగణ్య ! నీ
వనియెడుమాటగాదు మదికచ్చెగు వయ్యెడినన్న దేవ ! యే
యనువునునైన నీయడుగులాన నిజంబని చిల్కపల్కినన్. ౨౬.

ఉ. ఇంటికివచ్చునంత మగఁడింటికి వచ్చిన నాథునివ్వ న
న్నొంటిడిరాక యింతదడ వుండఁగఁ గారణమేమి యింక న
న్నంటిన నీకు నీవెఱుఁగుదంచు నొకానొకతప్పు వెట్టి వె
న్వెంట నతండు రాఁ జనియె వెండియుఁ గొమ్మలిపువ్వుఁదోఁట
కున్. ౮౧

విక్రమార్క చరిత్రకృతిపతియైన సిద్ధనప్రెగ్గడయు, నాతని తండ్రి జన్నమంత్రియుఁగూడఁ గవులైనట్లు పైపద్యములవలనఁ దెలియుచున్నది. పెదపాటి జగ్గనకవి తన యుదాహరణగ్రంథముఁలో సిద్ధనప్రెగ్గడ శాకుంతలములోనిదని యీక్రిందిపద్యము నుదాహరించి యున్నాడు. జక్కయకవి తన కృతిపతిగాని, యాతని తాతగాని శాకుంతలమును రచియించినట్లు చెప్పలేదు. తిక్కనసోమయాజి పూర్వులలో సిద్ధనప్రెగ్గడలు ముప్వురున్నారు. కాని వారలను వర్ణించిన కేతనకవికూడ దశకుమారచరిత్రమున వారిలో నెవరును శాకుంతలమును రచియించినట్లు చెప్పలేదు. సాక్ష్యాంతరము లభించువఱకును విక్రమార్కచరిత్ర కృతిపతియగు సిద్ధనప్రెగ్గడ శాకుంతలమును రచించిన కవి యని యనుకొందము.

ఉ. నీరజమిత్రుతో బయల నిల్చి చలంబునఁ గిట్టి మైమయిం
బోరుటదుర్లభం బనుచు భూరితమఃపటలంబు లొక్కమై
సూరెలఁ గోటవట్టి పొడసూపఁగ నొక్కొ యెదిర్చె నాఁగ బ్రా
కారనిబద్ధనీలమణికాంతిఁ గనుంగొన నొప్పు నెంతయున్.

ఈ క్రింది పద్యములు జక్కన చెప్పిన "పెమ్మయసింగధీమణీ" అను శతకములోనివనియు, ఈశతకము జక్కన చెప్పినదని ప్రయోగ రత్నాకరమున నుదాహరింపఁబడెననియు "చాటుపద్యమణిమంజరి" లో శ్రీ ప్రభాకరశాస్త్రులుగారు వ్రాసియున్నారు.

చ. మిరియము లేనికూరయును మెచ్చు నెఱుంగనివారియీవియున్
గరగరగానిభోజనము కన్నులపండువుగాని రూపమున్
మురిపెము లేనియౌవనము మోహము లేనిలతాంగికూటమిన్
సరసులకింపు గావు సుగుణాకర ! పెమ్మయసింగధీమణీ !

ఉ. మచ్చిక లేనిచోట ననుమానము వచ్చినచోట మెండుగాఁ
గుచ్చితులున్నచోట గుణకోవిదు లుండనిచోట విద్యకున్
మెచ్చనిచోట రాజు కరుణించనిచోట వివేకులుండిరే
నచ్చట మోసమందుదు సుగుణాకర ! పెమ్మయసింగధీమణీ !

ఉ. వాసనలేనిపువ్వు బుధవర్గములేనిపురంబు సత్యవి
శ్వాసము లేనిభార్య గుణవంతుఁడు గానికుమారుఁడున్ సద
భ్యాసము లేనివిద్య పరిహాసపరిసంగము లేనివాక్యమున్
గ్రాసము లేనికొల్వు కొఱగానివి పెమ్మయసింగధీమణీ !

ఉ. ఆకిక కోడఁడేని యుచితానుచితంబు లెఱుంగఁడేని ము
న్నాడినమాట తాఁదిరుగనాడక యుండఁడయేని పిల్లదం
బాడెనయేని సిగ్గువినయంబు నయంబును వీడెనేని వాఁ
డేడ నియోగి యయ్యెడు మహీస్థలి పెమ్మయసింగధీమణీ !

ఉ. మాడలమీఁద నాసగలమానిసి కెక్కడికీర్తి కీర్తిపై
వేడుక గల్గునాతనికి విత్తముమీఁద మఱెక్కడాస యీ
రేడుజగంబులందు వెలహెచ్చినకీర్తిధనంబు గాంచి స
త్ప్రౌఢయశంబుఁ జేకొనియె బమ్మయసింగఁడు దానకర్ణుఁడై.

ఉ. పెట్టక కీర్తిరాదు వలపింపక యింతికి నింపు లేదు తాఁ
దిట్టక వాదులేదు కడుధీరత వైరుల సంగరంబులోఁ

గొట్టక వాడలేదు కొడు కొక్కఁడు పుట్టక ముక్తి రాదయా
పట్టపు రాజుకైన నిది పద్ధతి పెమ్మయసింగధీమణీ !

ఈ సింగమంత్రియెవ్వరో జక్కయకవి యీపద్యములనుగాని యీ పద్యము లున్నశతకమునుగాని రచియించెనో లేదో యింకను బరిశోధింపవలసియున్నది. శుప్పదిఇద్దరుమంత్రులను వర్ణించిన సీసమాలికలో "పగతుఁజుట్టమటంచుఁ బల్కఁగాఁ ధనమిచ్చి చేపట్టె పెమ్మయసింగరాజు" అని ఈ పెమ్మయసింగమంత్రిని జెప్పియున్నాఁడు.

— ✻ —

## 60. విన్నకోట పెద్దన్న

ఈకవి నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; కాశ్యపగోత్రుఁడు; గోవిందరాజుపుత్త్రుఁడు. విన్నకోట యను గ్రామము కృష్ణామండలములోని గుడివాడకు సమీపమున నున్నది. దానినిబట్టి యీకవి గృహనామ మేర్పడియుండును. విన్నకోట వా రిప్పుడు నా గ్రామమునం దుండిరని తెలియుచున్నది కృష్ణా, గోదావరి, విశాఖపట్టణమండలములలోను విన్నకోటవారు కలరు. వీరికందఱకు నాదిమనివాసము కృష్ణామండల మేయైయుండును. గోదావరివిశాఖపట్టణమండలములలో విన్నకోటలేదు. ఈకవి "కావ్యాలంకారచూడామణి" యను తొమ్మిదియుల్లాసములుగల యలంకారశాస్త్రమును రచియించి, చాళుక్యవంశీయుఁ డగు విశ్వేశ్వరభూపతి కంకితము చేసెను. ఇతఁడు పురవర్ణనమున కుదాహరణముగా రాజమహేంద్రవరము నీక్రింది పద్యములో వర్ణించియున్నాఁడు.

సీ. గంభీర పరిఘ నాగస్త్రీల కశ్రాంత
  కేళివిహారదీర్ఘిక యనంగ
నుత్తాలసాల మన్యుల కుబ్బిదివిఁ బ్రాఁకఁ
  జేసిన దీర్ఘనిశ్రేణి యనఁగఁ

జతురచాతుర్వర్ణ్యసంఘ మర్థులపాలి
    రాజితకల్పకాగామ మనఁగఁ
బ్రాంతసుస్థిత మైనభవజూటవాహిని
    భుక్తిముక్తి ప్రదస్ఫూర్తి యనఁగ
నెప్పుడును నొప్పు రాజమహేంద్రవరము
ధరణిఁ గల్పించె నేరాజు తనదుపేర
నట్టిరాజమహేంద్రుని యనుఁగు మనుమఁ
డెసఁగుఁ జాళుక్య విశ్వనరేశ్వరుండు.

రాజమహేంద్రపట్టణమును వర్ణించుటచేతను, కృతిపతి రాజమహేంద్రున కనుఁగుమనుమఁ డని చెప్పుటచేతను కాఁబోలు, శ్రీ వీరేశలింగముపంతులుగారు కవి రాజమహేంద్రవరనివాసి యనియుఁ గృతిపతి రాజమహేంద్రవరపురాధీశ్వరుఁడనియు నాంధ్రకవుల చరిత్రమున వ్రాసియున్నారు. కాని యవి సత్యములుకావు. కృతిపతి రాజమహేంద్రునకుఁ బౌత్రుఁడు కాఁడు. ఇచ్చట మనుమఁ డను శబ్దమున కావంశములోనివాఁ డనునర్థమును గ్రహింపవలసియున్నది.

ఆయంశ మాకావ్యాలంకార చూడామణిలోని యీక్రింది పద్యమువలననే ధ్రువపడుచున్నది.

సీ. త్రైకంఠచూడాగ్రశృంగారికరణ మే
    ళాజున కన్వయారంభగురుఁడు
చాళుక్యవంశభూషణము శ్రీవిష్ణువ
    ర్ధనుఁ డేమహీశు తాతలకుఁ దాత
భృతకుమారారామభీముండు చాళుక్య
    భీముఁ డేనృపకులాబ్ధికి విధుండు
రాజమహేంద్రవరస్థాత రాజన
    రేంద్రుఁ డెక్కువతాత యేవిభునకు

సంధ్రిదళదానవోపేంద్రుఁ డగు నుపేంద్రి
ధరణివల్లభుఁ డేరాజు తండ్రితాత
ఘనుఁ డుపేంద్రాఖ్యుఁ డెవ్వనికన్నతండ్రి
యతఁడు విశ్వేశ్వరుఁడు లక్కమాంబసుతుఁడు.

పెద్దనకవి కృతిపతివంశములోఁ బేరు వినకొందఱినిమాత్రమే యీపద్యములోఁ జెప్పినాఁడు కాని వంశమును గ్రమముగా వర్ణించి యుండలేదు. నన్నయభట్టుచారిత్రమునఁ జాళుక్యవంశవృక్షము నిచ్చి యున్నాఁడను. అందు భారతకృతిపతి యగు రాజరాజునకు విజయాదిత్యుఁ డనుసోదరుఁ డుండెనని చూపియుంటిని. కావ్యాలంకారచూడామణికృతిపతి యైనవిశ్వేశ్వరభూపతి యీవిజయాదిత్యుని వంశములోనివాఁ డనిచెప్పుదురు. ఇతఁడు విశాఖపట్టణమండలములోని ఎలమంచిలితాలూకాయందలి పంచధార లనుగ్రామమున ధర్మలింగేశ్వరస్వామికిఁ గళ్యాణమండపమును గట్టించి యాస్తంభముపై వ్రాయించిన శాసనములోఁ దనవంశమును వర్ణించియున్నాఁడు, (ఎపిగ్రాఫికా ఇండికా 19సం 164పుట) తనతండ్రిపేరుతోఁ గట్టఁబడిన "ఉపేంద్రవరాగ్రహారమున నొకవిష్ణ్వాలయము నీతఁడు నిర్మించియుండెను ఈశాసనము ననుసరించి విశ్వేశ్వరభూపతి వంశవృక్షమును నోనయామాత్యునిచరిత్రమున నిచ్చియున్నాఁడను. (వివరములను దెలియఁగోరువారాచరిత్రమును జూడుఁడు)

ఈశాసనకాలము:— శాలివాహనశకము ౧౩౨౯ జ్యేష్ఠశుక్లసప్తమీ ఆదివారము=క్రీ. శ. ౧౪౦౭సం॥ జూను నెల ౧౨వ తేదీ (ద హిం శా. సం ౬ సంఖ్య ౬౬౫) దీనినిబట్టి పెద్దనకవి పదునాల్గవశతాబ్దియందుఁ జివరభాగమునను బదునైదవశతాబ్దిఁ బ్రథమభాగమునందు నున్నాఁడని స్పష్టమగుచున్నది.

రాజరాజునకుఁ దరువాత నాతనితమ్ముఁ డైనవిజయాదిత్యుఁడు రాజమహేంద్రవరము రాజధానిగాఁబదునైదుసంవత్సరములు స్వతం

త్రిముగనైననేమి రాజరాజుతనయుఁడైన కులోత్తుంగ చోళుని ప్రతి నిధిగనైననేమి వేఁగి కళింగదేశములను బరిపాలించెను. విజయాది త్యుఁడు చనిపోయినపిమ్మట రాజేంద్రచోళునితనయులే రాజమహేం ద్రవరమునుండి, రాజ్యపరిపాలనము చేసిరి. అటుతరువాత వేఁగిక ళింగదేశములు వెలనాఁటిచోడులవశమైనవి. అందుచే విజయాదిత్యు నితరువాత నాతనిసంతతివారికి రాజమహేంద్రవర రాజ్యములో సం బంధము లేకపోయినది. వారు క్రమక్రమముగా గోదావరీమండలము నువీడి విశాఖపట్టణమండలమందలి యెలమంచిలితాలూకాలోఁ గొం తప్రదేశమును సంపాదించుకొని యొకచిన్నసంస్థానమున కధిపతులై గౌరవముగా జీవితమును గడపుచువచ్చినట్లు కన్పట్టుచున్నది. అయి నను దాము చాళుక్యవంశీయుల మని సూచించుటకు తమపేరునకు ముందు "సర్వలోకాశ్రయవిష్ణువర్ధన మహారాజులైన" యనుప్రశస్తి నుంచుకొనుచువచ్చిరి. ఇట్టిప్రశస్తిగలవారిశాసనములు పదునాఱవ శతాబ్దియందుఁకూడఁ గన్పట్టుచున్నవి.

పైనచెప్పిన శాసనమునుబట్టి, కవికాలనిర్ణయమును గావిం చుచు శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారు భారతిలో (విభవసం॥ భాద్ర పదము) వ్రాసినయంశముల నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

"ఈశాసనమునవే, విశ్వేశ్వరభూపతి మండపము కట్టించిన సం వత్సరముకూడ దెలుపబడినది. ఆశ్లోకమిది :

శ్లో॥ శాకాబ్దే నవబాహురామశశిసంఖ్యాతే శుచౌ భాసితే
సప్తమ్యాం మినవారభాజిమహితఃసంస్థాపితో మండపః
కళ్యాణోత్సవసిద్ధయే సవిభవః శ్రీపంచధారాపురీ
ధర్మేశస్య చళుక్యవిశ్వధరణీభర్త్రా విచిత్రాస్పదం॥

ఈపై శ్లోకమునసరించి విశ్వేశ్వరభూపతి యీమండపమును శకవర్షములు౧౩౨౯ గాన జ్యేష్ఠశుద్ధసప్తమీ ఆదివారమునాఁడు కట్టిం చినట్లు విస్పష్ట మగుచున్నది. అందువలన విశ్వేశ్వరభూపతి క్రీ. శ.

౧౪౦౭వ సంవత్సరప్రాంతమున రాజ్య మేలుచుండినట్లు నిర్ణయమగు చున్నది. విన్నకోట పెద్దనకూడ ఈకాలమున నున్నవాడే.

ఈకవి కావ్యాలంకారచూడామణి నెపుడు రచించెననుటకు గూడ గొంతయాధారము కలదు. శాసనమున విశ్వేశ్వరనృపతి సర్వసిద్ధిప్రాంతమున నాంధ్రసైన్యము నోడించినట్లు తెలుపబడియున్నది. ఆశ్లోకమిది:-

శ్లో॥ గతిబాహుశక్తిభూ మితిమపి గణయ
త్సర్వసిద్ధి పథభగ్నం
సతి చిత్రభానుసాక్షిణి ధరణీ
వరాహో దధావ దాంధ్రబలం

ఈపై శ్లోకములోని కట్టకడపటిభాగము నోబిల్‌దొరగారు సంస్కరించినపాఠము. ఈశ్లోకమునకు సరిగా సరిపోవు తెలుగుపద్యమే కావ్యాలంకారచూడామణి ఏడవయుల్లాసమున నిట్లు గలదు.

"చతురుపాయబాహుశక్తిక్షమావలిఁ
బాఱవిడిచి చిత్రభానుసాక్షిఁ
బాఱె సర్వసిద్ధిపద మేలి ధరణీవ
రాహమునకు నోడి రాచకసుపు"

యీపద్యము కావ్యాలంకారచూడామణిలో కలదనియే మనకు దెలియునుగాని ఇంతవఱ కిందలివిశేష మేమో మనకు తట్టలేదు. నోబెల్‌దొరగారు పై శాసనశ్లోకములోనుండి విశ్వేశ్వరభూపతి సర్వసిద్ధి (పట్టణ) పథ (తెలుగుపద్యములోకూడ ఇది పథ అనియే యుండదగు ననుకొందును) ప్రాంతమున ఆంధ్రసైన్యమును గతి(౫) బాహు(౨), శక్తి (౩) భూమి (౧) వీటిగణమున నేర్పడిన శకవత్సరములలో. అనగా ౧౩౨౫-వ శకవర్షమున నోడించెనని చిత్రముగ తేల్చియున్నారు. ఇది ఎంతయు చక్కగ నున్నది. కవి యలంకారము నెపమున విశ్వేశ్వరభూపతి విజయవత్సరము నిట తెలిపియున్నాడు.

ఈశ్లోకపు తెలుగుసేతయే కావ్యాలంకారచూడామణిలో గాన్పించుట వలన అది విశ్వేశ్వరభూపతి విజయలక్ష్మీ పరిగ్రహణానంతరమే రచియింపఁబడినదని సిద్ధాంత మగుచున్నది. అయితే దొరగారు గతికి అయిదు లెక్క వేసినారు. దానము, భోగము, నాశముఅని ధనగతులు మూడే యని శబ్దరత్నాకరము తెలుపుచున్నది. దీనిప్రకారమైనచో గతికి మూఁడు లెక్క వేయవలయును. అప్పుడు విజయసంవత్సరము శకము ౧౩౨౩ అగును గాని కావ్యాలంకార చూడామణిలోని పద్యముప్రకారము అది చతుసుపాయ (౪) సాహసము (౨) శక్తి (౩) క్షమ (౧) శకము ౧౩౨౪ అనిస్పష్టమగుచున్నది. చతురుపాయ అనుపదము నుపయోగించినందువలన ఆసంఖ్య నాలుగనుటలో సందేహింప నవసరములేదు. అందువలన శాసనములోని 'గతి'కి చతుర్విధగతు లనినాలుగు లెక్క నేతీసుకొనవలెను. కాని మూఁడు కాని అయిదు కాని తీసుకొనవీలులేదు. దేవగతి, మనుష్యగతి, జంతుగతి, నరగతి యని గతులునాలు గనికూడ ప్రసిద్ధమే, (చూడుడు, సంఖ్యార్థనామప్రకాశిక, శ్రీమత్కనుపర్తి వేంకటరామ శ్రీవిద్యానందనాథవిరచితము) కొన్నిప్రాచీనశాసనములలోఁగూడ 'గతి'ని 'నాలుగు' లెక్క నే వాడియున్నారు. ఈకారణమువలన విశ్వేశ్వరభూపతి శత్రువులను శకము ౧౩౨౪ లోనే అనగా క్రీ. శ. ౧౪౦౨ లోనే జయించెననియు, కావ్యాలంకారచూడామణి క్రీ శ. ౧౪౦౨ తరువాతనే రచియింపబడియె ననియు, నిర్ణయ మగుచున్నది. శాసనమునందలి సంస్కృతశ్లోకమునకు తెలుగుసేతయే కావ్యాలంకారచూడామణిలో నుండుటవలన నాశాసనరచయితకూడ విన్నకోటపెద్దనయే యగు నేమోయని సంశయింపవలసివచ్చుచున్నది.

ఈవిశ్వేశ్వరభూపతికి 'రాయగండగోపాల' బిరుదమున్నట్లును, తండ్రిపేరిట కాదగును. ఇతడు ఉపేంద్రవరాగ్రహారప్రతిష్ఠ గావించినట్లీ క్రింది శాసనశ్లోకమువలనఁ దెలియుచున్నది.

శ్లో॥ కించతదుత్తర దిక్సముదంచితసాలం విశాల ముత్తాలం
ప్రాకల్పయ దాకల్పం విశ్వన్నృపో రాయగండగోపాలః

విష్ణుప్రతిష్ఠా మకరో త్ససౌధాం
విశ్వేశభూపో ధరణీవరాహః
స్వాహాది తోపేంద్ర వరాగ్రహారే
షట్కర్మభి స్తృప్త మరుద్విహోత్రే"

దీనినిబట్టి యీకవి తనగ్రంథమును క్రీ. శ. ౧౨౦౫ ప్రాంతమున రచించెనని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. విశ్వేశ్వరచక్రవర్తి శాసనములు శా.శ. ౧౭౯౯ మొదలు ౧౩౭౯ వఱకుఁగన్పడుచున్నవి. (ద. హిం. శా. సం ౬ సంఖ్య ౮౨౦, ౯౧౯).

ఆంధ్రమున నలంకారశాస్త్రములను రచించినవారిలో నీపెద్దనయే మొదటివాఁడు. ద్వితీయప్రతాపరుద్రుని యాస్థానమున నున్న విద్యాధరుఁ డనుకవి సంస్కృతమున రచించిన ప్రతాపరుద్రీయమను నలంకారశాస్త్ర మీగ్రంథమునకు మూలమని చెప్పనొప్పును. కొన్ని పట్టుల నీతఁడు దండి కావ్యాదర్శము ననుకరించెను. మరికొన్నితావుల రసమంజరి మొదలగు సంస్కృతగ్రంథముల నాధారముగాఁగైకొనియుండెను. కావున నిదియొకసంస్కృత గ్రంథమున కాంధ్రీకరణమని చెప్పరాదు. ఇదియొక స్వతంత్రగ్రంథమనియే చెప్పనచ్చును. ఈతని కావ్యాలంకారచూడామణి, సమగ్రము గాకపోయినను మొత్తము మీఁద దీనివలన నాంధ్రభాషలో నాలంకారికవిషయములను దెలిసికొనఁదలఁచినవారికిగొప్పమేలు సమకూరెనని చెప్పవచ్చును. తరువాతి కవులును లాక్షణికులును నీతని ననుసరించి గౌరవించిరి. ఈగ్రంథమునఁ గేవలము నలంకారవిషయములే కాకుండ ఛందోవ్యాకరణవిషయములుకూడ నున్నవి. ఆంధ్రాలంకారగ్రంథములయందుఁ దఱచుగా నిట్టిసాంకర్యము గన్పట్టుచునేయున్నది.

కావ్యాలంకారచూడామణి ప్రథమోల్లాసమున విభావ, అనుభావ, సాత్త్విక, వ్యభిచారాదిభావప్రపంచ వివరణమును, ద్వితీయోల్లాసమున శృంగార, వీర, రౌద్రాదిరసప్రపంచనిరూపణమును, తృతీయోల్లాసమున నాయక, నాయికావివిధవిశేష లక్షణములును, నాల్గవయుల్లాసమునఁ గావ్య, వృత్తి, రీతి ప్రముఖనానావిధవిశేషములును, పంచమోల్లాసమున నలంకారవిశేషములును, షష్ఠోల్లాసమున శబ్దాలంకారములును సప్తమాష్టమోల్లాసములయందు ఛందోవిషయములును, నవమోల్లాసమున వ్యాకరణవిశేషములును దెలుపఁబడినవి. ఈకవి లక్ష్యముల నితరకవులనుండి యుదాహరణములనీయక తానే పద్యములను రచించి యందుసామాన్యముగాఁ బ్రతిపద్యమునను కృతిపతి యగు చాళుక్యవిశ్వేశ్వరునినామముదాహరించుచువచ్చెను ప్రతిపద్యమునందును గృతిపతినామమును జెప్పవలసివచ్చుటచేఁ గొన్నిచోవుల భావప్రకటనము క్లిష్టమగుచువచ్చినది. అయినను నీతనికవితాశైలి మృదువై మనోహరముగ నేయున్నది.

అష్టమోల్లాసాంతపద్యములో "ప్రతతగుణపరీణా" "పంచధారాధురీణా" అని చెప్పియుండుటచేతను, పంచధారలయందే విశ్వేశ్వరుని శాసనముండుటవలనను, నీకవియొక్కయుఁ గృతిపతియొక్కయు నివాసము విశాఖపట్టణమండలములోని పంచధారలను గ్రామమనుట నిశ్చయము. ఇది సర్వసిద్ధితాలూకాలోనిది.

ఈకవి ప్రద్యుమ్నచరిత్ర మనుప్రబంధమును రచించినట్లు కుమారసంభవముటిప్పణములో శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు రెండుపద్యములనుదహరించిరనియు నాపద్యములు పొన్నడ పెద్దిరాజు రచించిన ప్రద్యుమ్నచరిత్రములోనివై యుండుననియు బ్ర. శ్రీ. వీరేశలింగముపంతులుగారు కవులచారిత్రమున వ్రాసియున్నారు. అదియే యథార్థమై యుండును. విన్నకోటపెద్దన ప్రద్యుమ్నచరిత్రమును రచియించినట్లు గనబడదు.

కృతిపతి యైనవిశ్వభూపునివర్ణించిన యీక్రిందిపద్యమును బట్టి యాతఁడు రాజతంత్రపారీణుఁడగుటయేకాక జ్యౌతిషాయుర్వేద విద్యలయందును సంగీతసాహిత్యములయందును బ్రజ్ఞావంతుఁడై నట్లు కన్పట్టుచున్నది.

సీ. వేదశాస్త్ర రహస్యవిధు లెల్లబరికించి
సవిఁ జతుర్వర్గ ప్రశస్తినొంది
రాజవిద్యాతంత్రశక్తి సంభావించి
వర్ణక్రమంబులవల నెఱింగి
జ్యౌతిషాయుర్వేదసంగతి నెగడొంది
సంగీతసాహిత్యసరణి నేర్చి
తురగేభరోహణాదుల విశ్రుతికినెక్కి
యాయుధవిద్యల నతిశయిల్లి

తే. యచట నచ్చట నున్న కావ్యాగమములఁ
జెలఁగి సత్కవిసౌకర్యసిద్ధికొరకు
నొక్కచోటనె యొడఁగూర్చ నుత్సహించి
సత్కళావర్తి విశ్వేశచక్రవర్తి.

"చారుసంగీతమోదిన్" ౨ ఉ ౧౪౪
"గంధర్వకళావిదుఁడు" ౫ ఉ ౧౦౫

కృతిపతి యైనవిశ్వేశ్వరభూపతితండ్రి మనుమోపేంద్రుఁడై నట్లు చతుర్థోల్లాసమునందలి ౧౧౧వ పద్యమందలి "మనుమోపేంద్రతనూజ" అనువాక్యమువలనఁ దెలియవచ్చుచున్నది. కొన్నితావుల "మనుమ" శబ్దమును విడిచి ఉపేంద్రునికుమారుఁడై నట్లు చెప్పియున్నాఁడు.

ఈతనికవిత్వశైలి తెలియుటకై యుల్లాసమున కొకపద్యము వంతున నీక్రింద నుదాహరించెదను.

చపలత:—

ఉ. నెయ్యపుబోటి మున్ను చెవి నించినవార్త లెఱుంగకున్న యీ
తొయ్యలి విశ్వభూవిభుని దూరమునం గని రాగరక్తయై
తియ్యపునవ్వు వాతెఱకుఁ దెచ్చె, వడిన్గుచమండలంబుపైఁ
బయ్యెద చక్కఁజేర్చె, బాలపంబు నమర్చెఁ గటాక్షవీక్షలన్.
౧ ఉ. ౭౦

జాగరము :—

క. వల్లభుఁ డెట్లును నబ్బమి
మొల్లంబగుచింతఁ గన్నుమోడ్పక మదిలో
నల్లల నుడుకుచునుండెడు
తల్లడ మది జాగరాభిధానం బయ్యెన్.  ౨ ఉ. ౭౦

విప్రలబ్ధ :—

క. పంచినయెడ కేతేరక
వంచించిన దయితుతో వివాదము సంపా
దించి చెలితోడ దుఃఖో
దంచిత యగు విప్రలబ్ధ తత్పరబుద్ధిన్.  ౩ ఉ. ౭౦

కైశికి :—

తే. సకలసుకుమార మధురార్థ సరళ రచిత
కైశికీవృత్తి; శృంగార కరుణ రసము
లధికసుకుమారములు, వాని నగు నొనర్పఁ
గైశికీవృత్తి చేతన కవుల నెల్ల  ౪ ఉ. ౬౯

శృంగారరసము:—

చ. ఇల వలరాజుచూపునకు నెక్కువ యయ్యెడు విశ్వమేదినీ
లలననిరూపయౌవనవిలాసములం జెలిమాటు చేరి య
గ్గలికపుసిగ్గు వేడుకలక్రిందున కడ్డపడంగనిమ్ములన్
మెలఁతుక వాలుఁజూపులకు మేపులు వెట్టెడుఁ జూచితే సఖీ!
౫ ఉ. ౬౦

క్రమభంగము: —

క. శ్రీవిష్ణువర్ధనాఖ్య
త్సేవకుకీర్తిప్రతాపమహిమలతో రా
జీవేందీవరమిత్రులు
కావింతురు చెలిమి యనఁగఁ గ్రమభంగమ్మగున్. ౬ ఉ. ౯౬

ఉ. ధన్యుఁడు విశ్వభూవిభుఁడు ధారుణి యేలఁగ భూజనంబు ల
న్యోన్యహితత్వసంపదల నొందిరి, దంపతు లింపు నింప న
న్యోన్యసుఖానుకూలతల నోమిరి విప్రులు వేల్పుఁబెంచు న
న్యోన్యసుపుష్టి తుష్టి కుశలాదులఁ జెందిరి నాఁడు నాఁటికిన్.

౭ ఉ. ౬౮

క. సీసమునకు నాఅడుగులు
బ్రాసము లిడి యోలి సర్వపదఖండములన్
భాసురముగ వళ్ళలవడఁ
జేసిన నది కృతులఁ బ్రాససీసం బయ్యెన్. ౮ ఉ. ౩౯

క. ఆదట నా సీ తన యను
చోద్యత్వము గలుగు షష్ఠిచూపెను నెడలన్
నాదుకళాసంపదయు
నిదువివేకంబుఁ దనదు నిపుణతయు ననన్. ౯ ఉ. ౧౩౨



# 61. వెన్నెలకంటి జన్నమంత్రి

"కృష్ణా! దేవకీనందనా" యనుమకుటముతో మత్తేభశార్దూల వృత్తములుగల శతకమొకటి యున్నది. దానితాళపత్రప్రతులు. అడయారులైబ్రరీయందును, మదరాసుప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమునందును, గద్వాలసంస్థానమునందును గలవు. ఈశతకమును శ్రీవావిళ్ళరామస్వామిశాస్త్రులు & సన్సువారును, గద్వాలసంస్థానమువారును, శ్రీకాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారును ముద్రించినారు. వావిళ్ళవారిప్రతిలో ౧౦౦ పద్యములును, గద్వాలవారిప్రతిలో ౧౦౮ పద్యములును, కాశీనాథునివారిప్రతిలో ౧౧౮ పద్యములును న్నవి. దేనియందును శతకకర్తను దెలుపుపద్యము లేదు. శతకాంతపద్యము లీక్రిందివిధముననున్నవి.

మ. సదయస్ఫూర్తికళల్ ఘటించు కవిరక్షశ్శ్రేష్ఠుఁ డుత్సాహియై
పదివేల్పద్యములందు నూటపదియౌపద్యంబు లర్పించి మీ
పదనీ రేజములందు దివ్యతటినీపాథఃప్రపూరాభిము
ఖ్యదశం గాంచినఁ దక్కు నీకరుణ కృష్ణా! దేవకీనందనా!

కా. నా. ప్రతి

మ. సదయామూర్తి కళన్ ఘటించు కవిరక్షశ్రేష్ఠుఁడామోదియై
పదివేల్పద్యములందు నూటెనిమిదౌ పద్యంబులర్పింప మీ
పదనీరేజములందు దివ్యతటినీపాథఃప్రపూరాభిము
ఖ్యదశం గాంచినదాట మీకరుణ కృష్ణా! దేవకీనందనా!

గద్వాలప్రతి

ఈ పద్యమందలి కవిరక్షశ్రేష్ఠుఁ డనగాఁ గవిరాక్షసుఁడని తలంచి యీశతకకర్త కవిరాక్షసుఁడని కొందఱభిప్రాయపడిరి. కాని యదిసత్యము కాదు. కవిరాక్షసుఁడు గొప్పపండితుఁడు. ఈశతకమునందు వ్యాకరణ మంగీకరింపని ప్రయోగములు చాలఁగలవు. మహా

భారతనిర్మాత యగు నన్నయభట్టు అంగీకరించిన ప్రయోగములచే కాని యితరములు వచింపరాదని శాసించిన కవిరాక్షసుఁడు అపప్రయోగములతోఁ గూడిన శతకమును నిర్మించెనని తలంపరాదు. మఱియు నీపద్యమందలి కవిరక్షశ్రేష్ఠశబ్దము కవులను బోషించిన వారిలో శ్రేష్ఠుఁ డను నర్థమును సూచించునుగాని కవిరాక్షసుని నామమును సూచింపదు. రాక్షసునివంటి మహాకవి తనపేరు నా విధముగా సూచించియుండఁడు. ఈకారణములనుబట్టి కవిరాక్షసుఁ డీశతకకర్త కాఁడని నిర్ణయింపఁదగియున్నది.

విక్రమార్కచరిత్రమను ప్రబంధమును రచించిన జక్కయకవి తన కృతిపతియగు సిద్ధమంత్రినిఁ దండ్రియైన జన్నమంత్రిని నీక్రింది పద్యములో వర్ణించియున్నాఁడు.

సీ. విమలవర్తనమున వేదశాస్త్రపురాణ
వాక్యార్థసరణికి వన్నెపెట్టెఁ
బరమహృద్యంబైనపద్యశతంబున
దేవకీతనయు విధేయుఁ జేసె
రసికత్వమున దేవరాయ మహారాయ
కరుణాకటాక్షవీక్షణముఁ గాంచెఁ
గర్ణాటకటకముల్ గలయంతయును మెచ్చ
గణకవిద్యాప్రౌఢి ఘనత కెక్కె

తే. గురులఁ బోషించె సత్కవివరుల మనిచెఁ
బ్రజలఁ బాలించె భాగ్యసంపద వహించె
హారితమునిముఖ్య వంశరత్నాకరేంద్ర
చంద్రుఁడై యొప్పు సిద్ధయజన్నమంత్రి.

ఈపద్యమందలి రెండవచరణమునుబట్టి దేవకీనందన శతకమును రచించిన యాతఁడీ జన్నమంత్రియేయని పలువురు పండితు లభిప్రాయపడియున్నారు. అది సత్యమనియే నేనును దలంచుచున్నాఁ

డను. ఈతని గృహనామము "వెన్నెలకంటి" యని విక్రమార్క-చరిత్రమునఁ జెప్పకపోయినను దనవంశములోఁ బూర్వుఁడైన సిద్ధమంత్రి విక్రమార్కచరిత్రమును గృతినందెనని వెన్నెలకంటి వేంకటాచలకవి కృష్ణ విలాసమునఁ జెప్పియుండుటచే నీజన్నమంత్రి యింటిపేరు వెన్నెలకంటివారని స్పష్టమయినది. ఇతనితండ్రి సిద్ధమంత్రి. ఇతఁడు హారితసగోత్రుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; ఆఱువేల నియోగిబ్రాహ్మణుఁడు. సంగమవంశజుఁడై విజయనగర రాజ్యమును బరిపాలించిన దేవరాయలకడ నుద్యోగిగానున్నవాఁడు. కావున నీతని కాలము హూ.శ ౧౩౬౦-౧౪౨౦ నడుమనై యుండునని తెలుపఁబడియున్నది. "సత్కవివరుల మనిచె" అనుపై పద్యములోని వాక్యార్థమే, "సదయస్ఫూర్తి" అను పద్యములోని "కవిరక్షశ్రేష్ఠ" అనువాక్యమునఁ దెలుపఁబడియెనని తలంపవచ్చును. పదివేలపద్యములు రచించెనను మాట యత్యుక్తియై యుండును. ఇతఁడింక నేవేని గ్రంథములు రచించియున్నచో జక్కయ యావిషయముఁ జెప్పకుండ నుండఁడు. కావున నీతని కొక్కటియే యాతని రచనమని చెప్పవచ్చును. జక్కయకవి యీతనినిగూర్చి విక్రమార్కచరిత్రమునఁ జెప్పిన మఱి రెండుపద్యములనుగూడ నిక్రింద నుదాహరించెదను.

మ. అరసెన్ బంధుల వైభవోన్నతులఁగా నాదిప్రధానావళిన్
దొరసెన్ నీతివివేకవిస్ఫురణచేఁ దోరంపుసత్కర్తలన్
బరసెన్ బూర్వవదాన్యవర్గముల నోహో యెందునే మంత్రులున్
సరియే సిద్ధయజన్నమంత్రికి మనీషాదేవతామంత్రికిన్.

వ. అమ్మహామంత్రీశ్వరునికులపాలికారత్నంబు.

సీ. పరమపతివ్రతాగరిమనీసతి కెన్నఁ
బ్రతిలేరు ధర నరుంధతియ దక్కఁ
బుత్త్రిలఁ గాంచినపోల్కి నీకాంతకుఁ
జింతింప సరిలేరు గొంతి దక్క

దాలిమి పేర్మి నీతరుణీలలామకు
నెనలేరు ధారుణీవనిత దక్క
సౌభాగ్యగరిమ నీసాధ్వికి నుపమింప
లక్ష్యంబు లేదు శ్రీలక్ష్మి దక్క

తే. రూపమున నీవధూమణిఁ జూపి చెప్ప
జోడు లేరు సురాధిపుసుదతి దక్క
ననఁగఁ బుణ్యాత్ముఁడై మెఱచి యక్కమాంబ
బంధువులపాలిసురభి నాఁ బరఁగె ధరణి

ఈజన్నమంత్రితనయుఁడైనసిద్ధమంత్రియే నిర్వచనోత్తరరామాయణ కృతిపతి.

మ. అరయన్ శంతనుపుత్రుపై విదురుపై నక్రూరుపైఁ గుబ్జపై
నరుపై ద్రౌపదిపైఁ గుచేలునిపయి న్నందవ్రజస్త్రీలపైఁ
బరఁగం గల్గు భవత్కృపారసము నాపైఁ గొంత రానిమ్ము నీ
చరణాబ్జంబుల నమ్మినాఁడ జగదీశా! కృష్ణ! భక్తప్రియా!

ఈపద్యమందలిమకుటమును "కృష్ణా! దేవకీనందనా!" యని మార్చి, యీశతకమునఁ జేర్చియున్నారు. ఇట్టివే మఱికొన్ని పద్యములిందుఁ జేరినవి.

భావిపరిశోధనమువలన నీశతకకర్త మఱియొకరని దెలియవచ్చినను నీతఁడొకశతకమును వ్రాసెనని జక్కయకవి తెలిపియుండుటచే నీతనిచారిత్రి మీగ్రంథమున నొకతరంగముగా నుండక తప్పదు.

దేవకీనందనశతకకర్త తిక్కనసోమయాజియని కొందఱిమతము. కాని యందు సత్యములేదు. శ్రీకృష్ణుని పరబ్రహ్మస్వరూపునిగా భారతమునందుఁ గీర్తించినతిక్కన శృంగారరసమిళితముగా నీశతకమును రచించియుండఁడు.

దేవకీనందనశతకమున నక్కడక్కడ వ్యాకరణవిరుద్ధములైన ప్రయోగములున్నను అప్పకవి దీనినుండి లక్ష్యములను గ్రహించి యుండుటచే నవి లెక్కింపఁదగినవికావు. ఈశతకమందలి శైలి మనోహరమై భక్తిశృంగారరస సంయుక్తమై మనోహరముగా నున్నది. మచ్చునకు మూఁడుపద్యముల నిచ్చెదను.

మ. ఇల గోవర్ధన మెత్తితీవనుచు బ్రహ్మేంద్రాదు లెంతో నినుం
బలుమాఱు ల్నుతు లొప్పఁ జేసెదరు పద్మాక్షా! కుచాగ్రంబునం
జులుక న్నెత్తినరాధ నెన్న రిదిగో సొంపొంద సత్కీర్తిని
శ్చలపుణ్యంబునఁ గాక చొప్పడునె కృష్ణా! దేవకీనందనా! ౧౫

శా. అంతశ్శత్రులఁ గెల్వలేరు మమతాహంకారము ల్మానలే
రంతామార్గము వీడలేరు భవదీయాంఘ్రిద్వయీచింతనా
చింతారత్నముఁ గానలే రిలను దుశ్చిత్తు ల్వృథా వే
దాంతంబుల్ చదువంగ నేమి యగుఁ గృష్ణా! ౭౬

శా. దారిద్ర్యానలతప్తమానసులకున్ దైవంబుపైఁ జింతనం
బేరూపంబునఁ గల్గు ధర్మవిధి తా నెప్పాటఁ జొప్పారెడిన్
సారాచారవిచార మెక్కడిది వాచానైపుణం బేడ వి
స్తారోల్లాసపరత్వ మెట్లొదవు కృష్ణా! ౧౦౭

ఖరసం॥ ఆషాఢ శు ౫

అడయూరునందలి తాళపత్రప్రతిలో విలేఖకుఁడు.

మ. కవితాచాతురి మీఱ మున్న కవిరత్నశ్రేష్ఠుఁ డామోదియై
భువిఁ గావించినయట్టి కృష్ణశతకంబున్ భక్తితాత్పర్యవై
భవ మొప్పన్ లిఖియించె సద్వరకవిప్రావీణ్యుఁడౌ భాస్కరా
ర్యవరగ్రామణి మీ లసత్కరుణ కృష్ణా! దేవకీనందనా!

అను పద్యమును వ్రాసియుండెను. "కృష్ణా! దేవకీనందనా" యను మకుట ముండుటచే దీనికి కృష్ణశతకమని నామాంతర మున్నది. విశే

ఖకుఁడైన భాస్కరుఁ డెవ్వరో తెలియదు. జన్నమంత్రికి భాస్కరుఁ డను నగ్రజుఁడు కలఁడు. తమ్మునికృతికి యన్న ప్రతివ్రాసెనని తలంపఁజాలము. పై పద్యమునందు "మున్న" యనుపద ముండుటచే నీభాస్కరుఁడు విలేఖకుఁడు కానేరఁడు. వెన్నెలకంటివారిలో భాస్కర నామధారులు నెక్కుడుగున్నారు మరియుఁ "గవితపుట్టిల్లు వెన్నెలకంటి యిల్లు" అనియుండుటచే నందు భాస్కరకవి యుండుటయు వింత కానేరదు. ఏభాస్కరకవి యోయీశతకమునకుఁ బ్రతి వ్రాసియుండును.

పై తాళపత్రప్రతియందే యీక్రిందిపద్యముకూడ నున్నదఁట!

క. ధరలోను మున్న చెప్పిన
అరయుఁగ నీకృష్ణశతక మతిమోదముతోన్
బరువడి వ్రాసెను ఈపురి
వరకవి పురుషోత్తమార్యు వసుమతిలోనన్.

ఈ యీపురి పురుషోత్తమకవి యెవ్వరో తెలియదు.

# 62. గౌరనమంత్రి

సరససాహిత్యలక్షణ చక్రవర్తి బిరుదాంచితుఁడగు నీకవి నియోగిబ్రాహ్మణుఁడు; గౌతమగోత్రుఁడు; అయ్యలమంత్రికిని పోచాంబకును బుత్త్రుఁడు; వల్లభమంత్రికిని గంగాంబకును దౌహిత్రుఁడు; ధరణిమంత్రికిఁ దమ్ముఁడు. కొన్నిప్రతులలోఁ గవితండ్రిపేరు ఎల్లమంత్రి యనియున్నది. ఈకవి హరిశ్చంద్రోపాఖ్యానమును, నవనాథచరిత్రమును ద్విపదకావ్యములుగా రచియించియుండెను. ఇతఁడు సారంగధరోపాఖ్యానమునుగూడ ద్విపదగా రచియించెనని వినవచ్చుచున్నది. ఇతఁడు హరిశ్చంద్రోపాఖ్యానమునఁ దననుగూర్చి చెప్పుకొనినద్విపదల నీక్రింద వ్రాయుచున్నాఁడను.

చెలఁగి ఋగ్వేదప్రసిద్ధుఁడై జగతి
వెలయు హరిశ్చంద్రవిభుపుణ్యచరితఁ
గవితాచమత్కృతిఁగాంచి హర్షించి
కవులందఱును శిరఃకంపంబు సేయఁ
బచరించి వీనులపండువుగాఁగ
రచియించు మత్కులకర్తమై మెట్టెదనిక
సింగనమాధవక్షితిపాలమణికి
మంగళమూర్తికి మంత్రియై జగతి
బాగడొందు పెద్దన పోతరాజునకుఁ
దగినతమ్ముఁడు యశోధనుఁ డెల్లమంత్రి
జెట్టపట్టఁగ నోఁచినభాగ్యవతికిఁ
జుట్టాలసురభికి సుందరీమణికి
ఘనుఁడు వల్లభమంత్రి గంగాంబఁ గోరి
కనినపోచాంబకు గారాబుసుతుఁడ
ధరణిసమాత్య రత్నంబనఁ బరఁగు
ధరణిమంత్రికిఁ గూర్మితమ్ముఁడ ఘనుఁడ
భూతనాయక పాదపూజాభిరతుఁడ
గౌతమగోత్రుండ గౌరనాహ్వయుఁడ
సరససాహిత్య లక్షణచక్రవర్తి
బిరుదవిఖ్యాతిచేఁ బెంపొందువాఁడ

*                    *                    *

భ్రమరాపరినాద సంప్రాప్తకవిత్వ
సుమహితసామ్రాజ్య సుఖపరాయణుఁడు
చతురసాహిత్యలక్షణచక్రవర్తి
ప్రతివాదిమదగజ పంచాననుండు
మతిమంతుఁ డయ్యలమంత్రి పుంగవుని
సుతుఁడు గౌరనమంత్రి సుకవిశేఖరుఁడు"

"కవితండ్రి అయ్యలమంత్రి యనివ్రాయుట లేఖకుని పొర పాటని తోఁచుచున్నది. పై నుదాహరించిన ద్విపదలలోనే ఒకచోట "ఎల్లమంత్రి" అనియు వేఱొకచోట "అయ్యలమంత్రి" అనియునున్నది. "మతిమంతుఁడెల్లన మంత్రిపుంగవుఁడు" అనియుండవలయునని శ్రీవీరేశలింగము పంతులుగా రాంధ్రకవుల చరిత్రమున వ్రాసి యున్నారు. ఈకవిరచించిన నవనాథచరిత్రములో:—

> "సింగయమాధవ క్షితిపాలమంత్రి
> పుంగవుఁడై యొప్పుపోతరాజునకు
> ననుజాతుఁ డగుచు నయ్యలమంత్రి కూర్మి
> తనయుఁ డుత్తముఁడు గౌతమగోత్రజుండు
> భ్రమరాంబికా వర ప్రాప్తవిచిత్ర
> విమలసాహిత్య ప్రవీణాధికుండు
> ననఘచిత్తుఁడు గౌరనాహ్వయఖ్యాతుఁ"

తనతండ్రి యయ్యలమంత్రి అనివ్రాసియున్నాఁడు. అయ్యల శబ్దము యతిస్థానమందుండుటచే దీనిని సవరింపరాదు. కావున నీతని తండ్రి యయ్యలమంత్రియే యనియు, ఎల్లమంత్రియని నామాంతర ముండిన నుండనచ్చుననియు నిశ్చయింపఁదగియున్నది. పైనవ్రాసిన ద్విపదలో "యశోధనుఁ డయ్యామంత్రి" యని సవరింపవచ్చును.

ఈతఁడు పైఁ జెప్పిన రెండుద్విపదకావ్యములేకాక "లక్షణ దీపిక" యనునొకలక్షణగ్రంథమును సంస్కృతభాషలో రచియించి యున్నట్లు తెలియుచున్నది. ఆగ్రంథము నాకులభింపలేదు. అందలి గద్య యిట్లున్నదఁట!

"ఇతి కవినుతవితరణవిజితపారిజాత పోతినామాత్యసహజాత చాతుర్యగుణాభిరామ శ్రీమదయ్యలు మంత్రిశేఖర గర్భరత్నాకర శ్రీగౌరనార్యవిరచితాయాం లక్షణదీపికాయాం ప్రథమఃపరిచ్ఛేదః". ఇందుఁ గవితండ్రిపేరు అయ్యలమంత్రియనియే యుండుటంజేసి అయ్యల మంత్రియనుటయే నిశ్చయము

ఈకవి తనపెదతండ్రియైన పోతనామాత్యుఁడు సింగయకుమారుఁ డైన మాధవరాయనృపాలునియొద్ద మంత్రిగా నుండెనని పైనఁ జెప్పిన ద్విపదకావ్యములలోనే కాకుండ తానురచించిన లక్షణదీపికలోఁగూడ నీక్రిందిశ్లోకములలోఁ జెప్పియున్నట్లు నవనాథచరిత్ర పీఠికలోఁ బీఠికాకారు లుదాహరించియున్నారు

"అస్తి ప్రశస్తావనిపాలమౌళీ రత్నావళీరంజితపాదపీఠః
రేచర్లవంశార్ణవపూర్ణచంద్రో మహాబల స్సింగయమాధవేంద్రః
ఆసీత్తస్య మహామాత్యః స్వామికార్యధురంధరః
మన్త్రిమిః పోతరాజ ఇతిఖ్యాతః రాజనీతియుగన్ధరః"

ఈమాధవనృపాలుఁడు రామాయణమునకు 'రాఘవీయ' మను నొకటీక వ్రాసియున్న పండితుఁడనియు, ఆతనిభార్య యీవిషయము నొకశాసనములో వ్రాయించియున్నదనియు, ఆశాసనమందలి శ్లోక మిది యనియు వ్రాయుచు నీక్రిందిశ్లోకమును నవనాథచరిత పీఠికలో నుదాహరించియున్నారు.

"శాకాఖ్యే నిధివార్ధిరామశశిగే వ్యబ్దేప్లవంగే శుభే
మాసే హ్యాశ్వయుజే రఘూద్వహపదే యో రాఘవీయాహ్వయామ్
టీకా మర్థపటిప్రబోధఘటనామాణిక్య పుష్పాంజలిం
కృత్వా రాజతి రావుమాధవనృపో రామాయణస్య శ్రియే"

ఈశాసనము శా.శ. ౧౩౪౯ (క్రీ. శ. ౧౪౨౭) ప్లవంగ సంవత్సర ఆశ్వయుజమాసము నాఁటిది. ఈ రావుమాధవనృపాలుఁడు, శ్రీనాథమహాకవిచే సర్వజ్ఞ సింగమభూపాలుఁడని వర్ణింపబడిన యాతని కుమారుఁడనితలంచి, గౌరనమంత్రికాలము 3౫వ శతాబ్దిపూర్వార్ధమని నవనాథచరిత్ర పీఠికాకారులగు బ్రహ్మశ్రీ. కోరాడ రామకృష్ణయ్యగారు చెప్పియున్నారు.

బ్ర. శ్రీ. వీరేశలింగము పంతులుగారు, ఈశ్లోకమునే యుదాహరించి, యీమాధవనృపాలుఁడు, బేతాళరెడ్డి కెనిమిదవతరమువాఁడని నిర్ణయించి దానినిబట్టి గౌరనకాలనిర్ణయ మొనర్చినారు. శ్రీనాథుఁడు వర్ణించినసర్వజ్ఞజింగమ భూపాలుఁడు బేతాళరెడ్డికిఁ బదియవ తరమువాఁ డనిపంతులుగారు శ్రీనాథునిచారిత్రమునఁ జెప్పియుంటచేత, కోరాడ రామకృష్ణయ్యగారును పంతులుగారును నీవిషయమున భిన్నాభిప్రాయ లగుచున్నారు.

బ్ర. శ్రీ. మానవల్లి రామకృష్ణకవిగారు భైరవకవి శ్రీరంగమాహాత్మ్యమునకుఁ బీఠిక వ్రాయుచు, నందు పైశ్లోకము నే యుదాహరించి యందుఁ జెప్పబడిన మాధవనృపాలుఁడు గౌరనపెదతండ్రి యగుపోతరాజు మంత్రిగానున్న మాధవనృపాలునకు, పితామహుఁ డని వ్రాసియున్నారు. వీరి యభిప్రాయము పైనిరువురి యభిప్రాయములతో నేకీభవింపక వేఱుపడుచున్నది.

ఇం దేదిసత్యమని చూడవలసియున్నది గౌరనకాలమును నిర్ణయించుటకు వేఱుమార్గమున్నను, పండితవర్యులగు వీరియభిప్రాయములం దేదినిజమో తెలిసికొనుట యావశ్యకము. కావున దానిని గూర్చి యాలోచింతము.

బ్ర. శ్రీ వీరేశలింగముపంతులుగారు కవులచరిత్రములో "ఈ మాధవ నృపాలునకు పెద్దనసుతుఁడైనపోతరాజు మంత్రియైనట్లు వెలుగోటివంశచరిత్రమునం దుదాహరింపఁబడిన యొకశిలాశాసనములోని యీక్రిందిశ్లోకములవలనఁ దెలియవచ్చుచున్నది.

శ్లో॥ శ్రీమతో మాధవేంద్రస్య రాజ్యాంగైకధురంధరః
మంత్రీ పోతనామాసీత్ సర్వశాస్త్రవిశారదః
యస్యామాత్యశిఖామణేః కవివర స్తోత్రైకపాత్రీకృతాం
మత్వా వాకృతి రిద్ధనీతిసుభగాం నాగ్న్యేఖరీం లజ్జతే
సోయం పెద్దనమంత్రివర్యతనయః శ్రీపోతరాజోన్వహం
దేవ స్యాస్యమహోపకారరచనాం సమ్యఙ్ముదాకరత్"

అనివ్రాసియున్నారు.

ఈశ్లోకములు మాధవభూపాలుని ఉమామహేశ్వర శాసనము లోనివి. పైనవ్రాయఁబడిన "శాకాబ్దే" అను శ్లోకమునాగారపుశాసనములోనిది ఈ రెండుశాసనములలోను మాధవనృపాలురుదాహరింపఁబడియున్నారు. ఈమాధవనృపాలుఁ డొక్కఁడేయనిపంతులుగారును శ్రీకోరాడ రామకృష్ణయ్యగారును నభిప్రాయ పడియున్నారు. కాని యది పొరపాటు శ్రీనాథకవిని సన్మానించిన సర్వజ్ఞసింగమనాయనివిషయములో శ్రీరామకృష్ణయ్యగారికిని పంతులుగారికిభిన్నాభిప్రాయ మున్నదికాని పోతరాజుమంత్రిగా నున్నమాధవనృపాలుని విషయములో వీరిరువురు నేకాభిప్రాయులై, ఆ మాధవనృపాలుఁడు "శాకాబ్దే" అను శ్లోకమున వర్ణితుఁడయిన యాతఁడే యని నిశ్చయించి దానినిబట్టి గౌరనకాలమును నిర్ణయించినారు. కాని వాస్తవమది కాదు శ్రీమానవిల్లి రామకృష్ణకవిగారును నిచ్చట నొకప్రమాదమునకు లోనైరి. ఇరువురి మాధవనృపాలును నొక్కరు గారనియు, వారు తాత, మనుమలగు భిన్న వ్యక్తులనియు, నిర్ణయించియు, "శాకాబ్దే" అను శ్లోకములోని మాధవ నృపాలుఁడు తాతయనియు, పోతరాజును మంత్రిగాఁ గైకొనిన మాధవనృపాలుఁ డాతనిమనుమఁడనియు భ్రమపడి, గౌరన కాలము క్రీ. శ ౧౪౦౦ ప్రాంతమని యూహించినారు. కాని యిదియునువాస్తవము కాదు.

ఉమామహేశ్వర శాసనమునందే గౌరన పెదతండ్రియైనపోతరాజు మంత్రిగా నున్నట్లుదాహరింపఁ బడియున్నది. గౌరనకాలనిర్ణయమున కీశాసనముతో మాత్రమే పనియున్నదిగాని నాగారపుశాసనముతోఁ బనిలేదు. ఉమామహేశ్వరశాసనమునం దీక్రిందిశ్లోకములో శాసనకాలము చెప్పఁబడియున్నది.

" దంత్యాంకాక్షి శకాబ్దశాలిని శివే వర్షే నవే ఫాల్గునే
మాసే దాచయసింగభూపతిసుత శ్శ్రీమాధవో భూధనః
శ్రీశైలోత్తరతోరణే భువి మహేశస్యాలయం నూతనం
పాషాణై స్సుదృఢం సురాసురనుతం గమ్యమ్మదాచీకరత్.

ఈశాసనము శా. శ. ౧౨౫౮ అనఁగా హూణశకము ౧౩౨౬ సంవత్సరమునఁ బుట్టినది. ఈశాసనముతోడను నాగారపుశాసనము తోడను విశేషకార్యమున్నందున నాశాసనముల సంపూర్ణపాఠము లను వంశవృక్షముతోఁగూడ శ్రీనాథకవి చారిత్రమున నీయఁదలఁచి తిని ఉమామహేశ్వర శాసనమునఁ గాలము లేదనుకొని నాగారపు శాసనమునుబట్టి కాలమును నిర్ణయింపఁగడంగుటలోఁ జరిత్రకారులు ప్రమాదమునకులోనైరి. ఉమామహేశ్వర శాసనమునందలి మాధవ నృపాలుఁడు తాతయు, నాగారపుమాధవనృపాలుఁడు మనుమఁడునై యున్నారు. ఉమామహేశ్వర శాసనములో దాచయసింగ మాధవ నృపాలుఁడని స్పష్టముగా నున్నది. ఇతఁడు బేతాళరెడ్డి కాఱవ తర మువాఁడు. పంతులుగారనుకొనిన తొమ్మిదవ తరమువాఁడు కాఁడు. ఇతఁడు సర్వజ్ఞ సింగమనాయనికిఁ బినతండ్రి. నాగారపుమాధవనృపా లుఁడు అనపోతసింగయ మాధవుఁడుకాని దాచయసింగమాధవుఁడు కాఁడు. ఉమామహేశ్వరశాసనకర్తయగుమాధవనృపాలునియొద్దపోత రాజు క్రీ శ. ౧౩౨౬ ప్రాంతమున మంత్రిగా నున్నవాఁడు. కావున నాతని తమ్మునికుమారుఁడైన గౌరన ౧౩౮౫ మొదలు ౧౪౪౫ వఱకు నుండియుండునని నిశ్చయింపఁ దగియున్నది ఇతఁడుశ్రీనాథుని కాలములోనివాఁడనుటస్పష్టము. శ్రీనాథుని శివరాత్రిమాహాత్మ్య ము శ్రీశైల మల్లికార్జునస్వామివారి ధర్మకర్తయగు శాంతముక్తి భిక్షారాయని కోర్కెపైఁ బువ్వుల శాంతయ్య కంకితమయినది. గౌరన తన నవనాథచరిత్రమునుగూడ నాశాంతముక్తి భిక్షారాయని యాజ్ఞ చే శ్రీశైలమల్లికార్జునకుఁ గృతియిచ్చినాఁడు. కావున నీ యిరువురు సమకాలికులని నిర్ణయించుటకు సందేహింప నక్కఱలేదు.

శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు భైరవకవికృతమగు శ్రీరంగ మాహాత్మ్యపీఠికలో గౌరననుగూర్చి వ్రాయుసందర్భమున:—

మల్లారెడ్డి శివధర్మోత్తరఖండమున:—

సీ. మానితవరధరామర కులతిలకంబు
గౌతమగోత్రాబ్ధి కల్పశాఖి
మల్లికార్జున పండితోల్లసద్వంశ్యుండు
గౌరనారాధ్య శేఖర సుతుండు
శ్రీమల్లమాగర్భసింధు శీతకరుండు
గంగమాంబామనః కంజభాను
సకలాగమ జ్ఞానసారధిధారేయుండు
పరవాదిదుర్మత భంజనుండు

చలగ ? గురుదక్షిణామూర్తి సద్గురులను
గౌరనాహ్వాయదేశికుఁ గన్నతండ్రి
ప్రవిమ లాస్మత్కులోద్భవారాధ్యుఁ బుణ్యు
రణ్యకనాథ్యు లింగనారాధ్యుఁ దలతు

అని చెప్పుటచే లింగనారాధ్యుఁడు గౌరనపుత్రుఁడఁట. పై చెప్పిన గౌరనయు (నవనాథచరిత్ర ద్విపదకావ్యకర్త) నీగౌరనయు విద్వాంసులు, గౌతమగోత్రులు నమూచానసంతానులు, మల్లికార్జున పండితారాధ్యులు వసించియుండిన శ్రీశైలప్రాంతములవారు. రేచర్ల భూమిపాలురేలిన జటప్రోలు మొదలగు సంస్థానములు శ్రీశైలప్రాంతములోనివే. ఈయంశము లించుక దీర్ఘముగా నాలోచింప నిద్దఱు గౌరనలును నేకపురుషనామములే యనియు క్రీ శ. ౧౪౦౦ ల కాలములో నతఁ డుండెననియు నూహింపవచ్చును. భైరవకవి కులగోత్రములును గౌరనకులగోత్రములును వాసస్థానములును గాలమును సరిపోవుచున్నవి. కావున భైరవుఁడు లక్షణదీపి కాదిగ్రంథములురచించిన గౌరనపుత్రుఁ డనితలంచెదను'' అనివ్రాసియున్నారు.

శ్రీరామకృష్ణకవిగారియం దత్యంతగౌరవముంచుచు, వారి యభిప్రాయముతో నివిషయమున నేనేకీభవింపఁ జాలకున్నాఁడను. మల్లారెడ్డి రచించిన షట్చక్రవర్తిచరిత్రమునందలి పద్యములో నిరువురుగౌరనలున్నారు. ఒకఁడు

లింగనారాధ్యునకుఁ దండ్రి. రెండవవాఁడు పుత్రుఁడు. ఇందు మొదటి గౌరనయే మనగౌరనమంత్రియని కవిగారి యభిప్రాయము. రెండవ గౌరనతో మనకీవిచారణమున నేమియు సంబంధము లేదు. మల్లారెడ్డి యొక్క గౌరన మల్లికార్జున పండితారాధ్యుల వంశీయుఁడు. మన గౌరనయారాధ్యులవారి వంశీయుఁడనని యెచ్చటను జెప్పియుండ లేదు. మల్లారెడ్డి గౌరన యారాధ్యుఁడు. ఆతనికొడుకు లింగనారాధ్యుఁడు. మనగౌరన, ఆరాధ్యుఁడ నని చెప్పుకొనలేదు. గౌరనమంత్రి సుకవిశేఖరుఁడ ననిచెప్పుకొనియున్నాఁడు ఆరాధ్యశబ్దము వీరశైవ మతసూచకము. గౌరనమంత్రి శివభక్తియుతుఁడైనను వీరశైవుఁడు కాఁడు. మఱియు మల్లారెడ్డి గౌరన, కవిగాని పండితుఁడుగాని దేవీ వరప్రసాదుఁడుగాని యైనట్లు లేదు. మనగౌరన సాహిత్యలక్షణ చక్రవర్తిబిరుదాంకితుఁడు. విమలసాహిత్య ప్రవీణాధికుఁడు భ్రమరాంబికావరప్రసాదకవిత్వశక్తియుక్తుఁడు. మల్లారెడ్డి గౌరన కవియనిచెప్పఁబడలేదు మనగౌరన గ్రంథత్రయనిర్మాత

ఈకారణములచే నీయిరువురు నొక్కరు గారని తలంచుచున్నాఁడను. కావున గౌరనమంత్రి కాలనిర్ణయముచేయుటలో మల్లారెడ్డిగౌరన నాలోచనలోనికిఁ దీసికొననక్కఱ యుండదు.

ఇతఁడు రచించినహరిశ్చంద్రోపాఖ్యానమునకు నాయకుఁడైన హరిశ్చంద్రునికథ ఋగ్వేదములో నున్నదని కవి చెప్పియున్నాఁడు. హరిశ్చంద్రునికథ మార్కండేయపురాణమునందును, దేవీభాగవతమునందును, భాగవతమునందును, స్కాందపురాణమునందును గూడఁ గలదు. భాగవతదేవీపురాణములయందును ఋగ్వేదమునందును హరిశ్చంద్రుఁడు తనకుఁ గుమారుఁడు కలిగెనేని నరమేధమును జేయుదు నని వరుణునకు మ్రొక్కుకొనుట మొదలుగాఁగల కథ కలదు. గౌరన రచించినహరిశ్చంద్రోపాఖ్యానములో నాకథాప్రమేయమే లేదు. సంస్కృతమార్కండేయ పురాణకథకును స్కాందపురాణకథకును, గొంతభేద మున్నది. గౌరనకవి స్కాందపురాణోక్తకథను గైకొని

స్వేచ్ఛానువాదమును గావించి యితివృత్తమునఁగూడ మార్పులను జేసియున్నాఁడు. నక్షత్రికపాత్రకల్పించినదీతఁడే. సత్యవ్రతపరీక్షను కథ కాధారముగాఁ జేసినదికూడ నితఁడే. ఈతని మార్పుల వలన నాంధ్రలోకమున హరిశ్చంద్రుఁడు సత్యవ్రతుఁడను భావమేర్పడినది నరమేధమునకొఱకు హరిశ్చంద్రుఁడు ధనమిచ్చి పశువుగాఁగొనిన శునశ్శేఫుఁడు, వసిష్ఠునిచే రక్షింపఁబడినవిషయముఁ, దానవ్యాదికమాయుఁడ నవిసభ్యులను బ్రశ్నించినప్పుడు మహర్షులలో జరిగినచర్చ దేవీభాగవతమునఁ జాలరమ్యముగా వర్ణింపఁబడినది ఆకథను గౌరనకైకొనలేదు. ఈతని ద్విపదకావ్యము ననుసరించి, శంకరకవియు, వీరశరభకవియు నాంధ్రమునఁ బద్యకావ్యములను రచియించియున్నారు. ఈముగ్వురి రచనములయందలి రసమును జవిచూచుటకొఱకే ఈవిషయమున నీము వ్యాఘనుగావించిన రచనల సేకరించదనిమ్చుచున్నాఁడను.

> సుచరితుఁడగుధర్మసూనుఁ డిట్లనియె
> బిన్నయానాఁటఁ బొంపిరివోవుభక్తిఁ
> గన్నగకంకణుఁ బరఁగ మెప్పించి
> మెఱుఁగుకోటులతోడి మృత్యువునోరు
> తెఱలక తాకాలఁ దన్ని ధట్టించి
> మునులముత్తాతలై మూఁడులోకముల
> వినుతికెక్కిన తపోవృద్ధులుమీరు
> ముందుమీరెఱిఁగిన భూతలాధీశు
> లందు రాజ్యంబు వోనాడి క్రమ్మఱను
> భుజవిక్రమంబున భూచక్రమెల్లఁ
> బ్రజలుసన్నుతిసేయఁ బాలించినట్టి
> మనుజేశతిలకుని మహితచారిత్రు
> ననురాగ మిగురొత్త నానతీవలయు
> నని విన్నవించిన నాధర్మపుత్రుఁ
> గనుఁగొని పలికె మార్కండేయుఁ డెలమి.

గౌరనమంత్రి.

గ. సలలితకీర్తిసాంద్ర! మునిచంద్ర! వివేకమహోఫణీంద్ర! భూ
తలమున మీ రెఱుంగని కథావిధి లేదొక సంశయంబు నా
వలన జనించె? యుష్మదనవద్యకటాక్షనిరీక్షణప్రభా
విలసదమోఘవాఙ్మధురవీచిక లానఁగఁజేయ వేఁడెదన్.

చ. ఘనుపవరేణ్య! మున్నుచనిపోయిన మానవనాథకోటిలో
గురుతరరాజ్యసంపదలుగోల్పడి ఘోరవిపత్పరంపరం
దిరిగి జగం బెఱుంగ ఘనదీనత లారడిఁబోనఁ జేసి క్ర
మ్మఱ ధరయేలినట్టి జనమాన్యుఁ డొకండు గలండె తెల్పుమా!

వీరశరభకవి. ఆ ౧

క. ఇత్తాపసపుంగవులకు
ముత్తాతవు నీవు గావె ముజ్జగముల మీ
చిత్తముల కెఱుకపడని నృ
పోత్తమ వృత్తములు గలవె యూహింపంగన్.

ఉ. కావునఁ దొల్లి మీరరసి కాంచినయట్టినృపాలకోటిలో
నీవసుధాస్థలిం దొలుత నేమఱి రాజ్యము గోలుపోయి మో
దావహలీలఁ గ్రమ్మఱఁ బ్రజాభినుతి న్ధగ నేలినట్టి ధా
త్రీవరు నానతీవలయుఁ దేటపడం గృపతో మునీశ్వరా

శంకరకవి. ఆ ౧

ముప్పగు రాజ్య మిమ్మునిచేత మనకుఁ
దప్పదు బ్రహ్మశతం బడ్డపడిన
ననుచు దేవియుఁ దాను నతిభీతి నెదురు
చనిబహురత్న పుష్పములఁ బూజించి
మ్రొక్కనదట్టింప మునినాథుఁ డతనిఁ
దక్కక దలవట్టి తన్నెఁ దన్నుటయు
నదరక బెదరక నాత్మలోఁ దాల్మి
వదలక వగవక వనజాప్తకులజుఁ

డనఘాత్మసీకోమలాంఘ్రిపద్మమ్ము
ఘనవజ్రమకుటసంగత మైనయట్టి
నామస్తకంబు మిన్నక సోఁకి నొచ్చె
నేమి తపఃప్రదవె నాయడఁ జెప్పు మనిన. గౌరనమంత్రి

చ. సులలిత జాతరూప విలసన్మణిబద్ధ సమగ్రవైభవో
జ్జ్వల భువనప్రసిద్ధముగ చారుకిరీటముఁ బాఱఁదన్నె పై
నలవడు చున్న తాపస సమాఖ్యయొకింతయుకాని నిక్కమై
కొలఁదికి వింత నిర్దయులు కుంభిని పైఁ గలరే తలంపఁగన్.

ఉ. ఆసమయంబునందు వసుధాధిపుఁ డల్లనలేచి చిత్తమా
యాసమొకింత లేక వినయంబునఁ దాపసవర్యుఁ జూచి యో
భాసురదేహ! మత్కులుషపంక్తి నొలంగె భవత్పదాబ్జని
శ్వాససమాహిత ప్రియభయంబున ధన్యుఁడనైతిఁజూడఁగన్.

తే అనుచు బహుభంగు లమర నయ్యవని విభుఁడు
చేరికొల్చి వినమ్రుఁడై బెదరు ? లేక
కోరికలుమీఱ నామునికులవతంసు
పాదముల కెఱ్ఱ యిట్లని పలికెనపుడు

ఉ. మానితమై శిరీష కుసుమద్యుతిఁ గేలిఁ గొనంగఁజాలు పెం
పైన భవత్పదద్వయనవారుణపద్మము లస్మదీయ నీ
రాజ్యకిరీటరత్న కఠినో ? పలపంక్తులు సోకి కందెనో
మానుగ నేఁ డటంచు ననుమానముతోడ విషాదమందెదన్.

వీరశరభకవి. ఆ ౨

మ. మనసామ్రాజ్య విభూతులెల్లనిఁక నమ్మౌనీంద్రుచేఁ జాల నా
శనముం బొందక యుండునేయని మనస్తాపంబు దీపింప నొ
య్యనభార్యాయుతుఁడై యెదుర్కొనుచుసాష్టాంగంబుదండంబు పె
ట్టినఁ గోపంబునఁ దన్నె భూరమణుకోటీరంబు బీరంబునన్

ఉ. తన్నిజ మానసాబ్జమున ధైర్యమొకింతయు జాఱనీక య
త్యున్నతభక్తితో వినయ మొప్పఁగ వెండియు మ్రొక్కి తెల్విమై
నన్నరనాథ పుంగవుఁడు హస్తసరోజయుగంబు మోడ్చి యు
ద్యన్నవభాను తేజుఁ డగు తాపసకుంజరుఁ జూచి యిట్లనున్.

చ. అనఘచరిత్ర మీ మృదుపదాబ్జము మామకరత్నయుక్తకాం
చనమకుటంబుతో నొరసి చాలఁగ నొప్పి సహించె నేనొన
ర్చినయపరాధమేది యిటు సేయఁగ నానతియిందు నావుడున్
మునికులముఖ్యుఁ డిట్లనియె మోముకుశాంబుజకాంతి సేనఁగన్.

శంకరకవి ఆ ౩

అని యెట్టకేలకు నాలోహితాస్యు
మను జేశుకడ నిల్పి మఱియొండు దలఁప
మది లేక నిల్చి యమ్మగువ ప్రాణేశుఁ
బదిలంబుగా మనఃపద్మంబునందు
ధృతినిల్పి చంద్రమతీదేవి భక్తిఁ
బ్రీతిముఖంబై యగ్నిభట్టారకునకుఁ
దరుణప్రవాళసుందరకాంతిఁ దనరు
కరపల్లవంబులు గర మొప్ప మొగిచి
వరద! వైశ్వానర! వరదయాలోల
దురితసముత్కర తూలవాతూల!
మదిలోన వాక్కున మఱి చేఁతలందు
వదలక పతిభక్తి వఱలుదు నేని
నరలోకనుతుఁ డైన నాకూర్మివిభుఁడు
పరమసత్యంబు దప్పక మను నేని
పరమశీతలుఁడవై ప్రాణదానంబుఁ
గరుణమైఁ దొలుత నక్షత్రున కొసఁగి
మునినాథు ఋణమున మునిఁగిపోకుండ
మనుజేశుఁ గొడుకును మఱి కావు మనుచు. గౌరనమంత్రి

చ. మరలఁగనీక లోహితకుమారకు వెన్కకుఁ ద్రోచి భాసురా
దరమతిచే మనోహరుపదద్వయ మెయ్యెడఁ బాయనీక హృ
త్సరసిజమందు నిల్పుకొని చంద్రనిభాస్య కృపీటయోనికిం
గరములు మోడ్చి తానభిముఖంబుగ భక్తివహించి యిట్లనెన్.

ఆ. వరదయావిలోల! వరద! వైశ్వానర!
తులిత దురితజాల తూలపవన!
ముదముమీఱ నీకు మ్రొక్కెద మద్వాక్య
సరణి వినుము నీదుకరుణ వెలయ.

చ. ధృతిమెఱయంగ నే నిజము పతివ్రతనేని ధరిత్రిమీఁద మ
త్పతి ఘనసత్యవాక్యనయభాసురుఁడేని కృశాన! నీ విదే
హితమతి శీతలాకృతి వహించి ధరామరవర్యు భూవిభున్
సుతుఁ డగులోహితాస్యుదయఁజూచి మునీంద్రుబుణంబు దీర్పు
మా!—వీరశరభకవి. ఆ 3

వ... నాయన్న మీయున్నయెడన నావచ్చునంతకుఁ గద
లక యిచ్చోటన యుండుమీ యని కుస్తరించి తదేకనిష్ఠాపరత్వంబున

తే. నియమ మొప్పంగఁ బుట్టంబు నెఱికఁ గట్టి
ప్రాణవల్లభు నిజమనః పద్మపీఠి
నునిచి ధైర్యంబు దళుకొత్త నుత్పలాక్షి
కృష్ణవర్త్మకు భక్తిమైఁ గేలు మొగిచి.

సీ. పరమపావనతేజ పావక! సదయాత్మ
హరిణాంకమౌళి పర్యాయకాయ
యనఘ! పాతివ్రత్యమున మనోవాక్కాయ
కర్మవిస్ఫూర్తిచే ధర్మనిరతిఁ
బూనిచరించితి నేని మత్ప్రాణేశ్వ
రుండు సూనృతవచోరాశి మెఱసి

భూనుతకీర్తి విభూతిశోభితుఁడేని
శీతలాకృతి మానిశిష్యునకును

తే. విశద వాత్సల్యమున మున్ను కుశల మొసఁగ
పిదపఁ గాశికుఁబుఁగాము సంప్రీతిఁ దీర్పఁ
గూడునట్లుగఁ బెనిమిటిఁ గొడుకుఁ గరుణ
నరసి రక్షింపవయ్య. జోహారు నీకు.

శంకరకవి. ఆ 3

“ఆపదవచ్చినయప్పుడే మున్ను
దాఁచినధనమిచ్చి తగుఁ బత్నిఁ గావఁ
జనుఁ బత్నినైనను జట్టిగా నమ్మి
తనకు వచ్చినబారిఁ దప్పింపవలయు
ననిచెప్పి నీతివాక్యస్థితిఁ గొంత
మనమునఁ దలపోయుమా చలమేల
సతి నమ్మరామైన దోషముఁబాసి పుణ్య
గతికేగు సద్విధి గలిగినఁ జాలుఁ
బంకజ హితవంశ! పాఱున కిచ్చి
బొంకిన పాపంబు పోలియ దేమిటను
బొంకిన మొగసిరి పోలియు నాయువ్వ
మింకుఁ దేఁకువ దప్పనెడ తెగుఁగీర్తిఁ
నమ్మికమాలు మానము దూలపోవు
వమ్మగుఁ బుణ్యంబు వచ్చు నాపదలు
ధర “నానృతాద్దుష్కృతంపర” మనుచు
నురువడి మోయుచునుండు వేదములు
నాలును బిడ్డలు నర్థంబు నెపుడుఁ
గాలిసంకెల లెల్ల కష్టలను బతికి
మఱచియు వీనిపై మక్కువసేయ

రెఱుక గల్గినధీరు లెల్లకాలంబు
వక్రంబుగా నాడవలదు నన్నిపుడు
విక్రయింపఁగ వేళ విచ్చేయు" మనుచు —గౌరనమంత్రి.

ఉ. ఆపద వచ్చినప్పు డభియాతుల కర్తకి విత్తమంతయుం
దోపుడు జెందినైనఁ దనతొయ్యాలిఁ గామట నీతి కాంతలం
బాపక జట్టిచేసి తనబాకిన యంగడి నమ్మరేనియుం
బాపము లే దటంచు వినఁ బల్కెడు నీతిరహస్యధర్మముల్.

చ. సతిఁ దెగనమ్మినట్టి కలుషం బెడబాసి జగం బెఱుంగస
ద్గతి బహునేర్పులం బడయఁగా దరిగద్దెముగాసి నింత స
త్కృతి గడుభాసురోత్తమునకిచ్చి రయంబున బొంకినట్టి దు
ర్మతుల మహోగ్రదోషములు మాన్పనుపాయము లేదుభూవరా !

ఆ. మాటబొంకెనేని మానంబు చెడిపోవు
దూలు నాయు వనఘ దురిత మొదవు
నుహి గణింపఁ బుణ్యమంతయు మిఱి దప్పు
ననెడు వేదవచన మరయవలదె

క. ఆలును బిడ్డలు విత్తము
కాలికి సంకెలలు వీనిఁ గని మఱచి మహీ
పాలు రెఱుంగక బహుతర
లోలత నసియింతు రెపుడు లోకమెఱుంగన్.

చ. విదితగుణాభిరామ! విను వేగమె నన్నిటువిక్రయించి యా
పద లెడఁబాయు మంచు బహుభంగుల వేఁడి తలంచి మాటికిన్
ముదమున మ్రొక్కి హస్తయుగముల్ ముకుళించిమరాళవైఖరిన్
గదియఁగ వచ్చుచున్నతనకాంతఁ గనుంగొని భూవిభుండనెన్.

వీరశరభకవి. ఆ ర

ఉ. అంచితసత్యవాగ్విభవ! యాపదఁ జెందిన విత్త మెల్ల వ
ర్జించి కులాంగనం గరుణఁ జేకొనఁగాఁ దగు భార్య నైనని
ర్వ్యంచన విక్రయించి యనివార్యవివేకకళాధురీణతా
భ్యంచితవృత్తి భర్తకు నుపద్రవముం బెడఁబాయఁగాఁ దగున్.

క. భూవర వివరింపఁగ భా
ర్యావిక్రయ పాతకంబు నైనను బాయం
గావచ్చుఁ గాని మఱి మి
థ్యావాగ్దోషంబుఁ బాయుఁదర మెవ్వారికిన్.

తే. అనృతభాషణుకంటె దోషాధికుండు
సత్యవాచానిష్ఠునికంటె నిత్యసుకృతి
వెదకిచూచినఁ బొడమఁ డుర్వీతలేశ!
పవనభుఙ్మానవామర భువనములను.

క. దారసుతాదులమోహము
గోరెడువారలకుఁ దగదు గూడఁగ ననివి
స్తారమతి సూరిజనులు
ధీరత దన్మోహలతలఁ ద్రెంపుదు రనఘా!

మ. ప్రతికూలోక్తులు పల్కఁగావలదు భూపాలాగ్రణీ! యిత్తఱిన్
ధృతిఁ జిత్తంబున నిల్పి దిగ్భరితకీర్తిస్ఫూర్తిఁ గూడి సూ
నృతవాక్సంపదఁ బొందు భూజనులు వర్ణింపంగ నామీఁదిమో
హతమఃపుంజముఁ బాపు చిన్మయవివేకాదిత్యబింబంబు చేన్.

శంకరకవి. ఆ ౪

సకలదీవులనేలు జనపతిపుత్త్రిఁ
డకట చేరెడు నేల కర్హుండు గాఁడె.

గౌరనమంత్రి.

శా. సప్తద్వీపసముద్రముద్రిత మహాసర్వంసహాచక్ర సం
ప్రాప్తశ్రీకమనీయలక్షణజగత్ప్రావీణ్యసత్యవ్రతో

ద్దీప్తవాగ్విభవుఁ జైనరాజసుతుఁ డర్థిన్ దైన్యభావోదయ
వ్యాప్తిన్ బెత్తెఁడు నేలకైనఁ దగఁడే యంచున్విలాపించుచున్.
వీరశరభకవి ఆ ౫

మ. అకటా! చేరెడునేలకుం దగఁడె సప్తాంభోధివేష్టితభవ
త్సకలద్వీపకలాప భూపమకుటాంచత్పద్మరాగోజ్జ్వల
ప్రకటానర్ఘళనిర్గళత్కిరణ శుంభత్పాదుఁడైనట్టి రా
జును మాగుం డని యేడ్చెఁ గన్నుఁగవన్ శోణాశ్రుల్ కాల్వలై పాఱఁగన్.
శంకరకవి. ఆ ౫

ఇతఁడు రచించినలక్షణదీపిక నాకులభ్యము కాలేదు ఈతఁడిం దుఁ గైకొనిన లక్ష్యగ్రంధములనుబట్టి పూర్వకవులనామములు గాని గ్రంథనామములుగాని ఏవియైన బయటపడునేమో!

ఇతఁడు సారంగధరచరిత్రమును ద్విపదగారచించె నని కొంద అందురు కాని యది నిజముకాదని తోఁచెడిని. ఇతఁడు నవనాధచరిత్రమున సారంగధరునికథను జెప్పియున్నాఁడు. ఆకథనుజూచియీతఁడు వేఱుగా సారంగధరచరిత్రమును రచించెనని కొంద అనుకొనియుండ వచ్చును.

నవనాథచరిత్రమును ముక్తిశాంతిభిక్షావృత్తిరాయని. ప్రేరణముపై శ్రీగిరిమల్లికార్జునస్వామికిఁ గృతియొసంగెను. ఈముక్తిశాంతరాయఁడాకాలమున శ్రీశైలమల్లికార్జునస్వామికి ధర్మకర్తయై పేరుగన్నవాఁడు. ఈనవనాథచరిత్రమును శ్రీగిరియనునాతఁ డంతకుపూర్వము పద్యప్రబంధముగా వ్రాసియుంచెనఁట. దానిని ద్విపదకావ్యముగా రచియింపు మని గౌరన నాముక్తిశాంతరాయఁడు కోరఁగా నీగ్రంథమును రచించితి నని కవి యీాక్రింది ద్విపదలలోఁ జెప్పియున్నాఁడు. ఇందు ముక్తిశాంతరాయనిప్రశంస విశేషముగాఁ గలదు.

"శ్రీమహాసీయప్రసిద్ధి పెంపెసఁగు
శ్రీమల్లికార్జున శ్రీమహాలింగ
సర్వలోకోత్తమ సామ్రాజ్యభార
నిర్వాహకప్రౌఢి నీతికోవిదుఁడు
కుహనాంబరధ? జైనకోలాహలుండు
మహితబిజ్జలరాయ మానమర్దనుఁడు
సన్నుతశైవదీక్షాగురుం డసమ
సన్నాహగజపతి సర్వాంగశూలు
శ్వేతాంబరప్రాణవితతజీమూత
జాతమహోదగ్రఝంఝానిలుండు
పరసమయాంభోధి బడబానలుండు

*　　*　　*

ఘనము త్రిశాంత భిక్షావృత్తిరాయఁ
డనుపమంబైన మహావైభవంబు
దనర విచిత్రవితానరమ్యమును

*　　*　　*

నవిఁ శైవాగవిద్యాధికులైన
నవనాథవరుల పుణ్యప్రవర్తనలు
పరగ శ్రీగిరికవి పద్యబంధముల
విరచించినాఁ డది ద్విపదకావ్యమునఁ
జెప్పింపవలయుఁ బ్రసిద్ధి పెంపలర
నిప్పుడు గలసుకవీంద్రులలోన
సరససాహిత్యలక్షణవివేకముల
సురుచిరమధురవచోవిలాసముల
గులశీలములను సద్గుణకలాపముల
నలవడ్డవాఁ డెవ్వఁ డని విచారించి

సింగయమాధవక్షితిపాలమంత్రి
పుంగవుఁడై యొప్పు పోతరాజునకు
ననుజాతుఁ డగునయ్యలామాత్యుకూర్మి
తనయుఁ డుత్తముఁడు గౌతమగోత్రజుండు
భ్రమరాంబికా వరప్రాప్తవిచిత్ర
విమలసాహిత్య ప్రవీణాధికుండు
ననఘుచిత్తుఁడు గౌరనాహ్వయఖ్యాతుఁ
డనసుఖముననుఁ దగఁ బిలిపించి
కరుణామృతము నిండఁ గనులొత్తుచూపు

* * *

ఈనవనాథచారిత్రమున, సుప్రసిద్ధరసవాదసిద్ధులయిన శివనాథుఁడు, మీననాథుఁడు, చౌరంగి సారంగధరుఁడు, గోరక్షనాథుఁడు, మేఘనాథుఁడు, నాగార్జునుఁడు, సిద్ధబుద్ధుఁడు, విరూపాక్షుఁడు, కణికుడు, ననుతొమ్మండ్రు సిద్ధులకథలు వర్ణితములైనవి. విరూపాక్షుఁడో, ఆతనిశిష్యులలో "అమృతఘ్నసిద్ధి" "అమృతము" అనుగ్రంథములను రచించిరఁట!

నవనాథచరిత్ర మదివఱకు శ్రీగిరికవిచేఁ బద్యరూపకముగా రచియింపఁబడియున్నదనియు, సామాన్యప్రజలలోఁగూడ మిక్కిలిగా వ్యాపము కావలయు ననునుద్దేశముతోఁ గాబోలు శ్రీశైలమఠాధిపతియగు శ్రీశాంతముక్తిరాయలు ద్విపదలో రచియింపు మని గౌరనను నియమించినట్లును పైన వ్రాసిన ద్విపదలనుబట్టి తెలియుచున్నది. ఈ శ్రీగిరికవి యెవ్వఁడో తెలియదు. చిన్నమల్లు శ్రీగిరియని కొందఱనుచున్నారు. ఈవిషయము నాతనిచరిత్రమునఁ జర్చించితిని.

గౌరనకవితామృతము నిదివఱకే చవిచూపియున్నాఁడను. అయినను నవనాథచరిత్రములోని మరికొన్ని ద్విపదల నిట నుదాహరించి యీతనిచరిత్రమును ముగించెదను.

వలనొప్ప నాకాశవాణి యిట్లనుచుఁ
బలికె నీతఁడు పూర్వభవమున విభవ
లీలతో మెఱయు కళింగదేశమున
శీలసంపన్నుఁడై చెన్నొందునొక్క
ధరణీసురోత్తము తనయుఁడా ద్విజుఁడు
మరణమొందిన వానిమానిని పిదప
కులటయై మును చనుఁగుడిచెడి శిశువు
నలిచి నిష్కృపతోడ నొకచోట వైచి
పోయిన మఱియొక్క భూసురవర్యుఁ
డాయర్భకునిఁ గొంచునరిగి మోహమున
వరలఁ జేకొని పెంచి వడుగుఁ గావించి
పరువొప్పినపుడు వివాహంబునకును
ధనముసంపాదింపఁ దలపోయుజాడ
మనమున నెఱిఁగి సమ్మతి బేరమాడి
యర్థమార్జించెద ననుచు నావడుగు
సార్థముఁ గూడుకచని దూరభూమి
నొకపురి వేశ్యయై యున్నట్టి జనని
నకలంకమతిఁ దల్లినరయంగ నేరక
కవయుచు ? నిత్యకర్మములు
ధీరుఁడై సలిపి వర్తింపుచున్నతని
యాచారమెడలింప ననువుగాదనుచు
నీచాత్మురాలు బానిసచేతఁ గల్లు
వలనొప్పఁ దెప్పించి వాఁడు నిచ్చుటను
జలములు గ్రోలెడిసగ్గడ నించి
యున్నంత నీరుపట్టాదవ విప్రుండు
మునుపు గ్రోలినయట్లు ముదము దీపింప
జలబుద్ధి నాకల్లు చవిగొని యెఱిఁగి

వలచేత సగ్గాడ వసుధపై వైచి
పరితాప మొందుచు బాష్పబిందువులు
దొరఁగ లంజనుజూచి దోషాత్మురాల!
తగునె యీకపటకృత్యంబు సద్విప్రుఁ
డగుననున్నుఁ జెఱుపఁ నీ కగులాభ మేమి
కటకటా యిఁకఁ దనగతియేమి యనుచుఁ
బొటబొటఁ బొక్కు నాభూసురుఁ జూచి
యావారవనిత యిట్లనియె నేదేశ
మేవంక నీపురి యేది నీగోత్ర
మంతయు నెఱిఁగింపు మని నాఁడు చెప్ప
వింతగా విని యామె వీఁడు మత్పుత్రుఁ
డని బిట్టుమూర్ఛిల్లి యల్లనఁ దెలిసి
కనుఁగవ బాష్పాంబుకణములు దొరుఁగ
నగచుచు నున్నట్టి వనిత నీక్షించి
మగువ నీవేటికి మఱగెద వనిన
దనపూర్వచరిత మంతయుఁ జెప్పి నీవు
తనయుఁడ వగుదువు తల్లి నే ననినఁ
బుడమిపైఁబడి మూర్ఛబొంది యొక్కింత
తడవుకు దెలివొంది తిరియింప నలవి
గానిదుస్సహ మాతృగమనాఘ మద్య
పానదోషములు చొప్పడె నొక్కయెడను
ఈమహాపాతక మింక నొం డొకట
నేమార్గమునఁ బాయ దెడవకపోయి
గంగఁ గాళిందిలోఁ గలిసి పెంపొంది
పొంగుచుఁ బ్రవహించు పుణ్యతోయముల
నొనరఁ బ్రాణత్యాగ మొనరింపకున్న
ననుచుఁ దాఁ గొనివచ్చు నట్టియాసరకు

వరుసతోడుతఁ దమవారి కిమ్మనుచు
వెరవు వచ్చినవణిగ్వ్రతతి కొప్పించి
చని ప్రయాగను గృతస్నానుఁ డై యతఁడు
తనపాపములఁ జెప్పి తద్వ్యయు క్తియును
ధరలోన భూపతిత్వము సిద్ధపదముఁ
దెలఁగొప్పఁ దనకు సిద్ధింపనుగోరి
యానదిలోఁ బడి ప్రాణముల్ దొలఁగి
తానట్టిఘోరపాతకములఁ బాసి
పదపడి ఘూర్జర పతిగ జనించి
విదితంబుగా రాజ్యవిభవంబు లందె.



# హిందూ ధర్మశాస్త్ర గ్రంథనిలయము
## కపిలేశ్వరపురము తూర్పు గోదావరి

**దుర్గేశనందని** రచయిత:— శ్రీ చాగంటి శేషయ్యగారు
ఇందు పఠానులకును రసపుత్రులకును జరిగి కలహము —రాజా మాన్‌సింహుని పుత్రుఁడగు జగత్సింహుని మహావీరత్వము — చక్కని శైలితో తెనుఁగుభాషలో మేటినవలా రత్నమనుటకు సందియములేదు. ఇది సప్తమముద్రణము. (మదరాసు టెక్స్టుబుక్ కమిటీవారిచే లైబ్రరీలు ఉపయోగించుటకు అప్రూవుకాఁబడినది.)

**నవాబునందిని** రచయిత— శ్రీ చాగంటి శేషయ్యగారు
దుర్గేశనందని యందలి మిగిలిన కథా విశేషములన్నియు "నవాబునందని" యందు చదువవలయును.

**రాధారాణి** శ్రీ రచయిత:—చాగంటి శేషయ్యగారు
నిరుపేదబాలిక "రాధారాణి"—గొప్పధనవంతుఁడు దేవేంద్రనారాయణరాయ్ దైవికసమావేశము— వీరిరువురి ప్రణయగాథ.

**శ్రీ** (ద్వితీయముద్రణ)
రచయిత— శ్రీ చాగంటి శేషయ్యగారు
చక్కని చారిత్రాత్మకమైన నవల.
మహమ్మదుపురము శత్రువుల హస్తగతమైన పిదప అద్వితీయ ప్రతిభాశాలియు, మహారాజున్యగు సీతారామరాయ లెట్లుప్రవర్తించెనో ఏరూపముతో నెట్టియవస్థయందెట్టి కార్యములనాచరించుటలో బ్రవృత్తుడయ్యెనో యిందు మనోహరమైన శైలిలో హృదయరంజకముగా వర్ణింపబడినది. ప్రకృతియొక్క సౌందర్యములిందు వివరింపబడినవి.
చక్కనిఅచ్చు మంచిగ్లేజుకాగితం వెల రు 2—50 నప్రై.

**విష్ప్రయత్నము**

రచయిత:— శ్రీ చాగంటి శేషయ్యగారు
ఇందలిరంగములును పాత్రములునునాంధ్రదేశమునకు సంబంధించినవి. కథాకల్పనము పాత్రగుణపోషణము, మొదలగునవి యిందు చక్కఁగాఁ బ్రదర్శింపబడినవి. ఇది సాంఘిక నవలయైనను, నపరాధ పరిశోధక నవలాలక్షణములచే నతి మనోహరముగ నలరారుచున్నది. మంచి గ్లేజుకాగితము, చక్కనిఅచ్చు! 366 పేజీలు రు 3—0—0

## మాతృమందిరము

(తృతీయముద్రణ)

రచయితలు:—శ్రీ వేంకటపార్వతీశ్వరకవులు

ఈ మాతృమందిరము భౌతిక ప్రపంచమున ప్రతిబింబించుచున్న భావనా ప్రపంచమందలి పవిత్ర చిత్రమందిరము.

ఇందలి ప్రబోధానందస్వామి స్వాభావికస్వరూపముచే సాక్షాత్కరించుచున్న సనాతన విజ్ఞానమయ దివ్యమూర్తి. ఇందలి యితివృత్తము 'అహింసాపరమోధర్మః ఆత్మవత్సర్వభూతాన— పరోపకారార్థమిదం శరీరం' అనునీ మొదలుగాగల దివ్యశ్రుతులు—ఆదర్శరామరాజ్యము.

అక్షరరూప విలసితమగు నీమాతృమందిరము నందలి పమార్గమును ఆంధ్రసోదరులందరు గ్రహించి మాతృదేశము నానందమందిరముగ జేసికొని ఆనందించెదరుగాక !

చక్కనిఅచ్చు గ్లేజుకాగితము 366 పేజీలు వెల రు 2—50 న. పై.

## పద్యకావ్యములు





## ఏకాంతసేవ

శ్రీ వేంకట పార్వతీశ్వరకవులు పరమేశ్వరునిగూర్చి పాడినపాట. భక్తిరస పరిపూరితములగు సంగీతామృతమును ప్రతియాంధ్రుడును గ్రోలి యానందింప దగినది. ప్రకృతి లీలాస్వరూపుడగు పరమేశ్వరునారాధించుటలో రవీంద్రుని గీతాంజలివలె వన్నెకెక్కినది. మృదుమధురము కడు హృద్యమమునగు నీప్రకృతి శృంగారకావ్యము నెల్లరు భక్తితన్మయులై చదువవలసినదే !

## కావ్యకుసుమావళి

శ్రీ వేంకట పార్వతీశ్వరకవులచే నేటివఱకును రచింపబడిన ఖండకావ్యములన్నియు భాగములుగ ప్రచురింపబడినవి. ఈ కవిద్వయము నవకవియుగకర్తలై ఆంధ్రలోకము నలంకరింపజేసిన మృదుమధుర వాగ్ఝరీతరంగములన్నియు నిందుపొందుపరుపఁబడినవి. భాషాభిమానులగుప్రతియాంధ్రునకు, ప్రతిపుస్తకభాండాగారమునకునీమహాకవుల కావ్యసంపుటములన్నియు నమూల్యాలంకారములు.

## బృందావనము

రచయితలు:—శ్రీ వేంకట పార్వతీశ్వరకవులు.

ఇందలికథ పురాణప్రసిద్ధమైన బృందాదేవియొక్క ప్రేమగాథ. ఆమె శ్యామసుందరుడగు శ్రీకృష్ణపరమాత్ముని వలచి, వలపించి, వరించిన దివ్యచారిత్రమే ఈమహాకావ్యము. భక్తిశృంగారరసపరిపూరితమై మధురాతి మధురమై నెల్లర నానందతన్మయులఁ జేయుననుట యతిశయోక్తి కాజాలదు. వెల 1—50

## చిత్రకథాసుధాలహరి 1-00

రచయితలు:—శ్రీ వేంకట పార్వతీశ్వరకవులు.

మనోజ్ఞమైనకథాకల్పనలతో—చక్కనిపాత్రౌచిత్యము గలిగి—శృంగారాదిరస పోషణతో మృదుశైలిలోమనోరమైనపద్యకావ్యము.

## భావసంకీర్తనము 1-00

రచయితలు:—శ్రీ వేంకట పార్వతీశ్వరకవులు.

ఇందలి భక్తిపూరితములగు సీసపద్యమాలికలు గద్యరచనలం బోలి సరళములై మృదు మధురములై పఠనీయములై విలసిల్లుచున్నవి.

---

ఆంధ్రప్రచారిణీ లిమిటెడ్
రామచంద్రపురం, తూర్పు గోదావరి